# మహాభారత కథలు

(విరాటోద్యోగ భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక స్త్రీ పర్వాలు)

## ( 3 వ సంపుటము )



రచన

కామరాజుగడ్డ రామచంద్రరావు

వెల రూ. 28/-

This book is Published with the financial assistance given by the Tirumala Tirupathi Devasthanams under their Scheme of Aid to Publish religious books.

పుస్తకం పేరు :

మహాభారత కథలు

(విరాటాది 8 పర్వాలు)

రచన :

కామరాజుగడ్డ రామచంద్రరావు

2-2-1144/24 న్యూనల్లకుంట

హైదరాబాదు-500 044.

ప్రతులు : 1000

ప్రచురణ : 1988 డిశంబరు

ముద్రణ :

సునీతా ఆర్ట్ ప్రింటర్సు పంజగుట్ట, హైద్రాబాదు-500 482.

కవరు పేజీ ఆర్టు : శ్రీ శీలా వీర్రాజు

Acc no 21767

# మహాభారత కథలు

## (విరాటాది 8 పర్వాలు)

విషయ సూచిక:

### విరాట్పర్వము

ప్రథమాశ్వాసము:



ద్వితీయాశ్వాసము :



తృతీయాశ్వాసము :



చతుర్థాశ్వాసము :



### ఉద్యోగ పర్వము

ప్రథమాశ్వాసము :

ద్వితీయాశ్వాసము:



తృతీయాశ్వాసము :



చతుర్థాశ్వాసము :



## భీష్మపర్వము

ప్రథమాశ్వాసము:



ద్వితీయాశ్వాసం :



తృతీయాశ్వాసము :

# ద్రోణపర్వం

ప్రథమాశ్వాసము :



ద్వితీయాశ్వాసము :



తృతీయ చతుర్థ ఆశ్వాసాలు



పంచమాశ్వాసము



# కర్ణ పర్వము

ప్రథమాశ్వాసం :



ద్వితీయాశ్వాసం :



తృతీయాశ్వాసం :

## శల్య పర్వం

ప్రథమాశ్వాసం :



ద్వితీయాశ్వాసం :



## సౌప్తిక పర్వము

ప్రథమాశ్వాసము :



ద్వితీయాశ్వాసం :



## స్త్రీ పర్వము

ప్రథమాశ్వాసము .



ద్వితీయాశ్వాసము :

# మహాభారత కథలు

## విరాటాది 8 పర్వాలు

## ఉపక్రమణిక

చిన్నప్పుడు ఇంగ్లీషు చదువుకోసం బస్తీలకు వెళ్ళి సెలవులకు మాత్రం ఇంటికి చేరి సాయంత్రం అయేటప్పటికి బాబాయి చుట్టూ చేరేవాళ్ళం శాస్త్రం చెప్పమంటూ, ఆయన రాత్రి తొమ్మిదయేవరకూ ఎన్నో కథలు చెప్పేవాడు- రాజులు, రాణీలు- కొడుకులు దేశాలు తిరగడం అత్యద్భుత కార్యాలు చేయడం- మనసుకు విస్తృతమైన రసోద్ధతి (Thrill) కలిగేది. ఆయన మహాభారతంలోని కథ లెన్నో చెప్పేవాడు. ఆయన చెప్పే విధానం విధానాన్నే పాటించానీకథల్లో. బాబాయే మహాభారత కథలు చెప్తున్నాడు ! వినండి.



# మహాభారత కథలు

## విరాట్పర్వము- ప్రథమాశ్వాసము

### 1. అజ్ఞాత వాసారంభము

అజ్ఞాతవాసమంటే పేరు ప్రతిష్ఠలుకూడ లేకుండా ప్రపంచంలో మని ఉండటం. పాండవులు కీర్తిమంతులు. వారు తమ కీర్తినిగాని పేతునుగాని ఆధారంగా చేసి కొని బ్రతకటం ఈ అజ్ఞాతవాస కాలంలో ఉండదన్నమాట.

భగవంతుడు సర్వత్ర ఉన్నవాడు. అతడు ఒక మూర్తి రూపంలో కూడ నిల్చిఉండిపోతాడు. కొన్నాళ్ళెవరూ ఆ మూర్తిని మన్నింపరు. ఎప్పుడో ఎవరో గుర్తిస్తారు ఆ మూర్తి భగవంతుడేనని. అన్నాళ్ళనుండి అజ్ఞాతవాసంలోనున్న భగ వంతుడు అప్పటి నుంచి తనకున్న అనేక పేరుల్లో, ఏదో ఒక పేరుతో వెలసి కటాక్షం ప్రసరిస్తూ ఉంటాడు. అన్ని యేళ్ళ అజ్ఞాతవాసం ఒకానొక నిష్ఠ, తపస్సు. భగవంతుని మూర్తికైనాసరే — మనుష్యునికైనాసరే. ఉద్ధృతినిస్తుం దనిపిస్తుంది:

భారతం మనుష్యుల నిష్ఠ, తపస్సులను గూర్చి చెప్పేది. పాండవులు అర్ధ రాజ్యం పొంది, జూదంలో దాన్ని పోగొట్టుకొని పన్నెండేళ్ళు నిష్ఠచేసి మనో బుద్ధులు సహా పన్నెండు ఇంద్రియాలను నిష్ఠలో నిల్పి ఇక అజ్ఞాతవాసం నెరపాల్సిన వారై ఉన్నారు.

అజ్ఞాతవాస కథను చెప్పే పర్వం విరాటపర్వం.

విరాటపర్వంనుంచీ ఆంధ్రమహాభారతం తిక్కన సోమయాజి తెనిగించిన భాగం. ఈయన, వ్యాస భారతం చదివి ముగ్ధుడై దానిని తెలుగులో చెప్పాలను కొన్నరోజుల్లో ఎప్పుడో చనిపోయిన ఆయన తండ్రి కలలో అవుపడి ఆ వ్రాయబోయే భారతాన్ని భగవంతునికి అంకితమివ్వాల్సిందని చెప్పాడట. పైగా హరిహరనాథుని తిక్కనకు సాక్షాత్కరింప జేస్తాడుకూడా. ఇదంతా కలలోనే జరుగుతుంది. హరి హరనాథుడు తిక్కనకు ఒక వరాన్ని ప్రసాదించాడు. ఏమిటంటే—

"జనన మరణాదులైన సంసార దురిత
ములకు నగుపడ కుండగ దొలగు తెఱవు
గను వెలుంగు నీ కిచ్చితి ననిన_లేచి
నిలిచి సంతోష మెదనిండ నెలపు కొనగ."

నన్నయ్య రచనలో ప్రసన్న కథాకవితార్థయుక్తి ఉన్నది. ఈయన రచనలో ఎక్కడికక్కడ నిశ్చయమైన కథ పరిపూర్తి అయినట్లు ఉంటుంది. "నీకు ఫలాన వెలుగునిచ్చాదని హరిహరనాథుడన్నాడు. అంతట ఇతడు లేచాడు అతడి ఎద నిండా సంతోషం నిండినది_ అని ఇలా ఉంటుంది ఈయన కథనం. నన్నయ్య కథనంలో ఒకటి చెప్తుంటే ఆ తరువాత వచ్చేదాన్ని సూచిస్తూ "ఐతే ఏమయింది" అనే ఉత్కంఠ కన్పడుతుంది. తిక్కన రచనలో పాత్రలవెంట నాటకీయ ఫక్కీలో కథ నడవటం ప్రత్యేకత.

పాండవులు పన్నెండేళ్ళ అరణ్య వాసానంతరం పదమూడో ఏడాది విరాట్రాజు కొలువులో ప్రచ్ఛన్నంగా ఉండి కాలం గడిపిన కథ ఈ విరాట్పర్వంగా మలచ బడింది.

జనమేజయుడు వైశంపాయనుని అడుగుతాడు _ "అంత గొప్ప తేజస్సు కలిగిన పాండవులు ఆడకూతురుతోసహా శత్రువులకభేద్యంగా రహస్యంగా ఉండా ల్సిన ఆ పదమూడో ఏడాదిని ఏ ఉపాయంతో ఎలా గడిపారు? చెప్పవలసింది" అని. వైశంపాయనుడు చెప్తున్నాడు_అరణ్యవాసం పన్నెండేళ్ళున్నా, పాండవులు అరణ్యాల్లో ఉంటున్నా బ్రాహ్మణులూ, రథాలూ చిన్న సైన్యం సహితంగానే ఉంటూ వచ్చారు. ఇప్పుడు వాళ్ళందర్నీ పంపేసి తాము మాత్రం వెళ్ళిపోవాలి. తామెక్క డున్నారో దుర్యోధనాదులకు తెలియకూడదు. ఈ సంగతిని అప్పటికి చుట్టూ ఉంటున్న శ్రేయస్కాములతో ధర్మరాజు చెప్తాడు. అందుకుగాను తమకు అనుజ్ఞ నివ్వాల్సిందని అడుగుతాడు. దయచేసి తమను వదలి వెళ్ళిపోవలసిందని అభ్యర్థిస్తాడు.

ధర్మరాజు వారితో చేసిన సంభాషణలో డగ్గుత్తిక పెట్టి దుఃఖాశ్రువులతో చెప్పిన మాటలన్నీ తిక్కన వ్రాకుచ్చాడు_ ఆ మాటలు కేవలం ధర్మపరుడైనవాడు మాట్లాడే మాటలు. ఇప్పటి రోజుల్లో అలాంటి ధర్మపరులు అరుదుకావటంవల్ల ధర్మరాజునోట పలికించిన మాటలు ఇప్పటివారికి కొంచెం అతిగా ఉన్నట్లు ఒక్కొ

క్కప్పుడనిపించటం కద్దు. 'ధర్మరాజు' అనంగానే "ఆ 'అతి' గాడు అనే దుర్భావం తమ సైకాలజీననుసరించి వారికి కలుగుతుండటం వల్లనే బహుశ "పేరు ధర్మరాజు పెనువేపవిత్తయా" అనే పదాలు వింటుంటామా అనిపిస్తుంది – వేమన మాత్రం లోకులు ధర్మరాజు పేరు పెట్టుకొని, చెడ్డగా ప్రవర్తించేవారిని గూర్చి మాత్రమే చెప్పినా లోకులు ధర్మరాజు మాటనె చెప్తూ ఆ మాటలు చెప్పటం అది ప్రారబ్ధం.

నిజానికి ధర్మరాజు కేవలం ధర్మపరుడు. చక్కని మాటకారికూడ. కేవలం మాటకారి అనుకొంటున్నవారు అతడి ప్రవర్తనాన్ని నిశితంగా పరీక్ష చేయటానికి తప్పిపోయినవారె ననిపిస్తుంది.

అతడు రసావేశంతో మాట్లాడినట్లు తిక్కన భారతంలో అపుపిస్తుంది. తిక్కన నాటి సరాసరి ప్రజల్లో ఉండే ధర్మపరులు ఆ మాత్రపు రసావేశంతో మాట్లాడటం అనేది ఉండిఉండవచ్చు. ఆ రసావేశం నాటకీయమైన రచనలో ఉన్న మాత్రాన ధర్మరాజు పట్టి నాటకం ఆడేవాడు అనే భావం పెంపొందించుకోవటం సరికాదు.

అప్పుడు ధౌమ్యునకు ధర్మరాజును– ఇతడు విషాదార్తుడై ఉండటంవల్ల ఓదార్చటం అవసరమైంది. "అయ్యో! ధర్మరాజా! నీవంటి ధర్మజ్ఞుడూ ధైర్యస్థుడూ లేడని ఈ నేలను ప్రసిద్ధి. నీవే ఇలా అంటే ఎలా? దేవతలే అనువు కానప్పుడు అణగి ఉండటమనేది ఉంది. ఇంద్రుడే ప్రచ్ఛన్నంగా ఉన్నాడొకప్పుడు. భగవంతుడె అదితి గర్భంలో వామనావతారుడై అణగి ఉన్నాడు. ఔర్వుడు తల్లి ఊరువులో నూరేండ్లు ఉన్నాడు. శత్రువులకు జడిసి, సూర్యుడు ఆవు శరీరంలో ఉన్నాడు. ఈ సంగతులు మనము వినుటల్లేదా! అందుచేత విచారింపకు. ఈ సంవత్సరమయింతరువాత నీకయిన భంగపాటు తీరిపోతుందిగాక" అంటాడు ధౌమ్యుడు.

ఈ సమయం చూసుకొని, భీముడు "అన్నయ్యా! నీ ఆజ్ఞ అనే బంధనవల్లగాదా మేమంతా శత్రువుల్ని మట్టుబెట్టకుండా ఆగింది! అంటాడు. అంటే ఇలా కావడం ధర్మమనేగా మనం నిశ్చయించాము అని అర్థం. అప్పుడు అక్కడున్న వారందరూ పాండవుల్ని దీవించి, తమ తమ స్థానాలకు వెళ్ళిపోతామంటారు. ధౌమ్యుడు మాత్రం పాండవులతో ఇంకా ఎక్కువసేపు ఉంటాడు. వారంతా సంప్రదించుకొని, మత్స్య దేశాధీశుడైన విరాటుని రాజ్యంలో తామా సంవత్సర కాలం గడిపాలని నిర్ణయించుకొంటారు.

ఎవరికివారు ఏఏ వేషాలతో తాము ఈ పదమూడవ యేడు గడపాలెనను కున్నారో చెప్పుకుంటారు. స్థూలంగా - అంతా పూర్వం ధర్మరాజు పరిపాలనలోనే ఉన్న వాళ్ళుగా చెప్పుకోవాలనీ, ధర్మరాజు దురదృష్ట వశాత్తూ అరణ్యాలపాలు కావడంచేత తమకు ఇలా మరొక రాజు నాశ్రయించాల్సి వచ్చిందనే భావం వెల్లడి చేయాలనీ నిశ్చయించారు.

వీరు ఈ విషయాలు సంప్రదించు తున్నప్పుడు ఒకరు ఇంకొకరిని ఎంతో అనుకంపతో పొగడటం, సత్కరించటం ఓదార్చడం చూస్తాము. ఇప్పటి సోదరులు అలా క్షణక్షణానికి దయ, ఓదార్పులతో కూడిన మాటలు అంటారా? అనిపిస్తుంది. అప్పటి (కనీసం తిక్కననాటి) వ్యక్తులు మనఃస్థితికీ ఇప్పటి మన మనస్థితికీ తేడా ఉంది నిశ్చయంగా ;వారిలా, వీరు పొగడుతూ ఆదరిస్తూ - అంతగా మాట్లాడుకొనరు. అనిపిస్తుంది. వీళ్ళమరి వారిలాగా ఏకమై ఉండనే ఉండకపోవటం ఆ మర్యాదను పాటింపక హాస్యంగా గానీ నిజాయితీగాగానీ ఒకరినొకరు తప్పుపట్టుకోవడంవల్లనే నేమో ననిపిస్తుంది.

అర్జునుడు ధర్మరాజును పొగడి, అంతటివాడివి నీవెలా మత్స్య రాజ్యంలో అణగి వుండగలవో నంటాడు. ధర్మరాజు జవాబుగా "నేను సన్యాసి వేషంలో వెళ్ళి ఆ రాజుచేత మన్ననినే పొందుతాను పుణ్య కథలే చెప్తుంటాను. శ్రౌత స్మార్త జ్యోతిర్విద్యలు మాట్లాడుతుంటాను. సంతోష పెట్టుతుంటాను. నాకు ఒక దుర్వ్యసన ముందిగదా. అది ద్యూతమాడటం_అదీ వాస్తవమైన పందెంతో ఆడనుగాక_ సరదాకు విరాటునితో జూదమాడి అతడ్ని సంతోష పెట్టుతాను" అంటాడు.

ఆ తరువాత ధర్మరాజు భీముడ్ని పొగడి అంతటివాడెలా అణగి ఉంటాడో న టాడు. అప్పుడు భీముడు, తాను వంటవాడిగా చేరి అప్పుడప్పుడూ మల్లులతో క్రీడలాడి రాజుకు సంతోషం కలిగిస్తుంటానంటాడు. అలాగే అర్జునుడు తనకు ఊర్వశి పూర్వం ఒక శాపం ఇచ్చి "నపుంసకుడు కావాల్సింద" న్నదనీ ఇంద్రు డప్పుడు దానిని ఈ ఒక్క అజ్ఞాతవాస సంవత్సర కాలానికే పరిమితం చేసి దాని వల్ల మేలే అయేటట్లు వరమిచ్చాడనీ, భగవంతు డందువల్ల తమ కనుకూలుడేననీ చెప్పి, తాను అంతఃపురంలోని ఆడపడుచులకు నాట్యకళలను నేర్పగలననీ అంటాడు.

నకులుడు తాను గుర్రపు శాలకు అధిపతి అయి తనకు అశ్వవిద్య తెలుసు గనక రాజును సంతోష పెట్టుతానంటాడు. సహదేవుడు పశువుల పాలకుడుగా

వెళతానంటాడు. ద్రౌపది తాను సైరంధ్రీ వేషంలో వెళ్ళి విరాటుని భార్యవద్ద పని చేస్తానంటుంది.

వెంటనే ధర్మరాజు ద్రౌపదితో అంటాడు—

మన వంశంబును, వృత్తాంతంబును చెరుపును గానజాలు పుణ్యసతివి – దుర్జనులగు తులువల తలపులు గనుగొని యేమరక మెలగగా వలయుజుమా! అని.

సోదరుల మాటలకు ప్రతివచనాలేవీ ఎవరూ చెప్పలేదుగాని ద్రౌపది మాటలకు ధర్మరాజు ఇలా బోధగా చెప్పటం చిత్రమనిపిస్తుంది. స్త్రీలకు చెప్పితీరాలి గనక నేను చెప్పతున్నాను అనైనా చెప్పి ఉండవచ్చు. ఈమె సైరంధ్రీవేషంలో పాపం దుష్టబుద్ధులవల్ల శ్రమపడి భంగపాటు చెందుతుందేమోనని అయినా అలా హెచ్చరించి యుండవచ్చు.

ద్రౌపది "ఫరవాలేదులె" అన్నట్లుగా మొగం తిప్పిందట. "అనాదర సుందర మందస్మిత వదనారవింద" అయిందట. ఎంత బాగా చెప్పాడామాట! ఇప్పుడయితె 'ఫరవాలేదులే' అని తలతిప్పిందని వ్రాస్తాము? బహుశ. ఆమె ఇంకా ఇలా అన్నది బహుశ సైరంధ్రీజాతివారు ఎలా ఉంటారో మగవాడుగనక ధర్మరాజుకు తెలీకపో వచ్చుననే భావంతో— "వారు ఎల్లప్పుడూ పాతివ్రత్యాచారముతో వర్తిస్తారు. సౌజన్యంతో ఉంటారు. అందుచేత మితభాషావిరచనమును, వ్రత సంభావనమును గౌరవమును, పాపభయమున్నూ వారికి ఉంటవిగనుక నేనలాగే ప్రవర్తిస్తాను" అంటుంది. ధర్మరాజు "మంచి" దంటాడు.

వీరిని వదలివెళ్ళిన పౌరులయినవారందరితో "పాండవులు తమ్ము పంపి ఎక్కడికో వెళ్ళిపోయారనీ వారి సంగతి ఇక తమకు తెలియదనీ మాత్రమే చెప్పాలి" అని చెప్పారు. వారంతా 'సరేస'ని వెళ్ళిపోయారు. ఇంతమందిచేత అబద్ధమాడించాలని చూశాడా ధర్మరాజు? అని సందేహం కలుగుతుంది. మరి ఏమంటాడు? "మీరు నిజం చెప్పండి సుమా అబద్ధమాడకూడదు— ఇలా ఇలా వెళ్ళారని చెప్పుకోండి అంటాడా?" అలా అంటే వీళ్ళను అనుసరించి ఎలా ఎలా వెళ్ళారో తమ ఉత్సుకత కొద్దీ తెలుసుకొని ఆ సంగతి తీసికొనిపోయి దుర్యోధన పరివారాలకు వారు చెప్పినా చెప్పచ్చు. అలా అనటం తెలివైన పనికాదు. ధర్మరాజుకు తెలివి లేదనీ, కేవలం మూర్ఖమైన ధర్మవిషయికమైన పట్టుదల మాత్రమే ఉన్నదనీ అనుకొన్నవాళ్ళకే ఈలాటి సందేహాలు వస్తవనిపిస్తుంది.

నిజానికి ధర్మరాజు చాలా తెలివైనవాడు. తనతో ఉన్నవాళ్ళందరిని ఫలాన ఫలాన చోట్లకు వెళ్ళమని పంపిస్తాడు. ద్రుపదుడి వద్దకూ, ద్వారకకూ పంపుతాడు. అక్కడివాళ్ళు నిజానికి తమకు శ్రేయస్కాములు. ఎవ్వరికయినా సరే పాండవులు ఏమయినారని అడిగినవారికి "ఆ సంగతి తమకు తెలియదనె చెప్పు" మన్నాడు. ఎందుకు తెలియదు? అంటె ఎలా తెలుసు? వీళ్ళు ఇలా ఇలా ఉండాలనుకొన్న మాటలయితె తెలిసి ఉండవచ్చుగాని, వారు వెళ్ళి ఇక్కడ ఉన్నారు అనే సంగతి తెలీదు. వారు తమవద్ద ఏమైనా మాటలు వింటే– వాటిని వారికి వెల్లడిచేసి ఇలా ఉండి ఉండవచ్చు– అనే చేతకాని ఊహలు చెప్పవద్దని మనవిచేసికొన్నాడు. ఇందులో అబద్ధం చెప్పవలసిందనే అభ్యర్థనమే లేదు. తెలివి తక్కువ అసలేలేదు. విషయ గ్రాహకులు ఇలా సమన్వయించుకొనడం అవసరమనిపిస్తుంది.

ధౌమ్యుడప్పుడు పాండవులకు సేవాధర్మం ఎలాంటిదో చెప్తాడు. "మీరన్నీ తెలిసివారయినా ఈ సమయంలో చెప్పాల్సిందేకనక చెప్తాను" అంటాడు– "రాజుల్ని కొల్చి ఏదో విధంగా బ్రతికే జనులు కీడు పొందకుండా సాధారణ నీతి ఒకటుంది. అది సంక్షేపంగా చెప్తాను వినవలసింది" అంటాడు.

ఇప్పుడు రాజులు లేకపోయినా ప్రభుత్వం వెలయించే వ్యక్తి క్రింద భృత్యుడెలా ఉండాలనే ప్రశ్నకు కూడా ధౌమ్యుని మాటలు సమాధానమె అవుతవి.

"ప్రభువు ఎదుట అర్హమైనచోట కూర్చొని సమయమెరిగి ప్రభువుని కొలవాలి. ప్రభువు దగ్గర అవికృతవేషంతో ఉండాలిట. అంటె వికృతమైన వేషంలో ఉండరాదని బోధ. రాజు మన్నన ఉన్నప్పటికి, మరియాద తప్పరాదట. రాజగృహం కంటే గొప్పగా తన గృహాన్ని కట్టకూడదు. రాజు వేసుకొన్న ఆహార్యాన్నే తనూ వేయకూడదు– పోటీగా ఆ యన సలిపే విహారాలు తనూ విహరించకూడదు. పనిచేయుమని ఎవరికో చెప్తే ఆ పని తన నెత్తిన వేసికొని చేయకూడదు. అది ముప్పు కలిగిస్తుంది మొదటకె. రాజు దగ్గరగా తిరుగుతుంటే ఎక్కువ మందికి సంకటం కలుగుతుండే పరిస్థితి కనక ఉంటే– అది తన చేటునకే కారణం అవుతుంది. పది మందితో గడాగడా బిగ్గరగా, రాజుగారి ఎదుట మాట్లాడకూడదు. నాగరికులతో సంప్రదించి నెమ్మదిగా పలుకుతుండాలి. ఇతర్లతో మాట్లాడేటప్పుడు రాజునడు వీలుగా గాక వేరుగా మాట్లాడకూడదు. ఎట్ట ఎదురుగా ఉండరాదు. వీపును రాజువైపునకు బెట్టికూడ ఉండరాదు. అయనకు రెండు ప్రక్కలలో ఎక్కడయినా ఉండి కొలవాలి.

ఎప్పుడేమి చెప్తాడోనని ఎదురుచూస్తూ దృష్టిని అయన ముఖంమీద కేంద్రీకరించాలి. రాజు తనను మన్నించి నందుకు ఉబ్బిపోరాదు. అవమానిస్తే క్రుక్కనూరాదు. అలాంటివాళ్ళకు శుభం కలుగుతుంది. ఆపదలు అణగిపోతవి."

తరువాత ప్రభుభృత్య సంబంధం చెప్తాడు ఈ క్రింది పద్యంలో తిక్కన— ధౌమ్యుని నోట,—

"ఎండకు వానకోర్చి తనయిల్లు ప్రవాసపుఁజోటునాక యా
కొండు నలంగుదన్ నిదురకుం దరి దప్పెడు, డప్పిపుట్టినా
క్కఁండన యెట్లొకోయనక కార్యము ముట్టిన చోట నేలినా
తండొక చాయ చూపినను తత్పరతం బని సేయు టొప్పగున్"

ఇదే మన రాజ్యాంగ చట్టంలో 310 వ ఆర్టికలులో రచింపబడింది గూఢంగా. గవర్నరుగారి వివేచనాన్ని బట్టి ఉద్యోగియొక్క ఉద్యోగం నిలుస్తుంటుందని. రాజు సొమ్మును పాముని చూచినట్లుగా దూరాన బెట్టాలిట.

ఆవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవనంబు గు ప్త వ ర్తనములు గాగ
జలుపవలయు నృపతి గొలువున్న యెడల బాహిరములైనఁగెలని కెగ్గులగుట

ఆవులింత మొదలయునవి గూడ, రహస్యంగా అనుభవించాలిగాని బాహిరంగా రాజు ఎదుట చేయరాదని బోధ.

ఇవన్నీ పాండవులు విని తమ మస్తకాల్లో నిలుపుకొంటాము అంటారు. ధౌమ్యునకు నమస్కరిస్తారు. అయన దీవించుతాడు, వారు ఇక వెళ్తామని బయలు దేరంగానే అయన శాంతిమంత్రాలు పఠించి మంగళార్థ మంత్రాలు చదివి కామ్య పూజలు తీర్చి అగ్ని ప్రజ్వలించి అన్ని శుభాలు కలగాలని ఆశీర్వదించి పంపుతాడు.

## 2. సాధనా క్రమణిక

అరణ్యపర్వం ఆసాంతం వరకూ అహం బ్రహ్మాస్మి సాధన సూచించబడింది. ద్యూతం 'నేతి' 'నేతి' అనే సాధనకు సూచన. అన్నీ వదలుకొన్నా మోక్ష సన్యాసం కాలేదు. 'మోక్షతపనకు ప్రతీక అయిన ద్రౌపదిని వదలకుండా తమతో ఉంచు కొన్నారు. ఆమెను వదలక తమను తాము పణం పెట్టటంఆత్మార్పణం చేయటమ యింది. ఈ పొరపాటువల్ల సాధన భ్రష్టమై తిరిగి పన్నెండు ఇంద్రియాలను పన్నెం

డేళ్లూ సాధనకు అలవాటు చేయాల్సి వచ్చింది. సభాపర్వ కథలో ఈ సూచన చేయ బడింది. అహం బ్రహ్మాస్మి సాధన పూర్తి అయితే, ఆ తరువాతి సాధన "సర్వంఖ ల్విదం బ్రహ్మ" అనే మహావాక్య బోధిత సాధన. ఇందులో అహంకార మమకారాలు తగ్గిపోవాలి. ఉండరాదు, తాను పై స్థితిలో నున్నట్లు ప్రపంచం వేరు– నేను వేరు–నేనే బ్రహ్మ అన్నట్లుండరాదు. ఆస్థితి నుంచి తిరిగి వచ్చి ప్రపంచంతో కలిసి, ప్రపంచమంతా బ్రహ్మమేననె తత్వం గ్రహించాలి. అదీ సాధన– అజ్ఞాతవాస పర్వంలో ఇది పాండవులు సాధిస్తారు. ఈ సాధన కోసమే పాండవులు "మత్స్య" రాజ్యానికి వెళ్ళి అక్కడుండాలన్నారు. మత్ + స – అనే పదానికి "మమకారం వదలట"మనె సూచనె వ్యాసమహర్షి ఈ మాటల్లో వెల్లడి చేయటానికి ఉద్యమించింది. అద్వైత సాధనె, ఉపనిషత్తుల్లో చెప్పిన మహావాక్యాల బోధాపరమైన సాధన। భారతం ఆ విధంగా పంచమ వేదంగా రూపొంది సామాన్యులకు కథ చెప్పి, ఆలోచింప గలిగిన వారికి సాధన చెప్పింది.

## ౪. వైరాటము

ధౌమ్యుడు కూడ పాండవుల్ని వదలి వెళ్ళిపోయిం తర్వాత, పాండవులూ ద్రౌపదీ అజ్ఞాతవాస సంవత్సరం తమను తాముగా కూడ చెప్పుకోలేని కాలం ప్రాప్తించిందని గమనించి దశార్ణ దేశానికి ఉత్తరానా– కాళిందీ నదికి దక్షిణతీరం వెంటా పశ్చిమానికి ప్రయాణం చేస్తూ ఉంటారు. వనంలో దొరికే ఆహారం తింటూ చెట్లనీడల్లో విశ్రమిస్తూ సరస్సుల్లోనూ నదుల్లోనూ స్నానాలు చేస్తూ అనుష్ఠానం చేని కొంటూ పక్షుల కూతలు వింటూ వెళ్తుంటారు అరణ్యాల్లో నడుస్తూ।

ఈ సమయంలో వీళ్ళు ఒకళ్ళతో ఒకళ్ళు ఆఖ్యానాలూ ఉపాఖ్యానాలూ ధర్మాలూ చర్చించినట్లు అవుపడదు. కేవలం ప్రకృతి– మనసు– గ్రహింపు– ఇంకేం లేదు. ఏది మాట్లాడుకుంటే ఎవరికి వీరి వర్తనం– వ్యూహం– అవగతమయిపో తుందోనని కూడ అయి యుండవచ్చు। ఇలా నడిచి నడిచి అధికమైన శ్రమవల్ల ద్రౌపదికి కాలివ్రేళ్ళు పొక్కడం నెత్తురులు చిమ్మడంతో ఇక నడవలేక కూలిపడే స్థితి ప్రాప్తిస్తుంది. ఈమెను ఎత్తుకొని కూడ నడిచి వెళ్ళాల్సి వచ్చింది. నకుల, సహదేవులు కూడ ఎంతో స్రుక్కి ఉండటంచేత అర్జునుడు ఆమెను ఎత్తుకొని నడు స్తాడు. ఇలా విరాటనగర ప్రాంతాలకు వస్తారు అంతాను.

ఉండాల్సిన చోటికి దగ్గరగా వచ్చారు. ఇక గుప్తంగా ఉండటానికి గాను ఆహార్యం మార్పు చేయాలి. వేషాలు వేసికొనేముందు ఈ మహత్తరమైన ఆయుధాలు, గాండీవం, గద, శంఖాలు మొదలైనవి ఎక్కడ దాచాలి! నిజానికి తమవి అనుకొన్న భూమి, పుట్టి జనులను పన్నెండేండ్లనాడు వదలి వచ్చారు. మొన్న మొన్ననె తమను ప్రేమించిన జనులందర్నీ పంపేశారు. ఇప్పుడు తమ తమ ఆయుధాలను కూడ వదలటానికి సిద్ధమవుతున్నారు. ఎంతో వేదన అనుభవిస్తున్నారు అంతాను. ముఖ్యంగా అర్జునుడు తన గాండీవాన్ని వదలి ఉండటం మహా త్యాగ విషయం అయింది.

ఆ ఆయుధాలన్నిటినీ ఒక కట్టగా గట్టి ఒక స్మశాన ప్రాంతంలో ఉన్న జమ్మి వృక్షంమీద పెట్టాలని నిశ్చయించుకొన్నారు. జిబ్బిజుట్టు విరబోసికొని బూజుపట్టి శాకినీ ఢాకినీ భూతాలు కొమ్మలపై ఉండి ఊగుతున్నట్లుంది ఆ వృక్షం. దాని దగ్గరకెవరూనరదాకైనా వెళ్ళరుగాక.అందుకని దానిపై భద్రపరచాలనుకొన్నారు.ఒక్కొక్కర్ని పిల్చి ధర్మరాజు "నీ ప్రియమైన ఆ ఆయుధం ఎంతో మంది శత్రువుల హెగరణచింది. ఆ ఆయుధం ఇప్పుడిక్కడ ఉంచాల్సింది" అని పొగడ్తా విషాదమూ కలిపి అభ్యర్థిస్తాడు. వారు కంటి నీరు మాత్రం తక్కువగా వాటిని ఇచ్చివేస్తారు. ధర్మరాజు వాటి నన్నిటినీ శవాకారంగా కట్టి తానే చెట్టుమీదకు దానిని మోసికొని పోయి ఒక కొమ్మకు వ్రేలాడగట్టుతాడు. బ్రహ్మ విష్ణుమహేశ్వ దిక్పాల చంద్ర సూర్య వనదేవతా పితృస్తుతులు చేస్తాడు. ఆకాశం భూమీ, రెంటినీ చూచి ప్రార్థిస్తాడు. వారంతా ఆ ఆయుధాలకు అధిదేవతలు. ఆ ఆయుధాల యందు వారి నావహింపజేసి ఇలా ప్రార్థిస్తాడు.

"మీరు భగవదంశ సంభూతులు. మీ వల్ల ఇన్నాళ్లూ మేము జీవించాము. మీకు కృతజ్ఞులము. మాకు మీరు ఇంకా సహాయం చేయవలసి ఉంది. ముఖ్యంగా ఈ సంవత్సరమంతా మీరిలా కట్టుబడి ఎవరికీ ఆయుధాల్లా కన్పడకుండ వలసింది. నాకూ అర్జునునకూ మాత్రం ఆయుధాల్లా కన్పడండి. ఇది మేము మిమ్ములను అర్థిస్తున్న మేలు." అంటాడు.

భీముడు ఆవేశపరుడు గనక అలాగే ఎవరికి ఆవేశం కలిగితే వారు వచ్చి ఆయుధాలు తీసి రభస చేస్తారేమోననే భయంతో అలా ధర్మరాజు ప్రార్థించాడు.

ఆ దేవతలు ఆయన ప్రార్థనను మన్నించారు. ధర్మరాజు క్రిందికి దిగి చూస్తే అది కేవలం ఒక శవంగా అవుపడుతున్నది అందరికిన్నీ. అక్కడ గోవుల కాసే వారు ఈ శవమేమిటి అలా ఉంచారు అని ఆలోచిస్తున్నారు. అందుకని ధర్మరాజు ఆ శవం తమ శత వృద్ధ అయిన తల్లి గారిదనీ— తమ ఆచారం శవాలు తగల బెట్టడం కాదనీ— అలాగే చేయాల్సి ఉందనీ చెప్పాడు.

ఈ కథనానికి అనువుగా ఉండేటట్లు ఆ స్మశానంలో పడిఉన్న ఒక శవం జుట్టుతీసి ఆ ఆయుధాల శవాకారానికి చేర్చుతారు. వర్షపు నీరు పడకుండా ఒక ఎద్దు చర్మాన్ని వలిచితెచ్చి కప్పుతారు. దాని మీద మరొక శవాన్ని కూడ కట్టు తారు. గోపాలురకే నేమి — ఎవరు చూచినా అది వ్రేలాడగట్టిన శవం లాగానే ఉంటున్నది.

అలాటి అసత్యం ధర్మరాజెలా చెప్పాడు అనిపిస్తుంది బాలురకు. అది అసత్యమా లేక సత్యమా అనేది కేవలం ఎదురుగానున్న గాథయందు మాత్రమే బుద్ధిని ప్రసరింపజేసి ఆలోచిస్తే తెలియడానికి చాలదు. పూర్వాపరాలతో సమన్వ యించుకొనడం అవసరం.

సత్యము అనేది ఒక్క భూతకాలానికే పరిమితమైంది కాదు, భూత భవిష్య ద్వర్తమాన కాలాలన్నిటికీ సంబంధించింది సత్యము. "అది తాకరానిది," అనేమాట సత్యమైనది. దానిని గోపాలుర మనసులకు హత్తి చెప్పటంలో వారు అవలంభిం చిన తీరు ఇది. తమ తల్లి శవమనడం యథాతథంగా భూతకాలం పరిశీలిస్తే అబద్ధం. ఎందుకనంటే కుంతీదేవి నిక్షేపంగా బ్రతికే ఉంది. అది తాకరానిది అనే సత్యం చెప్పడానికి శవం అనటంలో అది తమ తల్లిదిగనుక తాము ఆపని చేయ వలసి వచ్చిందనే మాటతో ఎవరికీ అనుమానం కలుగని మార్గం ధర్మరాజు అనుస రించాడు. ఎదుటి వారికి చెప్పదలచింది అది తాకరాదనేది — అంతేగాని "మా తల్లి శవం ఇది" అనేమాటకాదు. దానికి ఆ ప్రాధాన్యత ఎంతో ఉంది. అది తాక రాదనే సంగతిని ఉద్ఘాటించేవరకే ఉపయోగింపబడింది.

'సత్యము ఏది' అనే విషయం విమర్శకు వచ్చినప్పుడు ఒక కథ చెప్తారు. గోవును చంపాలని కసాయివారు వెంట తరుముతూ వచ్చారు. గోవు ఒకముని ముందుగా వెళ్ళి ఒక పొదలో దూరింది. దుండగులువచ్చి ముని నడుగుతారు గోవు ఎటు వెళ్ళిందని, ముని నేను చూడలేదన్నాడు. ఇది సత్యమే నన్నారు. ఎలా సత్యం?

చూచినవి కళ్ళు. నేను అని నాలుక చెప్తోంది. నాలుక చూడదు గనుక నేను చూడ లేదన్నది. మరి "నేను" అనే ఆ మనిషి సంగతేమిటి? అతడు చెప్పటం ఇష్టంలేదు గనుక ఆ అభిప్రాయం చెప్పనేలేదు. నాలుకను అందుకు ఉపయోగింపలేదు. అని సమర్థన. సత్యాఽసత్య నిరూపకం ఇంతటి సూక్ష్మ విషయంమీద ఆధారపడి ఉంటుందనేది తెలిసి నిర్ణయం చేయాలి. జరిగినది చెప్పటం—చెప్పకపోవటం అనే కేవల భూతకాలంపై ఆధారపడిన మాటలు సత్యం అనటం అసత్యం అనటంలో ధర్మం అనేది ముఖ్యం అని తెలియాలి.

ఆ తరువాత పాండవులు తమ పేర్లు తమలో తాము మాట్లాడుకోడానికిగాను మార్చుకొంటారు. వరుసగా వారు జయుడు, జయంతుడు, విజయుడు, జయత్సేనుడు, జయద్బలుడు అని పేర్లు పెట్టుకొంటారు. ద్రౌపతికి మాలిని అనే పేరు పెట్టుతారు ఈ యీ పేర్లు ఎప్పుడు పిల్చుకొనేవారో మనకు తెలీదుగాని, ఆ పేర్లన్నీ చెప్పి వారందర్నీ ద్రౌపది ఒకే ఒకసారి ఉపకీచకులు ఆమెను పట్టుకొని చంపబోయే సమ యాన పిల్చి రక్షించుకుంటుంది. ధర్మరాజు చెట్టుదిగి వచ్చి తూర్పుకు తిరిగి, ధర్మ దేవతను ప్రార్థిస్తాడు. ధర్మదేవత అరణ్యవాసాంతంలో తనకు ఒక రూపంలో అవుపించి భీమార్జున నకుల సహదేవుల్ని తన మాటలు విననందుకు విగత జీవులుగా చేసింది. ధర్మరాజు యక్షప్రశ్న లన్నిటికీ సమాధానం చెప్పి వారిని బ్రతికించు కొన్నాడు. అప్పుడే ఆ ధర్మదేవత పాండవులకు వరమిచ్చాడు— "అజ్ఞాతవాస సమ యంలో మిమ్ము లెవ్వరూ గుర్తించకుండా వరమిస్తున్నానన్నాడు. ఇది జ్ఞాపకం చేసి కొని ధర్మ దేవతను ప్రార్థిస్తాడు ధర్మరాజు.

అంతలో ధర్మరాజు రూపు సన్యాసిగా కంకభట్టుగా అవుతుంది. భీముడు వంటలవాడుగా వలలాంకుడుగా మారిపోతాడు. అర్జునునకు పేడిమూతి ఆడ కళలు వస్తవి. నకుల సహదేవులు ద్రామగ్రంధిగా తంత్రీపాలుడుగా మారిపోతారు. అంతా ఆశ్చర్యపోతారు. ద్రౌపది మాలినిగా సైరంధ్రిగా అవుతుంది.

వీరికి ఆహార్యం (వేషం) మాత్రం మారిపోయింది. మనసూ బుద్ధులు మార లేదు. శారీరక జన్మలు మారిపోయినవి. మనోబుద్ధుల జన్మ అదేగా ఉంటున్నదని తెలుస్తూనే ఉన్నది వారికి, తమకు తాము ఇంకా పాండవులమేననే స్పృహ ఇక్కడ గమనీయమైన విషయం.

వెనుకటి కథల్లో మార్కండేయుడు తాను వటపత్రశాయి ముందున్నప్పుడు ఆయన వదనంగుండా లోపలకువెళ్ళి నూరు సంవత్సరాలకు పైకాలం లోపల విహరించి తిరిగివచ్చి మళ్ళీ తానూ మార్కండేయుడేను అనే అనుభూతిలో ఉండి పోయినాడు. శరీర మరణం లేదా మార్పువల్ల మనిషికి అంతం కలుగదనే మాటకు ఇవి ఉదాహరణలు. ఒక సంవత్సరంపాటు మారిపోయిన శరీరాలతో ఉండి పాండవులు తామెప్పుడూ పాండవులేనని ప్రవర్తిస్తూ వచ్చారనేది చిత్రం. మనమూ స్వప్నాల్లో మారిపోయిన శరీరాల్లో ఉండికూడ అదంతా వట్టి అబద్ధం అనుకొంటూ ఉంటాము. ఈ జాగ్రతలో సంవత్సరం మెలగిన పాండవులు కూడ ఆ జాగ్రత్త లోని ఈ భాగం పరమ అబద్ధమనుకోకపోవటం ఎలాంటి పరిస్థితుల్లో జరిగిందో గమనించటం మనకు మేల్కొలుపు.

పాండవు లొక్కొక్కరె విరాట్రాజు ఆస్థానానికి బయలుదేరి వెళతారు. విరాట్రాజు గుర్తింపలేక పోవడమేమిటి కేవలం వేషాలు వేసికొని వారు వచ్చిన మాత్రంచేత అనిపిస్తుంది. విరాట్రాజుకు పాండవులు గొప్ప రాజులని తెలుసు. వారు అరణ్యాల పాలయినారనీ తెలుసు. అది పన్నెండేండ్ల క్రిందటి సంగతి, పద మూడో సంవత్సరం ఎప్పుడు మొదలో చివరో అతడికి తెలియాల్సినపని లేదుగాక. అందుకని ఈ పాండవులు తన దగ్గరె ఉండబోతున్నారనిగాని ఉన్నారనిగాని ఊహించే అవకాశమే విరాట్రాజుకులేదు.

ముందుగా కంకుడు తన దర్బారులోనికి రావడంచూసి, ఒక సంయమివస్తు న్నాడనుకొంటాడు విరటుడు. మంత్రి సహితంగా వెళ్ళి నమస్కరించి తెచ్చి కూర్చో బెట్టుతాడు. "ఎయ్యది జన్మభూమి? కులమెయ్యది" అంటూ కుశల ప్రశ్న చేస్తాడు.

ఇంతకూ నీ"కుల" మేమిటని విరాటుడడిగితే కంకుడు ఎంతో చమత్కా రంగా సమాధానం చెప్తాడు. నిజానికి అతడు తత్త్వవేత్తేను అనిపిస్తుంది ఆ సమా ధానం వింటె.

"ఉన్నరూపు పలుకు నన్నరులెక్కడ
గలరు తోచినట్లు పలుకనైన
చందమయ్యె నంతగాక యింత
పట్టి చూడగలరె ఎట్టివారు."

—అంటాడు.

"నానావిధ భూతమయము "మేను"
అతి చంచలము మనము—మెయికొని
నిక్కంబున కేనరునకు చెల్లింపగానగు
సత్యంబు నడపుక్రమ మట్లుండెన్."

ఈ నడుస్తున్న క్రమమే సత్యము. అంటున్నాడు. తాము ఆయుధాల విషయంలో పర్యవసానంగా దానినెవరూ తాకరాదని చెప్పిందే సత్యము. అనేది ఆలోచిస్తూ ఈ మాటలు చెపుతున్నాడా అనిపిస్తుంది. మొత్తంమీద నిజం తెలియకుండానే సమాధానం చెప్పాడు.

తాను ధర్మరాజుకు సఖుడనంటాడు. ఐహు వినోద విషయాలు తనకు తెలుసునట. ద్యూత క్రీడ తెలుసు. ఒకేఒక సంవత్సరం వ్రతంగా తా నక్కడ ఉంటానంటాడు. విరాటుడికి కంకుడు ధర్మరాజుకు సఖుడనంగానే తలమున్కలయినంత ఉబ్బు కలుగుతుంది. నీ కేమయినాసరే – ఇచ్చేస్తాను అడుగు మంటాడు. తన రాజ్యాన్ని ఇచ్చేస్తానంటాడు. అలా రాజ్యాన్నే ఇస్తాననటం వ్యావహారికంగా చూస్తే తాను కీచకుడి బాహుబలం వల్లగాక ఇతరవిధంగా రాజ్యం నిలుపుకోలేకుండా ఉంటాడు కదా. ఆ బెడద వదలించుకోవాలనేమొ ననిపిస్తుంది. లేక కేవలం నిర్వృతి తత్త్వం గలవాడా ఇతడు –అనిపిస్తుందికూడ. విరాటు అనే పదంలోనే నిర్వృతి తత్త్వం ఉన్నట్లు అర్థం ఉంది. కంకుడు విరాట్రాజు కొలువులో చేరిపోతాడు.

కొంత సేపటికి వలలుడు పెద్ద శరీరంతోనూ రెండు గరిటలతోనూ దర్బారుకు వస్తాడు. ఇతడ్ని చూస్తె బహుశ విరాటునికి తన బావమరిది కీచకుడ్ని చూచినట్లయిందనిపిస్తుంది. అతడిదీ పెద్ద శరీరమే. వలలుడు వచ్చి "అయ్యా నేను శూద్రుడను. చక్కగా వంటచేస్తాను. సరదాగా మల్లులతో సింహాలతో పులులతో యుద్ధంచేసి సంతోష పెట్టగలను. నాకు భోజనం గుడ్డలూ ఇస్తేచాలు. మీ ఆస్థానంలో ఉంటాను" అంటాడు, విరాటుడు అతడ్ని ఎంతో మెప్పువలతో ఆదరించి తన మహానస శాలలో వంటల వారిపై అధ్యక్షుడుగా ఉండుమని నియామకం చేసాడు.

అర్జునుడు బృహన్నలగా వచ్చి "మీకు కొల్వు చేయడానికి వచ్చాను. మీ ఇంటి కన్నెలకు ఆటపాటలు నేర్పుతాను. నేను పేడిని" అని చెప్తాడు విరాటుడు బృహన్నల అందాన్ని దీర్ఘ బాహువుల్ని భాగ్యరేఖనూ చూసి. "నీకు ఇంకా ఎక్కువ అధికారాలిస్తా"నంటాడు. అవేవీ వద్దని బృహన్నల అనడంచేత రాజు తన కూతురైన ఉత్తరను పిలిపించి, ఈ మనిషిదగ్గర ఆట నేర్చుకొంటావా" అని అడుగుతాడు. ఆమె అంగీకరిస్తుంది. విరాట్రాజు బృహన్నలతో ఉత్తరను తీవ్రంగా శిక్షింపవద్దనీ ఆమె గారాబంగా పెరిగినట్టిదనీ చెప్తారు. ఆమెతో "నీకు తల్లీతోడూ ఈ గురువే" అంటూ ఆమెను బృహన్నలకు అప్పగిస్తాడు. "ఈ బృహన్నల మన ఇంట్లో ఇక్కడ అక్కడ అనే నిర్బంధం లేకుండ సర్వత్ర తిరగవచ్చునన్నాడు. అలా బృహన్నల నియామకం అయినాడు.

నకులుడు అశ్వశాలాధ్యక్షుడుగా తామ్రగ్రంథి పేరుతోనూ, సహదేవుడు తంత్రీపాలుడనే పేరుతో గోశాలాధ్యక్షుడుగానూ విరాటుని కొలువులో చేరుతారు.

సైరంధ్రి పేరుతో ద్రౌపది ఊళ్ళోకి వస్తూ ఉంటుంది. జడవేయడం మాని కొప్పు పెట్టింది. చన్గవపైటతో మాత్రమే కప్పుకొన్నది నడచివెళుతున్నది. ఆవిడ పరిచారికగా ఉండాలని ఉద్దేశ్యంతో వెళుతున్నట్లు అందరికీ ప్రస్ఫుట మవుతోందిట. ఊరివారు ఆమె అందాన్ని చూచి తికమకయి పోతున్నారు. రోహిణా? అరుంధతా? మనిషేనంటావా? అనుకొంటున్నారు. "ఏం పనిమీద వెళుతున్నావు? ఎవరు నీవు" అంటున్నారు. అందుకామె "నేను గట్టువాలును, నా కెవరు కడుపుకూడు పెట్టి కట్టుబట్టలిచ్చి ఏలుతారో వారికి పనులు చేసిపెడ్తాను" అంటుంది. అలా అంటూనే రాజప్రాసాదం చేరుతుంది.

అలా వచ్చిన అమ్మని, సుధేష్ణ చూచి పిలిపించి సైప్రశ్నే అడుగుతుంది. అందుకు సైరంధ్రి తన పేరు మాలిని అనీ తనకు ఐదుగురు భర్తలున్నారనీ వాళ్ళు యక్షులనీ, తమ విరోధులు తనను తలపట్టి ఈడ్చినారనీ అందుకని ఒకానొక వ్రతం చేపట్టి తాను అరణ్యాల్లో ఉంటూ బ్రహ్మచర్యం పాటించిందనీ, ఇంకో సంవత్సరం నియమాచరణ చేయాల్సి ఉందనీ చెప్తుంది. "నీవు ధర్మవర్తివని విని నీదగ్గర పనులు చేసి నిల్చి ఉందామని వచ్చా" నంటుంది. తాను ఒకప్పుడు సత్యభామ దగ్గరా ఇంకొకప్పుడు ద్రౌపది దగ్గరా పనిచేశానంటుంది. "నాకు నీచమైన పనులు చెప్పకూడదు. ఆచారం తప్పకుండా నన్ను పాలించాల్సింది. పూలు కట్టుతాను. తలముడుస్తాను" అంటుంది.

సుధేష్ణ అనుకొంటుంది "ఈమె ఇంత అందంగా ఉంది, నా భర్త ఈమె పాల బడితె ఎలాగ" అని అందుకని నర్మ గర్భంగా 'అబ్బో నిన్ను నా యింట్లో పెట్టుకోవటం ఎంతో కష్టమే. నిన్ను కాపాడట మెలాగు' అంటుంది. వెంటనే ద్రౌపది 'ఆ సంగతి నాకు వదులమ్మా! నీచమతితో నన్నెవ్వరన్నా చూచేటట్లయితె నా భర్తలు నాణ్ణి ఆ రాత్రికి మట్టు బెట్టరూ? అందు చేత పురుషులు నా వంక చూడనె చూడలేరుగాక.' అంటుంది. సుధేష్ణ ఒక క్రమానికి అంగీకరించి ఆమెను తనవద్ద పనికి నియామకం చేస్తుంది.

అలా పాండవులంతా విరాట్రాజు కొలువులో చేర్తారు.

ఇది ప్రథమాశ్వాసము

— —

# మహాభారత కథలు

## విరాట్పర్వము- ద్వితీయాశ్వాసము

## కీచక వధ

పాండవులూ ద్రౌపది విరాట్రాజు కొలువుచేస్తూ అజ్ఞాతవాస సంవత్సరంలో చాలాకాలం గడిపేశారు. ధర్మరాజు తాను జూదమాడి గెల్చిన ధనాలను తమ్ములకూ, తమ్ములు తమ తమ నౌకరిలో లభించిన ధనాన్ని సోదరులకూ ఇచ్చేవాళ్ళు. ద్రౌపది వీరందరి మంచి, చెడూ, ఆరోగ్యం చూసుకుంటూ ఉండేది. ముఖ్యంగా తంత్రీ పాలుడికి పాలనిస్తూ ఉండేదిట.

భీముడు దర్బారులో సవాలు చేస్తూ ఉండే మల్లురతో మల్లయుద్ధం చేసి గెలిచి రాజును మెప్పించేవాడు. అప్పటి మల్లయుద్ధం ఎంతో చాకచక్యంగా వర్ణించాడు తిక్కన. ఆయన వ్రాసిన ఈ భాగం చదివితే మల్లయుద్ధంలోని ఎన్నో వివరణలు మనం తెలిసికోగల మనిపిస్తుంది. మల్లవరులెవరూ రాని రోజుల్లో అంతఃపురంలో వారి వినోదం కోసం భీముడు సింహం, పులి, ఏనుగువంటి జంతువులతో పోరాడి గెలుస్తుండేవాడు.

అజ్ఞాతవాస కాలం ఇంకా కొద్ది రోజులే గడువుందనగా ఒకనాడు కీచకుడు సుధేష్ణను చూడటానికి అంతఃపురంలోకి వచ్చి ద్రౌపదిని చూస్తాడు. ఆ క్షణంలోనే ఆమె అందానికి ముగ్ధుడై అతడు అలా కళ్లప్పగించి ఊరుకొంటాడు. ఆమె రూపం అతడికి వలగా ఉరిగా అయింది. కాముడు అతడ్ని తేలికగా వేటాడినాడట. ఈ సారస్యమైన పద్యాలు తిక్కన రచనలో ఎంతో హృద్యంగా నడుస్తవి.

కీచకుడు అప్పటినుంచీ ఈ పడుచు నెలా పొందాలి అనే ఆలోచన చేస్తున్నాడు. ఈతడిలా తనను చూస్తుంటే ఆమెకు హృదయంలో బాధ కలుగడంచేత వంటికి చెమటపట్టింది. "అయ్యో బ్రహ్మ ఈతడి నిలా ఇక్కడ చేర్చాడేమిటి! ఇంక నాకెవరు శరణు" అని భయపడటంవల్ల వణుకుపుట్టింది. ఏ ఉపాయమూ తెలియక పోవటంచేత మొగము వెలవెల పోయింది. ఇదంతా చూస్తూ కీచకుడు ఆమెకు తనపై కలిగిన మదన సంబంధానురాగమే ఆ మార్పులకు కారణమనుకొంటున్నాడు.

ఆతడు వెంటనే వెళ్లి అప్పగారికి నమస్కరించి "ఈపిల్ల ఎవరు? మగడున్నాడా? ఇక్కడికెందుకొచ్చింది?" అని అడుగటం ఆరంభించాడు. ఆమె మాట తప్పించి ఏదో చెప్ప జూచింది, అందుకని అతడు వెంటనే సైరంధ్రి దగ్గరికి వెళ్ళి

"ఓహో! ఎంత అందగా ఉన్నావూ నువ్వు! ఎవరి కుమార్తెవు? పతి ఎవరు? నీ పేరేమిటి?" అంటాడు. ఆమె మాట్లాడదు. క్షణమాగి చిఱునవ్వి ఇటు కనుత్రిప్పి చూడకూడదా? కొంచెం నవ్వరాదా? ముద్దుగా పలుకులు పలుకరాదా? హృదయం లోని సరసతను గ్రహించరాదా?" అంటూ దగ్గరకు వస్తాడు. ప్రక్కగా వెళ్తాడు. చుట్టూ తిరుగుతాడు. చేతిత్రేళ్ళు పట్టుకోబోతాడు. ఈ మదన చేష్టల నెంత బాగా చిత్రించాడో తిక్కన! ఎంతో సారస్యమైన చిత్రణం.

అప్పటి స్థితి సైరంధ్రి అవునన్నా–కాదన్నా–పేచీవచ్చే పరిస్థితి. అందుకని' అంటుంది,—

"నా యున్నబాము తలపవ యీ యొదలి చీర యిట్టి యేవపు జందం

బోయన్న! మదన వికృతిం జేయుననుట ఎంతయును నిషిద్ధముగాదే! -అంటుంది.

కీచకుడు మాత్రం తన ప్రయత్నమూ మాటలూ వదలడు. "నీ అందం, కమలాల రేకులు అతికించినట్లున్నది. చక్రవాకాలు తెచ్చి కుప్పలు పోసినట్లున్నావు. చంద్రుడి కాంతిని తెచ్చి తగిలించారు. నీకు" అంటున్నాడు. అప్పుడిక చివరి ఉపాయంగా ఆమె,-"కీచకా! నాకు ఐదుగురు గంధర్వులు భర్తలున్నారు. వాళ్ళు నీ మానం ప్రాణాలు తీసేయటం ఖాయం. పూర్వం రావణాసురుడి గతే నీకూ పట్టుతుంది జాగ్రత్త!" అంటుంది.

కీచకుడు గుటక మ్రింగి సుధేష్ణ దగ్గరకువెళ్ళి ఆ సైరంధ్రి సంగతు లడుగుతాడు. తన హృదయం విప్పి చెప్తాడు. అందుకామె, అంటుంది "నీ కెంతో మంది హంసలవంటి పడుచువాళ్ళుండంగా ఈ నీచమైన సైరంధ్రితో నీకి తగువేమిటి?" అని. అతడు "ఆ మనిషిని నా పరం చేయకపోయినావంటే నేను చచ్చిపోతా" నంటాడు. సుధేష్ణ ఒక సత్య విషయం అడుగుతుంది. "నీవంటె ఇష్టంలేని స్త్రీతోటిస్నీ రతుల్లో చవులు చూడలేని స్త్రీ పొందులోనూ సుఖం ఏముంటుందయ్యా! దాని పతులు ఐదుగురున్నారట. వాళ్ళు గంధర్వులట. వాళ్ళకు తెలిస్తే ఇంకేమన్నా ఉందా? బ్రతుకు రుచి ఎంతయినా అపథ్యం చేయవచ్చునా?" అంటుంది. అప్పుడతడు "బల సాహసాల మాట నాదగ్గరెత్తకు. ముందు దాన్ని పిలిపించు నీకు దణ్ణం పెడతాను" అంటూ కాళ్ళు పట్టుకొంటాడు,

సుధేష్ణ వెంటనే నిశ్చయించుకొంటుంది "పీడికి చచ్చిపోయే రోజులు దగ్గర కొచ్చినయి. ఎన్ని చెప్పినా వినడే! ఎలా" అని ఆలోచించి, "నీవు గోల పెట్టకు, కల్లు తేవడానికని, నీ యింటికి పంపుతాను. దాన్ని నీవేం చేస్తావో చెయ్యి. నా కాళ్ళు వదులు" మంటుంది.

కీచకుడు సంతసించి ఇంటికి వెళ్తాడు. మనసు సైరంధ్రిపైనే ఉంటుంది. ఆమె వచ్చిందని భ్రమిస్తూ అకెవ్వో రాలేదా? అనుకొంటూ కాలం గడుపు తుంటాడు. సుధేష్ణ సైరంధ్రిని వెళ్ళి కల్లు తేవలసిందని ఆజ్ఞాపిస్తుంది. ద్రౌపది హృదయంలో ఎంతో బాధపడిపోతుంది. తప్పనిసరిగా వెళ్తుంది. దేవుళ్ళను ప్రార్థిస్తుంది. ప్రత్యక్ష దైవమైన సూర్యునితో "ఓ ప్రభూ! నేను పాండవులనే-మనస్సులో ఉంచుకొన్న దాన్నయితే ఈ కీచకునివల్ల నాకు కీడు రాకుండా కాపాడాల్సింది" అంటుంది. తన నియమం ఉంకువచేసి సూర్యుని నిష్కర్షగా అడుగటం చిత్రం. నిశ్చయమైన ఆత్మ బలంతో అలా అడిగిందనేది గమనీయం! అరణ్య వాసారంభంలో చుట్టూ తననాశ్ర యించుకొని వచ్చిన జనాలకు తిండి పెట్టాలని ధర్మరాజు వాపోయి సూర్యుని ఉపా సించడం, అప్పుడతడు ప్రత్యక్షమై పాత్రనిచ్చి ద్రౌపది దానితో వండినట్లయితే అది సమృద్ధిగా అందరనూ తృప్తిపరుస్తుందని అనుగ్రహించడం తనకు తెలుసు ఆమె అందుకనే సూర్యుని రక్షణ అడిగింది.

సూర్యుడనుగ్రహించాడు. ఒక రాక్షసుడికి ఉండే బలం ఆమెకు కలిగిందో లేక ఒక బలశాలి అదృశ్యంగా వచ్చి ఉన్నాడో ఆమెను రక్షించడానికి. ఆమె సింహ్వాపు గుహలోకి లేడిలా వెళ్ళింది. కీచకుడు వచ్చి డైలాగులు చెప్తున్నాడు. పట్టుకోబోయినాడు. ఆమె పారిపోతోంది. తీరా పట్టుకొనే సమయానికి ఒక్క విసురుతో కీచకుడు పడిపోతాడు. రాక్షసుడే అలా త్రోసినట్లు వర్ణించారు భారతంలో. రాక్షసుడు అలా తనను త్రోసినట్లు కీచకునకే తెలీదు ఆమె త్రోసేసిందనుకొంటు న్నాడు. అది ఉపాసనవల్ల ఆమెకు కలిగిన శక్తి అని మనం అనుకోవచ్చు. అనుకో కనూపోవచ్చు. అది ఎవరి సంస్కారాన్నిబట్టి వారికి అలా అనిపిస్తుంది! ఆమె పరుగుతీసి రోడ్డునపడి రాజదర్బారు వైపునకు పరుగెత్తుతుంది. కీచకుడు లేచి దుమ్ము దులుపుకొని అటూఇటూ చూచి ఆమె వెంటపడుతాడు.

ఆమె దర్బారు చేరేటప్పటికి అక్కడ కంకభట్టు, వలలుడూ ఉంటారు. ఆమె ప్రాణం చేరుకొంటుంది. భీముడు ద్రౌపది అవస్థచూసి మండిపడిపోతుంటాడు.

కీచకుడు కోపంతో వచ్చి ద్రౌపది కొప్పుపట్టి లాగి ఒక్క తన్ను తంతాడు. ఆతన్ను తన్నడమేమిటి తానే స్థితి తప్పి పడిపోవడమేమిటి ఒక్కసారి జరిగినవి. అది రాక్షసుడు చేసిన పని! భీముడికి విరాటరాజు బావమరది మీదనేగాక, రాజుగారిమీదకూడ కోపం వచ్చింది. క్రోధంగా చూసి ఓ చెట్టు పీకాలని అనుకొంటూనే కంకభట్టు ముఖం చూస్తాడు. ధర్మరాజు వెంటనే కండ్ల విన్యాసంతో ఆ పని వద్దంటూ పైకి "ఈ వంటవానికి మనకు నీడనిచ్చే యీ ఫలపుష్పాలతో ఉన్న వృక్షమేగాని మరో చెట్టు దొరకలేదా కట్టెలకి!" అంటాడు, భీముడు ఆవేశాన్నాపుకొంటాడు.

ద్రౌపదికి విస్తృతమైన కోపం వస్తుంది. తనకు రక్షణ చేయద్దన్నాడు ధర్మరాజు. లేచి నుంచొని సభనూ, కంకునీ, వలలుణ్ణీ, భయంకరంగా చూస్తుంది. "ధర్మాఽధర్మ నిపుణులు, శిష్ట రక్షకులు దుష్ట శిక్షకులు సకల శాస్త్ర సంచయాన్ని అద్భుతంగా ఉపయోగింపగలిగినవారూ అయిన నా భర్తలు ఒకరు నన్నవమాన పరుస్తుంటే ఊరుకొన్నారంటే, ఇంకెవరి భార్యలు ఇలా పరాభవం పొందటానికర్థం ఉంటుందిక్కడ?" అంటుంది. విరాటుడికి కీచకుని నియంత్రించగలిగిన శక్తిలేదు. అతడు కేవలం అనునయ వాక్యాలతో సైరంధ్రిని శాంతపరుప చూస్తాడు.

అప్పుడు దర్మరాజు ఆమెతో అంటాడు మందలింపుగా—"నీ పతులకు అంత మాత్రం తెలీదనుకున్నావా? ఇది సమయం కాదని ఊరుకొని ఉంటారు. నీకయిన పరిభవం సంగతి ఈ సభవారికి తెలిసింది గనక నీవు లోనికి వెళ్ళిపోవచ్చు" అంటాడు. ద్రౌపది ఇంకా అక్కడే ఉంది. "ఇంతకంటె వారిని శిక్షించే సమయమే ముంటుం"దనుకొంటోంది బహుశ. అందుకని ధర్మరాజు మందలిస్తాడు—"నాట్యం చేయడానికి వచ్చినదానిలా హావభావాలు చూపిస్తూ ఎందుకుంటావిక్కడ?" అని. ద్రౌపది అంటుంది—

"నాదు వల్లభుండు నటుడింత నిక్కంబు పెద్దవారియట్ల పిన్నవారు
గాన పతుల విధముగా యే శైలూషిగా ననంగరాదు కంకభట్ట."

"నాపతి ఒక్క నాట్యకారేకాదు. జూదరికూడా జూదరి ఆలికి గౌరవమేముంటుంది!" అని వెళ్ళిపోతుంది. ఈమె ప్రవర్తనం ధర్మరాజాదుల కాలంలోని స్త్రీలది మాదిరిగా ఉన్నదో లేదోగాని తిక్కన కాలంనాటి ప్రౌఢ స్త్రీల ప్రవర్తనం గోచరిస్తున్నట్లనిపిస్తుంది. ఐతె ఇది కేవలం పతులను దూషించడానికి మాత్రమే అనినమాట

కాదు. వారిని ఉత్తేజితుల చేయడానికి ఆమె ఆ విధంగా అన్నదనే భావం సరియైన దనిపిస్తుంది. మరి ఆ సమయాన అలాటి ఉత్తేజకరమైన మాటలు అవసరముకదా! ఏ కాలంలోనయితేనేమి!!

ఆమె సుధేష్ణ దగ్గరకు వెళ్ళగానే "అలా ఉన్నావేం! నీ ముఖం చిన్నబోయిందేం" అని ఆమె తెలియనట్లుగా అడుగుతుంది. ద్రౌపది "నీకు తెలిసే అలా ఎందు కడుగుతావమ్మా" అని తనకయిన పరాభవం చెప్పి,-"మీ కీచకుణ్ణి మీరేం దండించనక్కర్లేదు. అందుకు నా మగలున్నారు లెమ్మంటుంది." దీంతో అంతఃపురంలోని వారంతా గడగడలాడిపోతారు మనసుల్లో-దీని మగలు కీచకునంతవానిని దండించే వాళ్ళా అనుకొంటారు. ద్రౌపదికి రాణివాసం చేరిం తరువాతగాని కంకభట్టు "సమయంకాద"న్న మాటల అంతరార్థం గోచరింపలేదు" అనిపిస్తుంది.

సైరంధ్రి పడుకొన్నదిగాని నిద్రపట్టలేదు. కీచకుణ్ణి నిర్జించకలిగినట్టిది-వలలాంకుడి బలమేతప్ప మరొకటికాదని యోచించి వంటశాలవైపుకు అర్థరాత్రి ఎవరూ చూడకుండ బయలుదేరి వెళ్తుంది. భీముడు లేచి,-"ఇదేమిటి? ఈ సమయంలో ఇక్కడికొచ్చావు. నీవు వస్తుంటే ఎవరూ చూడలేదుకదా! ఎందుకొచ్చావు?" అంటాడు.

అన్నీ తెలిసికూడ నాచేత చెప్పించుకోవాలని అడుగుతున్నావు" అంటూనె జరిగిన విషయమంతా చెప్పి "నా దుఃఖాన్ని చెప్పుకోవటానికి ఎన్నయినా ఉన్నాయి. సభలో దుస్ససేనుడూ, అరణ్యంలో సైంధవుడూ, ఇప్పుడీ విరాట సభలో కీచకుడూ అనుచితంగా ప్రవర్తించారంటే నాకు దుఃఖం క్రొత్తదేమీ కాసిమాట నిజమేలేకాని-

"అకట యోడు కూయు నాల కూయును లాతి వారికైన నరయ వలయు ననిన
నన్ను కీచకుండు తన్నంగ నెట్టులు సూడనోర్చె ధర్మ సూనుడపుడు?

—అంటుంది. అందుకు భీముడు "అయ్యో అలా ఆయన (ధర్మరాజు) మందలించాడు గనుక సరిపోయిందిగాని, నేనా చెట్టువిరిచి రాజునీ వాని బావమరిదినీ కొట్టినట్లయితె ఈపాటికి ఈ ప్రపంచానికి మన ఉనికి కాస్తా బహిర్గతమయేదికాదూ? అందుచేత ధర్మరాజు పొగడబడాల్సిన వాడుగాని, తప్పు పట్టబడాల్సినవాడుకా"దంటాడు ద్రౌపది అప్పటికి శాంతించిందై "అవును. నిజానికి ఆయన ధర్మమే మనకు జయము. నాకు ధృతి చెడి అలా వెఱ్ఱిగా పలికాను. ధర్మరాజు నిర్మలుడు. అజాత

శత్రువు. అందుకనే అతడు రాజసూయం చేయకలిగింది. ఆయన గాంభీర్యం ధైర్యం ఇంకొకరికి వస్తుందా! ఆయన మర్త్యుడేకాదు, మహాత్ముడు. అంతటివాడు విరటుని ఆశ్రయించడం వల్లనే నా ఓర్పు నశించింది నిజానికి" అంటుంది.

వెంటనే భీముణ్ణి పొగడుతుంది—"నీవు బక హిడింబ కిమ్మీరుల్ని జరాసంధుణ్ణి చంపేశావు. నీ దర్పం కాస్తా-కొంచెం కాదు. అలాంటివాడవు నీవు కట్టెలు కొట్టి వంటలు చేస్తుంటే నా హృదయం ఎంతో శోకిస్తోంది. దున్నపోతుల్తో పులుల్తో నీవు పోరుతుంటే నీవు గెల్చినపుడు విశేషమైన సంతోషం—పులులు విజృంభించినపుడు వెక్కసమైన విన్నవదనం పెట్టానని వాళ్ళంతా అంటుండేవాళ్ళు. ఇప్పుడు కోపంకొద్దీ నీవు కీచకుణ్ణి ఏమో చేసి బయటపడ్డావా—నీకూ నాకూగల సంబంధంకాస్తా వాళ్ళు స్థిరం చేస్తారు. అందుకని నీవు తొందరపడకుండా, రహస్యంగా ఏంచేయాలో అది చేయాల్సింది సుమా!" అంటుంది.

అంతలో అర్జునుడున్న స్త్రీ, పుంగాని స్థితిని తలచిదుఃఖించింది. నకుల సహదేవుల్ని తలచి దుఃఖించింది. ఆ చెప్పటంలో సహదేవుడు మరీ పిల్లవాడమ్మా ఆకలి కూడ తెలీక తిరుగుతాడంటుంది. తన వంశం ప్రతిష్ఠ తలచి తాను ఈ సైరంధ్రిపని చేయాల్సి వచ్చిందంటుంది. ఇవన్నీ దుఃఖాన్ని పెంచుకోడానికి స్త్రీలు ప్రోవుచేసి కొనే పూర్వ దుఃఖాల కంప. చివరకు,—

"ఆ కీచకుణ్ణి చంపకపోయినావో నేను ఏ నుయ్యో గొయ్యో చూచుకునేదిఖాయ"మంటుంది.

భీముడామెను ఓదార్చుతాడు. "వాడి సంగతి నేచూస్తాను నాకొదిలెయి దుర్యోధన, కర్ణ సైంధవుల్నికూడా వదిలేశాననుకొనకు. ఇప్పుడజ్ఞాతవాసం పన్నెండోనెల జరుగుతున్నది. ఈ నెలంతా మనం చాలా రహస్యంగా ఉండాలి. ఉద్రేకాన్ని క్షణ క్షణానా అణచుకొనడమె సాధన. అందుచేత నీవేం చేస్తావంటే.—" వాణ్ణి కలిసి చీకట్లో ఆ నర్తనశాలకు ఒంటరిగా రమ్మను. వాడి భావం నీకంగీకారమయినట్లె నాటకమాడు. వాణ్ణి అక్కడ రహస్యంగా తెగటారుస్తాను. ఇదొక్కటె మార్గం ఇప్పుడు. నీవు ప్రస్తుతం వెళ్ళిపో. తెల్లవారు ఝాము కావచ్చింది. ఎవరైనా చూస్తారు లేలె"మ్మంటాడు. ద్రౌపది సరేనని వెళ్ళిపోతుంది.

తెల్లవారింది. సూర్యుడు ప్రపంచాన్ని రక్షించడానికన్నట్లు ఉదయించాడు.

సింహబలుడు లేచి సింగారించుకొని సైరంధ్రిని కలవాలని అప్పగారింటికి వెళ్ళాడు. ద్రౌపదికిప్పుడు భీముడి ఆసరా ఉంది. కీచకుడికి విరాట్రాజు తననేమీ అనలేక ఊరుకున్న సన్నివేశంలోని అహంకారముంది. తొట్రుబాటు లేకుండా ద్రౌపది పనిచేసుకుంటూంటె కీచకుడు దగ్గరకు చేరుతూ వెట్టిమాటలు అంటూ. కూనిరాగం తీస్తూ, గోడలమీద స్థంభాలమీదా గోళ్ళతో తాళం లయలూ వేయటం, వళ్ళు అటూ ఇటూ త్రిప్పటం చేస్తూ తనను సైరంధ్రి చూడకపోయిందే అని బాధప డుతున్నాడు. చిరవకు ఒక దగ్గర చేరి "ఇదుగో కామ సౌఖ్యం అక్కర్లేదన్నట్లుం టావు! ఈ వైరాగ్యం స్థిరమైందా లేక నిమిష మాత్రమా! నామీద కొంచెం దయ తలిస్తె నీ మగలతోగల సౌభాగ్యం దెబ్బతింటుందా ఆ మాత్రానే! నీవు నన్ను సరె నవాలేగాని పురభామినులందర్నీ నీకు వరవళ్ళుగా చేయనా! విరాటుడ్ని పేరుకు రాజుగా ఉంచాను. నిన్ను తన్నాను గనక అతడు ఉపేక్ష చేశాడనుకోవద్దు. నేను పదివేల మందిని పట్టుకొన్నా ఎవరూ ఏమీ నన్ననలేరుగాక. కనుక నేను చెప్పే ముఖ్యమైన మాటేమిటంటే నిన్ను ఎలాగయినా పట్టుకొంటాను. ఎక్కడకుపోయినా పట్టేస్తాను. నీమగలేం చేశారుగాకనన్ను?" అంటాడు.

ఈ సమయం చూసి ఆమె అంటుంది. "నీకు రహస్యంగా ఉండాల్సిన విషయాలు తెలిసినట్లులేదు. లేకపోతె మగవాణ్ణిగదా అనే అహంకారమో! నాకు రహస్యం అవసరం. అది కాపాడబడేటట్లు ప్రవర్తించు" అంటుంది. కీచకుడు పొంగి పోయి "అయితె అలాగె, చెప్పు. ఎక్కడకు రమ్మంటావో" నంటాడు. ఆమె "రాత్రివేళ ఒంటరిగా నర్తనశాలకు రా. ఇంకెవర్ని తీసికొచ్చినా నా రహస్యం బయటపడిపోతుంది. అంచేత ఈ పనికి నేను ఒప్పుకోనే ఒప్పుకోను. ఇక నిక్కడ మాట్లాడకు" మంటుంది. కీచకుడు సంతోషంతో స్పృహ తప్పినంతపనై వెళ్ళి పోతాడు.

ద్రౌపది భీమునికీసంగతి చెప్తుంది-వెళ్ళి. "నేను చేయాల్సిన రాయబారం చేశాను మరి నీవేం చేస్తావో!" అంటుంది. భీముడు పొంగిపోతాడు. ఎవరినీ తేడు కదా-మన రహస్యం బయటపడకుండా ఉండాలికదా అంటాడు. ద్రౌపది నవ్వి- "ఒంటరిగా రమ్మన్నందుకె పులకించి పోయినాడు" అంటుంది. భీముడు చిటిక వేసి "ఐతె అనుభవం అయ్యేవరకూ ఇంకొకడితో చెప్పడు-కుక్కలా వస్తాడు-నావల్లచస్తా డున్నూ" అంటాడు.

పాంచాలి మళ్ళీ తమ అజ్ఞాతవాస రహస్య విషయం జ్ఞాపకంచేసి బహుజాగ్ర త్తగా మసలవలసిందంటుంది. ఆమె సెలవుతీసికొని వెళ్ళిపోతుంది.

కీచకుడు రాత్రివరకూ ఆగాల్సిన బెడదలో చిక్కుకొన్నాడు. ముగుదమీద మోహం తనను మలుపులు త్రిప్పిస్తోంది. తాను ఎవరినీ మాట్లాడనీయటల్లేదు. ఒంట రిగా ఊహల్లో ఊగుతున్నాడు. సైరంధ్రిని స్తంభాల్లో శారికల్లో చూస్తూ వనాల్లో వృక్షాలకు మాటలు చెప్తూ తిరుగుతున్నాడు. ప్రేమ చేస్తున్నాడు. సూర్యుడు క్రుంకి పోడేమని తిట్టుతున్నాడు. మనసుకు అయే అనుభవాలు శరీరాని కయే అనుభవాల కంటె ఎక్కువ ప్రభావం కలిగి ఉంటాయి. వీటితో సంతృప్తి కావడమంటూ ఉండదు-ఉన్న రసాన్ని ఉత్తేజితం చేయటమె అవి చేయగలవు-శారీరకంగాకూడ ఆ అనుభవం అయినమీదట ఆస్మృతిని తెచ్చి మళ్ళీ ఆ అనుభవం కావాలి అని అని పింపజేసేవికూడ ఈ మానసిక అనుభవాలె. శరీర అనుభవంకంటెకూడ మానసిక అనుభవాలు ఎక్కువ పతనాన్ని కలిగిస్తవనేది ఇందుకె. వాసనల కుప్పను తయారు చేస్తవికదా మరి!

కొంత సేపటికి సూర్యాస్తమయమయింది. ద్రౌపది రాత్రివేళ చూచుకొని భీముని సమీపించి సమయమయిందని సైగ చేసింది. ఇద్దరూ దోవచూసుకోంటూ నర్తనశాలకు వెళ్తారు. నర్తనశాల విశాలంగా వుంది. అక్కడ ఉత్తర విశ్రమించడా నికి గాను ఒక మంచమున్నది. పరుపూ అలంకారం అంతాఉంది. దానిమీద భీముడు పవ్వళిస్తాడు ఆమెను దగ్గరలో ఒక మూల నిలువమంటాడు.

సమయమయిందనుకొంటూ కీచకుడు ఒంటరిగా ప్రవేశించి సైరంధ్రి ఇంకా రాలేదనుకొంటాడు. క్షణంలో పర్యంకంమీద మనిషి ఆకారంచూసి ఆమె సైరంధ్రే ననుకొంటాడు. దగ్గరచేరి పైన చేయివేస్తాడు. భీముడి వళ్ళుకాదు-మనసు మండిపో తుంటుంది. ఐనా వీడెలా ప్రవర్తిస్తాడో చూద్దామని క్షణం మనసు బిగపట్టుకొని ఉంటాడు. అప్పుడు కీచకుడు, "నేను నీకు ఎన్నో బహుమతులు తెచ్చాను. ఆడ వాళ్ళు నన్నుచూసిం తర్వాత ఇంకో మనిషిని మనసులో ఆడనీయరు. నేనంటే పడి చస్తారు" అంటాడు. అప్పుడు భీముడిచేత తిక్కన చమత్కారంగా మాట్లాడిస్తాడు:-

"ఇట్టి వాడవు గావున నీవు నన్ను బొగడి కొననగు నకట నాపోల్కియాడు

దాని వెదికియు నెయ్యెడనైన నీకు బడయవచ్చునె ఎఱుగక బలికి తకట॥

—అంటాడు.

"నావంటి అడది నీకెక్కడా దొరక్కా వచ్చావు నా దగ్గరికి! అనటం హాస్యం. దీన్నె వివరిస్తూ నాఒళ్లూ నీఒళ్లూ కలిసిన క్షణాన నీఒళ్లెలాఅవుతుందో చూదుగాని! మామూలు అబలననుకొన్నావా? నను కలిసినాక మళ్ళీ వనితల్తో వెళ్దామనుకొంటున్నావా? అది మాత్రం జరగదు. నాకుతెలుసు. తనువును పొందిన ఫలితాన్ని సొంతం ఇప్పుడే అనుభవిస్తావు చూడు—మన్మథ వికారంగాను" అంటాడు భీముడు. అంటూనే లేచికలబడుతాడు.

సింహబలుడికి తెలిసిపోతుంది—అది సైరంధ్రికాదనీ వాడెవడో ఆమె భర్త గంధర్వుడయి వుంటాడనీని. పోట్లాడుకొంటూనే ఉన్నారు. అక్కడ చిత్రమైన పరిస్థితి కలిగింది. కీచకుడు తనవాళ్ళ నెవ్వర్నీ తనతో తేలేదు. బహిరంగంగా ఏపనైనా సాధించగలవాడనే పేరుపడ్డ తాను దొంగలా అక్కడికి రావడమయింది. పిలిస్తే తనవారెవరూ పలకరు. తన అగపాట్లకు ఇతర్లు తప్పుపట్టగలరు. నలుగురుకూ తెలిసిపోతుంది తన దొంగతనం. భీముడు అరవకుండా చప్పుడు లేకుండా వాణ్ణి చంపాలంటానికి తన రహస్యపు బ్రతుకు కారణం. అందుకని.—

"తన యగపాటొరు లెరుగుదురని సూతుడు సమయభంగ మగుటకు భీముం
డును గొంకుచు చప్పుడు చేయని గూఢ విమర్దన ప్రహారములన్"

—అలా మల్లయుద్ధ ప్రావీణ్యం చూపుతున్నారు, కొంత సేపటికి కీచకుడు అలసిపోయినట్లు భీముడు గ్రహించి ఎత్తి విసిరి క్రిందకుకొట్టి పైనెక్కి మోచేతుల్తోను పిడికిళ్ళతోనూ పొడిచి చంపేస్తాడు. కీచకుడు తన్నుకొని మరీ చస్తాడు. ఆ చచ్చినవాడిమీద కోపం ఇంకా తగ్గక భీముడు తాను పొడిచిన దెబ్బలవుపడకుండా చేతులూ కాళ్ళూ తల పొట్టలోనూ గుండెల్లోనూ కుక్కేసి మాంసపు ముద్దగా ఆ శరీరాన్ని పెట్టి వదిలేస్తాడు.

తను సాధించిన ఫలితం ద్రౌపదికి చూపాలని ఒక కొఱవిని తెచ్చి ఊది వెలిగించి జ్యోతిలా చేసి ద్రౌపదికి సింహబలుడి శవాన్ని చూపిస్తాడు. ఆ శవం పరిస్థితి చూసి ఆమె ముక్కుమీద వ్రేలు వేసికొని గాలి పీలుస్తుంది. నిట్టూర్చి ఇలా

అంటుంది— "దీని కోసమా కీచకా? యింత యాతన పడ్డావు. అలా చేస్తే ఇలాగాక ఎలాగవుతుంది" అంటుంది.

భీముడు ద్రౌపది నడుగుతాడు "నీ చింత మనసులోనుంచి పోయిందా? సంతోషించావా" అని.

అప్పుడామె "కొలువులో నీవు చూపిన ఆ కోపభంగిమా ఆ ధైర్యం చూడరా నంతగా ఉంది. ఇక్కడ ప్రజల కళ్ళు గప్పిన గొప్పతనం తలచుకోజాలనంతగా ఉంది. ఎవ్వరి సహాయం లేకుండా ఈ దురాత్ముని రూపుమాపటంలోని చాకచక్యాన్ని మెచ్చుకోవడమెలాగో నాకు తెలియటల్లేదు.... నేను మాత్రం— భీమసేనా! విస్మయానంద నిర్మగ్ననైనాను'' అంటుంది, భీముని చెవులో ఆ మాటలు కర్ణరసాయనంలా అమృతం కురిసినవి.

కీచకవధలో వ్యాసమహర్షి సాధనాపరమైన విషయం చెప్పాడు. కీచకమంటే వెదురుబొంగు అని అర్థం. ఏ గాలి కొట్టితే ఆగాలికి పిలుగా కూతలు కూస్తుండటం దానిపని. రాజ్యంలో రాజుగా నిర్వృతి తత్త్వానికి ప్రతీక అయిన విరాటుని నిలిపిన వాడు కీచకుడె. అదుదానిని చూచి అరాటపడేవాడూ అతడె. ఇంద్రియాలు ఎలా లాగితె అలా పోవడమనేది దుర్వృత్తి. ఆ వృత్తినిజయించాలి. ఆయుధాలతోగాదు ఆయుధాల్లేకుండానె జయించాలి. కేవలం మనః స్థైర్యంలోనే జయించాలి. కలిగిన సిద్ధులతో శపిస్తాను అనటం కాదనిబోధ. ఎవరికి తెలీకుండా జయించటమె దానికి ప్రతిక్రియ. భీముడు సాధకునిలోని సత్‌వృత్తికి ప్రతీక. రహస్యం అంటే—సత్‌వృత్తికి దుర్వృత్తికిగల యుద్ధం అలా మనసులోనే జరిగేది గనుక రహస్యం! కీచకుని దుర్వృత్తిని జయించటమె సాధకుని కీలకం. ''కీచకుడు", "విరాటుడు,' అని పేర్లు పెట్టి వ్యాసుడు ఈ సాధనను కథాపరంగా అంతర్గర్భితంగా సూచిస్తున్నాడనేది అనుసంధానం చేయవలసిన తెలివిడి.

—: ఇది ద్వితీయాశ్వాసం :—

# మహాభారత కథలు

## విరాట్పర్వము- తృతీయాశ్వాసము

## 1. ఒక్క రాత్రిలో ద్రౌపదికి సుఖదుఃఖాలు

కీచకుణ్ణి చంపి భీముడు ద్రౌపదికి శవం చూపించి ఆమెను వెళ్ళమని చెప్పి తాను వంటశాలకు వెళ్ళిపోతాడు. ద్రౌపది బయలుదేరి వెళ్ళే సమయానికి కావలి వాళ్ళు కనపడ్డారు. ఆమె వాళ్ళతో నిశ్చయంగా చెప్పేస్తుంది. నా భర్తలైన గంధర్వులు ఈ కీచకుణ్ణి చంపేశారు. దుర్మార్గానికి ఫలితం అనుభవించాడు. వెళ్ళి చూసుకొనండి అంటుంది. కీచకుడు చచ్చాడంటే వాళ్ళు దిగ్భ్రమలో మునిగి కాగడాలు వెలిగించి శవాన్ని చూచి హడలిపోయి హాహాకారాలు చేశారు. కీచకుని ఆత్మీయులైన ఉపకీచకుల్ని పిలుచుకొచ్చారు. వాళ్ళు నూరుమంది. వాళ్ళంతా ఆ రాత్రివేళ భోరుమని రోదన మారంభించారు. "అయ్యో చేతులేవి? కాళ్ళేవి ? శిరస్సేది?" అంటున్నారు. ద్రౌపది ఒక ప్రక్కనుంచి చూస్తూ ఆనందమనుభవిస్తోంది. అది పిశాచానందమా? పగదీరిన వెనుక కలిగే సంతోషమేనా? ఇది ఎక్కువయితే పిశాచానందానికె జమ అవుతుందిగాక. ఈ సమయంలో ఆమె ఆ ఉప కీచకుల కంటపడింది. వాళ్ళ కోపం విపరీతంగా పెరిగిపోయింది. ఈ శవంతోపాటు సైరంధ్రిని కట్టి తగలెయ్యాలన్నారెవరో. ఆమెకు సుఖ మంతరించి దుఃఖ భయాలావరించినై గోలపెట్టింది. ఐనా అంతా ఒక్కమాటమీద ఆమెను తెచ్చి బంధించి అప్పటికప్పుడు ఆ రాత్రికి రాత్రి తగలెట్టెయ్యాలనే ఆత్రంతో ఉపక్రమిస్తున్నారు.

ఈ ప్రయత్నం సంగతి రాజుకు చెప్పాలని వెళ్ళి రాజునులేపి ఇలా ఇలా అయిందని చెప్పి ఇలా చేసేస్తున్నామంటారు. విరాట్రాజు బయటకురాడు. ఈ పగ ఈ ఉద్యమం ఇంకొకరు చేస్తే తగ్గేవి కావు. ఇంతమందికి సంబంధించిన పగయితే ఇక చెప్పనక్కర్లేదు. విరాట్రాజు నిర్వ్యక్తి తత్వానికి ప్రతీక అనుకొన్నాంగదా. అందుకని మీ ఇష్టమన్నాడు. అలాచేస్తే గంధర్వులు మళ్ళీ కోపిస్తారని తెలీదా? తెలుసు. తాను తటస్థుడెప్పుడూను. అందుకే తాను తన బావమరది శవాన్ని చూడాలనైనా అనుకోలేదేమో.

ఉపకీచకులు ఆమెనుపట్టి కీచకునితోపాటు కట్టి స్మశానానికి తీసికొనిపోతున్నారు. సైరంధ్రి గోలపెట్టి ఏడుస్తూ తన గంధర్వ భర్తల పేర్లుగా పాండవుల సాంకేతికమైన పేర్లతో పిలుస్తుంది.

"అనతవైరి యోజయః మహోద్భుత విక్రమ యోజయంత ! దు
ర్మాన విఘూర్ణమాన రిపుమర్దన యో విజయా భిధాన, తే
జో నిహితాహితాహిత ప్రకటశూర గుణ ప్రతి భాన యోజయ
త్సేన ! విరోధి బాహుబల జృంభణ భంజన యో జయద్బలా !

—అని పిల్చి రక్షించుమంటుంది. జయ, జయంత విజయ విజయోత్సేన జయద్బలలు పాండవులు అజ్ఞాతవాసారంభంలో సాంకేతికంగా తాము చెప్పుకోవడానికయిన పేర్లు.

భీముడికి ఇది వినవచ్చింది. కాని ఎలా ఈ ఉపద్రవాన్ని గడిచేది? తాను బయటపడి ఈ కీచకుల్ని చంపడం గొప్పకాదుగాని మళ్ళీ పదమూడు సంవత్సరాల ప్రవాసాన్ని తనకూ తన సోదరులకూ కలుగజేసినవాడు అవుతాడు గదా ! ఉన్న గడువుకూడ ఎక్కువ రోజులు లేదు. ఈ చిక్కు ద్రౌపది ఆలోచింపలేకపోయింది. ఆమె అక్కడ ఉండటమె తప్పు. స్త్రీ బుద్ధి పోనిచ్చుకున్నదికాదు. స్త్రీ అంటే 'స' త్వ'ర' జ'త'మో గుణాల కూడలి అని అర్థం. పురుషులకూ ఉంటయి ఈ మూడున్నూ. కాని ఆ గుణాలు లాగిన విధంగా వెళ్ళిపోయే వాళ్ళు దానిలో ఇరుక్కుపోయినవాళ్ళవుతారు. వారు పురుషులయినా స్త్రీలక్రిందనే లెక్క. అలా అని మీరాబాయి ప్రవచనం. కాని ఈ స్త్రీ అనే మాట కేవలం ఆడవాళ్ళకె రూఢార్థాన్నివ్వటం పాతకాలం నుంచి ఉంటూనే ఉందిగాక !

భీముడు అప్పుడొక విచిత్రమైన వ్యూహం వేశాడు. వీళ్ళు శవాన్ని ఊరిబయటకు తెస్తారుగనుక తాను ముందే అక్కడకు వెళ్ళిపోతాడు. భయంకరమైన వేషం వేసి వాళ్ళను భ్రమపెట్టి ద్రౌపది తప్పుకుపోయేటట్లు చేయాలనుకొంటాడు. పెద్ద శరీరంతో ఆ రాత్రి స్మశానం దగ్గర అట్టహాసం చేస్తున్నాడు. అసలె ఉపకీచకులు గంధర్వులకు ముందే జడిసి ద్రౌపదిని తగలెయ్యాలని ఆరాటపడుతున్నారు. వాళ్ళు తీరా స్మశానానికి వచ్చేటప్పటికి ఇంత పెద్ద ఆకారంతోగంధర్వుడులా రాక్షసుడులా ఒక పెద్ద చెట్టుపీకి భుజంమీద పెట్టుకొని వీళ్ళని రమ్మంటున్నాడు. వారు వెంటనే

శవాన్నీ ద్రౌపదినీ వదలి వేసి చెట్లెక్కి తమ ప్రాణాలు రక్షించుకోవాలనుకొంటారు భీముడు తన వ్యూహం పారినందుకు సంతోషించి చెట్లనుంచి వాళ్ళను పండ్లను దులిపినట్లు దులిపి కొట్టి చంపేస్తాడు. అతడు భీముడని-కాదు-వలలాంకుడని గుర్తుపట్టిన వాళ్ళున్నారేమోగాని వారిలో బ్రతికి బయటపడ్డవాళ్ళు మాత్రం లేరు. అంతా చచ్చినాక ద్రౌపది కట్లు విప్పి ఇంటికి పొమ్మని ఇంకోదారిన వెళ్ళిపోతాడు తాను.

ఈ వ్యూహం రచించిన భీముడి తెలివితేటలా గొప్పవి? లేకపోతే మరో బలవంతుడనేవాడుండి ఇలా చేశాడా అనే దానికి సమాధానం ఒకరు చెప్పే ఇంకొకరు వినగలిగిందిలేదు. ఎవరికి వారు వారి సంస్కారాన్నిబట్టి అర్థం చేసికొనాల్సిందే

సైరంధ్రికి ఈనాడు కలిగిన సంతోషం— బహుశ భారత యుద్ధం అయిన తరువాత కూడ రాలేదేమోననిపిస్తుంది. తాను స్మశానం నుంచి బయలుదేరి ముందు యానంతో పట్నంలోకి వస్తోంది. ఈ సంగతంతా ఊళ్ళో అప్పటికె తెలిసిపోయింది. ప్రజలు ఈమెను చూసి "అమ్మో" అంటున్నారు కొందరు. "రాక్షసి" అంటున్నారు ఇతర్లు. "బాబోయ్ నేను కళ్ళెత్తి చూడనుదాన్ని'' అంటున్నారు ఇంకా కొందరు. ఇవన్నీ వింటూ త్రిప్పుకొంటూ ఆనందిస్తూ వస్తోందామె తెల్లారుతూ ఉండగా.

విరాటుడు నిద్రపోలేదు మళ్ళీ. బహుశ ఏమయింది, ఏమయింది అనే తహతహలో ఉండచ్చు. లేదా ఏదో అయుంటుందిగాక-కానీ అని నిర్వృత్తిలో ఆనందంలో ఉన్నాడోమరి! తీరా ఉపకీచకులంతా స్మశానంలో చచ్చిపడి ఉన్నారనీ సైరంధ్రి తిరిగి వచ్చిందనీ తెలిసి మళ్ళీ భయపడతాడు. ఆ గంధర్వులు తననూ తన ప్రజలనూ కూడ తినెయ్యవచ్చుగదా! అందుకని సుధేష్ణను పిలిచి "సైరంధ్రిని బ్రతిమాలి మన ఊరినుంచి వెళ్ళిపొమ్మని చెప్పు" అంటాడు.

సైరంధ్రి వస్తూ వస్తూ వంటశాల దగ్గరకు వచ్చి వలలాంకుడికి వినవడేటట్లు ఎక్కడో చూస్తూ అంటుంది—

"కీచకుల వెనబుట్టిన కిల్బిషంబు
పాచినన్ను రక్షించిన పరమధర్మ
రతికి గంధర్వ పతికి నిరంతరంబు
భక్తియుక్తిని ప్రణమిల్లి బ్రతుకుదాన', —అంటుంది.

అప్పుడు వలలుడు నిగూఢ వచన చాతుర్యధుర్యుడై - ఓ పడుచా! అపాయం కలిగినప్పుడు రక్షింపక పోతే ఆ పతి పతేనంటావా? నీ భర్తలు నిన్ను రక్షించటం ఉచితమె. వాళ్ళని నీవు ప్రత్యేకంగా మెచ్చుకోవాల్సిన పనిలేదు అంటాడు. ఆమె చిరునవ్వుతో ఓరకంట చూస్తూ వెళ్ళిపోతుంది.

నర్తనశాల దరికి ఆమె వచ్చేసరికి బృహన్నల అందరితోపాటు సైరంధ్రి చెప్పేది వింటూ "అసలేం జరిగిందో చెప్పు"మంటాడు. ఆమె నిష్ఠూరంగా "కన్నెల కాటలు నేర్పుతూ సుఖంగా ఉన్నావుగాని సైరంధ్రి కెంతబాధ కలిగిందని చింత చేస్తున్నావా?" అంటుంది. అందుకు బృహన్నల— "నీ దుఃఖానికిగాను నేనూ దుఃఖపడటం ఎప్పుడైన ఉంటూనే ఉందిగాని నేనీ అసహ్యపు పుటక పుట్టిన దుఃఖాన్ని తలచుకొనేవారెవరున్నారు. నీవు క్రొత్త మనిషివేగాని అనింద్యవని మాత్రం అనుకొంటాను. అలాంటి నీకు ఏ దుఃఖం రావడానికి వీల్లేదు. అందుకే నీ కారణంగా ఏలాంటి బాధా నా మనసులో కలుగదుగాక" అంటాడు.

ద్రౌపది— "అయ్యో! నీ బాధ నేనెరుగనా? నీవు అలాగే వుండాల్సి ఉన్నది గనుక అలా ఉంటున్నావు. నీవంటె నాకెంతో ఇష్టము ఆ కారణానే" అంటుంది.

ఈ భాగంలో తిక్కన చేసిన రసపోషణ ఎంత రమ్యమైందో ఆ పద్యాలు చదివి తెలియాల్సిందె.

సైరంధ్రి సుధేష్ణ ఇంటికి రాగానే ఆమె పిలిపించి "అమ్మా ఇన్నాళ్ళూ ఇక్కడ ఎలాగో వున్నావు. ఇలా నీ భర్తలచేత మగవాళ్ళ నందర్నీ చంపించే పరిస్థితి కలిగిన తర్వాత నిన్ను ఇక్కడ ఉండవద్దని బ్రతిమాల వలసిందని మా రాజుగారు కోరారు. నీవు దయచేసి ఎక్కడికయినా వెళ్ళిపోవాల్సింది" అంటుంది. కాని ద్రౌపది—

"అమ్మా నా భర్తలు కృతఘ్నులు కారమ్మా! రాజుకూ ఇంకెవరికీ అపకారం చేయరుగాక. వాళ్ళు మీకు మేలు చేసేవారేగాని కీడు చేయరు. ఇంకా పదమూడు రోజులు మాత్రం ఓపికపట్టు" అని ప్రార్థిస్తుంది. ఇన్నాళ్ళుంచుకొని ఇప్పుడీ సైరంధ్రి ఏమయిపోతే నాకేమని నన్ను వెళ్ళిపొమ్మంటం న్యాయం కాదు. నన్ను కనికరించాల్సింది" అంటుంది.

సుధేష్ణ ఒక క్రమానికి ఒప్పుకొంటుంది. ఐతే ప్రజల్లో కీచకుడినీ వాళ్ల తమ్ముళ్ళీ గంధర్వులు చంపేశారనే వార్త ప్రచారమై రాష్ట్రిందాటి వెళ్ళిపోయింది. ఈ పదమూడు రోజులూ కాకముందే! కీచకుడు ఇప్పుడిక లేడుగనక విరాటుని జయించు దామని ఎవరైనా శత్రువు దండెత్తవచ్చు!

క్షణానికొచ్చే సంగతి ఇప్పుడు తెలీదుగాక!

## 2. గోగ్రహణము

దుర్యోధనుడు పాపి కావటంచేత — అంటే పరపీడనం చేసే స్వభావం కల వాడవడంచేత — పాండవులను అజ్ఞాతవాస కాలంలో గుర్తించి కాంట్రాక్టు ప్రకారం మళ్ళీ పదమూడేండ్లు ప్రవాసంలో ఉండేటట్లు చేయాలనే ప్రయత్నం చేస్తున్నాడు. కాంట్రాక్టులో అలా ఉన్నట్లయితే అతడలా చేయడం పాపమెలా అవుతుందని శంక వస్తుంది. మాయా ద్యూతమె పాపపు పనికదా! అందుచేత అలా అతడు ప్రయత్నం చేస్తూ పంపిన వేగులవాళ్ళు అంతా తిరిగి తిరిగి వచ్చి ఒకచోట కలిశారు. పాండవుల ఆచూకీ ఎవ్వరికీ తెలియలేదు.

వాళ్ళు దుఃఖితులై దుర్యోధనుని సభలో ప్రవేశించి, పాండవులు ఉండి వెళ్ళిపోయిన పురీ పుట్టా అడవులూ మడువులూ అన్నీ వెదికినా పాండవులున్నట్లు ఎక్కడా చూడలేకపోయినామన్నారు. ఒకచోట రథాల గుర్తులు అవుపడ్డవి. వాటి వెంటబడి వెళితే అవి ద్వారకా నగరం వెళ్ళిన రథాలని తెలిసింది. పాండవులు మాత్రం అక్కడలేరు. ఇది చెప్పి ఇంకా ఇలా చెప్పారు. "మేము ఒక విశేష విషయం చూచాము. మత్స్యరాజైన విరాటుని బావమరది ఒక స్త్రీ కారణంగా గంధర్వులచేత అర్ధరాత్రివేళ చిత్రంగా చంపబడ్డాడు. ఆయుధం లేకుండా ఆ మహాబలుణ్ణి చంపి తల చేతులూ కాళ్ళూ డొక్కలోకి దోపివేసి శరీరం ముద్దచేసి వదేశారుట గంధర్వులు ఎవరో. మత్స్య రాజుకు మీరు శత్రువులు గనుక మీరు సంతోషిస్తారని మేము ఈ సమాచారాన్ని చెప్తున్నాము. ధర్మరాజాదుల అచూకీకిగాను తమరేచర్యలు తీసుకుంటారో అది తమరు యోచించాల్సింది" అంటారు.

దుర్యోధనుడు మంత్రాలోచన కోసం సభకు అందరనూ పిలుస్తాడు. అందర్నీ సలహాలు చెప్పవలసిందంటాడు.

"కర్ణుడు నిపుణులైన రహస్య ప్రచారకుల్ని వంపి నలుమూలలా వెతికిస్తే తెలియకేమవుతుంది?" అంటాడు. దుశ్శాసనుడయితే "పాండవులు ఎప్పుడో అర ణ్యాల్లో దుష్టమృగాల బారిపడి చచ్చివుంటారు. మనమిక వారిని మర్చిపోవచ్చు" నంటాడు. ద్రోణుడు "పాండవులు గౌరవనీయులూ, కీర్తిగలవారూ మాత్రమేగాక దైవబలం కలిగినవారు. దివ్యులతో సమానులు. వారికి అంతటి ఆపద వచ్చిందన దానికి వీలులే''దంటాడు. "ఓపిక ఉంటే భూమినంతా వెతికించండి వట్టి పిచ్చి మాటలెందు''కంటాడు. ఎవరి స్వభావాన్నిబట్టి వారి ఊహాపోహలు ప్రస్ఫుటమవు తాయి అనేది భారతం చదివి ఆలోచించి తెలియవలసినమాట। భీష్ముడు ద్రోణుడు చెప్పిన మాట నిజమంటూ "బాహుబల, ధీబల దైవబలాలు కలిగినవారు గదావాళ్ళు-వారికి అరిష్టమెప్పుడూ కలుగ''దంటాడు.

దేశమంతా వెతికించటంలో ఒక మెలుకువ చెప్తాను వినవలసింది అని భీష్ముడు చెప్తాడు. అదేమంటే ధర్మరాజు ఏదేశంలో ఉంటే ఆదేశంలో వారికి-

సీ॥ బ్రాహ్మణ భక్తియు బరహిత శక్తియు-
నిర్మల మతియును నీతిరతియు

సత్యభాషణమును సాధు పోషణమును-
జిర వితరణమును సేవ్య గుణము

సన్మార్గ రక్షయు ఉన్మత్త శిక్షయు-
నంచితోదయము గృపాతిశయము

బంధు సంప్రీతియు భవ్య విభూతియు-
శాస్త్రోపగమము నస్ఖలితదమము

తే.గీ॥ సజ్జన స్తవనీయ సౌజన్యములును-
ధర్మ సంచిత బహుధన ధాన్యములును,-

-కలుగుతవి అన్నాడు. ఈ గుర్తులు చూచుకొని ఆయా దేశాల్లో బాగా గాలించాల్సింది. ధర్మరాజున్న చోట గోదానాలు మెరుగెక్కినవై పాడికి కొరత వడనీయకుండ చేసికుర స్తవి అంటాడు. భీష్ముడు పాండవుల్ని అలవాటుగా పొగడి వట్లున్నది దుర్యోధనాదులకు. అయినా కోపాన్ని తెచ్చుకొనకుండా ఇదే గీటురాయిగా తీసికొని వెదకాల్సిందని చారుల్ని పంపుతారు. ఎందుకనంటే భీష్ముడు చెప్పిన

విధం అబద్ధం కాదని దుర్యోధనుడికి కూడ అంతరాంతరాల్లో తెలుసు. ధర్మరాజు బుద్ధి ప్రవర్తనా అంత గొప్పవి అనే సంగతి దుర్యోధనునికే తెలిసిన సంగతి. ఇప్పుడు భారతం చదివే మనకు మాత్రం మన సంస్కారాన్నిబట్టి తప్పుగా అర్థ మయితే తప్ప ధర్మరాజు సార్థక నాముడనేది నిజమైన మాట అనిపిస్తుంది. కృపా చార్యుడు కూడ వీరితో ఏకీభవిస్తాడు.

దుర్యోధనుడంటాడు "సింహబలుడూ, భీమసేనుడూ, శల్యుడూ, హలధరుడూ సమాన బలం కలవారు. శల్యుడూ బలరాముడూ దూరంగావున్నారని మనకు తెలుసును గనుక భీమసేనుడే విరాట్రాజ్యంలో ఉండి సింహబలుడ్ని చంపాడనిపిస్తుంది. ఆ స్త్రీ ద్రౌపదే అయి ఉంటుంది. ఎవరో గంధర్వులని పాండవులు ప్రచారం చేసి ఉండి ఉంటారంటాడు. పైగా మత్స్యదేశంలో, తాతగారైన భీష్ముడు చెప్పినట్లు సుభిక్షంగా ఉంటున్నదికదా" అంటాడు.

చివరకు విరాట్రాజ్యంలోని గోవుల్ని తోలుకొస్తె వాటిని రక్షించటానికి పాండవులు వస్తారు. వాళ్ళను గుర్తుపట్టి తిరిగి పదమూడేండ్లు వెనక్కు పంపించవచ్చు అని నిర్ణయించాడు దుర్యోధనుడు.

అప్పుడు త్రిగర్త దేశాధిపతి అయిన సుశర్మ అంటాడు. నేను పూర్వం మత్స్య దేశంమీదకు దండెత్తికూడ సింహబలుని ధాటికి తట్టుకోలేకపోయినాను". ఇప్పుడు అతడు లేడుగనక వెళ్ళి మత్స్య దేశాన్ని ముట్టడించే అవకాశం తన కివ్వాల్సిందని కోరాడు. మరి కీచకుడు లేకపోయినా పాండవులు ఉన్నట్లయితే వారి ధాటికి తాను తట్టుకోవటమనేది ఉంటుందా అనేది అతడికి తట్టలేదో లేక అథవా వాళ్ళు ఎదురువచ్చినట్లయితే దుర్యోధనాదుల సాయం తాను పొందగలనుగదా! అనుకున్నాడో తెలీదు. తన సాహసోద్యుక్తతను మాత్రం తెలియపర్చుతాడు.

దుర్యోధనుడు అందుకు ఒప్పుకొని దక్షిణ దిశలో సుశర్మ మత్స్య దేశాన్ని ముట్టడించేటట్లూ విరాట్రాజు ఆ దిశకు వెళ్ళి యుద్ధంలో మునిగి ఉంటాడు గనుక తాము ఉత్తర దిశలో నుండే గోవుల్ని తోలుకొని వచ్చేటట్లూ ఏర్పాటు చేస్తాడు. అష్టమినాడు సుశర్మ దండెత్తి వెళ్ళాలి. నవమినాడు తాము ఉత్తర గోగ్రహణం చేస్తారు. పని ప్రారంభించరాదనబడే అష్టమి నవమిలలోనే వీరు నిశ్చయించుకొనటం దైవ నిర్ణయమా అనిపిస్తుంది.

సుశర్మ దక్షిణ దిశకు వెళ్ళి అక్కడున్న మత్స్యరాజ్యానికి చెందిన గోవుల్ని తోలుకుపో ప్రయత్నిస్తాడు. గోపాలకుల్ని దునుమాడుతాడు. విరాట్రాజు వెంటనే యుద్ధసన్నద్ధుడై వస్తాడు. అతడితో వాని ముగ్గురు తమ్ములూ శంఖుడనే పెద్ద కుమారుడూ కూడ ప్రయాణమై వస్తారు. అప్పుడు ధర్మరాజు, తనకూ ఆయుధాలు పట్టటం తెలుసుననీ యుద్ధం చేయగలననీ చెప్పి తానూ యుద్ధానికి బయలుదేరుతాడు. పైగా వలలుడూ తామ్ర గ్రంథీ, తంత్రీపాలుడూ కూడ తమతో యుద్ధానికి రావల సిందిగా ఆజ్ఞాపించాల్సిందని విరాటుని ఒప్పించి వారినీ రప్పిస్తాడు. మిగిలిపోయింది బృహన్నలా, సైరంధ్రీ మాత్రమే అంతా మహాట్టహాసంతో వెళ్ళి సుశర్మ నెదిరిస్తారు. ధర్మ, భీమ, నకుల, సహదేవులు వారి రథాలే వారు నడుపుతున్నారట—మరి రథం నడుపగలిగినవారిక మత్స్య దేశంలో లేరేమో!

రెండు సైన్యాలూ సంకులంగా పోట్లాడుతున్నాయి. సైన్యం చనిపోయిన వారిమీదనుంచీ నడుస్తున్నదట. రక్తపు మడుగులు సృష్టిస్తున్నారు. విరటుని తమ్ములూ కుమారుడూ విజృంభించి శత్రువుమీదకు వెళ్ళటం చూసి, విరాట్రాజు ఉత్సాహంతో తానూ తన రథాన్ని సుశర్మ మీదకు పోనిమ్మంటాడు.

సుశర్మ పెద్ద ఆటోపంతో విరాటుని ఎదిరిస్తాడు. సైన్యమంతా ఉత్సాహంతో పోరాడుతూ ఉంటుంది. పోరు ఘోరమై నడుస్తున్నది. ఇంతలో ప్రొద్దుగ్రుంకుతుంది. ఒకరికొకరు కనపడని స్థితి వల్ల పోరు మందగిస్తుంది. మళ్ళీ చంద్రకాంతి రాగానే సుశర్మ రథమేదో తెలియజేస్తూ జండా కనిపిస్తోంది. మళ్ళీ యుద్ధం ముమ్మరమైంది. కాని త్రిగర్తులు విరాటుని సారధిని చంపి రథాన్ని విరగ్గొట్టుతారు. విరథుడైన విరటుని సుశర్మ వచ్చి పట్టుకుపోయి తన రథంమీద పెట్టుతాడు.

ఇప్పటివరకూ ధర్మరాజాదులు కేవలం యుద్ధం చూస్తూ తను రథాలు అలా అలా నడుపుతున్నారని పిస్తుంది. రాత్రిపడిం తరువాత యుద్ధం చేయాలనుకున్నారో ఏమో, అప్పుడు ధర్మరాజంటాడు— "ఆ విరాట్రాజును కష్టాన్నుంచి తప్పించండి" అని— భీముడు ఒక తాటిచెట్టు చూపించి "దాంతో చంపేస్తా శత్రువుల్ని మీరుండండి" అంటాడు. వెంటనే ధర్మరాజు "వద్దు వ"ద్దంటాడు. "నీవెవరో క్షణంలో తెలిసి పోతుంది. అలాటి పనిచేస్తే! ఇదిగో ఈ ఇద్దర్నీ కూడ సహాయం తీసికొనిపో. తమాయించి తగుల్కొను శత్రువుల్ని" అంటాడు. భీముడు నొసలు చిట్లించి "సరే అలాగే"నని వెళ్తాడు వాళ్ళతో.

నకులుడూ సహదేవుడూ ఎంతోమంది శత్రువుల్ని చంపేశారు ఆ రాత్రి. ధర్మరాజు త్రిగర్తుల అశ్వాలను కొట్టి చంపుతాడు. భీముడి యుద్ధంలో సుశర్మ మునిగిపోతాడు. ఈ సమయం చూచి విరాట్రాజు సుశర్మ రథంమీదనున్న ధనస్సూ బాణాలూ తీసికొని ఒక్కసారిగా క్రిందకు దూకి పారిపోయి వెళ్ళి సుశర్మమీద బాణాలు వేస్తాడు. భీముడు వెంటనే వెళ్ళి త్రిగర్తుని పట్టి పెడరెక్కలు విరచి కట్టి గెలుపు ప్రకటించి అరుస్తాడు. త్రిగర్త సైన్యాలు చెల్లాచెదరవుతాయి. విరాటునికి కాపలాగా తమ్ముళ్ళి పెట్టి, భీముడు తను వెళ్ళి ఎక్కడో వున్న గోవుల్ని మరలించి తీసికొస్తాడు. తరువాత అంతా కంకుభట్టు వద్దకు వస్తారు. ఇలా ఇలా జరిగిందని చెప్తారు.

విరాటుడికి చాల సంతోషమయింది. ఈ వలలుడు ఇంతపనిచేసి వచ్చి కంకుభట్టుకు చెప్పటంతో కంకుభట్టుమీద గౌరవం ఇనుమడించింది. అప్పుడు కంకుభట్టుతో విరాటుడంటాడు. "నా ఈ శరీరం నీవల్ల బ్రతికి వున్నది. అది నీకు దాస్యం చేస్తుంది. నా రాజ్యం నీవు పుచ్చుకోవలసిం'' దంటాడు. వెంటనే కంకుభట్టు అయ్యో! అదేంమాట. రాజువైన నిన్ను రక్షించుకోవటానిక్కాదా నేనిక్కడకు వచ్చింది! ఎవరి కర్తవ్యం వారు చేసినప్పుడు పొగడవలసిన అవసరమేమిటి?" అంటాడు.

కర్తవ్యం అనేది ప్రతి వ్యక్తికీ అతడున్న పరిస్థితులకు లగించి ఉన్నదై వుంటుంది. ప్రతి పనీ కర్తవ్యం కాదు. కర్తవ్య మేమిటి అని తెలిసి వాటిని చేయాల్సిన బాధ్యత ప్రతి వ్యక్తిమీద వుంటుంది. ఎందువల్లనంటే సమాజంకోసం వ్యక్తి వున్నాడు. సమాజమే వ్యక్తికోసం ఉన్నదనే మనులూ ఉన్నారుగాక. వాళ్ళు సమాజంలో అశాంతిని లేపేవాళ్ళు. ఆకులు చెట్టుకోసం ఉన్నయిగాని ఆకులకోసం చెట్టుబ్రతికి ఉన్నదనటం సరికాదుగదా! వ్యక్తికి ందుకే కర్తవ్యం ఉ ది అ ది సమాజంతో అతడ్ని ముడివేస్తున్నదనేది గమనీయం. అందుకే కంకుభట్టు రాజును రక్షించుకొనే బాధ్యత తనకు కర్తవ్యమైందని చెప్తున్నాడు.

ఇదంతా ఇలా ఆలోచించుకొని విరాట్రాజు ఆశ్చర్యపడిపోతాడు. ఇంతటి యుద్ధంలో పాల్గొని పోరాడటమనేది స్వార్థం కాదనేది విదితం చేసికొంటాడు. అందుకని అంటాడు—

"ఉపకారమొ బంటు తనమొ
కృపయో పెంపో సమగ్రకీర్తి ప్రియమో
రిపు దున్సహమగు నీ రణ
నిపుణతకుం గారణంబు నెయ్యమొ ఎరుగన్"

—అని "ఈ వంటలవాడేగదా ఆ మంటలామండే శత్రువుల్లోకి దూరి వారిని హతంచేసి నన్ను గెలిపించింది। తంత్రీపాలుడూ తామ్ర గ్రంథి నీవూ ఈ వలలాం కుడూ వీరియంత గొప్పగా యుద్ధంచేసిన వాళ్ళెవరూ లేరు. అందుచేత మీకు ఏనుగులు గుర్రాలు అన్నీ ఇస్తాను. మీ ఋణాన్ని నేనింకెలా తీర్చుకోను॥" అంటాడు విరాట్రాజు.

అందుకు ధర్మరాజు— అందుకు ప్రతిఫలంగా నేనొకటి అర్థిస్తాను. ఇవ్వాల్సింది. అదేమంటే త్రిగర్తపతినీ వాని సైన్యాలతోసహా విడుదల చేయాల్సింది. నీవు ఇక్కడ యుద్ధంలో గెలిచి తిరిగి వస్తున్నట్లుగా ఇంటికి కబురుచేయాల్సింది" అంటాడు. విరాటుడు అలాగె చేస్తాడు. సుశర్మ వెళ్ళిపోతాడు. అంతా వెన్నెట్లో ఆ ఇసుక ప్రదేశంలో ఉండి. సంతోషంతో రాత్రిగడుపుతారు.

ధర్మరాజు తన మహారాజ లక్షణం పోనిచ్చుకోక పోవటం తెలియాలి. సుశర్మను గెలిచింది విరాటుడయితె అతణ్ని వదలటం శిక్షించటం గూర్చి ధర్మరాజు తను చెయ్యాలనుకున్న ఆ నిర్ణయం విరాటునిచేత చేయిస్తాడు. ఇది అతడి నర నరాల్లో ఎక్కి ఉన్న రాజలక్షణం కాదా? ఇంటికి కబురు చేసింది బృహన్నలా సైరంధ్రులు వీళ్ళేమయినారోనని గోలపెట్టకుండా. అందుకె భారతం గుణతత్వ నిరూపణం అనేది।

## 3. సాధనా క్రమణిక

భారతం వేదార్థ బృంహితంగా రచించాడు వేదవ్యాసుడు. భారత కథ చెప్తూనే అనేక సాధనలు సూచించాడు. పాండవు లయిదుగురూ కౌరవులూ కూడా మనిషిలో ఉండే వివిధ తత్వాలే. పాండవులు సాత్త్విక తత్త్వాలు. కౌరవులు దుర్వృత్తులు. ఈ రెండూ ఒకదానికొకటి వ్యతిరేకం. సాధకుడు చేయాల్సింది ఉపనిషత్తులలో చెప్పిన బ్రహ్మజ్ఞాన సాధనం. ప్రజ్ఞానం బ్రహ్మ తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి అనే మహా వాక్యాల సాధన చేయటం మొదటిది. అది పాండవుల అరణ్య

వాసం పూర్తి అయ్యేవరకూ వ్యాసమహర్షి సర్వత్ర చెప్తూ వచ్చాడు. ఈ అజ్ఞా వాస కథతో సర్వం ఖల్విదం బ్రహ్మమనే సాధనకు ప్రాతిపదిక వేయటం అయిం ఇప్పుడీ సుశర్మ యుద్ధం చేయటం ఒక చిత్రమైన సాధనా విషయం అనిపిస్తుంది త్రిగర్తుల కధిపతి అతడు. సాధనలో త్రిపుటీ సాధనకు ప్రతీక. విశ్వ ప్రాజ్ఞ దశలలోని పరమాత్మ (జీవుడు) ఒక్కడేననే తత్త్వం త్రిపుటీ సాధ తత్త్వం. దీనిని సాధించేటప్పుడు కలిగే తప్పుదోవ ఇక్కడ సూచిస్తున్నా శరీరాన్ని మరచి మనసులో మనసును మరచి వాసనలలో నిల్చి అన్నీ క ఒక్కటేనని అమనస్కయోగం చేస్తుండటం. వాసనల నశింపజేయక భగవం సనటం సరికాదు. ఇదీ ఒక సాధనే ననే తత్త్వంతో ఋజు ప్రవర్తనాన్ని వదలివే భగవంతుడు నేనూ ఒకట్టేననే విపరీత భావనను ఆవేశింపజేయటం తప్పుదోవ సాధకుణ్ణి లాగడమవుతుంది. సాధకునకు ఇటువంటి విపర్యయాలు వస్తూ ఉంట వాటిని పవనయోగంతో (భీముడు) అష్టాగయోగంతో (ధర్మరాజు), వైరా వృత్తితో (నకులుడు), జ్ఞానప్రకాశంతో (సహదేవుడు) జయించాలి అనే సూత్ర వ్యాస భగవానుడు నర్మగర్భంగా ఇక్కడ చెప్పాడు అనిపిస్తుంది.

-( ఇది తృతీయా శ్వాసము )-



# మహాభారత కథలు

## చతుర్థాశ్వాసము

## 1. ఉత్తర గోగ్రహణము

దక్షిణ గోగ్రహణ సందర్భంలో విరాటుడూ ధర్మరాజాదులూ వెళ్ళి సుశర్మను ఓడించారు. మరునాడు వారు రావడానికి ముందే దుర్యోధనాదులు తమ సైన్యాలతో వచ్చి ఉత్తరదిక్కున నున్న గోగణాలను పట్టుకొంటారు. వాటిని కాస్తూ ఉండే అధికారి బండిసెక్కి గబగబా వచ్చి అంతఃపురంలో ఆటలాడుతున్న విరాటుని చిన్నవ కుమారుడైన భూమింజయునితో ఆ సంగతి చెప్పి గోల పెట్టాడు- "కౌరవ సేనలు వచ్చి చుట్టుముట్టినయి" అని. మరి రాజ సౌధంలో ఉన్న అధికార పూరితుడు ఈ పిల్లవాడే. వానికి చెప్తే కొంత సైన్యమన్నా కూర్చి పంపితే కౌరవ సేనలను ఎదుర్కొనవచ్చునన్న ఊహ ఆ గోవుల్ని రక్షించే అధికారికి కలుగటం ఆశ్చర్యమేమీకాదు. వచ్చి పెద్ద పని పప్పుచెప్తున్నాడు గనక ఉత్తరుని ఇంద్రుడవు, యోధుడవు అనికూడ పొగడి సంతోషపెట్టాడు.

ఆ కలిగిన సంతోషంతో ఉత్తరుడు "అవును, నేను ఎంతో బాగా యుద్ధం చేయగలను- కౌరవులయితే మాత్రమేమిగాక! గోవుల్ని తోలుకుపోతారా? క్షణంలో వాళ్ళను జయించి గోధనం తీసుకొస్తాను. కాని, నాకు తగిన సారధి లేడుగదా ఎలాగ?" అంటూ కర్తవ్యం జారవిడవడానికి సిద్ధమవుతుంటాడు.

ఇప్పుడు విరాట నగరానికి వచ్చిన ఇక్కట్టు తొలగడం సామాన్యమైన పని కాదు. ఇంత ఇక్కట్టు వచ్చిందని ఆ అంతఃపురంలో కేవలం ద్రౌపదికి తప్ప ఇంకెవ్వరికి తెలియదనిపిస్తుంది. లక్ష ఇక్కట్లు పడి యెరుక గలిగి ఉన్నది ఆమె. పాపం మిగతా వారికేమి తెలుసు. ఆ వచ్చిన ఇక్కట్టులోని తీవ్రత? అందుకని సైరంధ్రి గబగబా బృహన్నల ఉన్న చోటకు వెళ్ళి ఈ బెడద వచ్చిన సంగతీ ఉత్తర కుమారుడు సారధిలేక అంజాయిస్తున్నట్లూ చెప్పింది. ఆమెకు తెలుసు అజ్ఞాతవాసం సంవత్సరమంతా ఇంచుమించు అయిపోయిందని. ఆ సంగతి బృహన్నలతో కూడా అన్నది.

బృహన్నల లెక్కలు గట్టి "అజ్ఞాతసంవత్సరకాలం దాటిపోయింది. ఇక భయ లేద"ని చెప్పి, ఉత్తరుడితో "బృహన్నలకు రథసారథ్యం వచ్చుననీ ఖాండవదహన సమయంలో అతడే అర్జునునకు రథసారథ్యం చేశాడనీ చెప్పు" మంటాడు. ఇవన్నీ అబద్ధాలు అవటం క్రింద లెక్కగట్టి అర్జునుడిని అవినీతిపరుడనే వాళ్ళుంటారుగాక వారికి యుక్తాయుక్తాలు తెలీకపోవడంచేత అలా అంటారనే సంగతి విచారిస్తే మనక తెలుస్తూనే ఉంటుంది. సైరంధ్రి అందుకు ఉత్సాహపడి వెళ్ళి ఉత్తర ద్వారా ఉత్త కుమారునకు ఈ సంగతి తెలియ జేస్తుంది. ఉత్తర కుమారుడు బిట్టు నవ్వేస్తాడు "వచ్చినవాళ్ళు కౌరవులు – నేను వెళ్ళి యుద్ధం చేయాలి. నాకు సారధిగ బృహన్నలా! పేడివాడు" అతడిని కళ్ళారా చూడటమే నాకు అసహ్యము! ఇతడ కౌరవ సేనతో పోట్లాడటానికెలా పనికి వస్తాడు. అంటాడు'' అప్పుడు సైరంధ్రి —

"కౌరవసేనగాదు త్రిజగంబులు నొక్కటనెత్తి వచ్చినం
దేరు బృహన్నలా వశగతిం జరియించిన గెల్వవచ్చుఁద
ద్వీర గుణంబు సొంపు వృథివీ వరనందన మున్నెరుంగుదుం
గారణ జన్మమై తను వికారమువచ్చిన బెంపు దప్పునే''

ఒక పందెం వేసినట్లుగా మాట్లాడింది సైరంధ్రి. ఉత్తరుడు వద్దువద్దని తప్పుకుపోవడానికి కూడ వీలులేని సవాలున్నది ఆ మాటల్లో. ఉత్తరుడు ''సరె'' నంటాడు. ఉత్తర గబగబా వెళ్ళి బృహన్నలతో చెప్పి నేను నిన్ను తీసికొని వస్తా నని వాగ్దానం చేసివచ్చాను మీరు కాదనక రావాల్సిందంటుంది. ఆమె మాట చెల్లించడానికి గాను అన్నట్లు బృహన్నల ఉత్తరుని వద్దకు వస్తాడు!

వచ్చిన బృహన్నలను తనకు సారధిగా నుండవలసిందని కోరుతాడు ఉత్తర కుమారుడు. బృహన్నల ఒక క్రమానికి ఒప్పుకొంటాడు. రథం గుర్రాలూ తెస్తారు, వాటిని పూన్చి జండా ఎత్తించి పగ్గాలు పట్టి బయలుదేరుతాడు అర్జునుడు. అక్కడి ఆడపిల్లలు కౌరవసేనను వీరు గెల్చి వస్తారనే గొప్పనమ్మకంతో ఉన్నారు. అందుకని వచ్చేటప్పుడు ఆ గొప్ప గొప్ప శత్రురాజులు తలగుడ్డలుగా ధరించి ఉన్న రంగుల గుడ్డలను బొమ్మ పొత్తిళ్ళగా ఆడుకోడానికి తమకు తేవాల్సిందని అడుగు తారు.

తిక్కన ఎంతో సున్నితంగా రమ్యంగా ఈ సన్నివేశంలో హాస్యం చెప్పటం చూస్తాముగాక! ఈ హాస్యానికి ఆధారం ఏమంటే ఆడవాళ్ళకు కౌరవ సేనతో చేయవలసిన యుద్ధంలోని తీవ్రత తెలియక పోవటం ఒకటీ, బృహన్నల గొప్పదనం సైరంధ్రికీ మనకూ తెలిసినదై తెలియవలసిన ఉత్తర కుమారునికి తెలియకపోవటం రెండవదీ, ఆ సమయంలో స్త్రీలంతా ఎదురువచ్చి సేనలు చల్లి వారిని పంపుతారు యుద్ధానికి.

రథం వెళ్ళి వెళ్ళి తీరా కౌరవసేన అగుపడేటంతవరకూ వెళ్తూనే ఉంది. ఆ సేనను చూసేటప్పటికి యుద్ధం చేయాల్సిన ఉత్తర కుమారుని గుండె జారిపోతుంది. ఒకరుకాదు—ఇద్దరుకాదు—కౌరవయోధులంతా వున్నారు. రథం ముందుకే వెళ్తోంది. అప్పుడు బృహన్నలను పిల్చి ఉత్తర కుమారుడు తన పరిస్థితిని చెప్పి వాపోతాడు. "నేను వీరిని గెలవడం అసంభవం. బ్రతికియుండిన సుఖముల బడయవచ్చు. కనుక త్రిప్పు వెనక్కు రథాన్ని" అంటాడు.

అప్పుడు బృహన్నల మొదట "గోవుల్ని విడిచి వెళ్ళటం—ఎలా జేస్తావలాంటి పని—" అంటాడు. "అంతేకాదు సైరంధ్రి నా సంగతి చెప్తే నీవు నన్ను తెచ్చావు. పైగా పౌరులంతా మనకు దీవెనలిచ్చారు. కౌరవులు మన గోవుల్ని ఎత్తుకుపోతున్నారు. ఇన్ని ఇలా ఉండగా నేను వృథాగా తిరిగిపోతానా?" అంటాడు అర్జునుడు. నపుంసకత్వం బృహన్నలకు పోయినట్లు ఈ పద్యమె చెపుతుంది అనిపిస్తుంది. "కొంచెం మనసు చిక్కబట్టుకో. ఆ కౌరవులె ఆశ్చర్యపోయేటట్లు చేసి వెళ్ళిపోదా" మండాడు. రథం ఆపడు. ఉత్తరుడు తన బాణాలూ కవచం అక్కడ రథంమీదనే వదలి, దూకి వెనక్కు తిరిగి పారిపోతాడు. అర్జునుడు రథం నిలిపి దిగి అతడి వెంట పరుగెత్తి వెళ్ళి అతణి పట్టుకొని రథంవద్దకు తెస్తాడు.

ఇదంతా దూరం నుంచి కౌరవ యోధులు చూస్తూ ఉన్నారు. అర్జునుని ఉత్తరుడు ఎంతో ప్రార్థిస్తాడు. తాను తన తల్లిని చూడకుండా చచ్చిపోతాననే భయంతో ఇక బ్రతుకు లేదా అంటాడు. అప్పుడు అర్జునుడు "నీవు రథికుడవై యుద్ధంచేయకపోతె మానె. నాకు సారథిగా వుండు. ఈ కురువీరుల్ని ఇప్పుడే నుగ్గుచేస్తాను." అని అతడ్ని నొగులపై కూర్చోపెట్టి తాను రథికుడై తాము మొదలు ఆయుధాలు దాచి పెట్టిన శమీ వృక్షం దగ్గరకు తీసుకొని వెళ్తాడు.

ఈలోగా ద్రోణాచార్యుడు ఈతణ్ణి అర్జునుడుగా గుర్తిస్తాడు. అజ్ఞాతవాస సమయం పూర్తికాక ముందే తాను ఇతడ్ని గుర్తించినందుకు నొచ్చుకుంటాడు-పాళ్ళు మళ్ళీ 13 సంవత్సరాలు ఇలాగా బాధలు పడాల్సి వస్తుందేమోనని. తమ తమ సైన్యంలోని వారందర్నీ జాగ్రత్తగా ఉండాల్సింది, యుద్ధం చేయడానికి సన్నద్ధులై-అంటాడు. ఇంకా భీష్ముడితో అంటాడు-

వీడు ఎవరో వెర్రివాడిలా ఉన్నాడు, జడవేసికొని వస్తున్నాడు. కౌరవ వీరుల్ని జయించడానికి. అహంకారంతో ఇతడొక ఇంద్రుడులా అనుకుంటున్నాడేమో వీడి కథేమిటో తెలియదుకదా ? అంటాడు. మీకు తెలియదంటున్నాడు తనకు తెలీదంటం అబద్ధం కదా. తన మనసుకయితే నిశ్చయంగా తెలియనే తెలిసింది అర్జునుడతడని. పైకి చెప్పుట ల్లేదుగాక. అబద్ధం భూతకాల విషయమేకదా! భీష్ముడు దుర్యోధనుని చూచి "శత్రువులకు ఇమ్మయిన కాలాన్ని గడిపివచ్చాములా ఉన్నది. ఇప్పుడు చేయండి యుద్ధం శాయశక్తులా" అంటాడు. ద్రోణుడు మనసులో సంతోషిస్తాడు. పైకి అందరితో అంటాడు - ఆ వచ్చేది అర్జునుడే. సింహం ఆకలితో కుంజరంమీదకు ఉరికినట్లు వస్తున్నాడు. మనలో అతడితో సమానంగ ఉన్నవాళ్లెవరూ లేనట్లుంది. అతడు రుద్రుణ్ణి గెల్చిమరీ వచ్చాడు కదా వనవాసకాలంలో" నంటాడు.

కర్ణుడికి ఈ మాటలకు కోపం వచ్చి - "ఆ మాత్రపు వాడెవరూ లేరని శత్రువుకి కైవారాలు పలుకుతావేం? అతడే అర్జునుడు కావాలి గాని నేనున్నాను అతడ్ని జయింపడానికిక్కడి నీకు చేతకాకపోతే" నంటాడు. అందుకు ద్రోణుడికి, ద్రోణ పుత్రుడికి, భీష్ముడికి, కృపుడికి వీరందరికి కించిత్తు కోపంవస్తుంది. దుర్యోధనుడు మాత్రం సంతోషించినా "అలా కాదు"అంటాడు. ఎందుకంటే అతడే అర్జునుడైతే మళ్ళీ 13 సంవత్సరాలు రాజ్యం వదలిపోవాలివాళ్ళు" అని, అతడ్ని ఇంకో విధంగా జయించాల్సిన అవసరం కనపడదని ధ్వనిస్తుంది అతడిమాట.

శమీవృక్షంమీద ఆయుధాలున్నవనీ అవి పాండవుల ఆయుధాలనీ వాటిని తీయవలసిందనీ బృహన్నల ఉత్తరుని కోరుతాడు. ఉత్తరుడు అ కనపడేది శవము కదా అంటాడు. అప్పుడు అర్జునుడు అలా కట్టిపెట్టి వెళ్ళారు పాండవులు అంతేకాని అది నిజానికి శవముకాదు చూడు"మంటాడు. ఉత్తరుడు తీరా చూస్తే అందులో పాములు కన్పడతవి. మళ్ళీ ఉత్తరుడు భయపడ్డాడు. అందుకు అర్జునుడు అవి దివ్యాస్త్రాలు,

అలా కన్పడుతవిగాక, వాటిని తీసి అందులో ఆ పెద్దవిల్లు తనకివ్వమంటాడు. ఉత్తరుడు వాటిని తాకినమీదట అవి శస్త్రాలుగా అప్పుడు తెలుస్తుంది. ఒక్కొక్కటి తీసి దానిని ఎవరు ఉపయోగించేవారో చెప్పమంటాడు ఉత్తరుడు. అన్నీ చెప్పినాక ఇక్కడ ఈ ఆయుధాలు దాచి వారెక్కడున్నారు చెప్పమంటాడు. వాళ్ళు నాకు మేనమామలవుతారంటాడు. అప్పుడు అర్జునునకు చెప్పవలసివస్తుంది కంకుడు వలలుడు తామ్రగంధి తంత్రీపాలుడు మాలిని వీళ్ళే వరుసగా ధర్మరాజూ భీముడు నకులుడు సహదేవుడూ ద్రౌపదిననీ—తాను అర్జునుడేననీ చెప్తాడు. పైగా కీచకుణ్ణి చంపింది భీముడేననికూడ చెప్పాడు.

ఉత్తరుడు చాల చిన్నవాడు. అతడికి అశ్చర్యకరమైన ఈ విషయాలేవీ నమ్మబుద్ధికావటల్లేదు. చివరకు అర్జునునికి పేర్లు పది ఉన్నట్లు తనకు తెలుసు. ఆ పేర్లు నువ్వుచెప్పుచూద్దాం అప్పుడు నమ్ముతా నంటాడు. అలాగేనని అర్జునుడా పేర్లు చెప్పిం తరువాత అవి ఎందుకు ఆయనకు అలా వచ్చినవని అంటాడు. ఆపేర్లు అర్జునః ఫల్గుణః పార్థః కిరీటి శ్వేతవాహనః భీభత్సః విజయః జిష్ణః సవ్యసాచిఃధనుంజయః'' అనేవి. ధనాలు కొల్లగొట్టి తేవడం వలన ధనంజయుడు. ఎలాంటివారినైనా ఎదిరించి జయించడం వలన విజయుడు, తెల్లని వాహనాలు కలవాడు గనక శ్వేతవాహనుడు. ఇంద్రుడిచ్చిన కిరీటం తలమీద సూర్యుడుగా ఉండటంవల్ల కిరీటి అంటారు. వీరులకు భీభత్సంగా యుద్ధంచేస్తాను గనుక భీభత్సుడంటారు. రెండు చేతులా బాణాలు వేయగలనుగనుక సవ్యసాచి అంటారు. తెల్లని వాడను గనుక అర్జునుడను. ధర్మరాజును యుద్ధంలో ఎవరూ నొప్పించకుండా చూస్తానుగనుక జిష్ణుడను. మా అమ్మ పృథ అనే పేరుగలది గనక పార్థుడను అని చెప్తాడు. ఇంకా తాను ఖాండవ దహనమప్పుడు సైంధవ పరాభవమప్పుడు ఇంద్రునికి సహాయము చేసినప్పుడు ఎంత గొప్ప వీరుడనిపించుకొన్నాడో ఆ సంగతంతా చెప్తాడు. అప్పుడు ఉత్తరుడు నమ్మి నమస్కరించి ఇక నీకు నేను సారథ్యం చక్కగా చేస్తానుగాక! నా తప్పు మన్నించాల్సిందంటాడు. అర్జునుడు "నీకు ఒక్క దెబ్బగాని తగలకుండా కాచేభారం నాది" అంటాడు. ఇప్పటికి మనసులు కుదుట బడినవి.

ఉత్తరునకు మళ్ళీ ఈతడికి ఈ షండభావం ఎలావచ్చింది. ఇది నటించగలిగేదికాదే! అని సందేహం వస్తుంది. వెంటనే అర్జునుడ్ని అడుగుతాడు. అప్పుడర్జునుడు ఊర్వశివల్ల కలిగిన శాపం సంగతి చెప్పి ఇప్పుడేమీ లేదులెమ్మంటాడు.

అంతట ఉత్తరునిచేత మిగిలిన ఆయుధాలు తిరిగి పైన పెట్టించి తన ఆయుధాలు ధరించిన క్షణాన ఇంద్రుని కిరీటం వచ్చి అతడి తలను చేరుతుంది. అగ్నిదేవుని తలచుకోంగానే కపికేతనము వస్తుంది. ఉత్తరుని సింహకేతనాన్ని చెట్టుమీద ఉంచి కపికేతనంతో అర్జునుడు యుద్ధానికి తారసిల్లుతాడు.

సర్వమూ సన్నద్ధమైన క్షణాన దేవదత్తాన్ని విజృంభమాణంగా పూరిస్తాడు అర్జునుడు. ఆ శబ్దానికి గుర్రాలు చాపకట్టుగా క్రిందపడిపోతవి_ ఉత్తర కుమారుడు మూర్ఛపోతాడు. వాటినీ ఉత్తర కుమారునీ సేదదీర్చి ధైర్యం చెప్పి మళ్ళీ యుద్ధానికి దుముకుతాడు అర్జునుడు. ఈ సంరంభం చూసి, దుర్యోధనునితో ద్రోణుడు అంటాడు_ "అ వింటినారి మ్రోత, శంఖం మ్రోతచూస్తే అవి గాండీవం దేవదత్తం అనె అనిపిస్తున్నవి. అతడి కిరీటం కూడ అతడు కిరీటి అనే చెప్తోంది. అర్జునుడయితే నేను గెలుస్తానని కర్ణుడూ మళ్ళీ ఎక్కడకో పంపుతానని నీవూ. అనే సమయంలేదు_ వెళ్ళి కలబడి యుద్ధం చేయాల్సిన సమయం వచ్చింది త్వరపడు" మంటాడు. కృపాశ్వత్థామలతో "దుర్యోధనుని ముందు పెట్టుకొని హస్తిపురానికి దోవతీయండి। వారి వెనుక గోవుల్ని తోలుతూ కొందర్ని పంపండి. వారి వెనుక నిలిచి యుద్ధానికి అంతా సిద్ధం కావలసింది। అంటాడు.

దుర్యోధనుడు మాత్రం "ఇంకా వనవాస అజ్ఞాత వాసాలకాలం 13 సంవత్సరాలూ కాలేదు కనుక మనం పాండవులను తిరిగి అరణ్యాలకు పంపాల్సిందె. ముందు భీష్ములవారు లెక్కచెప్పి చూస్తారు గాక।" అంటాడు. కర్ణుడు "యుద్ధమొచ్చిందని వెనుకాముందు ఉండాలనుకోవటం ఎందుకు? ఎవరయితే యేమిగాక యుద్ధం చేద్దాము మనం గెలుస్తాముగాక। ఒక్కడు వచ్చాడు మనలందర్నీ గెలుస్తాడా? అసంభవం అంటాడు. దుర్యోధనుడు మళ్ళీ అవునంటే కాదని, పోట్లాడటం వచ్చినప్పుడు నీతి నియమాలు చెప్పటం - భోజనానంతర సంభాషణంలా పలకటం, ఈ ఆచార్యులకు అలవాటు. ఇతరులమంతా వెళ్ళి వెనక వీరి నుంచి నట్లయితే వారు మనకు జయం రావాలనె ఆశిస్తూ ఉంటారుగాక" అంటాడు ద్రోణుని హేళన చేస్తూ.

అశ్వత్థామకు ఈ మాటలవల్ల చాల చెడ్డకోపం వస్తుంది. "గోవులు కాచే వాళ్ళని అదలించి, గోవుల్ని పట్టుకున్నంత మాత్రాన ఇంత మదంతో మాట్లాడకు। యుద్ధంలో గెల్చిన రాజ్యాన్ని పట్టుకున్న వాళ్ళుకూడ ఇలా మాట్లాడరుగాక. ద్యూతంలో గెల్చినవాడివి నీవు। ఇప్పుడేం చెయ్యాలో ఆ శకుని నడుగు. పాండవుల

ఎదుట ద్రౌపది వలువలు వలిపించింది వాడి నీతివల్లనేగా! అప్పుడు ఆవనికి అవమానంతో క్రుంగినవాడుగనుక ఆ కపికేతనుడు నీపాలిటి ధూమకేతనుడుగా వస్తున్నాడు. దేవదానవులకుకూడ దుర్జయుడయిన అర్జునుని ఎవరు పొగడకుండా ఉండగలరు? ద్రోణాచార్యులకు ప్రియశిష్యుడుకూడ గనుక అర్జునుణ్ణి ఆయన పొగడటం ఆశ్చర్యమేమిటి? ఆయన యుద్ధం చేస్తే చేస్తాడేమో నాకు తెలీదుగాని, నేను మాత్రం నీ మాటలకు సిగ్గువదలి యుద్ధం చేయలేనుగాక" అంటాడు.

చిత్రమైన సంగతి ఒకటి ఇక్కడ చూడవచ్చు. ధృతరాష్ట్రుడు పెద్దరాజు. దుర్యోధనుడు పేరుకు రారాజు. దుర్యోధనుడ్ని సంగతి కనుగొనకుండా ధృతరాష్ట్రుడు నిర్ణయాలు తీసికొనడు. కాని ధృతరాష్ట్రునికి పెద్దవాళ్ళంతా సలహాదారులు. భీష్ముడూ, ద్రోణుడూ, కృపాచార్యుడూ విదురుడూ మొదలైనవారు, వీరిమాటలూ సలహాలూ యువక సమాలోచనాపరులైన కర్ణశకుని దుశ్శాసనాదులకు సరిపడవు. వీరి సలహాలను ఆ పెద్దవాయ విమర్శించుతూనే ఉండేవారు ఈ విధంగా కౌరవులలో ఒక వర్గ సంబంధమైన విభేదాలు తరుచువచ్చి సమసిపోతుండేవి. దుర్యోధనుడు చిన్నవారి పక్షం ఉండేవాడు. ఇప్పుడు ద్రోణుని కొంచెం తూలనాడిన కారణంకూడ ఈ భేదమే. అశ్వత్థామ చిన్నవాడయినా పెద్దవారికే గౌరవం ఇచ్చే అలవాటుంది. ఇది ఎందువల్లనూ అంటే అతడి సంస్కారమది అని చెప్పాల్సింది కాని ఇంకేమీ చెప్పలేము. ఇంతకూ దుర్యోధనుడన్న తేలిక మాటలకు అశ్వత్థామ కల్పించుకొని దుర్యోధనుని ధిక్కరించడం జరిగింది.

వెంటనే అశ్వత్థామ మాటలను ధిఃకరిస్తూ కర్ణుడు ముందుకువచ్చి మాట్లాడుతాడు. "మీరంతా విరాటురాజు గోధనాన్ని తీసికొనిపోదామని వచ్చినవారే. అయినా తీరా అర్జునుడిని చూసి ఇలా హడలిపోయివాణ్ణి పొగడటం ఆరంభించారు. మీరంతా యుద్ధంచేసే అతడ్ని ఎదుర్కొనకపోయినంత మాత్రంచేత ఏమీకాదు. అతడొక్కడు! నేనొక్కడ్ని చాలనా? నేకు ఎదుర్కొంటాను. ఆతనికీ నాకూ ఎప్పుడూ పోటీయే. ఇప్పుడు తెమిల్చి చూపుతాను నా ఆధిక్యం అంటాడు.

అప్పుడు కృపాచార్యుడు ఈ తగాయిదాను సర్దుతాడు.—కర్ణుని దురుసుతనాన్ని తిట్టుతూనే, అతడ్ని తిట్టటంలో తనకుగల స్పర్థ వ్యక్తం చేస్తాడు. కాని యుద్ధం చేయాల్సివస్తే అశ్వత్థామ, ద్రోణులచేత అప్పుడు యుద్ధం చేయించాల్సిన

అవసరంకూడ ఉంది గనుక వారిమనసుల్ని శాంతపరచ చూస్తాడు. కృపాచార్యుడం టాడు—"ఈ కర్ణుడెప్పుడూ కయ్యానికే కాలు దువ్వుతాడు. యుద్ధం అనేది చివరి సాధనం. దేశ కాల బలాలు చూడకుండా అలా పోరాటానికి పోతే చివరకు కీడు కలుగుతుంది" అంటాడు.

ఎందుకు కీడు కలుగుతుంది అని శంకవస్తుంది. ఒకానొక ధర్మ విరుద్ధమైన విషయం జరుగుతుందనుకొందాం. ఎవరి గోధనాన్నో మనం కొల్లగొట్టటం. మనం చేసింది అధర్మం. ఆ గోధనాలు పోగొట్టుకొన్నదివారు. వారికీ మనకూ కలిగే పోరాటంలో ధర్మం వారియందుండటంచేత వారు గెలవడమెకద్దు. ధర్మం ఎంతో బలం కలిగింది. శరీరబలం కాదది. మనోబలం అనవచ్చునేమొ. అలా అన్నా చాల దేమొ దైవబలం అది అనాలనిపిస్తుంది. అందుకని కేవలం శరీర బలం బాహుబలం ఆధారంచేసి యుద్ధం కోసం ఆశిస్తే కీడుకలుగుతుందని కృపాచార్యుడు చెప్తున్నాడు.

కృపాచార్యుడు ఇంకా అంటున్నాడు—"అర్జునుడు ఒక్కడేకదా ఇపుడు మనం దరితో యుద్ధం చేసేది! అతడేంగెలవకలడని అనుకుంటున్నారేమో. ఇంద్రునితో యుద్ధంచేసి ఖాండవ దహనం చేయించింది ఒక్కడుకాదా! సుభద్రను తీసికొనివచ్చే టప్పుడు యాదవ బలాలను జయించింది ఒక్కడుకాదా! మనవంశ ప్రతిష్ఠ మార్మో గేటట్లు దిగ్విజయం చేసింది ఒక్కడుకాదా దుర్యోధనుడ్ని గంధర్వపతి నుండి విడిపింపగలిగింది ఒక్కడు కాదా! నివాత కవచులనే రాక్షసులను జయించి ఇంద్రుని తృప్తిపరచింది ఒక్కడుకాదా! కాలకేయుల్ని గెల్చింది ఒక్కడుకాదా! ఇంత యెందుకు! ద్రౌపదీ స్వయంవరంలో ఉన్న నరపాలురనందరనూ గెల్చింది ఒక్కడుకాదా! అప్పుడు కర్ణుడూ ఉన్నాడు ఓడిపోయినవారిలో! కనక కర్ణా! ఊరికే గప్పాలు మాట్లాడి అందరి మనసులూ పాడుచేయకు—మేమూ యుద్ధం చేస్తాముగాక ఒక్కడవూ అర్జునుడ్ని ఎదిరించి గెలవడం నీకు వశమా? ముక్కంటికే వశం కాలేదు?" అంటాడు.

ఎలాగయినా అంతా యుద్ధం చేయాలని అతిడి తహతహ. కర్ణుడు మాత్రం కృపాచార్యుని ఇంకా అల్పమైన మాటలతో అధిక్షేపిస్తూనే ఉంటాడు. బ్రాహ్మణ కులస్థుడవు గనుక చక్కగా యజ్ఞాలు చేయించి భోజనం చెయ్యక ఈ యుద్ధ విష యాలు నీకెందుకు పొమ్మంటాడు.

అప్పుడు భీష్ముడుకూడ సర్దిపలుకుతాడు-కర్ణుడు సంగర పాటవాన్ని కలిగి యుండవచ్చుగాక. ఇతర్లను ఇలా అవమానించి వారి మనసులు చెడగొట్టటం భావ్యం కాదంటాడు. తిరిగి కృపాశ్వత్థామల వైపు దిరిగి చేతులు చాచి ఆహ్వానిస్తూ "మన కెంతో పనివుంది. అటుచూస్తే అర్జునుడు వస్తున్నాడు. కురువంశానికి ఏ కీడు వచ్చినా అది ధనుర్వేద విదులయిన మీతలకు చుట్టుకొన్నట్లేసుమా! కనక అపరాధు లను క్షమించి యుద్ధం చేయాల్సింది" అంటాడు. అప్పుడు కృపాశ్వత్థామలు, 'క్షమించాల్సినవాడు ద్రోణుడు గాని, మేము కా'దంటారు. ద్రోణునివంక భీష్ముడు చూస్తాడు. దుర్యోధనుడుకూడ కర్ణుని స్నేహపూర్వకంగా పట్టుకొని ద్రోణాచార్యుని వైపు తీసికొని పోతాడు. ద్రోణుడది గమనించే, "భీష్ముని మాటలేచాలు. నా కోపం తీరిపోయింది" అంటాడు.

కాని దుర్యోధనుడు ద్యూత సంబంధమైన కాంట్రాక్టు కాలమయిన 13 సంవత్సరాలు పూర్తి అయిందో లేదో తెలిసికొనాలని అనుకొంటున్నట్లున్నాడు. అది లెక్కకట్టి చెప్పవలసింది వింటాము అని ద్రోణుడు అంటాడు. అప్పుడు భీష్ముడు లెక్కకట్టి అధికమాసాలు వదలి లెక్కకట్టినాకూడ 13 సంవత్సరాల కాలం నిన్నటికె అయిపోయింది అని చెప్తాడు. ధర్మరాజాదులు అలాంటి పొరపాటు లెక్కలు వేయరుగాక. అలా పూర్తి అయింది కనుకనే అర్జునుడిప్పుడు ఇలా బయటపడ్డాడు. అధర్మం అయినాసరే ఇలాగే ప్రవర్తిస్తాము అనే స్వభావంకలవారు అయితె, ఆనాడే మూర్ఖంచేసి తిరగబడేవారు అన్నాడు. ఇప్పుడు యుద్ధానికి వస్తున్నాడు కనక ఊరు కొంటామా? ఎదుర్కొంటాంగాక కాని అవశ్యం వారిని యుద్ధంలో గెలుస్తామని చెప్పకలిగే వీలు లేదుగాక. అందుచేత వారితో సంధిచేసికోవలసి ఉంటుందేమో యాతావతా అంటాడు. అప్పుడు దుర్యోధనుడంటాడు—

"మనకు బాండు రాజతనయ వర్గమునకు నెట్లు వొందుగలుగు నేను రాజ్య
భాగమీను సమరభంగిక విక్రమ నిరతి బూనుటిదియ నిశ్చయంబు—అని

ఇంకా చర్చసాగిస్తే దుర్యోధనుని మనసు స్థిరమయిపోతుందని ఆ విషయం భీష్ముడు చర్చించటం మానేస్తాడు. ద్రోణుడప్పుడు "యుద్ధం సంగతీ, ఏం చెయ్యాలనే సంగతీ రాజుకే తెలుసు ఎక్కువగా అయినా ఇప్పుడీ యుద్ధంలో నాల్గవవంతు బలాన్ని తీసికొని 'రాజు' గోవులనుకూడ తీసికొని వెళ్ళిపోవాలి. గోరక్షణకు నాల్గవంతు సైన్యం వెళ్ళాలి. ఇక మిగిలిన సగభాగాన్ని అమర్చి ముందు కర్ణుడు

ప్రక్కల్లో అశ్వత్థామ, కృపుడు, నేనూ వెనక భీష్ముడూ ఉండి రక్షించాలి అని నా అభిప్రాయ" మంటాడు.

ఈ జరగబోయే యుద్ధం చూడటానికి సురసిద్ధ సాధ్యగంధర్వ కిన్నర కింపురుషులంతా ఆకాశంలో బారులుతీర్చి ఉన్నారు. పాండురాజుకూడ వచ్చాడట కుమారుని ప్రతిభ కనులార చూడ్డానికి, వీళ్ళందరి మనోబలం అర్జునునకు సహాయమవుతున్నదనిపిస్తుంది. మనోబలమేమిటి? చింతకాయ పచ్చడనేవారికి చెప్పగలిగే బోధ ఏమీలేదు.

అర్జునుడి రథం చేరువవుతుంది. ఈ వ్యూహం చూస్తాడు. అందులో కర్ణుడు శకుని దుశ్శాసనుడు ఇంకా అందరూ ఉన్నారు. కాని దుర్యోధనుడులేడు. దూరంగా కొంత సైన్యంతో వెళ్ళిపోతున్నట్లున్నాడు. గోవులు వెళ్తున్నాయి. వాటితో కొంత సైన్యం వెళ్తున్నది. వీళ్ళతో యుద్ధం తరువాతయినా చెయ్యవచ్చు-ముందు దుర్యోధనుడు వెళ్ళిపోకుండా చూడటం, గోవుల్ని మళ్ళించటం చెయ్యాలి అని అర్జునుడు ఉత్తరుడితో చెప్పి, ఈ సైన్యం చుట్టూర తన రథాన్ని మళ్ళించి ఒక్క ఉదుటలో పోయి దుర్యోధనుడి సైన్యాన్ని ముట్టడించాలిగాక అంటాడు-అలాగే రథాన్ని ఉత్తరుడు తోలుతాడు-ఈలోగా అర్జునుడు నాల్గు బాణాలు వేసి, ద్రోణుని, భీష్ముని ముందు నిల్చేటట్లు రెండూ, వారి చెవిప్రక్కగా వెళ్ళేటట్లు రెండూ, పంపుతాడు. అది క్షేమమడగడం నమస్కరించటమూనూ, భీష్మద్రోణులెంతో సంతోషిస్తారు మనసుల్లో. వారి సుహృద్భావం అర్జునునకు మంచినీయబోతోందనేది ఊహించవచ్చు.

అనుకున్నట్లు అర్జునుని రథం ఈ సైన్యాన్ని వదిలివేసి వెళ్ళిపోతోంది. భీష్ముడప్పుడు తెలిసికొంటాడు. అర్జునుడు అలా ఊరికే వెళ్ళటంకాదుగాక. దుర్యోధనుడ్ని పట్టుకోవడానికి పోతున్నాడు; ఇప్పుడు రాజును రక్షించాలి గనుక ఈవ్యూహం మంతా వదలి రండి అంతా ఆ గోవులవైపుకు పోదాం అంటాడు. అలా వెళ్తూ ఉండటంగానే అర్జునుడిది గమనించి నిలబడి ఎదుర్కొంటాడు సైన్యాన్ని.

విద్యుచ్ఛక్తి పరువెత్తినట్లుగా గాండీవం నుంచీ శరాలు వెళ్ళి అందరినీ కదలకుండ చేస్తున్నాయి. సైన్యమంతా ఇలాటి కౌశలం ఆదివరకెప్పుడూ చూడకపోవటం చేత చూచేవారుగా నిలిచిపోయి చూస్తున్నారు. గోవుల వెనకనున్న సైన్యంకూడ

చెదిరిపోయింది. వాళ్ళ తూర్పువయిపునకు తప్పుకొని పారిపోయే అవకాశమిస్తూ రథాన్ని నడుపుమంటాడు అర్జునుడు. గోవులు ఒకవైపూ సైన్యం ఇంకోవైపూ ఉండగా మధ్యలోనున్న అర్జునుడు దేవదత్తాన్ని విశృంఖలంగా పూరిస్తాడు. గోవులు బెదరి తోకలెత్తి తూర్పుకు పరుగిడుతాయి. తమ ఊరి పొలిమేరలవైపుకు వెళ్ళిపోతుంటయి. ఉత్తరుడు గోపాలకులకు ఆజ్ఞనిస్తూ అరుస్తాడు— అటునుంచి అటు గోవుల్ని ఇండ్లకు తోలుకుపొమ్మని, వీళ్ళు చూస్తుండగా గోవులు తమ తమ పొలాలకు వెళ్ళిపోతాయి.

ఇదీ ఉత్తర గోగ్రహణం. ఇక మిగిలింది యుద్ధం. అర్జునుడూ కౌరవుల మధ్య జరిగే యుద్ధం—

## 2. ఉత్తర గోగ్రహణానంతర యుద్ధం

తీసికొని పోయిన గోగణాలను తిరిగి చాకచక్యంగా తమ పొలాలవైపుకు తరిమించి, నివ్వెరపోయి చూస్తూ నిలిచిపోయిన కౌరవ సైన్యాన్ని అలానే వదలి "దూరంగా వెళ్ళిపోతుండే దుర్యోధనుడివైపుకు పోనీ మన రథాన్ని" అంటాడు ఉత్తరునితో అర్జునుడు. ఇది చిత్రమనిపిస్తుంది. అర్జునుని అతిశయానికి ఇది గుర్తనిపిస్తుంది. గోవుల్ని మరల్చుకురావాలని వచ్చాడు. పని అయిపోయింది. దుర్యోధనునిమీదకు పోవటం ఎందుకు? ఇది రజోగుణ లక్షణమేను. అటు తాను వెళ్ళితే ఈ సైన్యం మళ్ళీ గోవుల్ని కొట్టేస్తారేమోనని ఆలోచింపలేదు. ఎందుకంటె తనమీదకు వచ్చి తనతో పోట్లాడి గెలువకుండా గొడ్లను తోలుకుపోయేటంత నీచపువని కౌరవసేన చేయదని నమ్మకం. తానెటుపోయినా వీళ్ళంతా తనను అనుసరించివచ్చి మరీ యుద్ధం చేయటం ఖాయం. ఒక్క దుర్యోధనుడే వెళ్ళిపోతున్నాడు. అతడ్ని తిప్పి తీసికొని వస్తే అందరితోపాటుగా అతణ్ణి ఎదిరించవచ్చని ఉద్దేశించాడు అర్జునుడు.

అటు అర్జునుడు వెళ్ళటం రాజుకు పట్టుకోడానికేనని తోచంగానే కౌరవ సైన్యం అంతా ఒక్కుమ్మడి ఆ దిక్కునకు వెళ్ళి దుర్యోధనుడికి, అర్జునుడికి మధ్య వచ్చి నిలిచారు. ఇక అర్జుననకు యుద్ధం చేయట మొక్కటే ఏకాగ్రమైన పని మిగిలింది. అందుకని ఎవరెవరు ఏఏ జెండాలు పట్టుకొని ఉన్నారో ఉత్తరునికి చెప్తాడు. రథికుని శరీరం ముఖం బహుళ కవచాలవల్ల కన్పడకపోవచ్చు గుర్తించడా

నికి వీలుగా, కేతనం మాత్రం ఒకరిది మరొకరు పెట్టుకోరు. చక్కగా ఎత్తుగా కన్పడుతూ ఉంటుంది. అందుకని జండాల సంగతి చెప్తున్నాడు.

ద్రోణుణ్ణి చూపి ఆయనతో యుద్ధం చేయనుగాక. ఆయన నాపైకి వచ్చినప్పుడు చూసుకొందాం. ఆయనంటే నాకు గౌరవం. ఆయనకు ప్రదక్షిణంగా పోనీయీ రథం. ఈ కృపుడు, అశ్వత్థామ చాల గొప్ప యోధులు. వీళ్ళకెదురుగా పోనీకు రథం. ఇతర్లమీదకు పోనీ. వీళ్ళు అడ్డువచ్చినా వీలయినంతవరకు తప్పించి పోనీ. ఇంతకు అడుగో ఆ కర్ణుడు యోధాగ్రేసరుడు దుర్యోధనుడికి వాల్లభ్యం పట్టేవాడు అతడికీ నాకూను ఎప్పుడూ మత్సరమే ఉంటుండేది. అతడి కెదురుగా నిశ్శంకతో రథాన్ని తోలుసుమా! దుర్యోధనుడు అడుగో పోయేవాడు వెనక్కు తిరిగివచ్చి నిల్చాడు యుద్ధానికి. ఈ కర్ణుడూ దుర్యోధనుడూ ఇద్దరు ఒక్కచోట ఉంటే వాళ్ళతో యుద్ధం చేయాలని నా ఊహ, ఇప్పుడు లభిస్తోంది నాకిది. నాకు పండువుగా వాళ్ళిద్దరూ యుద్ధరంగంలో ఎక్కడన్నా కలిసి ఉన్నారంటె పరువెత్తించువార్లవైపు రథాన్ని" అంటాడు.

భీష్ముడు మంచి ధీమంతుడు. మమ్ములనూ ధార్తరాష్ట్రిలనూ ఒకే విధంగా ప్రేమిస్తాడు. అయినా అక్కడి వారితో ఉండటంచేత వారికి సహాయం చేస్తాడు.— యుద్ధం అనేది ఆయనకు చాలా మామూలయిన విషయం కావటంచేత అయనకు అన్ని అస్త్ర శస్త్రిల సంగతీ తెలుసు సుమా! ఆయన రథంవైపునకు మాత్రం పోనీకు మన రథాన్ని అని అంటాడు. ఇవన్నీ ఒక్కతై తాను అందరితో పోరాడవలసిన అవసరం వచ్చింది కనుక అతడు వేసిన పథకం ఇది అనిపిస్తుంది. కొందర్ని తప్పించుకు తిరగడం కొందర్ని చావగొట్టి చూడటం.

అశ్వత్థామ కర్ణుని ఉడికిస్తాడు—"ఇప్పుడేం చేస్తావు. యుద్ధం చేస్తావో లేదో శకునిని పిలిచి సలహా అడుగు" మని, కర్ణుడు మండిపడి యుద్ధం అరంభిస్తాడు. ద్రోణ, భీష్మ, దుశ్శాసన, కృపాచార్య ప్రభృతులంతాకూడ యుద్ధానికి తలపడుతారు. దుర్యోధనుడు ఉజ్వలమైన కోపంతో నిలుస్తాడు భూమి దద్దరిల్లిపోతుంది.

అర్జునుని గాండీవం ఒకే మోతగా భం, భం, భం, అని గోల పెట్టుతున్నది. బాణాలు అసంఖ్యాకంగా బయటకు వస్తూనే ఉన్నాయి. ఇంతమంది కౌరవవీరులు వేసిన బాణాలూ తుత్తునియలవుతున్నయి. గుఱ్ఱాలు ఏనుగులు చచ్చిపడి రక్తసిక్తం

చేస్తున్నవి రంగస్థలమంతా. అందుకు కినిసి కౌరవ యోధులు ఒక్కసారిగా చుట్టు ముట్టి అర్జునునిపైకి వస్తారు. అప్పుడు అర్జునుడు బాణాలు వేయటంలో అత్యంతమైన వేగాన్ని పొందాడు. నారిలాగినప్పుడు విల్లు గుండ్రంగా వంగుతుందిగదా. బాణం వేయంగానే తిరిగి విల్లు నిలువుగా రావాలి! అలారానిచ్చే సమయం ఇవ్వట ల్లేదు అర్జునుడు. ఆ విల్లు అలా నిరంతరం గుండ్రమైన ఆకారంలోనే కన్పడుతున్నదట. బాణాలనువదలే ఈ వేగం అర్జునునికి తప్ప ఇంకెవరకీ లేదన్న విషయం ఉత్తరుడికి తెలిసింది. ఇంకా మనం ఫలాని దృశ్యం చూడాలని కన్ను త్రిప్పినప్పుడు ఎంత త్వరగా దృష్టి ఆ దృశ్యంమీదకు లక్ష్యం తప్పకుండానే వెళ్ళిపోగలుగుతుందో అలా అర్జునుని బాణాలు లక్ష్యం తప్పనే తప్పటల్లేదుట. ఎంతబాగా తిక్కన వర్ణించాడో ఈ సంగతుల్ని అందరూ ఆయన రచన చదివి తెలిసికోవడం సమంజసం అనిపిస్తుంది.

అర్జునుడింకా ఈ చేత్తోనూ ఆచేత్తోనూకూడా బాణాలను వదలుతున్నాడు. అతడి రథం ఇక్కడా ఉంటోంది ఎక్కడో అక్కడా ఉంటోంది. ఈ వేగం ఎవరికీ అర్థం కావటల్లేదు. బలాలను రెండుపాయలు చేస్తూ వెళ్తున్నాడు. మళ్ళీ ప్రక్కకు తిరిగి నాల్గు చేస్తున్నాడు. మెరుపులా మూలలకు వెళ్తున్నాడు. అందరినీ చిక్కువరుస్తున్నాడు. అంబుధిలో మహామత్స్యంలా విహరిస్తున్నాడట. చిన్న చేపల గమనాన్ని పరికించి ఆ చాలనం మహామత్స్యానికి ఉంటే ఎలా ఉంటుందో ఊహింపగలిగితేగాని ఈ విశేషం తెలియదేమో. తిక్కన పద్యాలు కంఠస్థంచేస్తే ఇలాటి దృశ్యాలు మనసులోనిల్చి మనిషికి ఎప్పటికప్పుడు జీవితంలో సంతోషాన్ని కలిగిస్తుంటవి అనిపిస్తుంది.

కౌరవసేనలు ఏమీ చేయటల్లేదా అనిపిస్తుంది వాళ్ళంత అసదలా అనిపించటంకద్దు. కాని వారికి ఒకానొక ధ్యేయముంది. దుర్యోధనుని కాపాడటం. అతడి చుట్టూ పెద్ద పెద్ద యోధులంతా ఈ చిందర వందర తప్పించుకొనిపోయి కాచి ఉన్నారు. మిగతా వాళ్ళంతా ప్రొద్దుగ్రుంకితేగాని ఈ యుద్ధం పూర్తికాదే ఎలా? అనుకొంటున్నారు. మనలందర్నీ పూర్తిగా నరకేసిందాకా ఈ యుద్ధం పూర్తి కాదేమోననుకొంటున్నారు. అర్జునుడి ముందు చచ్చి కుప్పలుగా పడిపోయే జీవాలనూ సైనికుల్నీ చూస్తూ తామూ అంతే అవుతామేమోనని దగ్గరకు రావటల్లేదు ఇలా ఉంది యుద్ధరంగం.

అప్పుడర్జునుడే తమాయించి చూశాడు దుర్యోధనుని వెనకపెట్టుకొని ద్రోణుడూ, భీష్ముడూ, కృపుడు అశ్వత్థామా చివరకు కర్ణుడుకూడా ఉండటం. అప్పుడు ఉత్తరునితో అడుగో కర్ణుడు అతడిమీదకు తోలు ఈ రథాన్ని అంటాడు.

అర్జునుని రథం కర్ణునివైపు ఎపుడయితె వెళ్తోందో కౌరవులు ఊరుకోదలచ లేదు. ఇప్పటివరకూ వీరిద్దరికీ పోటీపడితె ఎవరు గెలుస్తారు అనే సంగతి వాళ్ళకు తెలియకపోయింది. ఇప్పుడు అర్జునుడు నడిపిన వికసనకాండవల్ల బహుశ అర్జునుడ్ని కర్ణునిమీదకు వదలరాదీ సమయంలో అనుకొని యుండవచ్చు. ఒక్కొక్కరే ఎదురు వచ్చి యుద్ధం చేసి చావడమో పారిపోవడమో చేస్తారు. అలా చచ్చినవారిలో శత్రుంతపుడు, సంగ్రామజిత్తు మొదలయినవారున్నారు.వాళ్ళలో కర్ణుని తమ్ముడు సంగ్రామజిత్తు. ఇదిచూచి కర్ణునకు ఆవేశం వస్తుంది వచ్చి తలపడుతాడు.

అలా తలపడిన క్షణాన వీరి ఔద్ధత్యం ఒకరికంటె ఒకరిది ఎక్కువదిగా అవుపడుతుంది సైన్యాలకు. బహుశ అందుకని మళ్ళీ ఎవరు గెలుస్తారో వీరిని అలా చూస్తూ ఉండిపోయినారట. కర్ణుని బాణాలు అర్జునునివైపు వెళ్తుంటే చూసి సంతోషిస్తున్నారు. అర్జునుని బాణాలు కర్ణునిపై కొస్తుంటే చూసి దిగాలుపడుతున్నారు. అర్జునుడు తనకుతాను ఉత్సాహం తెచ్చుకోవలసిన స్థితి బహుశ అది. అందుకని ఉషారు పుట్టటానికన్నట్లు కర్ణుడితో అంటాడు_"సభలో నాకుసరి ఎవరూలేరని మాట్లాడావప్పుడు. అజ్ఞాపాశాధీనుడనై నేనప్పుడుండటంచేత ఊరుకొన్నానుగాక. ఇప్పుడు నీతమ్ముడు చచ్చాడు మరి, నీవూ ఏం చేస్తావో చెయ్యి. నీమగటిమి చూపించు, మాటలు చెప్పటం వేరు పనిచేయటంవేరుకదా!" అంటాడు కర్ణుడుకూడ చాల ధైర్యంగా అతిశయంతో మాట్లాడుతాడు. "నీవు ధర్మరాజు వద్దంటేనే ఊరుకొన్నావో చేతగాకనే ఊరుకొన్నావో ఎవరికి తెలుసు. ఇప్పుడాగు_క్షణంలో నీసంగతి తేలుస్తాను. అర్జునుడది చేశాడు ఇది చేశాడని వార్తలు విన్నానుగాక_ఇప్పుడు నీపటిమ చూసినప్పుడుగదా నమ్మాల్సింది" అంటాడు.

ఈ సంభాషణ సమయంలో కౌరవులు తమపని ఏమిటని ఆలోచించి అంతా వచ్చి అర్జునుడ్ని చుట్టూ ముట్టుతారు. మళ్ళీ అర్జునుని గాండీవం గుండ్రంగా ఉంటే ఆకారం దాల్చింది. అర్జునుని రథం వీరందర్నీ శిక్షిస్తూనే చుట్టూ పరుగెత్తుతోంది. అర్జునుడు కర్ణుని మాత్రం కొట్టుతూనే ఉన్నాడు బాణాలతో,రథాలు కుప్పలుగా కూలిపోతున్నాయి. ఘోటకాలు ఏనుగులు పడిపోతున్నాయి. కర్ణుడు అర్జునుని రథంవెంట

బడి తరుముతున్నట్లున్నది వదలకుండా. అది చూచి అర్జునుడు కర్ణుని విల్లువిరిగే టట్లు కొట్టుతాడు. చేసేదిలేక కర్ణుడు శక్తినొకదానిని వేస్తాడు అర్జునునిపై. అది దేవేంద్రుడు తనకిచ్చిన శక్తికాదు. మరొక్కటి. దానిని అర్జునుడు తుత్తునియలు చేస్తాడు బాణాలతో, కర్ణుడు మళ్ళీ మళ్ళీ తీసిన విల్లులన్నీ తుత్తునియలవుతవి. ఏ ఆయుధమూ లేకపోవటం వళ్ళంతా తూట్లు పడటంతో కర్ణుడు తప్పనిసరిగా పారిపో తాడు. వెంటనే అర్జునుడు దేవదత్తాన్ని పూరిస్తాడు.

శంఖం పూరించటంవల్ల స్వపక్ష రథికులకు గొప్ప ఆవేశం వస్తుంది. అలాగే అర్జునునకు ఎంతో ఆవేశం కలిగి శరీరం విజృంభించినట్లుంది. ఉత్తరుడు ఇదిచూచి నిశ్చేష్టుడైనాడు. ఈతడు మళ్ళీ యుద్ధం చేస్తాడా. ఇకతాను ఆ రథం నడపజాలనను కొంటాడు. చాల వెక్కసపడిపోయినాడు తను. అలా నోరు తెరచి, ఇంద్రియాలు ఏపనీ చేయలేని స్థితిలో పడిపోయినాడు. అప్పుడర్జునుడు ఉత్తరునికి జ్ఞాపకంచేసి సరియైన స్థితికి తెస్తాడు.

అర్జునుని రథం ద్రోణాచార్యునికి ఎదురుగా వెళ్తుంది. అర్జునుడు రథంనుంచే ద్రోణునికి నమస్కరించి—

"అడవుల బెద్దయు గాలం, బిడుమలగుడిచితిమి మాకునిదిదటియని
యిప్పుడు వచ్చితిమి విపన్నులయెడ కృపసేయుట లెస్సయీ తలుగకుండీ.

అంటాడు. పైగా మీరు నామీద బాణాలు వేయకపోతే ముందుగా నేనే మీ మీద బాణాలువేసే ప్రసక్తి లేదంటాడు. వెనక ద్రోణుడు అర్జునుని గురుదక్షిణ ఇమ్మని అడిగే సందర్భంలో తనపై యుద్ధానికి రాకూడని కాంట్రాక్టు ఒకటి అర్జునుని చేత చేయించుకొన్నాడు. అందుచేత అర్జునుడిలా అంటున్నాడు అని తెలిసికొన్నాడు. తాను బాణం వేయకపోతె తనతో యుద్ధంచేసే బాధనుంచీ తప్పించుకుపోతాడు ఇప్పుడర్జునుడు నేరుగా వెళ్ళి దుర్యోధనుని కొట్టుతాడు. కనక తానే యుద్ధం ఆరం భించాలి_ అని ఆలోచించుకొని ఉంటాడు ద్రోణుడు. వెంటనే ఇరవయి బాణాలు అర్జునునిమీద వేస్తాడు. అర్జునుడప్పుడే వాటిని తుత్తునియలూ చేశాడు_పోరు ఘోర మయింది. దివ్యాస్త్రాలు ఒకరిమీద ఒకరువేసి ఒకర్ని ఒకరు జయిస్తున్నారు. చివరకు అర్జునుడు ద్రోణుని గుఱ్ఱాలనూ, సారథులను కొట్టి విరథుణ్ణి చేస్తాడు.

అప్పుడు ఎవరో అడ్డురావాలికదా వెంటనే. ద్రోణపుత్రుడయిన అశ్వత్థామ అర్జునితో తలపడుతాడు. మళ్ళీ చండ యుద్ధం నడుస్తుంది. అశ్వత్థామ గాండీవానికున్న నారిని తెగగొట్ట గలుగుతాడు. మళ్ళీ నారిని బిగించుకొనేలోగా బాణాలతో అర్జునుడ్ని నొవ్వగొట్టి "హా" అని అరిచేస్తాడు. కౌరవసేన మహా సంతోషాన్ని పొందుతుంది. కాని గాండీవానికి మళ్ళీ నారి సారించింది మొదలు-ప్రచండ యుద్ధం పెల్లుగొన్నదౌతుంది. ఇంతలో అశ్వత్థామ అంబులుపొది ఖాళీ అయిపోతుంది అర్జునుడికి అక్షయ తూణీరాలవటంచేత తరగలేదు. తప్పనిసరిగా అశ్వత్థామ తప్పుకొని పోతాడు రంగంనుంచి. అతడు అలా పోయేందుకు వీలుగా కృపాచార్యుడు అడ్డం వస్తాడు అర్జునునకు.

అర్జునుడు కృపాచార్యుని నొప్పిస్తాడు. అదిచూచి కౌరవ సేనలో చంద్రకేతుడు మొదలయిన పదిమంది ఒక్కసారిగా తలపడతారు.వాళ్ళందరూ చస్తారు అర్జునుని బాణాలతో కృపాచార్యునికి చివరకు రథం విల్లుకత్తి, డాలూ అన్నీ నుసికావటంచేత అశ్వత్థామ రథం వద్దకు పరువెత్తి వెళ్ళిపోతాడు. ఇక భయపడిపోయిన కౌరవబలం భీష్ముని రథం వెనుకకు సర్దుకొని నిలుస్తారు. అర్జునుడు భీష్ముని మీదకు వెళ్ళే సమయంలో వృషసేనుడొచ్చి అడ్డుపడుతాడు. కాని అర్జునుని గాండీవముక్త బాణం అతడి విల్లును విరగగొట్టటంచేత అతడు తప్పుకొని వెళ్ళిపోతాడు. అందుకని భీష్మునితో యుద్ధం తటస్థించింది అర్జునునకిప్పుడు.

భీష్ముడూ అర్జునుడూ యుద్ధం చేయడం చూస్తూ ఆకాశంలో నిల్చిన దేవతలూ మొదలైనవాళ్ళు వీరి అస్త్ర శస్త్రవిద్యా బాహు బలాలు తమనందరనూ దాటి పోయినవి అనుకొంటున్నారు. వారు ఒకరికంటె ఒకరు ఎక్కుడెక్కుడుగ శరపరంపరలను వేస్తున్నారు. భీష్ముని విల్లు విరుగుతుందొక క్షణాన. ఆయన మహా కోపంతో మరోవిల్లు తీసికొని అర్జునుని ఎదుర్కొంటాడు-మళ్ళీ ఆ వింటిని విరగకొట్టుతాడు అర్జునుడు. భీష్ముడు మళ్ళీ మరోవిల్లందుకొంటాడు. చివరకు అర్జునుడు విసిగి ఆ విల్లు విరగగొట్టి మళ్ళీ మరొక విల్లు తీసికొనేలోపునే బాణాలతో భీష్ముని నొవ్వచేస్తాడు. భీష్ముడు రథస్తంభం ఊతగా పట్టుకొని పడిపోకుండా నిలుస్తాడు. అది గమనించి సారథి రథాన్ని దూరంగా తోలుకుపోతాడు.

ఆ సమయంలో అశ్వత్థామ మళ్ళీ కర్ణుని ఉడికిస్తాడు. "అతా యుద్ధరంగం నుంచి తొలిగారు. నీకేమయినా శక్తిఉంటే అర్జునుని ఎదిరించాలి" అని. కర్ణుడు

ఘోషంతో రథాన్ని ముందుకు తోలిస్తాడు. దాని వెనుక మాటున ఉన్న సైకులంతా 'హా' మంటుంటే అర్జునుడు తరుముకుంటూ వచ్చి చాపకట్టలా వారంతా పడిపోయేట్లు చేస్తాడు.

ఉత్తరుడు "అబ్బో ఇంక యుద్ధం పొడిగించవద్దు నేను భరించలేనుగాక" అంటాడు–పిల్లవాడుకదామరి! అర్జునుడు అదుగో రాజు తానే నామీదకు రావాలను కొని అంజాయిస్తున్నాడు. వానిమీదకు పోనీ అప్పుడు మనమీదకు అతడు వస్తాడుగాక చూదాం వానిబలం అంటాడు.

రథం అలాగే తోలుతాడు. మళ్ళీ యుద్ధం బాణాలతో నడుస్తుంది. దుర్యోధనుడ్ని కాపాడాలని ఒక మంచి ఏనుగు నెక్కి వికర్ణుడు వస్తాడు. కాని అర్జునుడు తన ముష్టిఘాతంతో ఆ ఏనుగును చంపేస్తాడు. వికర్ణుడు ఇంకో దోవలేక మరొకరి రథమెక్కి వెళ్ళిపోతాడు. దుర్యోధనుని చుట్టూ ఉన్నవాళ్ళెవరూ మీదకు రాకపోవడంచేత అర్జునునకు దుర్యోధనుడొక్కడే దొరుకుతాడు. అతడు ఏమీచేయలేక పారిపోచూస్తాడు. కర్ణుడు దుశ్శాసనుడు ఇద్దరికీ బాణాలు గ్రుచ్చుకొంటవి. కర్ణుడు, అందర్నీచూచి అశ్వత్థామ, ద్రోణుడూ మొ॥ వారినందర్నీ పిల్చి వచ్చి సహాయం చేయండి. రారాజును రక్షించుకొనే బాధ్యత లేదా మీకు" అంటున్నాడు. ద్రోణుడూ మొదలైన వాళ్ళు ఇంకా అంజాయిస్తున్నారు. చివరకు దుర్యోధనుడే వారిని ప్రార్థిస్తాడు సహాయం చేయండని. అప్పుడు వాళ్ళు యుద్ధానికాయత్తమవుతారు.

ఈ సమయంలో అర్జునుడు దుర్యోధనుణ్ణి పిల్చి అంటాడు–"ఓహో! నీవు క్షత్రియుడవు ఓడిపోతావా! కుంతీ పుత్రుల్లో నేను చిన్నవాణ్ణి, నిన్ను యుద్ధానికి నేను రమ్మంటుంటే పారిపోవటం న్యాయమా నీకూ నీ మిత్రులకూను? జనులు నిన్ను మెచ్చుకొంటారా అలా చేస్తేనంటాడు. దుర్యోధనుడు యుద్ధం చేయాలని తిరగబడుతాడు. భీష్మ ద్రోణ కర్ణులూ ఇతరులందరూ వస్తారు. అర్జునుడు సమ్మోహనాస్త్రమనేది వేస్తాడు. అది మత్తుమందులాంటిదనిపిస్తుంది. దాని ప్రభావానికి అంతా వళ్ళు తెలీకుండా పడిపోతారు. అప్పటికి అర్జునునకూ ఉత్తరునకూ విశ్రాంతి కలిగింది.

ఉత్తరుడు వెళ్ళి పడిపోయినవాళ్ళందరి తలగుడ్డల్లోనూ కొన్ని చింపి తీసికొని వస్తాడు. భీష్ముని తలవద్దకు మాత్రం పోవద్దుసుమా అంటాడు అర్జునుడు. నిజానికి

భీష్ముడు రథం నడిపి, వచ్చి అర్జునుని ఎదుర్కొంటాడు మళ్ళీ. కాని అప్పుడు అర్జునునిదే గెలుపు. భీష్ముడు నిల్చిపోతాడు. అర్జునుడు కొంచెం దూరంలో రథ నిలిపివేచి యుంటాడు వీళ్ళంతా లేస్తారేమోనని.

కొంతసేపటికి దుర్యోధనుడు లేచి అర్జునుని చూచి మళ్ళీ యుద్ధంచే ప్రయత్నం చేస్తాడు. కాని భీష్ముడు అతనిని వారిస్తాడు. ఇప్పుడు సమయంకాదు అంతా వళ్ళు తెలియక పడివున్న స్థితిలో ఈ అర్జునుడు మన మెడలుతెగ్గోసిన దిక్కులేక పోయేదిగాక. కాని అతడు అలాటి పనిఏమీ చేయలేదు చూడు. అతడ మన ప్రాణాలు తీయడానికి సంకల్పించలేదు. అదిగమనించి ఇప్పటికి మనం ఆ పోతే మేలు అంటాడు.

దుర్యోధనుడు చేసేదిలేక యుద్ధం చాలించి హస్తినాపురం వెళ్ళిపోదాం పద మంటాడు.

ఇంత యుద్ధంలో పేరులేనివాళ్ళు ఎవరో మాత్రం చంపబడ్డారుగాని. కౌరవు లలో ఎవర్నీ ప్రాణాలు తీసి చంపలేదు అర్జునుడు. ఇది చాలా ముఖ్యమైన విషయం యుద్ధం ఎంతో తీవ్రంగా చేసి ఉండాలి. కౌరవులందరూ ఒక్కపెట్టున ఉన్నా, అర్జునుని ఏం చేయలేకపోయినారు. దీనికి కారణం ఏమిటని శంక రావడం కద్దు.

కౌరవులు కేవలం గోవులను అదలించి ధర్మరాజాదులు మత్స్య రాజ్యంలో ఉన్నారేమో తెలిసికొందామని మాత్రమె వచ్చారుగాని పెద్దయుద్ధం జరుగుతుందని తెలిసిరాలేదు. అర్జునుడు అజ్ఞాతవాసం గడువయిపోయిందని కౌరవులకు తెలియా లనీ తన చేతుల తీట సంవత్సరం నుంచీ పెరిగిందాన్ని తరిగించాలనీ మాత్రమే యుద్ధం చేశాడు. అంతా జ్ఞాపకంలో ఉంచుకున్నానా ? యుద్ధం చేయడమనేది మర్చిపోయానా అని తెములుచ్చుకోడానికే యుద్ధం చేశాడు. దుర్యోధనాదులంతా తన బంధువులూ వయస్యులు కావటంచేత వారిని ఈ తమాషా చమ్మచక్కలాట వంటి యుద్ధంలో చంపదలచలేదు. ఆ సంగతి కౌరవులకూ తెలుసు. అర్జునుడు తమను చంపడానికి యజ్ఞం ఆరంభించలేదని. తప్పనిసరిగా కర్ణుని తమ్ముణ్ణి, ఇంకా కొంద రినీ చంపవలసి వచ్చింది గాక అర్జునునకు. ఆ కారణం చేత మహాకౌశలుడయిన అర్జునుడు కౌరవుల్ని సునాయాసంగా గెల్చినట్లు అనిపిస్తున్నది. ఒకరినొకరు చంప డానికిగాను చేసిన యుద్ధం కాదనేది జ్ఞాపకముంచుకొనటం మంచిది. అందుకె భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలు తమ తమ వర్గపోరాటానికి సంబంధించిన మాటలు కర్ణుని

తోనూ దుర్యోధనునితోనూ అంటూనే ఉంటున్నారు. వారు కొంతసేపు యుద్ధం చేయనే లేదు నిజానికి. ఒక్కొక్కరే వచ్చి యుద్ధంచేసి ఓడి వెళ్ళిపోయి నుంచున్నారు. ఉత్తర గోగ్రహణ యుద్ధంలోని కీలకం ఇది. బలాబలాలు తెగవేయటానికి చేసిన యుద్ధమయితే ఇంతబాగా యుద్ధంచేసే అర్జునునకు గెలవడానికి పాండవ కౌరవ యుద్ధంలో 18 రోజులు ఎందుకు పట్టింది. కొడుకునెందుకు కోల్పోవాల్సి వచ్చింది అనేదానికి ఈ పై సంగతులు సమాధానం అనిపిస్తుంది.

## 3. చెడ్డరోజులు చివరెళ్ళటం

దక్షిణ గోగ్రహణ సందర్భంలో ధర్మరాజ భీమ నకుల సహదేవులు యుద్ధం చేసినా తాము ఫలాన అని ఎవరికీ తెలియలేదు. ఆ యుద్ధంలో పగటికాలంలో వాళ్ళు యుద్ధం చేయకుండా విరాటుడి వెనుకగా ఉన్నవారై వెన్నెల వచ్చిన తరువాత ముందుకువెళ్ళి యుద్ధం చేశారు. పైగా భీముడు విజృంభించి చెట్లు పీకి యుద్ధం చేయరాదని ధర్మరాజు చేసిన నియమం ప్రకారం తమాయించి మరీ యుద్ధం చేశాడు అందుకని వీరు ఫలాన అని ఎవరూ గుర్తింపలేకపోయినారు. పదిమందితోపాటు వీళ్ళు ఎవరో యుద్ధం చేశారనే అనుకొంటున్నారందరు.

ఉత్తర గోగ్రహణంలో అర్జునుడొక్కడే యుద్ధంచేయాల్సి వచ్చింది. అంతే గాక అర్జునుడు తన అన్నగారి ఆజ్ఞకోసం వేచియుండకుండానే తాను అర్జునుడనని బైటకు చెప్పకొని, కపికేతనం పెట్టుకొని గాండీవం పుచ్చుకొని కిరీటం ధరించి మరీ యుద్ధం చేశాడు. దీనికి కారణం క్రిందటి రాత్రితో 13వ సంవత్సరం అజ్ఞాతవాస సంవత్సరం పూర్తి అయిపోవటమె. పైగా తాను అర్జునుడని చెప్పకొనక యుద్ధం చేసిఉన్నట్లయితే తన గెలుపు ఎలా ఉండేదో. ఇతడు అర్జునుడని కౌరవులకు తెలియంగానే వాళ్ళు కోరిన సమాచారం వారికి దొరికినందువల్ల సంతుష్టులైపోయినారు వాళ్ళు. కాకపోతె అజ్ఞాతవాస సంవత్సరకాలం పూర్తి అయినట్లుగా భీష్ముడు చెప్పటం వాళ్ళకు చెడ్డవార్త అయింది. అతడు ఎవరో మరియొకరనె అనుకొంటె భీష్మద్రోణ కృపాశ్వత్థామలు ఇంకా ఎక్కువ పౌరుషంతో యుద్ధంచేసి అర్జునుని ఓడించేవాళ్ళేమో కూడ.

ఏమయినా తాను అర్జునుడనే సంగతి విరాట రాజ్యంలో మాత్రం తనంత తానుగా బయట పెట్టడానికి అర్జునుడిష్టపడలేదు. పశువుల్ని తోలుకొని వస్తూ

ఉత్తరునితో ఈ సంగతి నగరంలో చెప్పవద్దు, సర్వులనూ నీవే జయించినట్లు చెప్ప వలసిందని కోరుతాడు. తమ ఆయుధాలు మళ్ళీ శమీ వృక్షంమీద పెట్టిస్తాడు, కపి కేతనం తీయించి సింహకేతనాన్ని పెట్టి తన కిరీట కవచకుండలాలను ప్రార్థించి అదృశ్యం చేయించి. తాను సారథియై కూర్చొని ఉత్తరుణ్ణి రథికుడుగా చేస్తాడు. మరి పేడిగతికూడ మళ్ళీ తిరిగి సంప్రాప్తించేదేమో ఇంద్రుని దయవల్ల.

పురంలో ఉత్తరుని విజయం చాటింపజేస్తారు. అంతఃపుర స్త్రీలువచ్చి ఉత్తరుని ఎదుర్కొని పొగడటం ఆరంభించినప్పుడు ఉత్తరుడు తన మనసులో ఉదయించిన నవ్వులాట (humour) ను భరింపలేక నర్మగర్భంగా బృహన్నల సహాయం లేకుండా కించిత్తు పనికూడ చేయలేకపోయేవాణ్ణి అంతపని చేయటానికి నా బ్రతుకెంత నేనెంత అంటాడు. అలా హాస్యాన్ని సృష్టిస్తాడు తిక్కన—

"కురుబలమున్ జయించుటయు గోవుల దెచ్చుటయున్ బృహన్నలా
స్ఫురిత భుజాబలంబునన చూవె నిజంబిది నాకు యేల యె
వ్వరికిని నెవ్వరిం గెలువ వచ్చున యిట్టి సహాయ సంపదం
బొరయకయున్న మీకెరుగ బోలునె నా బ్రతుకెట్టి భంగియో"
—అంటాడు ఉత్తరుడు.

క్రిందటి రాత్రి దక్షిణ గోగ్రహణ సందర్భంలో కలిగిన యుద్ధం పూర్తిచేసి అక్కడి ఇసుక తిన్నెలమీద కాలంగడిపి ఉదయానికల్లా విరాటుడు ధర్మరాజాదులూ నగరం చేరుతారు. తీరా ఇక్కడి పరిస్థితి విని విరాటురాజు బెంబేల్కు పడిపోతాడు. అయ్యో నా చిన్నబిడ్డ పసివాడు. అంత గొప్ప యోధులయిన కౌరవులపైకి యుద్ధా నికి వెళ్ళాడా! అయ్యో ఏమవుతుందో ఏమోనని గోల పెట్టుతాడు.

కంకుడు ధైర్యం చెప్తాడు—సుశర్మను జయించి రావడమనే శుభం నీకు ఇప్పుడె కలిగింది గనక రెండో విజయంకూడ నీకు సంప్రాప్తిస్తుంది. ఎందుకంటే ఉత్తరుడేననేమిటిగాక బృహన్నల సహాయంతో ఎవరు వెళ్తే వాళ్ళే జయిస్తారు అంటాడు. ఎందువల్ల అలా అన్నారని అడిగితె అతడు అర్జునుడేను అని చెప్ప టానికి బహుశ ధర్మరాజు సిద్ధంగా ఉన్నాడు. కాని విరాటుడు అలా అడగలేదు. పైగా కొంచెం కోపగించుకొని ఉత్తరునికి సైన్యాన్ని సహాయంగా పంపవలసిందని తనవారికి ఆజ్ఞలిస్తాడు. ఇంతలోనే కౌరవుల్ని జయించి ఉత్తరుడు గోగణాలన్ని

తోలుకొని వచ్చినట్లు వార్తవస్తుంది. అనంతమైన సంతోషాన్ని పొందుతాడు విరాటుడు. కుమారుని తీసికొని రావాల్సిందంటాడు. కంకుభట్టుతో జూదం ఒక ఆట వేద్దాం రమ్మంటాడు. సైరంధ్రి మరి అక్కడకు తన భర్త సంతోషాన్ని చూడాలని వచ్చిందేమో బహుశ అక్కడ ఉన్నది. ఆమెను చూచి విరాటుడు జూదవు సారెలు తెమ్మని తెప్పిస్తాడు.

మళ్ళీ క్షణం గాలి పీల్చుకొని విరాటుడు ఓహో భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలతో కూడుకొన్న కౌరవ సేనను ఓడించి నా కుమారుడెంత గొప్పవని చేశాడూ అని ఆనందిస్తున్నాడు. ధర్మరాజు ఎలాగైనా తమతమ రహస్య విషయాలు విరాటుడికి చెప్పాలనే ప్రయత్నం చేస్తున్నాడు గనుక, "అబ్బో వారందర్నీ ఉత్తరుడొక్కడే జయించాడంటే అంతకంటె అచ్చెరువైనది ఇంకొకటి ఉంటుందా! ఉత్తరుడు ప్రసిద్ధికెక్కియుండేవాడు గదా" అన్నాడు. అందుకు విరాటుడు "ఐతే అతడు వాళ్ళని జయించనే లేదంటావా? నీవు కనుక ఊరుకొన్నానుగాని మరొకరలా అంటే ఏమి చేసేవాడివో" అంటాడు. ధర్మరాజు మళ్ళీ "బృహన్నల రథంమీద నిల్చి తన భుజబలం పెరవారిమీద చూపుతుంటే ఉత్తరునకు రాక్షసులు కోట్లకొలది వస్తేమాత్రం జయించడం కష్టమా?" అంటాడు. విరాటుడు "ఔరా! నాకుమారునికయిన పొగడ్త నీకు పొసగటల్లేదు. మూర్ఖమైన ఉద్రేకంతోకూడ మాట్లాడుతున్నావు! నేను ఇది సహింపను" అంటున్నాడు. కంకుడు మాత్రం "నేను చెప్పాను గదా ఇది తథ్యం విను. బృహన్నలే నీ కుమారుని సారథిగా తీసుకొనివెళ్ళి అందర్నీ గెల్చి ఉంటాడు. ఇది తెల్సికొనాల్సింది" అంటాడు. ధర్మరాజు అంతర్యం "అలా ఎందుకనుకొంటున్నావు" అనె ఉత్సుకతతో విరాటుడడుగుతాడని !!! విరాటుడికి మాత్రం కోపం అగ్గలమైపోతోంది. చివరకు ధర్మరాజు, "బృహన్నల విజయాన్ని పురంలో చాటింపు" మంటాడు. దీనితో ఓర్పు నశించిపోతుంది విరాటునిలో. ఆసారె ఒకదానిని తీసికొని ధర్మరాజు ముఖాన కొట్టాడు. నెత్తురు కారుతుంది. వెంటనే ద్రౌపది తన చీర చెరగుతో ఆ రక్తం క్రింద బడకుండ అపి పత్తిపట్టుకుంటుంది. మీ ఇద్దరకూ సంబంధ మేమిటని అయినా విరాటుడు అడగక నీపై చీరతో ఆరక్తం అంత భద్రంగా ఎందుకు పట్టుతున్నావు అని అడుగుతాడు సైరంధ్రిని. సైరంధ్రి ఆయన తన భర్త అని చెప్పటం అసంభవం ఆ సందర్భంలో. ధర్మరాజు అజ్ఞ లేకుండా ఆమె అలా బయటపడదు. కనుక అంటుంది ఆయన రక్తం ఎన్నిబొట్లు

క్రింద పడితె అన్ని సంవత్సరాలు ఆ రాజ్యంలో అనావర్షభయం కలుగుతుందని" ఆయన ద్విజుడవడమె దానికి కారణమని ఒక సూచన నిస్తుంది.

ఇంతలో ప్రతీహారివచ్చి "ఉత్తరుడూ బృహన్నల ఇద్దరూ తమరు రమన్న కారణంచేత వచ్చారు ప్రవేశపెట్టుమంటారా' అంటాడు. వెంటనే ధర్మరాజు "బృహన్నలను రానీయకు. ఉత్తర కుమారుని రమ్మనవలసింది.బృహన్నల ఈ రక్తాన్ని నా ముఖాన ఈ దెబ్బను చూస్తే కోపిస్తాడు" అంటాడు. విరాటుడికి ఈ సలహా మరీ బాగుండి యుండవచ్చు. "అలాకానీమం"టాడు– ఎందుకంటె బృహన్నలను తాను చూడటానికి ఇష్టపడకపోవచ్చు ఉత్తరుని కలిసిందాకా.

ఉత్తరుడు వచ్చి తండ్రికి నమస్కరించి కౌగలించుకొని, కంకుభట్టుకు సగౌరవంగా నమస్కరించి ఆయన ముఖంపై నెత్తురు దెబ్బ చూచి అదేమిటంటాడు. విరాటుడు తాను సారె తీసి వేశానని చెప్పి ఎందుకంటే, "నీ విజయాన్ని నేను పొగిడినప్పుడు ఆతడు సరిగా గ్రహింపకపోయినా" దంటాడు. ఉత్తరుడు "అయ్యో! ఎంత పొరపాటు చేయడమయింది. ఈ సందర్భంలో తమరు అంన్ని ప్రార్థించాల్సింది కరుణింపుమని" అంటాడు–విరాటుడు – పాపం కంకుభట్టును భక్తియుక్తంగా వేడుకొంటాడు. తరువాత బృహన్నల రాంగానే కంకుభట్టు తన ముఖంపై దెబ్బ కననవడకుండ కాటికప్పుకొంటాడు.

సమర విషయాలన్ని చెప్పవలసిందని తండ్రి అడిగినప్పుడు ఉత్తరుడు తనకు ఒక మహాత్ముడు సహాయం వచ్చి రక్షించాడనీ నిజానికి తాను భయపడి పారిపోతున్నప్పుడు అతడువచ్చి ధైర్యం చెప్పి రక్షించాడంటాడు. ఆ రక్షించింది బృహన్నలని గాని అర్జునుడనిగాని చెప్పడు. ఎందుకంటే అర్జునుకు అలా కట్టడి చేశాడు. అక్కడ యుద్ధం మొదలయిన దగ్గర్నుంచీ ఒక్కొక్కరిని ఎలా జయించడమయిందో అంతా వర్ణించి చెప్తాడు. చివరకు ఒకొక్కరు గెలువలేక ఎలా పారిపోయిందనిన్నీ తప్పించుకొన్నదిన్నీ కూడ వర్ణిస్తాడు. ఇది ధర్మరాజూ, ద్రౌపదీ కూడ వింటున్నారు. వారికి అర్జునుని పరాక్రమం వర్ణించటం ఎంత ముదావహమో విరాటుడికి తెలీదు. ఈ కంకుడు ధర్మరాజనీ, అర్జునుడు, భీముడు, నకులుడు, సహదేవుడూ ద్రౌపదీ అంతా ఇక్కడే ఉన్నారని తెలిసిన ఉత్తరుని సంతోషోద్రేకానికి ఆ మాట చెప్పకూడదని అంకు ఒకటి హద్దు అయిపోయింది. తన కుమారుడే ఎలాగయినా గెల్చివచ్చాడనే సంతోషానికి అడ్డుగా ఆ యక్షుడెవడో వచ్చి ఇంత పేరు కొట్టేశాడనె కించ విరాటు

డికి ఉండటం చిత్రమైన సన్నివేశం. చివరకు ఉత్తరుడు' ఆ గంధర్వుడు మన వంశానికి మేలు చేయటమె తనకు ప్రధానమ'న్నట్లు చెప్పాడు.

ఇలాంటి విజృంభమాణమయిన యుద్ధం చేశాడెవరోను అని ఉత్తరుడూ, బృహన్నలే అంత మేధావీ అని కంకుభట్టూ చెప్పిన మాటలను సంధానంచేసి ఆలోచించటం విరాటుడు చేయలేదు. అతడిది నపుంసకత్వ బుద్ధి అంటాడు తిక్కన్న. నిర్వ్యుత్పత్తి అని అర్థం. బృహన్నలను విరాటరాజు ఆదరించి, ఉత్తరుణ్ణీ బృహన్నలనూ అంతః పురానికి పంపివేస్తాడు. అలా వెళ్తూ బృహన్నల ఉత్తరుని నీవు బాగా మాట్లాడినావని మెచ్చుకొంటాడు. ధర్మరాజుకు అంతకంటె ఎక్కువ తెలియనీయ నక్కరలేదంటాడు.

తను చేసిన పనికి ధర్మరాజు ఎలా భావిస్తాడోనని అర్జునుని శంక అనేది గమనీయం.

## 4. అభిమన్యుని వివాహం

ఆ రాత్రి రోజువారి కృత్యాలు పూర్తి చేసుకొని ధర్మరాజు ఉంటున్న గృహంలో భీమార్జున నకుల సహదేవులూ ద్రౌపదీ అంతా వెళ్ళి కలుస్తారు. గోగ్రహణపు కథా విషయాలన్నీ ఒకరికొకరు తెల్పుకొని సంతోషిస్తారు. కాని అర్జునునకు ధర్మరాజు తన ముఖాన్ని పూర్తిగా కనపడనీయక మారుమొగంతో ఉన్నాడు. దానికి కారణమేమిటో తెలియటల్లేదని భీమసేనునితో అర్జునుడు అంటాడు. అప్పుడు యుధిష్ఠిరుడు జరిగిన సంగతిని చెప్పక తప్పలేదు. వెంటనే భీముడూ అర్జునుడూ చంపేస్తాం ఈ విరాటుడినంటారు. అప్పుడు ధర్మరాజు జ్ఞాపకం చేస్తాడు వీరిద్దరికీ—

"ఆ రాజుకు మనం ఫలాన అనేది ఇంతవరకూ తెలియదు. ఇన్నాళ్ళూ అతడి చాటున మనం దాగి పబ్బంగడుపుకొన్నాం. అతనికి ఏ విధమైన ఎగ్గుగాని చేయటం సమంజసం కాదు. మనం ఫలాన అని తెలిసిం తరువాత అతడట్లా ప్రవర్తిస్తే ఆ సంగతి వేరు అంటాడు. ముందు తమని తాము రాజునకు తెలియపరచుకోవటం కర్తవ్యం. ధర్మరాజు కర్మయోగి. కర్తవ్యం లేని పనులను చేయడు. ఇప్పుడు కర్తవ్యం తమని తాము రాజున కెరిగించుకొనటం.

మరునాడు రాజదర్బారులో తెలుపుకొందామని నిశ్చయించుకొని ఆనాడు అక్కడనే విశ్రమించి ఉదయం స్నాన సంధ్యలు పూర్తిచేసి రాజదుస్తులు ధరించి వచ్చి విరాటుని దర్బారులో ఉన్న ఆసనాలమీద కూర్చుంటారు. ధర్మరాజు విరాటుని సింహాసనంమీదనే కూర్చుంటాడు – విరాటుడు వచ్చేటప్పటికి. ఈ రంగం విరాటునికి చాలా కోపాన్ని తెప్పిస్తుంది. ఆయన వచ్చినా, వీళ్ళు లేవరుకూడ. విరాటుడు కంకుభట్టుని పిల్చి మదకారణంచేత కదా నీవు నా సింహాసనంమీద కూర్చొని నేను వచ్చినా లేవకున్నావు అంటాడు.

అప్పుడర్జునుడు "అయ్యా ఈయన నేల నాల్గుచెరగులా ధర్మపరిపాలనం చేసినవాడు. దిక్కులన్నీ ఇతడి కీర్తితో వెలుగొందినయి. రాజసూయాధ్వరం చేసినవాడితడు. సత్యభాషా మహావ్రతశాలి. ఈయనే ధర్మరాజు సుమా! ఈయన ఈమాత్రపు సింహాసనానికి తగడా అంటాడు. విరాటుడప్పుడు అలాఅయితే భీమార్జునులు మొదలయినవారంతా ఏరి? అంటాడు అమాయకంగా. అప్పుడు అర్జునుడు వాళ్ళను ఒక్కొక్కరినే చూపిస్తూ వాళ్ళను పరిచయం చేస్తాడు. భీముడు అర్జునుని తెల్పి పరిచయం చేస్తాడు. ఉత్తరుడప్పుడు ఈ అర్జునుడే నన్ను యుద్ధంలో సారధి చేసికొని కౌరవులను గెలిచినవాడు. ఆయన వెంటనే ఆ సంగతి చెప్పవద్దనటంచేత ఇప్పటివరకూ నేను చెప్పలేదు." అంటాడు. విరాటుడు ధర్మరాజు పాదాలకు నమస్కరించి మిగతావారిని, కౌగలించి సుధేష్ణకు కబురంపి ఈ సంగతంతా తెల్పి ద్రౌపదిని గౌరవింపచేస్తాడు.

అర్జునుడు విరాటుడికి కృతజ్ఞతలు తెల్పుతూ ఈ అజ్ఞాతవాస వత్సరం విరాటుని ఆస్థానంలో తాము ఒదిగి ఉండటానికి ఎన్నో వీళ్ళు కలిగినదై విరాట్పురి ఉన్నదని మెచ్చుకొంటాడు. అందుకు విరాటుడు "మా పుణ్యవశంచేతనే మీరు ఈ సంవత్సరం ఇలా కడపగలిగారుగాక ఇందులో నా గొప్పతనమేమీ లేదు. పైగా మీరు వేరూ నేను వేరూ అనుకోవద్దు. మీరు సంతోషపడటం నాకెంతో సంతోషం. ఈ రాజ్యాన్ని మీరు ఏలుకోవలసింది అంటాడు. అప్పుడు ఉత్తరుడు ఎంతో తెలివిగా మాట్లాడతాడు, "ఈ రాజ్యానికేమి. ఈ రాజ్యం వాళ్ళు జయించి ఇచ్చిందేగదా నిన్నటి రోజున – ఆ ఇవ్వటం చాలదుగాక. ఇంకా ఒక కొత్త కాన్క నివ్వాలి ఉత్తరను పిలిపించాల్సింది" అంటాడు.

విరాటుడికి చాలా సంతోషమవుతుంది. "ఉత్తరను అలంకరించి తీసుకొని రమ్మం"టాడు. సుధేష్ణకు కబురంపుతాడు. మంగళ వాద్యాలతో ఆమెను తీసుకొని వస్తారు. విరాటుడు ఉత్తరను ఆదరంతో తీసుకొనివచ్చి ధర్మరాజు ప్రక్కన నిలిపి, మేమంతా మీకు పనిచేయడానికి ఇష్టపడుతున్నాము. ఈ బంధువుల కందరకూ మీతో కలిసియుండటం ఎంతో ఇష్టం అంటాడు. ధర్మరాజు అర్జునుని వంకచూస్తాడు. అర్జునుడు మత్స్య రాజుతో ఈ పిల్లను నా కోడలుగా తీసికొంటానుగాక. ఈ సంవత్సరమంతా వీరందరి పరిచయంతో మెలగిన కారణంగా నేను ఈమెకు గురువునవుతాను కనక అదే సమంజసమంటాడు.

అర్జునునికి సుభద్రయందు అభిమన్యుడనే కుమారుడున్నాడు పెండ్లీడువాడు. విరాటుడు వెంటనే చాల బాగున్నదంటాడు. ధర్మరాజు అంగీకరిస్తాడు. అంతా ఒప్పుకొంటారు వెంటనే. దైవజ్ఞులను పిల్చి ముహూర్తము నిశ్చయించి యాదవ పాంచాలాది బంధుజనుల నందర్నీ పెండ్లికి రావలసిందని రెండు వంశాలవారున్నూ కబుర్లు పంపిస్తారు.

ఇక దుర్యోధనుడు కర్ణశకుని దుశ్శాసనులతో మంతనం చేసి అజ్ఞాతవాస కాలం పూర్తి అయిందని భీష్ముడు చెప్పింది సరికాకపోయి ఉండవచ్చుననీ, ఆయన పాండవులమీద పక్షపాతంతో అలా చెప్పి ఉంటాడనీ ఈ సంగతి నిజమైన లెక్క తెలియాలంటే ధర్మరాజువద్దకే కబురు పంపితే అతడు నిష్కర్షగా సత్యమైన సంగతిని చెప్తాడనీ తీర్మానిస్తాడు. ఇది ధర్మరాజు యొక్క ధర్మనిరతిని తెలుపుడు చేయడానికి ఎంత బలమైన నిదర్శనమో యుపకులు ఆలోచించి చెప్పడానికి ప్రయత్నం చేస్తే ధర్మరాజుమీద దురభిప్రాయం కలగడం మానుతుందనిపిస్తుంది.

దుర్యోధనుడు ఒక దూతని ధర్మరాజు వద్దకు పంపి అజ్ఞాతవాస కాలావధి పూర్తికాకముందే అర్జునుని తాము గుర్తించారుగనక ఇప్పుడేం చేయాలో అదిచేయాల్సిందని కబురు చేశాడు. ఆ దూతవచ్చి చెప్పంగానే ఆ కాలావధి కచ్చితంగా అంతకుముందే పూర్తి అయిందని చెప్పి—

"నిండె సమయాబ్దములు నిం
కొండన లేదిపుడచని సుయోధనుతో భీ
ష్ముండు గురుడును వినగా
నిండెననుము నిండె నిండె నిక్కంబునకున్"

—అంటాడు తిక్కన. కౌరవులు ఇది విని మాట్లాడకూరుకొన్నారు.

ధర్మరాజాదులు తమ తమ ఆయుధాలు తెచ్చుకొని ఉపప్లావ్యానికి వెళ్తారు. అప్పుడు శ్రీకృష్ణుడు, బలదేవుడు సాత్యకి ఇతర యాదవులు అంతావస్తారు. పాండవులు ఎదురువెళ్ళి సుభద్రాభిమన్యులు సహాఅంతరనూ ఆదరిస్తారు. పాంచాల దేశంనుంచి ద్రుపదుడూ అతని పుత్రుడూ వస్తారు. వీరందరూ కలిసి విరాటపురికి పెండ్లికి తరలి వెళ్తారు.

అక్కడ మత్స్యపురాధీశుడు మహోర్భాటంగా ఉత్తరను అభిమన్యునకిచ్చి పెండ్లిచేస్తారు. పాండవులకు శుభం ఇలా కలిగింది. సభాపర్వంలో కలిగిన రాజ్య సుఖం గొప్పదేగాని ఇప్పుడు తమ కుమారుని పెండ్లిలో ఇంకా ఎంతో ప్రశాంతమైన సుఖాన్ని వారు పొందారనేది గమనీయం.

విరాట్పర్వ కథలో వ్యాసమహర్షి, అదివరకె అహంబ్రహ్మాస్మి సాధన పూర్తి చేసిన సాధకుడు, బ్రహ్మ అయి తాను తిరిగి లోకంలోకి వచ్చి సర్వమూ బ్రహ్మమే యేను అనే "సర్వం ఖల్విదం బ్రహ్మమనే సాధనను" ఆరంభించటం సూచించాడు. పాండవులు మహత్తర స్థితిని వదలి సామాన్యులుగా మనటం నేనే బ్రహ్మమనే స్థితి నుండి వచ్చి సర్వమూ భగవన్మయమనే దోవవైపునకు రావటమేనని గమనీయం.

ఇది విరాట్పర్వము



# మహాభారత కథలు

## ఉద్యోగ పర్వము- ప్రథమాశ్వాసం

### 1. ఉద్యోగం

పాండవుల అజ్ఞాతవానకాలం పూర్తి అయింది. సక్రమంగా పూర్తి అయింది. ఆ మీదట అభిమన్యునకూ ఉత్తరకూ పెండ్లి వైభవంగా అయింది. బంధువులంతా విరాటనగరంలోనే ఉన్నారు.

అంతా కూర్చొని ఉన్న సమయంలో శ్రీకృష్ణుడు వారితో అంటాడు. — మీరంతా ఈ పాండవుల సంగతిని ఆలోచించాలి. వాళ్ళు శకునిచేత కపట జ్యూతంలో ఓడించబడినా రాజ్య భ్రంశాన్ని ఒప్పుకొని అరణ్యవాసం అజ్ఞాతవాసం వహించి ఇప్పుడు బైటపడ్డారు. వీరికి కౌరవులతో యుద్ధంరాకుండా వీరి రాజ్యం వీరికి ఇవ్వడం జరిగితే ద్యూతానికి సంబంధించిన సంవిద పూర్తి అవుతుంది.

పూర్వం ధృతరాష్ట్రుడే రాజ్యం చెరినగంగా పంచి పాండవులకూ కౌరవులకూ ఇచ్చి ఉన్నాడు. వీరికిచ్చిన భాగం పాండురాజు జయించిన భాగం, ఇప్పుడీ విషయంలో కౌరవులకు కర్తవ్యంచెప్పి వీరి పాలు వీరికిప్పించాల్సి ఉంది. అలా కాకపోతే పాండవులు తమ బలం ప్రదర్శించాల్సి వస్తుంది. దుర్యోధనుడు సూదిమొన మోపిన మేరైనా వీరికి రాజ్యమివ్వనంటున్నాడు. వీలయితే వీరిని చంపేస్తానంటున్నాడు. యుద్ధమనేది కలిగితే వీరి తరఫునా వారి తరఫునా కూడా అనేకులు చేరి, యుద్ధంచేసి నశించడానికి దోహదమవుతుందేమో. ఎవరినైనా వారిద్దకు కర్తవ్యం చెప్పడానికి పంపడం మంచిదనిపిస్తుంది" అన్నాడు.

బలరాముడు అంటాడు అవును పంపాలి, ఆ వెళ్ళిన వ్యక్తి కౌరవుల్ని తిట్టి కార్యం చెడగొట్టే వాడుగా వుండరాదు ఎంతవాళ్ళు దుర్మార్గులని మన మంటున్నా జూదంలో ధర్మరాజు సాహస పూర్ణమైన పందెం వేయడమే ఈ అరిష్టానికి కారణం. శకునికి అక్ష విద్య తెలుసు గనుక గెలిచాడు, తనకు రాదుగనుక ధర్మరాజు ఓడిపోయినాడు. ఇప్పుడిక వాళ్ళు అధర్మపరులని నిందించరమెందుకు? ?

సాత్యకి మాటనందుకొని, అదేమ్మాట! ధర్మరాజు వేడుకకోసం జూదమా లేదు. వారు బలవంతం చేసి ఆడించారు. పైగా కపటంతో ఆడారు, అది న్యాయ మెలా అవుతుంది? పాండురాజు జయించిన రాజ్యం ఎప్పుడూ పాండవులదే. కౌ వుల వద్దకు అడుక్కోడానికి వెళ్ళినట్లు వెళ్ళాల్నా?.... వాళ్ళ వీళ్ళ రాజ్యం! కివ్వకపోతే నా ఆయుధాలతో వాళ్ళను నిర్జించి మరీ ఇప్పిస్తాను. ఈ భీమార్జునుల కవలు, పాంచాలురు, వృష్ణివరులూ ఉన్నారు గదా! మత్స్యరాజున్నాడు. ధృ రాష్ట్రుడు మర్యాదగా వీరి రాజ్యం వీరికిస్తే తప్ప ఎక్కువ తక్కువలు మాట్లాడి ఆ ఫలితాన్ని అతడనుభవింపకపోడు.

ద్రుపదుడు కల్పించుకొని "అనువు, దుర్మార్గునికి చెప్పే మెత్తని మాటలవ వారికి మదమెక్కించటమే అవుతుంది గాని వారికి ప్రసన్నతా మహిమ కలుగద అక్కడ కుట్రచేసి సంధి చెడగొట్టే కర్ణుడు మొదలైనవారే ఉన్నారుగాని ధర వరులులేరు. మా పురోహితుని రాయబారిగా వంపుదాముగాక. ఐనా మనక సహాయం చేసే వారిని అర్థించి మనవైపు చేర్చుకొనాలి. రెండు విధాలా ప్రయత్న చేయడం అత్యవసరం" అన్నాడు.

అక్కడున్న వారంతా ఇది విని చాలా సంతోషిస్తారు. యుద్ధమే నిశ్చయ మయితే మాకు కబురు పంపండి. మేమంతా సహాయం వస్తాము అంటారు. ఇ పర్యవసానంగా అంతా తమ తమ నెలవులకు వెళ్ళడానికి నిశ్చయించి వెళ్ళిపోతారు

ద్రుపదుడు తన పురోహితుని పిల్చి "మీరు వెళ్ళి, ఒక్క ధృతరాష్ట్రునితో మాత్రమేగాక, భీష్ముడూ ద్రోణుడూ ఇతర సజ్జనులైన వారితో మాట్లాడి కౌరవు చేస్తున్న దుర్మార్గం చెప్పి ఈ కులాంతరితమయిన తగాయిదాను తీర్చవలసిందని చెప్పు. కులవైరం పెద్దలు తీర్పుచేయటం భారతీయ సంస్కృతి, దానికి భిన్నంగా మొరాయించిన వారి కులాలు యుద్ధంలో నశించిపోవటం తథ్యమని పూర్వుల నమ్మకం" అన్నాడు.

ఇప్పుడు ఎవరికి వారె గొప్పవారమనుకొంటూ పెద్దల నాశ్రయించే అలవాటు వదులుకొన్నారు. పెద్దలూ కలిగించుకోరు. నశించేవారు నశిస్తారుగాక మన కేమన్న భావం ఎక్కువ ప్రకటితమవుతున్నది ప్రపంచంలో. అందుకే రహస్యంగా చంపటం ఇళ్ళు తగులబెట్టటం బందిపోటు చేయడం దుశ్చర్యలు నడుపటం ఎక్కువవం పోతున్నాయి. న్యాయమని ఆక్రోశించేవాళ్ళు మాత్రం కోర్టుకెక్కి చివరకు నెత్తి

గుడ్డ వేసుకొని తిరుగుముఖం పట్టుతున్నారు. అయ్యో; అయితే ఇక నెలా" అనిపిస్తుంది గాక. దానికి సమాధానం "మనుషుల మనసులు మారాలి" అనే. కాని "ఎలా మారటం" అనే దానికి సమాధానం లేదు. కేవలం సాధన తప్ప.

ద్రుపదుడు చెప్తున్నాడు:— "నీవు అక్కడ ఉన్నన్నాళ్ళూ రోజూ అక్కడి సంగతులను నాకు సమాచార మందిస్తూ ఉండు. దుర్యోధనుడు సంధి కొడబడితే అది మనం మేలుగానే భావిద్దాము. ఒడంబడకపోతే యుద్ధానికి సిద్ధమే. రెండు పక్షాలకూ శాంతి కలుగడమే మన ఇచ్ఛ". ఇదే సాత్త్వికుల ఇచ్ఛ అనేది గమనీయం.

ఆ తరువాత ద్రుపదుడూ, పాండవులూ యుద్ధసన్నాహాలు చేయడానికుపక్రమిస్తారు. ఈ సంగతిని దుర్యోధనుడు విని, వెంటనే తనకు స్నేహితులయిన రాజులందరకూ సందేశాలు పంపుతాడు.

అత్యంతమైన పలుకుబడి గలవాడు అప్పట్లో శ్రీకృష్ణుడు. ఆయన సహాయం అర్థించడానికి గాను అర్జునుడూ, దుర్యోధనుడూ కూడ ద్వారకకు వెళ్తారు. ఎవరు ముందు అర్థిస్తే వారికి మాటయిచ్చి ఆ ప్రకారం వారికే సహాయం చేయడం యోధులకు ఆ రోజుల్లో మామూలు. అదేమిటి ధర్మాఽధర్మాలు మాట్లాడరా అని ఆశ్చర్యపడవద్దు. ఆ స్థితి దాటి యుద్ధం నిశ్చయమయితేనే సహాయం అర్థించేది. ఇక ధర్మాధర్మాలు లేవు జయాపజయాలె ఉన్నాయి.

అర్జునుడు శ్రీకృష్ణుని మందిరం లోపలకు వెళ్ళి ఆయన నిద్రపోతున్నాడని చూచి లేపకుండా కాళ్ళవైపు కూర్చున్నాడు. దుర్యోధనుడూ వచ్చి తలవైపున కూర్చుంటాడు. శ్రీకృష్ణుడు నిద్రలేచి వరుసగా చూసి ఇద్దరూ సహాయాన్ని అర్థించడానికే వచ్చారని తెలిసి, చిరునవ్వు నవ్వుతాడు. చివరకు సైన్య విభాగంచేసి, ఇద్దరకూ సహాయం చేయాలని నిర్ణయిస్తాడు. ఎలాగంటే తనతో సమానమయిన శరీరబలం కలవారు పదివేలమంది ఒక ప్రక్కనూ, తాను శరీరబలం యుద్ధంలో ఉపయోగింపక కేవలం తెలివితేటలు మాత్రం ఉపయోగిస్తూ రెండో ప్రక్కనూ ఉండేట్లు విభాగం చేశాడు.

రెండూ సమానమెలా అవుతవి? అనే శంక ఉదయించవచ్చు. ఆ రోజుల్లో శరీరబలంకంటే మనోబలం బుద్ధిబలం పదివేలరెట్లు ఎక్కువ అనే అంచనా ఉండేది—అందుకని అవి రెండూ సమానమైన బలాలుగానే గమనించారు. నిజానికి

దుర్యోధనుడు తనకె ఎంపిక చేసే హక్కు ఇచ్చినట్లయితే పదివేలమంది వ
ఎంపిక చేసేవాడు. ఆ ఎంపిక హక్కు అర్జునునికిచ్చినందుకు కొంచెం వ
పడ్డాడు. కాని అర్జునుడు శ్రీకృష్ణునే ఎంపిక చేయటం గమనీయం.

అర్జునునకు తన బాహుబలంమీద అత్యంతమైన నమ్మిక. పదివేలమం
నారాయణాభిధానులయితే మాత్రం తనకు లెక్కా? కాని శ్రీకృష్ణుని మనోబలం అచింత్య
మైనది. అది తనకు రక్ష. వెంటనే ఆపక్షాన్నే ఎంపిక చేశాడు.

ఇది దుర్యోధనునికికూడ అత్యంత సంతోష విషయమైంది. ఎందుకంటే
అతడి దృష్టిలో కర్ణుని తెలివితేటలముందు — తన తెలివితేటలుసహా — అందరి తెలి
తేటలు దిగదుడుపే. అందుకని నారాయణాభిధానుల బలమె తనకు మంచిదని సంతో
షించాడు.

ఏమయినా శ్రీకృష్ణుని ఆశ్రయించిన ఇద్దరూ ఎంతో పుష్కలమైన సంతో
షాన్ని పొందారు. శ్రీకృష్ణుని దివ్యత్వం ఎలాటి సంతోషాన్నిస్తుందో ఆలోచించి
కొద్దీ ఆనందబాష్పాలు వస్తయి.

## 2. శల్యుడు

దుర్యోధనుడు అక్కణ్ణుంచి వెళ్ళి బలరాముని చేరి సహాయమడుగుతాడు.
కాని బలరాముడు తాను యుద్ధంలో పాల్గొననని అదే తాను దుర్యోధనునకు చేయ
గలిగిన సహాయమనీ చెప్తాడు. దుర్యోధనుడూ సంతోషిస్తాడు ఈ సందర్భంలో
కూడ.

ధర్మరాజు మద్ర దేశాధిపతియైన శల్యుడికి సహాయంకోసం కబురంపుతాడు.
ఆయన మాద్రికి అన్నగారు. మేనమామ వరుసవాడు. ఆయన బయలుదేరి పాండ
వుల్ని కలవాలని ఉపప్లావ్యానికి ప్రయాణం చేస్తుంటాడు. దోవ ఎడారులద్వారా
ఉంది. దుర్యోధనుడు ఈ సన్నివేశం తెలిసి, స్వయంగా వెళ్ళి దోవలో అనేక
ప్రదేశాల్లో చలివేంద్రాలు శీతలకర సౌకర్యాలూ, మనోహ్లాదైక మధురిమలూ కల్పించి
శల్యుని సంతోషపెట్టుతాడు. శల్యుడు ఈ ఉపచారాలు చేయిస్తున్న వారెవరో
తెలిసికోకుండానే "నాకోసం ఇంత శ్రమపడి చేస్తున్న మంత్రి పుంగవుడెవరో అతడి
కేం కావాలంటే అది ఇచ్చేస్తాను" అంటాడు. వెంటనే అప్పటివరకూ ప్రచ్ఛన్నంగా

వేషంలో ఉన్న దుర్యోధనుడు సహాయం చేసే వరం ఈయమంటాడు. శల్యుడు తప్పనిసరిగా అందుకు అంగీకరిస్తాడు. కాని తాను ధర్మరాజును కలిసిన తరువాతనే వచ్చి దుర్యోధనుని పక్షంలో చేరుతానని చెప్పి ఉపప్లావ్యానికి పోతాడు. దీనర్థ మేమని. గట్టిగా ధర్మరాజు మాతో ఉండి తీరాలంటే ఉండక తప్పదనా అర్థం? లేకపోతె తానుకూడ శ్రీకృష్ణుడల్లె తన బలగం సగంచేసి పాండవులకు ఇవ్వాల్సి వస్తుందనా? ఏదో ద్వైదీభావముంది!!

తరువాత ధర్మరాజును కలిసి, ఇలాఇలా జరిగింది అని తాను దుర్యోధను పక్షంలోనే ఉండి యుద్ధంచేయాల్సి వచ్చిందనీ నొచ్చుకొంటాడు. ధర్మరాజుమాత్రం "నీవేలాటి చింతగాని ఆ విషయంలో పడకు, యుద్ధం అన్న తరువాత ఎవరెక్కడ యుద్ధం చేశారనే ప్రసక్తి అనవసరము. ఐతే ఒకానొక విషయంలో నీవు మాకు సహాయం చేయగలవు. ఆ అవకాశం వస్తుంది. అర్జునుడికి శ్రీకృష్ణుడు రథసారథి. రథసారథులలో అంతటి చాకచక్యం నీకుతప్ప ఇంకెవరికీ లేదు. కర్ణుడు నీ సహాయాన్ని తెప్పించుకొనే అవకాశం రావచ్చు, నీవు అంగీకరించేటప్పుడే నీకున్న వాక్స్వాతంత్ర్య విభవానికి అడ్డులేకుండా చూసుకొని, అర్జునుని రక్షించాల్సింది. అదెలాగంటావేమో? కర్ణుడు యుద్ధంచేస్తున్నప్పుడు వాని ఏకాగ్రతకు భంగం కలిగించే మాటలు చెప్పటం ద్వారా అర్జునుని రక్షించు" అన్నాడు. శల్యుడు ఆ పరిస్థితుల్లో అందుకు అంగీకరించుతాడు.

శల్యుడు ధర్మరాజును అరణ్యవాసం తరువాత కలువడం ఇదె మొదలు. అంతకష్టం అనుభవించినవాళ్ళను పరామర్శించటం బంధువుల బాధ్యత. ఈ అర్థ్రి బుద్ధి కలిగిన శల్యుడు ధర్మరాజు అడిగిన అభ్యర్థనను కాదనలేకపోయినాడు. ఐనా యథాతథంగా తాను సారథిగా ఎందుకు పనిచేస్తాడు? అందుకు తాను ఒప్పుకొనకనే పోవచ్చు. అందుకని ''సరెలె"మ్మని సమాధానమిచ్చి తరువాత పరామర్శ చేస్తాడు.

"మీరు ఎన్నో కష్టాలు పడ్డారు. ఒక్కొక్కప్పుడు అలాటి స్థితులు తప్పవు— దేవతలకైనా—

''వాసవుడు తొల్లి నిజకాంతా సహితముగాక నధిక దైన్యము నొందెన్,
మీ సంపద పెద్దయె విధిసేసినగతి ఖదయకుండ శివునకు వశమే,"

ఇంద్రుడే భార్య యెడబాటు సహా ఎన్నో కష్టాలు అనుభవించాల్సి వచ్చింది. ఆ ఇతిహాసం చెప్తాను విను—

''త్వష్ట అనే మునికీ ఇంద్రునకూ పడలేదు. త్వష్ట అప్పుడు విశ్వరూపుడనే మూడు తలలవాణ్ణి సృష్టిస్తాడు. అతడు జాగ్రత్ స్వప్న సుషుప్తిలు అనే మూడవస్థల్లో ఆ తలలతో తపస్సు చేస్తున్నాడు - ఇంద్రపదవికోసం. ఇంద్రుడిది సహించక రహస్యంగా వచ్చి ఆ మూడు తలలనూ త్రుంచివేస్తాడు. అందువల్ల అతడికి బ్రహ్మ హత్యా పాతకం సంక్రమించింది. బ్రహ్మతత్త్వం శరీరమనో బుద్ధులతో అనుభూతి చేసి మోక్ష స్థితిని పొందటం ఇంద్రునికైనా త్వాష్టుడికైనా కర్తవ్యమై ఉండగా దానిని చెడగొట్టినప్పుడు పాపం వస్తుంది. బ్రహ్మతత్త్వ సాధకుడ్ని చంపినందుకు పెద్దపాతకం రాకేం చేస్తుంది? భూతాల ఆక్రోశం ఎక్కువైంది అతడికి, దానిని తట్టుకోలేక ఏదో కష్టతరమైన వ్రతం జరిపి, తన పాప ఫలాన్ని సముద్రానికీ, చెట్లకూ భూమికీ స్త్రీలకూ పంచి అందుకు ప్రతిగా వారికి తానేవో వరాలిచ్చి సమాధాన పడుతాడు.

త్వష్ట మళ్ళీ కోపించి, వృత్రుడనేవాణ్ణి పుట్టించి, వెళ్ళి ఇంద్రుణ్ణి జయించుమంటాడు. త్వష్ట నియమశీలి - ఇంద్రుడు అంటె మనసు. మనసును నియమించాలని నియమశీలి అనుకోవటం అసలైన సంగతి. అప్పుడు వృత్రుడు నోరు తెరుచుకొని వచ్చి ఇంద్రుణ్ణి మింగేస్తాడు. కాని వానిలోపలనె ఇంద్రుడు కొంతసేపుండి వృత్రుడావులించిన సమయాన తిరిగి సూక్ష్మరూపంలో బయటకు వస్తాడు. యుద్ధం చేస్తాడు. ఐనా ఓడిపోతాడు. చివరకు వృత్రునితో సంధిచేసికొంటాడు. అతడికి అందుకుగాను మునులు ఒక వరమిస్తారు. ఏమనంటే ఆర్ద్రమైన దానిచేతగాని, శుష్కమైనదానిచేతగాని, తరుపాషాణ శస్త్రాస్త్రములతో దేనిచేతగాని, వృత్రుడు చావకుండా వరమిస్తారు.

కొంతకాలానికి ఇంద్రుడు ఆర్ద్రమూ శుష్కమూ కానట్టి సముద్రపు నురుగు కనుపడగా దానిని తన కత్తికిపూసి, నారాయణమూర్తి నందు ప్రవేశింపజేసి, వృత్రుని జయిస్తాడు. కాని వృత్రుడు చచ్చిన కారణాన బ్రహ్మహత్య తిరిగి ఇంద్రునికి కలిగింది. భూతచయం చలములో వానిని నిందించడ మారంభించింది. ఇంద్రుడు నిషధాచలం పారిపోయినాడు. ఇంద్రపదవిలోనికి మునులు నహుషుని పిల్చి తెచ్చి నిలుపుతారు.

ఇంద్రుడు వెళ్ళి ఎక్కడో ఉత్తరాన సరస్సులో ఒక పద్మనాళంలో దాక్కొంటాడు. శచీదేవి కష్టాలు వెంటనే ప్రారంభమవుతాయి. నహుషుడు తానింద్ర పదవి నధిష్టించాడు గనుక శచీదేవి కూడ తనవశం కావాలంటాడు. ఆమె బృహస్పతిని శరణు జొచ్చుతుంది. బృహస్పతి ఆమెను కొంత కాలంపాటు వ్యవధిని నహుషునివద్ద కోరుమంటాడు. అందుకామె నహుషుని ఒక సంవత్సర కాలవ్యవధికి గాను అభ్యర్థిస్తుంది. నహుషుడు అంగీకరిస్తాడు.

ఈ సంవత్సర కాలంలో ఇంద్రుణ్ణి వెదకి పిలిపించి అశ్వమేధ యాగం చేయిస్తారు అతడు బ్రహ్మహత్యనుండి బయటపడాలని. అలా అతడు తప్పించుకొన్న వాడైనా నహుషునివంక చూడలేనివాడై తిరిగి వెళ్ళి దాగొంటాడు. సంవత్సర కాలం అయిపోతున్నదని శచీదేవి ఉపశ్రుతి అనే దేవతను ఆరాధిస్తుంది. ఉపశ్రుతి ప్రత్యక్షమై శచీదేవిని తీసికొనిపోయి మంజుతరం అనే పర్వతంమీద నూరు యోజనాలు దాటి అక్కడి సరస్సులో పంచ వర్ణాత్మకమైన కమలనాళం చీల్చి అందులోంచి వెళ్ళి సూక్ష్మ రూపంలో వున్న ఇంద్రుని చూపి తానదృశ్యమవుతుంది. ఇదేదో సహస్రారంలోనున్న ఒకానొక ప్రకాశమైన తేజస్సును వెదకినట్లుంది. అంతరార్థమేమిటో దీనికి భగవంతుడె అనుగ్రహించాలి.

ఇంద్రుడు శచీదేవిని హఠాత్తుగా అక్కడ చూసి కంగారుపడిపోతాడు. అప్పుడంటాడు: "నీవు కష్టాల్లో వున్నావని తెలుసు. ఐతే కాలం కలిసిరావాలని చూస్తున్నాను. మొన్న నే నొచ్చినప్పుడు నహుషుని తేజస్సుని కళ్ళెత్తి చూడలేక పోయినాను. ఇప్పుడు నీవొక పనిచెయ్యి. ఆ నహుషునికి కబురంపు. నిన్ను పొందాలనే ఉద్దేశ్యం ఉన్నట్లయితే పల్లకీ నెక్కి దానిని బ్రాహ్మణులూ, మునులూ అయిన వారిచేత మోయించుకొని రమ్మను. అతడలా చేస్తే అతడి పుణ్యం క్షయమవుతుంది" అంటాడు.

ఆమె వెళ్ళి అలాగే నహుషునకు కబురంపుతుంది. నహుషుడు అలా నడుచుకోవడానికి ప్రయత్నిస్తూ క్రింద మోస్తూ వెళ్తున్న అగస్త్యుని కోపంతో తన్నుతాడు. పుణ్యం క్షయించింది. వెంటనే పాముగా శపింపబడుతాడు. మునులు బృహస్పతి ఇంటికి వచ్చి శచీదేవికి ధైర్యం చెప్తారు. దేవతలు వెళ్ళి ఇంద్రుని తిరిగి తీసికొని వచ్చి పదవిలో నిలుపుతారు.

ఇంద్రుడు—అంటే మనసు– నిలవాలి ప్రపంచ రచనకు– చచ్చిపోతె కేవలం మోక్షమె– వ్యక్తికయితే. ఇంద్రుడు వట్టి మనసుకాదు. సమష్టి మనసు. అందుకని అతడె జయించాలి– దైవదృష్ట్యా-వ్యక్తిదృష్ట్యా కాదు ॥

ఈ కథ పేరు పురందర విజయము. శల్యుడీ కథను ధర్మరాజుకు చెప్పి ఈ కథ విన్న వారందరకూ సౌఖ్యాలే కలుగుతవనీ అందుచేత ఇక ధర్మరాజుకు వగవు అక్కరలేదనీ చెప్పి వెళ్ళిపోతాడు.

పురందర విజయాన్ని ఉపాఖ్యానంగా చెప్పడంలో ఒకానొక సత్య విషయం గర్భితమై ఉన్నదనిపిస్తుంది. ఇంద్రుడు నహు సర్వులూ కాలానికి కట్టుబడి ఉండక తప్పదనే భావమె ఆ సత్యం. ఎవరి తెలివి మేధ చాకచక్యం మహాత్మ్యం వారిదె. కాని ఎవరికివారు తమ కిష్టమైన విధంగా బ్రతుకుతామంటే మాత్రం కుదరదు. భగవంతుడికి లేదా కాలునికి లేదా పరిస్థితులకు వీటికి లోబడి మాత్రమె అవి ఉపయోగిస్తవనేది గమనీయం.

ఇంద్రుడు పెద్ద పదవిలోనివాడు. అతడికి కామ క్రోధాలుంటవి. తృష్ణకూ ఉన్నయి. మరి ఇలా ఎందుకు జరగాలి అనే దానికి సమాధానం అదృష్టమె. దానినె కాలమనీ భగవంతుడనీ అనటం. దానికి అంతా కట్టుబడి ఉండటమనేది తప్పనిసరి అనేది స్మరణీయం. నహుషుడూ దిగిపోవలసిన వాడె. అతనికి మదం విజృంభించి అగస్త్యుని తన్నిన క్షణాన చెడ్డకాలం అతడికి ఆరంభమయిందని తెలిసికొంటాము. కాలం కారణంగా దిగిపోయినాడా– ప్రవర్తన మారింది కనుక దిగిపోయినాడా అనేది శంక. ఈ రెండూ రెండుగా చూసినంత సేపూ సమస్య తీరేదికాదు. విత్తు ముందా చెట్టు ముందా వంటిదె ఈ సమస్య కూడా. విత్తుకూ చెట్టుకూ తేడా లేదని తెలిసినప్పుడు ఆ సమస్య విడిపోతుంది. అలాగే ప్రవర్తనలో కలిగే తేడాయే కాల ప్రభావం అని తెలిస్తేగాని ఈ చెడ్డ అనేంని సమస్యా తీరదు.

## 3. సాంగత్య సాధనం

ఉద్యోగమంటే, ఉత్ + యోగం అని విడదీస్తే సాత్త్విక వృత్తికి ప్రతీకలైన పాండవులు మోక్షసాధనలో ఇంకా ఎన్నో సాత్త్విక వృత్తులను సమకూర్చుకొని యోగశక్తిని ఉచ్చస్థితికి కొనిపోవటమనె వ్యాస మహర్షి చెప్పిన సందేశమనిపిస్తుంది.

రెండు వృత్తులనూ తనలోపలే కలిగి యున్న సాధకుడు కొన్ని సిద్ధులను మాత్రమె సాధనచేయడం ఒకరకం. అలాటప్పుడు సాధనచేసే సమయంలో దుర్వృత్తులు రాకుండా చూసుకొంటాడు. కాని నిర్వృతి తత్త్వాన్ని చేరి (శ్రీకృష్ణుని చేరి) సత్సాంగత్యం జరపడంవల్ల ధర్మరాజు మోక్షాన్ని మాత్రమే ఆశ్రయించిన వాడు. ఇది రెండో రకం. ఈ మార్గంలో ఏ మాత్రపు దుర్వృత్తుల్ని మిగుల్చుకొన్నా మోక్షం అసంభవం. కేవలం స్థైర్యం — శమం— అనే పరాక్రమంతో సాత్త్విక వృత్తులు దుర్వృత్తుల్ని గెలవాలి. ఈ మార్గాన్నె కృష్ణుడు నొక్కి చెప్తుండటం ముందు ముందు వింటాం.

కాని విరాట్ నగరులోని సదస్సులో మాత్రం ద్రుపదుని ప్రతిపాదన ప్రకారం రెండు విధాలుగానూ ప్రయత్నించి సాధన చేయాలనేదాన్ని నెగ్గింపజేయడం జరిగింది. అది నిర్ణయించడానికి కూడ సాధకుడు కొంత అనుభవం పొందాలని వ్యాస మహర్షి అర్థమేమో.

నిర్వృతి తత్త్వాన్ని (శ్రీకృష్ణుని సాంగత్యం) పొందటం ఉద్యోగ పర్వంలోని ఆధ్యాత్మికమైన మెట్టు.

## 4. సంజయ రాయబారము

ఉపప్లావ్యంలో పాండవులూ హస్తిపురంలో కౌరవులూ యుద్ధానికి ఆయత్తమవుతూ ఉంటారు. పాండవులతో సాత్యకీ ధృష్టకేతుడూ జరాసంధ పుత్రుడయిన సహదేవుడూ కేకయ రాజూ ద్రుపదుడూ మత్స్యరాజూ పాండ్యరాజులూ చేరి ఏడక్షౌహిణీల బలమయినారు. కౌరవులలో భగదత్తుడూ శల్యుడూ సదక్షిణుడు జయద్రథుడు మొదలైనవారు చేరి పదకొండక్షౌహిణులయినారు.

ద్రుపద పురోహితుడు హస్తిపురి చేరి ధృతరాష్ట్రుని కృపుని ద్రోణుని భీష్ముని వేరు వేరుగా కలిసి తిరిగి ధృతరాష్ట్రునికి సభలో ఇలా చెప్పాడు—

"ధృతరాష్ట్రా! పాండు రాజ సుతులూ నీ సుతులూ వారి వారి ఆస్తులను తీసికొనడం ఉచితమయినపని. అలాగాక ఒకవేళ బాహుబలంచేత రాజ్యం సంపాదించాలంటే ఎవరికీ ఏ సూక్తి చెప్ప పనిలేదు. కాని మీరు వంచనచేత పాండవుల రాజ్యాన్ని పుచ్చుకొన్నారు. ఇదేం న్యాయం! వారి స్త్రీని సభలో అవమానించి వారి

సంపద పుచ్చుకొని వారిని అరణ్యాలపాలు చేశారు. దీనులుగా చూచి చుల్కనగా మాట్లాడారు. కౌరవుల ఈ అపరాధాన్ని పాండవులు వదలివేశారు. పగ పెట్టుకొనటల్లేదు. తమ రాజ్యం తమకీయవలసిందన్న దొక్కటె ఇప్పటి మాట। అది చెల్లకపోతే మాత్రం యుద్ధం జేస్తారు మీతో.

పదకండక్షౌహిణీల బలముంది ఫరవాలేదనుకొంటున్నారేమో। భీముడూ సాత్యకీ యుద్ధంలో వేల అక్షౌహిణులకు సమానమనేది మరువద్దు. అర్జునుడ్ని ఎదిరింపగలిగే వారెవరు? శ్రీకృష్ణుడే వారి పక్షమనే సంగతి మరువకలిగిన విషయం కాదు. అందుచేత అవకాశం తప్పిపోకుండా పాండవులకు కబురంపి వారి రాజ్యం వారికివ్వాల్సింది. మనందరకూ మేలవుతుంది" అన్నాడు.

అప్పుడు భీష్ముడు చెప్తాడు. "ధర్మరాజు అలా కేవలం తమ భాగం మాత్రం అడిగి సంధి కావాలంటం మేలు. తమకు మీరు చేసిన ఎగ్గులు మనసులో పెట్టుకొనక పోవటం ఎంత మంచితనం। అర్జునుడు అలిగివస్తె ఎదుర్కొగలిగేదెవరు? ఇంత అయింతర్వాత కూడ సంధికి ఉపపాదించటం ధర్మరాజు ధర్మవృత్తానికి రుజువు". అన్నాడు. కాని, కర్ణుడు:- "మనం చేసిన తప్పేమిటి? శకునితో ధర్మరాజే ఓడిపోయాడు. సిగ్గులేక మళ్ళీ వచ్చి రాజ్య మిమ్మంటున్నాడు— అప్పుడే యుద్ధ నన్నాహాలారంభించాడు— అటడిదే తప్పుగాని మనకేమి?" అంటాడు.

బహుశా సంవిద ప్రకారం 13 సంవత్సరాలకే హక్కు అనేది వదిలి కర్ణుడు వచ్చి అబద్ధం ఆడాడు. రాజ్యాన్ని పూర్తిగా వదులుకోవటం కాదు అప్పటి పందెం. అలాంటి పందెం మొదటి జూదమాడినప్పుడు పెట్టుకున్నారు. కానీ ఆ రాజ్యాన్ని ధృతరాష్ట్రుడు తిరిగి ద్రౌపదికి వరం రూపంగా ఇచ్చివేశాడు. రెండవసారి జూదానికి పిల్చి 13 సంవత్సరాల పాటు రాజ్యంలో లేకుండా పోయి తిరిగి అజ్ఞాతవాసం తరువాత రావటం ప్రజ్ఞ. పాండవుల రాజ్యాన్ని కౌరవులు ఈ రెండోసారి జూదంలో గెలుచుకొనవలసి యున్నదనే ప్రసక్తి లేదు.

కర్ణుడు తాను మహా సత్యవంతుడనని చెప్పుకొనేవాడు. మహా దానపరుడనని కూడ అనేవారు. ఇక్కడ ఇంత వచ్చి అబద్ధం ఎందుకాడినావని ఎవరూ హెచ్చరిక చేయకపోయినా రెందుకనో!! బహుశా "వీడికి నిజాయితీ ఏమిటి? వట్టి కుట్ర మనిషి" అని ప్రతివారూ అనుకొని వదలిపెట్టి యుండవచ్చు.

భీష్ముడు మాత్రం "ఎక్కువ మాట్లాడ వద్దు" అంటాడు. "నీకు నేను ఉత్తర గోగ్రహణ సందర్భంలో చెప్పలేదా ఆ వచ్చింది అర్జునుడనీ అప్పటికే వాళ్ళకయిన కాంట్రాక్టు అధిక మాసాలతో సహ చెల్లిందనీని, కాంట్రాక్టు ఏమిటో తెలిసి కూడ మనలనందరనూ అర్జునుడప్పుడు గెలిచినాడు కూడ. నీవిలా పలకడం – బహుశా ఈ మహారాజు కొలువులో మాత్రమే చెల్లుతుంది కావలె" అంటాడు. ఎంత తీవ్రమైన విమర్శ రాజరికం మీద !

భీష్ముడు చేసిన ఈ విమర్శను చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. ఈ భీష్ముని అప్పటి పరిస్థితులలో అవసరమైతే కాళ్ళు పట్టుకొని మ్రొక్కి అయినా తమ పక్షంలో ఉంచుకొనటానికి దుర్యోధనాదులు సిద్ధంగా ఉన్నారనేది పరమ ముఖ్యమైన విషయం. అందుకే అంత తీవ్రమైన విమర్శ ఆయన నోట వచ్చిందనవచ్చు.

ఈ రాజరికపు దుఃస్థితి అంతా ఈ వచ్చిన ద్రుపద పురోహితునకు తెలిసి పోతున్నదని ఆ క్షణాన ధృతరాష్ట్రుడూ, కౌరవులూ కటకట పడతారు. అందుకని పైకి ధృతరాష్ట్రుడు ఇలా చెప్తాడు ఆ పురోహితునితో–

"బాబూ మేము ఈ సంగతి కూలంకషంగా ఆలోచించి సరియైన మనిషిని అక్కడకు పంపి మా మాటలు తెలియజేస్తాము. నీవు ప్రస్తుతం వెంటనే వెళ్ళాల్సింది" అంటాడు.

ఆ తరువాత కౌరవులు ధర్మరాజు వద్దకు సంజయుని రాయబారిగా పంపుతారు. ధృతరాష్ట్రుడు కేవలం ఒకే ఒక్క విషయం నొక్కి చెప్పి పంపుతాడు– 'యుద్ధం అనేది మాత్రం తలపెట్టొద్దని.' మరి దానికి ప్రతి ఫలంగా తాను ఏమైనా ఇస్తున్నాడా అంటే అలాంటిదేమీ చెప్పక కేవలం అంతా కలసి వుండటమే ప్రధానమంటాడు. అంటే ద్రౌపదిని పెళ్ళి చేసుకొని పాంచాల పురంలో పాండవులు వుండగా తాను పిల్చి వారిని రప్పించుకొని ఐదేళ్ళు తన ఇంట్లో ఉంచుకొన్నాడు గదా–అలాగే ఇప్పుడూ వారు తనతో ఉండాలెనని అర్థం.

ఈ మాటలు చెప్పేటప్పుడు భీష్మాది వీరులతో "అమ్మో యుద్ధం వస్తే వాళ్ళను–ఆ భీమార్జునులను జయింపగలిగేవారు ఎవరుగనుక–ఆ ధర్మరాజుకు కోపం వస్తే ఆపగలిగేవారెవరుగనుక" అంటాడు. పైగా ఒక సత్య విషయం చెపుతాడు. పాండుసుతులు దోషాన్వితులుకారు. ఈ దుర్యోధనునివల్ల ఇంత పుట్టింది అని.

"మనలనింక నమ్మ రనృతాత్ముల
న్యాయ పరులు గర్వులనుచు బాండుసుతులు
గూడి మనుట కియ్యకొ౦న
నేరరైనను ధర్మజుండు గలడు దగవునడువ."

మనం క్షమింపదగని దుష్టులమె అయినా ధర్మరాజుతో సంధిచేసికొంటే దానిని 'తు' 'చ' తప్పకుండ ఆయన నడిపిస్తాడుగదా అని ధైరం చెప్పకుంటాడు. ధర్మరాజుమీద ఈ పగవాడైన ముసలివాడికికూడ ఎంతనమ్మకమో!

సంజయుడు ఉపప్లావ్యం వెళ్ళి కృష్ణార్జునులను చూచి మరునాడు ధర్మరాజు ముందు సభకు వస్తాడు. తనను ధృతరాష్ట్రుడు పాండవులను పరామర్శించి రమ్మని పంపాడు అంటాడు. ధర్మరాజుకు తెలుసు—అది ముఖ్యంకాదని! రాయబారం పంపు తాను ఎవరితోనైనాను" అని కదా ద్రుపదుని పౌరోహితునితో చెప్పి పంపేశాడు. ధృతరాష్ట్రుడు ఇప్పుడే సంజయుడు చెప్పే మాటలన్నీ రాయబారాన్నే చెప్పతున్నవి అని ధర్మరాజుకు అర్థమయిపోయింది.

అందువల్ల ఎన్ని మాటలు సంజయుడు చెప్పాడో అన్నిమాటలకూ ధర్మరాజు దీటుగా తానూ నర్మగర్భంగా పలుకుతాడు. అంతా కౌరవులలో బాగున్నారా? కర్ణుడి మాట చెల్లుతున్నదా? భీష్ముని అంతా గౌరవిస్తున్నారా అని పరామర్శ చేస్తాడు. సంజయుడు అసలు విషయం కదిలించడానికి వీలుకాక ప్రత్యేకంగా, గాలి పీల్చుకొని "ఆ మాటల కేమిగాక నేను చెప్పే మాటలు విను" అని చెప్పదమారం భిస్తాడు:—

"ధృతరాష్ట్రుడు ముసలివాడైన కారణంగా దుర్యోధనుడి దర్పం తగ్గింప లేక మనసులో బాధపడుతున్నాడు! నీవు సౌమ్యంగా రాయబారిని పంపినందుకు ఇప్పుడు శాంతిగా ఉన్నాడు. నీవు నిజంగా అజాత శత్రుడవు. నీ తమ్ములు మహా బలవంతులు. అయినా మీరు శాంతమూర్తులు? నేను చెప్పవలసిన మాటలు ఈ శ్రీ కృష్ణుని ఎదుట అందరి ఎదుటా చెప్తానుగాక!

మీవంటి ధర్మజ్ఞులూ శాంతులూ చులకనైన పని చేయరాదనేది జ్ఞాపక ముంచుకోవాలి. దుర్యోధనుని కారణంగా మీ సత్కులానికి మసివంటి నింద అంటటం మంచిదికాదు. దానిని అలాకాకుండా చేయగలిగింది నీవే! బంధువుల

నందరనూ చంపేట్లు యుద్ధం చేసినట్లయితే జయంఅపజయం ఏదయినా సుఖాన్నివ్వ జాలదు అనగా– నీకు రాజ్యం ఏం ప్రయోజనమని ధ్వని! నీకు భీముడే పెట్టనికోట అర్జునుడున్ రణంబున దొట్టినమంట. ఈ గురువులైన భీష్మద్రోణ కృపాశ్వత్థామలు సుయోధనుని పక్షంలోనున్నవారని వారిని చంపుతావా? ఈ కలహం అందుచేత హితంకాదు. కనుక అసూయలు వదలి పెట్టండి. మీకందరకూ నేను నమస్కరిస్తాను. కోపం శాంతింపజేయండి"–అంటాడు.

ధర్మరాజు ఎంతో చాకచక్యంగా సమాధాని మిస్తాడు–నేను మాటాడిందాంలో స్నేహంకాక వేరే మైనా విన్నావా! సంజయా? భీమార్జునులైనా ప్రపంచహితం చేసేవాళ్ళేగాని దుష్కర్మలు చేయరే! చదురులేనివారెవరో మనసులో సుఖం కోరుతూ దుఃఖకరమైన పనులు చేస్తుంటారుగాక. భోగాలకోనమైనా వారితో వుందామన్నా వస్త్రమాల్యాను లేపాలు అయన మాకివ్వ దనను గాని – ఆనాడు మాకూ కొడుకులకూ కూడ బుద్ధి చెప్పలేకపోయినాడే! మేము గెల్చినప్పుడొక విధంగానూ ఇలా ఉన్నప్పుడొక విధంగానూ చూడటం న్యాయమా? తనకు రొట్టె ఇంకొకరికి ముక్కా అన్నట్లుండవచ్చునా? అతడి ప్రవర్తన నీకూ తెలియందికాదు. ఇంత దూరం వచ్చి నీవు అది మాట్లాడడం వ్యర్థమైన పని. జూదంలో వచ్చిన ధనం ఆసించరాదని విదురుడు చెపితే విన్నాడా? కర్ణశకునులెలా చెప్తే అలా చేశాడు గాని! ఇప్పుడు మళ్ళీ మేము వారితో చేరినా అంతే. మళ్ళీమాకు అలా వెళ్తే కౌర వుల అవినయమైన మాటలు కలుగుతాయని తెలిసి అంటున్నావో అమాయకంగా అంటున్నావో వెళ్ళి వాళ్ళను చేరండని! చెప్పలేకుండా ఉన్నాను.

కళ్ళు మూసుకొన్న కారణంచేత–ఆశ అనే పొగలోబడి యుద్ధానికి వచ్చిన క్షణాన, కపిధ్వజుడి ప్రతిభాకాంతికైనా అంధత్వం వదలకపోదులే. సద్గుణుడవైన నీవు వచ్చావు. సంతోషం. వాళ్ళు చేసిన ఎన్ని దుష్టచర్యలను సహించి క్షమిం చామో నీకు తెలిదా? ఇక ముందుగూడ ఇప్పటికి మేము గడించిన ప్రతిపత్తికి గౌర వానికి విప్రతిపత్తి లేకుండా ప్రవర్తిస్తాముగాక. మమ్మల్ని పిల్చి ఇదిగో ఈ రాజ్యం మీది అని యివ్వటం అతడికి ఉచితంకాదా?

సంజయుడు–"ధర్మరాజా! నేను చెప్పదలచిందొక్కటి ఉంది. నీ గొప్ప దనానికి కారణం నీ అహింస. కౌరవులు పాలు ఇవ్వకపోయినానరె– అహింసా పరుడవైన నీకు భిక్షాన్నమైనా మేలుగాని రుధిరాన్నం కోరదగింది కాదు. దుష్ట

ద్యూతంలో వాళ్ళు కొల్లగొట్టినా గంగిగోవులా నీ వడివికి పోయింది అందుకు కాద గన తీరా ఇన్నేండ్లు అయిపోయిం తర్వాత ఇప్పుడు యుద్ధంచేసి వెతికి వెతికి బంధువుల్ని మ చంపే స్థితికి నీవు దిగజారడం కోరదగింది కాదంటున్నాను.''

సంజయుడు చెప్పిన అహింసా సిద్ధాంత భావం నిజానికి పాండవులకే శ బాధింపకపోలేదు. ఇదె అర్జునుడి బుర్రలో నెలవేసి యుద్ధారంభంలో భగవద్గీ ప్రవచనానికి శ్రీకృష్ణుని కదిపింది. ఈ క్షణాన మాత్రం ధర్మరాజె సంజయునకి సమాధానం చెప్తున్నాడు —సంజయా

“..........అది యెల్ల నీపలికినట్టిద—ధర్మువులట్లయుండి బో

ధనులరయంగ వచ్చిన నధర్మములై చెడుగొన్ని ధర్మవ

ర్తనములుగాకతోచి తుది ధర్మములై చను గొన్ని కర్మముల్.”

కొన్ని పనులు ముందు ధర్మాలుగా అవుపడి చివరకు అధర్మాలవుతవి. కొ ముందు అధర్మాలై తరువాత ధర్మాలవుతవి. అందుచేత నేచేసింది అధర్మ దానికి పూర్వం నిరూపించి మరీ దూషించు. అహింస ధర్మమె. సందేహం లేదు. కాని లోకకంటకులూ పాపాత్ములూ అయిన వారిని నిర్మూలనం చేయటం ధర్మమె. రాజులు యుద్ధం ద్వారా దుర్మార్గుల్ని చంపి ప్రజల్ని వారే దుర్మార్గంనుంచి రక్షిం చాలి. అది కర్తవ్యం. శ్రీకృష్ణు డున్నాడు. ఆయన్నడుగు నాకది కర్తవ్యమో కాదో! అది కర్తవ్యమైతె నన్ను లోకం ఏమనుకుంటుందనే ప్రసక్తి ఎందుకు! కర్మయోగ సారాంశమంతా పిండీకృతం చేశాడు ధర్మరాజు.

శ్రీకృష్ణుడు అప్పుడు పర్యవసానం చెప్తాడు— సంజయా! ధర్మరాజు మాటలు విన్నావుకదా! సంధి పొసగే అవకాశమేదీ కనిపించటల్లేదు. దుర్యోధనుడు దుర్మార్గుడు. ధృతరాష్ట్రుడు ఏమో మాటలు చెప్పినంత మాత్రంచేత వీరిపాలు వీరికివ్వకుండా వివాదం తీరుతుందా? తమపాలు తమకిస్తే స్నేహంగా ఉంటాననడం వీరి ఓర్పుకు ప్రతీక. ఇంకొకరయితె కార్పణ్యంకొద్దీ ఘోర యుద్ధం లేవదీయరా! నా ఉద్దేశ్యంలో వీరు అన్న వస్త్రాలకుగాను వాళ్ళల్లో కలిసి ఉండటం మేలుకాదు వాళ్ళు అడుక్కొని తినేవారు వారుకారు. వాళ్ళు క్షత్రియులు. చెడుచేసినది కౌరవులు

గనుక వారికి చెప్పు నువ్వు నీతి. ఎంతమంది పూర్వంజూదమాడలేదు. ఇంతటి అవమానకరమైనవని ఎవరైనా చేస్తారా?

శ్రీకృష్ణుడు ఉద్రేకం పెంచి మాట్లాడుతున్నాడు. అక్కడి అందరికీ కోపాలు పెరుగుతున్నయి. కర్ణుడిలా అన్నాడట. దుశ్శాసనుడిలా చేశాడట. సభలో ఒక్కడైనా ధర్మం చెప్పలేదట ఆ ప్రవర్తనలవల్ల ఇంకా వీళ్ళ గుండెల్లో గాయాలు రేగుతూనే ఉన్నయి. ఈ మాటలకు సభాసదులు కుతకుతలాడిపోతున్నారు. దోవ దొరకటల్లేదు. ఇంకా కృష్ణుడంటున్నాడు ఇక సంధెలాగయేది? అందుచేత—

అప్పటికి గాలిపీల్చుకొన్నారు జనం ఏం చెప్తాడో విందామని— "నేను అక్కడకు వచ్చి సంధికి ప్రయత్నం చేస్తాను. సంధి కుదిరినా కౌరవులు తాము చేసిన పాపాలకు పరిష్కృతి లేకుండా పోదనేది మాత్రం జ్ఞాపకముంచుకొను. పాండవ బాణాగ్నికి కృశింపకపోయినా వారు లోభమనే చిచ్చులోబడి చస్తూనే ఉన్నారనే సంగతిని గమనింపుమను. పాండవులు ధర్మమహాతరువు. దానికి వేదాలూ నేనూ మూలం. కౌరవులు రోషమహాతరువు. దానికి అసారమైన ధృతరాష్ట్రుడు మూలశక్తి. నేను మాత్రం రాయబారానికి వస్తున్నానని చెప్పు" అంటాడు.

సంజయునకు పెద్దభారం తీరింది. తన రాయభారంతో సంధి చెడినట్లుగాక ఇంకోరాయబారం శ్రీకృష్ణుడు నడుపటం అతడికి హృద్యమయింది. అందరికి నమస్కరించి వెళ్ళివస్తానంటాడు.

ధర్మరాజు కొన్ని పలుకరింపు సందేశాలు కౌరవులలోని వారందరికి పేరు పేరునా పంపుతాడు సంజయునిద్వారా, ధృతరాష్ట్రునికి — మేము మొత్తం రాజ్యం మాకివ్వమన్నా అది అధర్మం కాజాలదనేది గమనింపుమని చెప్పుమన్నాడు. 'భీష్మునితో — "శంతనువంశం నడిలోచిక్కి నశించకుండా అధర్మంనుంచి రక్షించాల్సిం" దని చెప్పుమన్నాడు. దుర్యోధనునితో "మావంటి బలవంతుల్ని ఉపేక్షించటం తెలివితక్కువని తెలిసికొనుమను.పాత స్పర్థలు వదలివేశామనిచెప్పు. మా ప్రక్కన ప్రత్యేకంగా ధర్మమనేది సహాయంగా ఉండటంచేత అధర్మపక్షమైన మీరు గెలువలే"రని చెప్పు అన్నాడు. అన్నిటినీమించి అఖిలలోక సేవితుడైన శ్రీకృష్ణుడు మాకు ప్రాపు ఉన్నాడని తెలిసికొనుమను. చివరిమాటగా కుశస్థలము, వృకస్థలము, వానంతి,వారణావతములయినా కనీసంగా మాకీయవలసింది. లేదా మా ఐదుగురకూ ఐదూళ్ళియవలసిం"దని చెప్పు అన్నాడు.

సంజయునకు ధర్మరాజు బుద్ధికి తలముక్కలయినంతపనయింది. అర్జును కూడ సంజయునితో బాల్యక్రీడ విషయాలు జ్ఞాపకం చేసి సమాదరించుతాడు సంజయుడు సెలవు తీసికొని వెళ్ళిపోతాడు.

ఆధ్యాత్మిక సందేశం ఈ కథలో ఏమంటే ధర్మరాజు అష్టాంగయోగికి ప్రతీ అతడి ఉద్దేశ్యంల్లో తామసిక వృత్తులు సాధకుని యోగసమయంలో అవహించకుం ఉంటే చాలుననేది ఒక ఊహ." పై చెప్పిన కుస్థశలాది ప్రదేశాలు మణిపుర స్వా ష్టాన అనాహత విశుద్ధ చక్రాలవద్దగల సాధనలకు ప్రతీకలు. అక్కడున్నప్పు దుర్వృత్తులడ్డం రాకుంటే చాలు ననేది ఆ ఊహ. ఐతె పూర్తిగా మోక్షం గడిం డానికి అ సాధన చాలదని శ్రీకృష్ణుని తత్త్వమా అనిపిస్తుంది. ఏమయినా రెండు సాధనలూ పాటించడానికే వ్యక్తి ప్రయత్నించాలి. మోక్షం రావాలంటే దుర్వృ త్తులు సంపూర్ణంగా నశించాల్సిందె. సద్వృత్తి చేసే కాలంలో దుర్వృత్తి రాకుంటే చాలునంటే అది మోక్షం దాకా తీసుకుపోలేదు. అదీ శ్రీకృష్ణుని తత్త్వం.

—: ఇది ప్రథమాశ్వాసము :—



# మహాభారత కథలు

## ఉద్యోగ పర్వం—ద్వితీయాశ్వాసము

## 1. ధృతరాష్ట్రుని ప్రజాగరణం

సంజయుడు పాండవులతో రాయబారంచేసి తిరిగి వచ్చి ధృతరాష్ట్రుని ప్రొద్దు క్రుంకే వేళకు కలుస్తాడు. "ధర్మరాజు మీ అందరి క్షేమం పేరు పేరునా అడిగాడు. మీ ఆశీర్వచనం వల్లనే వారు సుఖంగా ఉన్నారట చెప్పుమన్నా"డన్నాడు. "ధర్మరాజుకు ధర్మం రుచించినట్లు భోగాలు రుచింపవు. అతడికి నిర్మలమైన బుద్ధి కూర్మి అహింసా ఉన్నాయి. కేవలం మనుష్య ప్రయత్నం మీద మాత్రమే ఆధారపడడు. దైవాన్ని ఆధారంగా మనుతుంటాడు" అందుకని పుణ్యం పాపం అంతా నీ మీదనె పెట్టాడు. "నీవేమో స్వంత తెలివిని వదలి కొడుకుల తెలివిమీద నడుస్తున్నావు. నిన్ను అంతా చెడ్డవాడివని తిట్టుతుంటె వినడానికి చెవులు చీములు కట్టుతున్నాయి. అనాడె వాళ్ళు తిరగబడి మీ మీద యుద్ధం ప్రకటిస్తే యేమయేది? 'క్షమ' అనె పుణ్యానికి కట్టుబడి అతడు తన తమ్ముల కోపానికి ఆనకట్టలా నిలిచి ఉన్నాడుగాని అలా కాకపోతె ఏమయేది? మీరంతా అతడు చేతకాని వాడనుకోవటం మీ తెలివి తక్కువ, గృహదహనం చేయటం నీ ఉపేక్షవల్ల! దానికితోడు జూదంలో కపటం ఈ రెండే చాలు వాళ్ళు నిన్నూ నీ పిల్లల్నూ మట్టుబెట్టడానికి! ధర్మరాజు మెత్తని పులి! ప్రపంచానికంతకూ నీ దుర్మార్గాన్ని తెలిపి సర్వులూ నిన్ను ఛీదరించేటట్లు చేస్తున్నాడు. తీరా అనుకొన్నంతా అయి వాళ్ళు యుద్ధానికొస్తె వాళ్ళ నావగలిగే దెవరు? నే నిప్పుడు చెప్పగలిగిందింత వరకె. రాత్రంతా ఆలోచించు, రేపు దర్బారులో అందరి సమక్షంలో వారేమన్నదీ చెప్తాను." సంజయుడు వెళ్ళిపోతాడు.

ధృతరాష్ట్రునికి తల బరువెక్కింది. సంజయుణ్ణి పంపింది. అక్కడి యుద్ధ సంగతులు తెలిసివచ్చి చెప్తాడని, ఇప్పుడతడు యుద్ధంలో కౌరవులాగలేరని చెప్తున్నాడు. ఇలా ఆలోచిస్తూ ఇక నిద్రపట్టటమనె దుండదనుకొన్నాడు. వెంటనె విదురుణ్ణి పిల్చి— "సంజయుడు వచ్చాడు. వాళ్ళన్నమాటలు రేపు చెప్తానన్నాడు, నేను పాపాత్ముణ్ణని సూచిస్తూ తిట్టిపోయినాడు. నాకు నిద్రపట్టటల్లేదు. ధర్మరాజు మనసు నీకు తెలుసుగదా— ఏమని ఉంటాడో చెప్పరాదా?" అంటాడు.

విదురుడు,— "నిద్రపట్టటల్లేదంటున్నావు! నిద్రపట్టనివాళ్ళు— ఎవరో ఎరుగుదువా? (1) బలవంతుడు పైనెత్తిన బలహీనుడు (2) ధనము గోలుపడిన యతడు (3) ముచ్చిలవేచువాడు (4) కామాకుల చిత్తుడు— నిద్రలేక కుందుదురంటారు. నీకీ నాల్గింటిలో ఏది వచ్చిపడింది? ఇతర్ల సొమ్ముతిందామనే బుద్ధి మళ్ళీ పుట్టిందా? ధర్మరాజు— నీకు బాంధవుండును జెలికాడునుందగు భటుండును బ్రెగ్గడయున్ గురుండుగాడె" అంటాడు.

"అతడెన్నడయినా తప్పుపలుకుతాడనుకొన్నావా? నీ వంటె— నీ కుమారుల మతం పట్టుకొన్నావు రాజ్యపాలనలో, అందుకె అది సరిగా నడవటల్లేదు. రాజ్యం నడిపేవారికి (1) తమను తామెరిగియుండటం (2) తొందరపడకపోవటం (3) ఓర్పు (4) విడుపు ఇవి ఉండాలి. వీళ్ళకవెక్కడున్నయి?" అన్నాడు.

"విదురుడా, ఇప్పుడు నా మనసంతా తల్లడిల్లుతోంది. కర్తవ్యమేమిటో చెప్పు, హితమేమిటో చెప్పు. నా సంతాపాన్ని పోగొట్టు" అంటాడు ధృతరాష్ట్రుడు.

"ఏది కర్తవ్యమనేది ధర్మశాస్త్రాలు చెప్పేమాటలె. నేనవి చెప్తాను విను. ఏది సుఖాన్నిస్తుందో అదె చెప్తాను విను;"—

"సుఖం కలగాలంటె జనాలకు ఒప్పుదలగా నడుచుకోవాలి. నింద్యాలుగా లోకం చెప్పేవాటిని చేయరాదు. వారితో పొంది పొసగి మనాలి."

ఇది చిత్రానికి పూర్వం తెరమీద పూసే పూతలాటి నీతి. దీన్ని స్థిరంగా మనసులో నిలుపుకొనటం వల్ల మిగతా నీతులను అర్థం చేసికోవడానికి ఆధారం కలుగుతుంది. విదురుడు ఎన్నో సల్లక్షణాలను వర్ణిస్తాడు—"కోపము-ఉబ్బు-గర్వము—ఆపోవకుండటం - దురభిమానము నిర్వ్యాపారత్వం" ఇవి నీచపురుష లక్షణాలు. వాటిని దగ్గరకు రానీయరాదు. రాజును, దైవాన్ని భార్యను బంధువుల్ని ప్రీతులుగా చేయాలి. లేకపోతె వాడలసుడవుతాడు. ధనం, విద్య, వంశం ఇవి దుర్మతికయితె మదాన్నిస్తవి- సజ్జనుడికయితె వినయాన్నిస్తవి. ఈ మంచీ చెడులు పాండవులకే పాటి ఉన్నాయనేది నీకు నీవె నిర్ధారణ చేసికొను."

"రాజా! విలుకాని బాణం గురితప్పితె ఒక్కణ్ణే చంపుతుంది. కాని, ధర్మరాజా వంటి నీతిపరుని స్ఫురణము రాజునీ రాజ్యాన్నీ గూడ హరిస్తుందనేది మరువద్దు.

మనిషి భగవంతుని ఒక్కణ్ణే గ్రహించాలి. ఉపనిషత్తులూ ధర్మాలూ – రెంటినీ – నిశ్చల యుక్తితో అనుసంధానం చేయాలి. ధర్మార్థకామాల్ని మూడింటినీ, దాన, తప, జప అధ్యయనాలనే నాల్గింటి ద్వారా పొందాలి. ఐదు ఇంద్రియాల్నీ గెలువాలి. కామక్రోధాదులారింటినీ తెలిసికొని సప్తవ్యసనాలను కూడ వదలి నడుచుకొనాలి.

"ప్రవర్తన అనేది ఒక సముద్రం వంటిది. దానికి ఓడ అనేది సత్యం, దీన్ని అనుసంధానం చేయడమె పరమమైన సూత్రం. క్షమ శరీరానికి కవచంలాంటిది. అది వ్యక్తికి ఉత్తమ రూపాన్నిస్తుంది. వానిని చేతకాదనేవాడు మూఢుడు. పరుష వాక్కులు పలుకకుండానూ ఇతర్లకు నష్టం కష్టం కలుగజేయకుండా ఉండే వాడిసె ఉత్తముడంటారు. సాధించకలిగి కూడ ఇతరుని క్షమించేవాడూ తను పేద అయినా ఇతర్లకు పెట్టేవాడూ ఇద్దరూ పుణ్యపురుషులనబడతారు. పాత్రులకు న్యాయార్జనను పెట్టాలి. పెట్టకున్నా అపాత్రులకు పెట్టినా కీడు అనేది కలుగుతుంది.

ఇవన్నీ మంచి అనీ అవి పాటించిన వారికి ఎప్పుడూ సుఖమె కలుగుతుందనీ చెప్పడానికి చెప్తున్నాను. నీకు నిద్రవట్టలేదుగనుక కనీసం మంచి యేదో వింటె దుఃఖశమన మవుతుంది. అందుకే గదా నన్నుపిల్చి ఈ సంప్రశ్నము చేస్తున్నది॥

సప్తవ్యసనాలేవంటే (1) వెలది (2) జూదం (3) పానం (4) వేట (5) ప్రల్లదనపు పలుకులు (6) పరుసదనమైన దండనము (7) నిష్ప్రయోజనమైన వ్యయములయందు వ్యామోహము కలిగి యుండటమని అర్థం. ఐతె మరెలా ఉండాలన్నట్లయితె,– తగిన వేషం, స్వకీయ ప్రశంస లేకపోవటం, నొచ్చినప్పుడైనా కీడు పలుకకపోవటం, ఇచ్చికూడ అయ్యో ఇచ్చానని వగవకపోవటం, జీవనం సరిగా నడవకున్నప్పుడైనా సరియైన మార్గం తప్పకపోవటం, కొంచెమున్నా అందరితో పంచుకుతినటం–ఇవి ఉండాలి. అడిగినప్పుడు శత్రువునకయినా ఇవ్వాలి.

ఈ గుణాలన్నీ ధర్మరాజుకున్నయి. నీకు తెలుసు. అలాంటివాడిని నీ కొడుకుతో సమానంగా చూడ్డం మానేశావు. మీరూ మీరూ కలిసివుంటే దేవతలయినా మీ వేలు వంచగలిగేవారా?

ధృతరాష్ట్రుడు నిట్టూర్చి "ఐతె ఇప్పుడేం చేయాలో చెప్పి నా చిత్తానికి శాంతి చేకూర్చు" అంటాడు.

రాజుగారికి కలిగిన ఒక్కొక్క మూడ్‌లో కొన్ని నిర్ణయాలు పొందటం మంత్రులకు అలవాటు. విదురుడు ధృతరాష్ట్రునకు తమ్ముడేగాక మంత్రికూడ. వెంటనే "నీతమ్ముని భాగం వాళ్ళకిచ్చెయ్యి. దాన్ని నువ్వు భ్రమింగేస్తామనుకొంటె ఇలాగే నిద్రపట్టటం మానేస్తుంది." అంటాడు.

ధృతరాష్ట్రుడు ముఖం తిప్పుకొని "ఇందాకట్నుంచీ నువు చెప్పే ధర్మాలు ఎంతో మనోజ్ఞంగా ఉన్నయి. ఇంకా మంచీ చెడూల సంగతులు చెప్పు" మంటాడు' బుద్ధిదోవలోకి వస్తున్నా ఇంకా మనసు వెనక్కు పీకుతున్నది ధృతరాష్ట్రుడికి. బుద్ధికూడ దిగజారిపోతున్నట్లయితె మంచీ చెడూల సంగతిని కూడ వినగలిగేవాడు కారనేది గమనీయం.

భారతంలో ఈ ఘట్టం సద్‌బుద్ధిని సంతరింప జెయడానికయిన బోధ అనేది జ్ఞాపకముంచుకోవాలి. మనసు మలినమైన దోవలో ఉన్నా బుద్ధి మంచి మాటలు రుచిచూస్తూనే ఉంటుంది. కాని మనసు కూడ మంచికి తిరగాలంటే _ మనసు ఎలా కోరితే అలాగే జీవితం నడిపిస్తుంటే బుద్ధియొక్క ప్రభావం వ్యక్తికి ఉపయోగింపవాలదు. అందుకని విదురుడు_

"అదె చెప్తున్నాను. పండకముందే పంటను కోస్తె రుచీ ఉండదు_ విత్తుకూడ చెడిపోతుంది. అందుకని కార్యం అదనులో చేయటం ముఖ్యం. ఆ చేయటం కూడ మృదువుగా చేయాలి. పూవును కోసినట్లుగా, తేనెను తేనెటీగ గ్రహించినట్లు చేయాలి. అంతేగాని, కట్టెలో ఉన్న బొగ్గె కట్టెను హరించినట్లు చేయరాదు. ధర్మరాజాదులను చేర్చుకొని ఎక్కువ రాజ్యం సంపాదించవచ్చుగాని వాళ్ళను నాశం చేయటం కర్జం కాదు. గొడ్డలితో కొట్టినా చెట్టు మళ్ళీ చిగుర్చుతుందిగాని, మాటలతో సామంస్యం చెదగొట్టితే మళ్ళీ పొసిగేది ఉండదు. కాళ్ళూ చేతులూ విరిగినా అతికించవచ్చుగాని నిష్ఠురమైన మాటలు మనసు నుంచీ పోగలిగేవా?"

ధృతరాష్ట్రుడు మళ్ళీ నిట్టూర్చి "నాకు నీతి వాక్యాలు చెప్పు తమ్ముడూ' అంటాడు.

విదురుడు:_ అలాగె. న్యాయం తప్పకపోవటం అనేది అన్ని ఇతర పుణ్య కర్మలకంటెకూడ గొప్పతనంలో బరువుతూగుతుంది. ఎందుకనంటే న్యాయం ప్రక్కన ఎన్నో పుణ్యకర్మలుంటయి కనక ఇహంలో ఫలం కీర్తికూడ కలిగి, కీర్తి ఉన్నంతకాలం పరంలో స్వర్గప్రాప్తి ఉంటుంది_

ఒకసారి ప్రహ్లాదుడి కుమారుడైన విరోచనునికీ సుధన్వుడనేవానికీ ఒక ధర్మ శాస్త్ర విషయంలో వివాదం వచ్చింది. పందేలు వడ్డినవాళ్ళై ఎవరు ఓడితే అతను చచ్చిపోవాల్సిందె ననుకొన్నారు. ఇద్దరూ కలిసి ప్రహ్లాదుని దగ్గరకు వెళ్లారు. ప్రహ్లాదుడికీ పందెం సంగతి కూడ చెప్పారు. వారిలో విరోచనుడు తన కొడుకు. తానే మధ్యవర్తిన్నీ. న్యాయం ధర్మం ఏదో చెప్పక తప్పదు. చెప్తే తన కుమారునికి చావు తప్పదు. ఇదీ పరిస్థితి. చివరకు న్యాయం చెప్తాడు. విరోచనుడు తన జీవితం అంతం చేస్తాడు. సుధన్వుడు ప్రహ్లాదుని మెచ్చుకొని, వరమిస్తానడుగుమంటాడు.''

విరోచనుని బ్రతికించమని ప్రహ్లాదుడర్థిస్తె అతడు బ్రతుకుతాడు. ఇది జరిగిందా? కథా? అని కాదు ఇక్కడ తెలియాల్సిన మర్మం. ప్రహ్లాదుని సదవడివల్ల అంత ఫలితం కలుగగలదని బోధగా తెలియగలుగుతాం మనం! విదురుడు ఇంకా చెప్తున్నాడు_

"పరిస్థితుల్ని చూచి పాపాలు చేయక తప్పదని అనుకొంటారు కొందరు. అలా పాపంచేసి ఆ పరిస్థితుల ప్రాబల్యంతో సంతోషాన్ని వారూ పొందుతారుగాక." ఈ పరిస్థితి మనకు ఇప్పటికె చాలచోట్ల సంభవించిందనిపిస్తుంది!

సభ అని ఉన్నప్పుడు ఆర్యులైనవారుండాలి. ధర్మం తెలిసినవారని అర్థం. వాళ్ళు ధర్మం పలకాలి. ధర్మమంటే దేనిని పాటించి నందువల్ల నిజమైనది వ్యక్తమవుతుందో అది. అలాకాకపోతె అది సభాకాదు. అందలి వారు ఆర్యులూకారు. ఒక నెపంకోసం చెప్పబడిన మాట సత్యంకాదుగదా?''

నీతిపథంలో బ్రతకాలి. అది ఉత్తమం. శౌర్యసంపతచేత బ్రతికితె అది మధ్యమం. నిజం నీతి తప్పి భారవహమైన జీవనం జీవించేవారు అధములు. ప్రపంచం వారిని మెచ్చదు. ఒకరినుంచి సర్వసంపదలూ పొంది చివరకు వానికి కీడు చేసిన వాడి పీనుగును కనీసం కుక్కలుకూడ ముట్టవంటారు. పాండురాజు నీకు చేర్చిన రాజ్య సంపదను మరచి పాండవుల్ని వదలివేయటం నీతికాదు.

ఈ బ్రతుకు వచ్చింది. దాంతో చేటు_పొగడ్త_దూషణం_త్యాగం అడుక్కుతినటం_ఇలా సౌఖ్యం దుఃఖం వస్తూనే ఉంటయి. వాటికోసం నిస్పృహగాని వగగాని పొందటం సరికాదు. చెడు రాకుండా చూచుకొనటం, వస్తె సుఖంగాని దుఃఖంగాని అనుభవించటం ఇదె కర్తవ్యమైనది. వగవస్తుందిగాక. దాన్ని తలచుకొని తలచుకొని

మాత్రం దుఃఖించరాదు. శరీరంలో బలం కలుగుతుంది. ఎంతకాలముంటుంది. వగ అమాత్రం కాలంకూడ ఉండలేదు. ఆలోచించకుండా ఉంటే క్షణంలోపోతుంది. ఆలోచించిదాన్ని చాలాకాలం ఉంచుకొంటె మతి పోతుంది. తెగులు పుట్టుతుంది. ఇతర్లను తిట్టటమవుతుంది. అందువల్ల అప్రియం పెరుగుతుంది. అందుకని వగ వడం ప్రయత్నపూర్వకంగా మానేయాలి.

ధృతరాష్ట్రుడికి ఈ నీతుల్లో బ్రతుకున కుపయోగించే మాటలు బుద్ధికి తట్టుతున్నాయి. శారీరకంగా, భౌతికంగా నీతిపథం అనుసరించేమాట తరువాత. బుద్ధీ దాంతోపాటు మనసూ మంచికి మళ్ళుతున్నాయి అనిపిస్తుంది. అప్పుడంటాడు. "నా పుత్రులు దుర్వృత్తితో ఉన్నారు. నేను వారి ఉపచారాలు చూసుకొని ఉత్తముడైన ధర్మరాజును ఉడికింపచేశాను. యుద్ధం వస్తె మనకు ఓటమి తప్ప కలిగేదేముంటుంది."

స్వార్థపరమై మనుతున్న మనకు కూడ ఈ ధర్మమార్గ సూచకమైన మాటలు వింటే తప్ప సన్మార్గమనేది ఒకానొకటున్నదని తెలియకపోవచ్చు. బుద్ధికి తెలియటం మొదటిస్థాయి. అది ప్రవర్తనలో జీర్ణించి అనుభూతి కావటం తరువాతి ఎత్తు. ముందు తెలియందె నడవడి బాగుచేయడమనె ప్రసక్తి అప్రస్తుతము అవుతుంది. అందుకని విదురునివంటి వారి మాటలు వినాలి. సత్సంగమంటె అదె. విని వాటిని జారవిడువకుండా పాటించటం తరువాతిది.

ఇంతకూ ధృతరాష్ట్రుడు విదురుని మళ్ళీ అడుగుతాడు— "వగ అనేది రాకుండా నిలుపుకోవాలంటే దేన్ని ఆశ్రయించాలి?" అని. అందుకు విదురుడు—

"నియత తపమును నింద్రియ నిగ్రహంబు
భూరి దయయును శాంతికి కారణములు
వాని యన్నింటికంటె మేలైన శాంతి
కారణము "లోభముడుగుట" కౌరవేంద్ర !

అని— "అందుచేత నీకు లోభమేమన్న ఉంటె అది వదలివేయి— వగ నశిస్తుంది." అంటాడు.

లోభం "స్వకీయ ప్రకర్ష"కు సంబంధించి కలుగడంచేత మొదట వారణావ తానికి పాండవుల్ని పంపేశాడు. అందుకే వాళ్ళను చంపాలని ఇల్లు కాల్చేశాడు. మళ్ళీ తెచ్చిపెట్టుకొన్నా తమ సొమ్ము వాళ్ళెందుకు తినాలని రాజ్యం సగంచేసి ఇచ్చేశాడు. జూదం పెట్టి కాజేశాడు.

ఇప్పుడు కాంట్రాక్టు ప్రకారం రాజ్యం ఇవ్వటం ఇష్టంలేదు. పగతో కుమిలి పోతున్నారు కౌరవులు. ఇదంతా లోభంవల్లకాదూ? అందుకని విదురుడొక మధ్యే మార్గం చెప్తామని చూశాడు—

రాజ్యమివ్వకపోతేమానె వాళ్ళను మీతో కలుపుకొని కలిసి ఉండండి. మీకు సిరిసంపదలు పెరుగుతవి. అలా ఇవ్వకపోతేకూడ పాండవులు ఊరుకోరాదా అన బోతావు? అలా ఇప్పుడూరుకున్నా ఎప్పుడో ఒకప్పుడు – విడిగా వాళ్ళున్నారంటే– నీకు చీకాకు కలిగింపకపోరుకదా? ఈ సంగతి మరువకు. అవసరమయితె దుర్మార్గు డయిన నీ కొడుకునె వదిలేయి. అంటే వేరు పెట్టుమని అర్థం.

ధృతరాష్ట్రుడంటాడు—

"నీవు చెప్పిన మాటలు నిర్మలములు
నిపుణ సమ్మతములు రాజనీతి మార్గ
బోధకంబులైనను బుత్రువిడువ
నోపధర్మో జయతియని యుందువాద." అని

ధర్మం ఎవరిపక్షంలో ఉంటే వాళ్ళే జయిస్తారనా అర్థం?—లేక—ధర్మమంటే ప్రకృతి లక్షణమని అర్థం. అదె జయిస్తుంది తప్పదు అనా? అనగా నీవెన్ని చెప్పినా నా ప్రకృతి జయిస్తుంది సుమా అనా?— చివరకు రెండూ అయినవిగాక. యుద్ధమూ వచ్చింది ధర్మపక్షమూ జయించింది.

"అంతేగాక ఒకవేళ దుర్యోధనుని జ్ఞాతిగనుక విడవకూడదని అన్నట్లయితె ధర్మరాజాదులూ నీకు జ్ఞాతులేగదా? వారినికూడ తెచ్చిపెట్టుకొను. అందుకు కాదన్నా వంటే తరువాత పశ్చాత్తాప పడాల్సివస్తుంది."

వాళ్లొచ్చి నీ బిడ్డల్ని చంపుతారని భయపడుతున్నావేమో. చావుకు భయ పడినందువల్లప్రయోజనమెప్పుడూలేదు. ఇప్పుడుకాకపోతే రేపు రుజావ్యాధులతో

చనిపోవటం ఖాయం. ఇహపరాల్లో శ్రీవిభవ-కీర్తివిభవాల్ని గడించటం కావాలి. చనిపోయిన తరువాత వెంటవచ్చేది కీర్తి సంపదే".

## 2. సనత్సుజాతుని బోధ

ఇన్ని విన్న తరువాత ధృతరాష్ట్రుడు విదురునితో "నీవు చెప్పినట్లే ధర్మరాజాదులకు సంపద నిస్తాను అంటాడు. విదురుడు ఒక ప్రక్క సంతోషం ఇంకో ప్రక్క అతణ్ని నమ్మకపోవటం అనుభవిస్తాడు. "నీవు నీ కుమారుడిమంతనంలో మళ్ళీ పడకుండా ఉంటేకదా!'' అంటాడు.

నిజానికి ధృతరాష్ట్రుని మనసు ఈ సిరిసంపదల్లో గల అస్థిరతను ఆలోచిస్తూనే వున్నది. త్రిగుణాల్లో సత్త్వగుణం పాళ్ళు అక్షణాన అతడితో పెంపొందినయి. పరమార్థం ఐహికార్థాల కంటె గొప్పదనే విషయం అర్థమయింది. అందుకని విదురునితో ''నాకు పరమార్థ దృష్టిని కలిగించే మాటలు చెప్పవలసిం''దంటాడు.

పరమార్థ దృష్టి అంటె ఐహికంలోనే మునిగిపోయే దృష్టికానిది. మునిగేదీ మునగకుండా ఉండాల్సిందీ మనసే. ధృతరాష్ట్రుని మనసు ఐహికంలో మునగకుండా విదురుడేం చేశాడనేది సంస్మరణీయము. విదురుడన్నాడు—

"నాకు తెలిసిన విషయాలు నీ మనసుకెఱిగించటం వరకూ నేను చేయగలిగిన పని. ఆ పైన అనుభూతి కావాలి. దానిని నేను కలుగజేయలేను. సనత్సుజాతుడంతటివాడు వచ్చి అలా అనుభూతిని నీకు కలిగించాలి!" అంటాడు.

"అబ్బో అంతటి మహానుభావుడిప్పుడెలా లభ్యమవుతాడు? నీవే ఆ సంగతులు చెప్పు" అంటాడు ధృతరాష్ట్రుడు—

కాని విదురుడు అప్పుడు సనత్సుజాతుని తలచి భక్తితో ప్రార్థిస్తాడు. ఆ మునీశ్వరుడు అప్పటికప్పుడు అక్కడికక్కడ ప్రత్యక్షమవుతాడు. ఆయన్ను విదురుడు తమ రాజుకు పరమార్థ తత్త్వం బోధ చేయాల్సిందని కోరుతాడు. అప్పుడు ఆ ముని చెప్పిన తత్త్వం సనత్సుజాతీయమనే తత్త్వ గ్రంథమయింది. వ్యాస మహర్షి మహాభారతంలో ఇలాంటి మహత్తర తత్త్వ విషయాలు చక్కగా చేర్చి మహోపకారం జనాళికి చేశాడు. శ్రీమద్భగవద్గీత – విదురనీతులు – సనత్సు జాతీయము, అను

ుతలు అలాంటివి. అవి ప్రత్యక్షరం చదివి తెలిసి ఎరిగి అనుభూతి చేయాల్సి ఃట్టివి. ఇక్కడ మీకు చెప్పే అధికారం అవకాశం కూడ నాకు లేవు అన్నారు ూబాయి.

తెల్లవారేదాకా ఆ మునీశ్వరుడు ధృతరాష్ట్రునికి తత్త్వ బోధచేసి, తెల్లవారే సరికి అదృశ్యుడై వెళ్ళిపోతాడు.

విదురుడు అంతా తెలిసిన వాడుగానే ఉన్నాడు. తానే ఆ తత్త్వ విషయాన్ని ఎందుకు చెప్పలేదు అని శంక. ఆయన యమధర్మరాజు అంశలో పుట్టినవాడు కదా అనిపిస్తుంది. విదురుడు ధృతరాష్ట్రునితో "తాను శూద్రయోనిజుడు కావటం చేత ఇతర్లకు చెప్పేటంతగా తెలీ"దన్నాడు. తనకు మాత్రం తెలుసు.

ఆ మాటకర్థం ఎంతో అనిపిస్తుంది. తత్త్వ విషయం కేవలం మాటలతో భాషా మాత్రంగా తెలియజేయగలిగింది కాదు. ఆ సనత్సుజాతునకు దేవతలకు తెలియనివి కూడ తెలుసునంటాడు విదురుడు. తత్త్వం మాటల్లో తెలియజేస్తే తిరిగ ప్రశ్న వేస్తే మాటలు దొరకవు. భావ ప్రధానులయిన దేవతల కందని అతీతమైన భావమని అర్థం. అందుకని బ్రహ్మపదార్థ తత్త్వవేది ఎవరో అతడే చెప్పాలి–లేదా అనుభూతి కలుగజేయాలని అర్థం. ఈ బ్రహ్మ అనే పదం శూద్ర అనే పదం వ్యాసుడు రచించింది ఈ కులాల్లో విభేదాలు పుట్టించడానికేనని అనటం సహృదయతా లోపం వల్ల. శూద్రుణ్ణి అని విదురుడనటం తెలియజెప్పే అనుభవం లేనివాడనటమే గాని ఇంకేమీ కాదనిపిస్తుంది. ఈ దోషం మనలోది. భారతాన్ని చదువడానికి ముందె జాగ్రతపరులమై దీన్ని తొలగించుకొంటే తప్ప అర్థంకాని అంధకారంలోనే మనం ఉండిపోయే ప్రమాదమున్నదనేది మరువకండి.

## 3. ధృతరాష్ట్రు మనఃస్థితి మెట్టు నెక్కటం

సంజయుడు రాయబారం నడిపి ఉపప్లావ్యం నుంచి తిరిగివచ్చి మర్నాడు దర్బారులో అందరకూ ఆ విషయం చెప్తాడు. "పాండవ పక్షంలో అందరి కంటె ఎక్కువగా శ్రీకృష్ణుడె కౌరవుల ప్రవర్తనను నిరసిస్తున్నాడు". కౌరవ మహాసభలో ఆనాడు అన్యాయానికి బలియై ద్రౌపది ఎక్కడో ఉన్న తనను "గోవిందా రక్షించు" మ:డం జరిగిందంటే అందుకు తానెంతో అప్పు పడిపోయినాడట. అర్జునుడి రథ

తోలుకొంటూ తానొచ్చినప్పుడు మీరంతా ఎక్కడకు పోతారో చూస్తానన్నాడు. ఆ అప్పు తానప్పుడు తీర్చుకొంటా"నన్నాడు.

ఇది విని పేరోలగం విలవిలలాడిపోయింది.

"అర్జునుడు భీముడు మీ సైన్యాన్ని నుగ్గుచేస్తుంటే తనూకవలూ ఊచకోత కోస్తుంటే అప్పుడుగాని ధర్మరాజును మీరు సరకు చేయరుగాక అన్నాడు. గాండీవం గుంక్రమైతేగాని మీ మెదళ్ళకు సంధి మాట తగులదు లెమ్మన్నాడు. ధర్మం తమ యందున్నది గనుక తామే గెలువడం ఖాయమన్నాడు.

ఇది చెప్పి సంజయుడు, "ఇక మీ ఇష్టం కురువృద్ధులెలా నిర్ణయిస్తే అలా జరుగనీయండి" అన్నాడు.

భీష్ముడు - నరనారాయణులు బ్రహ్మ సభలో ఉండే మునులనీ దేవాసుర యుద్ధంలో విజేతలనీ పౌలోమ కాలకేయాదుల్ని గెల్చినది వారిలో నరుడనే యాతదే ననీ—వారిద్దరే ఈ కృష్ణార్జునులుగా వినోదార్థం అవతరించారనీ వారు దేవతలనైనా సాధింపగలిగేవారనీ చెప్పాడు. దీనికి దుర్యోధనుడు పెడసరి వాలకం మాత్రమే ప్రదర్శించటం చేత మళ్ళీ అంటాడు భీష్ముడు,—"నీకు మేము చెప్పే హితం నెత్తి కెక్కటల్లేదు. నీవు దుష్టులూ కష్టులూ నికృష్టాత్ములూ సలహా చెప్తే వింటావు. వాళ్ళు మంచిని మాత్రం వదలి మిగిలినవి చెప్తారు" అన్నాడు.

కర్ణుడు ఆ మాటకు అభ్యంతరం చెప్పాడు - సభా మర్యాద దాటాడీ భీష్ము డంటూ. ఆ క్షణాన తెమలవలసిన నిర్ణయం కేవలం దుర్యోధనుడి మేధనుబట్టి మాత్రముండేది గాని మిగతావారి ఇష్టంతో సంబంధం లేదు గనుక కర్ణుని వ్యర్థ ప్రగల్భాలను గూర్చి మళ్ళీ చెప్తాడు. భీష్ముడు—"వీడేమిటి! ఏదో మాట్లాడుతాడు! అర్జునుడు ఎన్ని యుద్ధాల్లో విజయాన్ని గడించాడు? ఉత్తర గోగ్రహణ సమయంలో ఈ కర్ణుడు లేడా? ఎట్టి ప్రేలాపనవల్ల ప్రయోజన మేమిటి?" అన్నాడు. ద్రోణుడు "అర్జునుడితో సమానమైన యోధుడెవడున్నాడు? ఎక్కడయితె మాత్రం! ఖాండవ దహనం చేయించాడంటె సామాన్యుడా!" అన్నాడు.

ధృతరాష్ట్రుడు ఉత్సుకతతో అంటాడు—"ధర్మరాజు ఇక్కడి మన యుద్ధ మోహరం విషయం తెలిసి ఏమనుకొంటున్నాడు? ఎవరెవరి సహాయాన్ని అతడు తెచ్చుకొన్నాడు?"

సంజయుడు ఆశ్చర్యంతోనూ దుఃఖంతోను సమాధానం చెప్తాడు– "ఎవరి సహాయమా! అంతటి పరాక్రమం కలిగిన భీముని సహాయం; మహ వీరుడయిన ఫల్గుణుని సహాయం; సింహసములయిన కవలు, ద్రౌపదీ పుత్రులు, సాత్యకి, ద్రుపదుడు విరాటుడు వాని తమ్ములు, జరాసంధుని కుమారుడైన సహదేవుడు, శిశుపాలుని కుమారుడు ధృష్టకేతు, వృషభుడు, చేకితానుడు ఘటోత్కచుడు ఇలా అనేక మంది".

వెంటనే ధృతరాష్ట్రుడంటాడు:

"అబ్బో ఆ భీముని తలుచుకుంటేనే గుండెలవిసిపోతున్నాయి. అర్జునుడూ ఇతన్లాతోడైతె ఇంకా చెప్పగలిగేదేముంది! మిగతా వారందరూ ఆపాటివారె! పాండవులతో యుద్ధం కులక్షయానికే రాబోతుంది. శాంతి పొందటమె మేలు, మనవారి కిష్టమయితే నేను దానికే ప్రయత్నం చేస్తాను" అన్నాడు.

మనవారంటె ఎవరు? దుర్యోధనుడూ అతడి బృందమూను. ధృతరాష్ట్రుని బుద్ధికి కిందటి రాత్రి సద్బోధ కలిగి ఉంది. మనసు పూర్తిగా మారలేదు. ఇంద్రియాది శరీరం ఇంకా మారలేదు. తన భావం సంధి చేయటమె కర్జమనిపించినా, దానిని దుర్యోధనాదుల యోజనకూ నిర్ణయానికీ లొగ్గు చేశాడు. అందుకె వ్యక్తికి తగిన సాధన ఉండాలనటం, ముందు బుద్ధిని సరియైన దోవలో పెట్టాలి. దానికి గాను ధర్మసంహితల నెఱుగాలి. అలా చేసిన కొంత కాలానికి ఇది ధర్మం అది అధర్మం అని తెలుస్తుంది. ఐనా మనసు ఇంకా దుష్టత్వంతోనే నిలవడం కద్దు. అప్పుడు బుద్ధిచేత మనసును నియమించాలి. ఇది సాధనలో రెండో స్థాయి. అది నెగ్గినప్పుడు మనసు అధర్మం మీదకు వెళ్ళటం మానుకొంటుంది. ఇంద్రియాలు ఇంకా అలవాటుగా అటు వెళ్తూనే ఉండటం సంభవం. ఎప్పటికో వాటినీ సాధించాలి. అప్పుడు గాని శరీర మనోబుద్ధులు ఏకమై చక్కని నిర్ణయాలను మనిషి అలవాటుగా తీసికొనడమనేది జరుగదు. మనోబుద్ధుల నుద్బుద్ధం చేయకుండా ఇంద్రియాలు నియంత్రణలో నుంచమంటె అది అసంభవమని చెప్పదగినంత కష్టమనిపిస్తుంది. ఒకవేళ హృదయ ప్రధానులై స్వకీయమైన మేధ లేక కేవలం తల్లి దండ్రి గురువు దైవం చెప్పినట్లు చేసేవారు మాత్రం మనోబుద్ధుల కంటె ముందు ఇంద్రియాలను ఉద్బుద్ధం చేయగలరేమో! ధృతరాష్ట్రుడు ఇక్కడ చేస్తున్న సాధనబుద్ధి, మనసు, ఇంద్రియాలను వరుసగా ఉద్బుద్ధం చేయడమని ఇక్కడి బోధ. ఈ ఆధునిక ప్రపంచంలోని మనకు కూడ అదే బాట. ఎందుకంటె ఆచారాలవల్ల చెప్పబడే నియమాలు మనం పాటించటల్లేదు.

దుర్యోధనుడు వెంటనే కల్పించుకొని, అంటాడు_"పాండవులు ఎక్కడో అ పుల్లో జనపదాల్లోపడి రూపుచెడి వున్నారు. ఈ శ్రీకృష్ణుడు వారిని ఒకచో చేర్చాడు. ఆ మాత్రానికి భయపడటం అనవసరం. మనవైపు ఈ శాంతనవుడు ద్రోణుడు అశ్వత్థామ కృపుడు కర్ణుడు ఎంత మంది ఉన్నారు! వీరిని జయించగ గిందెవరు? పాండవులకు మావైపు చూడగలిగే శక్తి ఉన్నదా? నీవు వట్టి బీదమాటలు మాట్లాడకు. మనకు పదకొండు అక్షౌహిణీలున్నయి! వాళ్ళకు ఏడు మాత్రమే ఇంతకూ ధర్మరాజు తన నిశ్చయమేం చెప్పాడు అది చెప్పనీ విందాము" ధర్మరాజు యుద్ధం మనకొద్దని తమ్ముల్ని మాన్పించి యుండవచ్చు కదా అని దుర్యోధను ఊహ బహుశ. ధర్మరాజు శాంతి సూత్రం మీద వానికి కూడ అంత ఆశ!!

నిష్కర్షగా సంజయుడు చెప్పాడు_"వాళ్ళందరకూ కూడ యుద్ధమంటె చాలు పెళ్ళి సంబరమన్నట్లుగా ఉంది. ఎవరెవరిని ఎవరెవరు ఎదిరించాలని కూడ నిశ్చ యించుకొన్నారు. భీముడు నిన్నూ, శిఖండి భీష్మునీ, ధృష్టద్యుమ్నుడు ద్రోణుని ఎదుర్కొనాలిట!

ధృతరాష్ట్రుడు_వీరినిలా పురికొల్పినవారెవరు?

సంజయుడు_ ధృష్టద్యుమ్నుడు అంటాడు.

అప్పుడు ధృతరాష్ట్రుడంటున్నాడు_ దుర్యోధనా, ఇది విను :—

"పరిజనులకు నీకును నిద్దరలోన సగంబుసాలు
దక్కటి సగముం గరముచితముగ బాండవ
వరుడగు। ధర్మజునకిచ్చి బ్రతుకుమునెమ్మిన్

కర్ణుండు రేచిబెట్టగ దుర్ణయపరులైన శకునిదుశ్శాస
నులీ నిర్ణయమె మేలనగ నీ కర్ణములకు నించునెట్లు కార్యవచనముల్

నీకూ నీ పరిజనులకూ సగం రాజ్యం చాలు. మిగతాది పాండవుల కుచితంగా ఇచ్చెయి. ఇంత సేపటికి శరీర పూర్వకంగా కూడ (వాక్కు) సద్వాక్కు ధృత రాష్ట్రుడనగలిగాడు.

ఐతె "ఉచితంగా" ఇవ్వడమెలా అవుతుంది? పదమూడేళ్ళ ప్రవాసం తరు వాత వాళ్ళ రాజ్యం వాళ్ళకిచ్చెయ్యవద్దా? కాలదోషం పట్టే ప్రసక్తిలేదు కదా! సభ్యు లెవరూ ఈ న్యాయం మాట్లాడకపోవడమె యుద్ధానికి మూలమనిపిస్తుంది.

ఇద్దరి మధ్య పోరాటం - ధర్మవిదుడైనవాడు ఇది ధర్మమని చెప్పితే తగ్గి పోతుంది. అలా చెప్పే అలవాటు ప్రస్తుత కాలంలో లేదు. అందుకె సర్వత్రా పోరాటాలు ఎక్కువవుతున్నాయి. ఎవరైనా ఒకరు ఫలానిది ధర్మమని చెప్పినా, అధర్మపరుడు ఇతడి మీద పెద్ద పోరాటం లేవదీస్తాడు. ఆ సమయంలో మిగతావాళ్ళెవరూ అడ్డం రాకపోవటం శోచనీయం. అందుకె ఆ మొదటివాడు కూడ ఇంకెప్పుడూ ధర్మం చెప్పడానికె ప్రయత్నించడు. కనీసం కోర్టుకు వచ్చి సాక్ష్యం చెప్పడు. సాక్ష్యం చెప్తే తననేం చేస్తాడో ఎవరూ అడ్డురాకపోవచ్చునని భయమే కదా!

ఇలాటిస్థితి కౌరవ సభలో రావటంచేతనె దేశానికరిష్టంగా యుద్ధం వచ్చి పడింది. ఆయుద్ధంలో కలిగిన పరిణామం విమర్శించిచూస్తే "ఇది అధర్మం" అని చెప్తున్నవాళ్ళ మాత్రం బ్రతికారు. శ్రీకృష్ణుడు, విదురుడు, భీష్ముడు మొదలయిన వారు.

ఇంతకూ ఆ సభలో దుర్యోధనుడు మాత్రం తాను సూదిమోపినంత స్థలం కూడ పాండవులకీయనంటాడు. ఇక తనను బాధ పెట్టవద్దంటాడు.

ధృతరాష్ట్రుడు మళ్ళీ ఎన్నో చెప్తాడు. భీమార్జునుల శౌర్యం భీభత్సమైందనీ పాండవులకు దేవతల సాయముందనీ అన్నాడు. దుర్యోధనుడు, దేవతలు పక్షపాతులైనట్లయితే ఇకవారి దేవత్వమేమిటి. వాళ్ళను మేము తేలికగా జయించేస్తామంటాడు. తాను రాక్షసాంశ సంభూతుడని ఒకప్పుడు పాతాళలోకంనుంచి వచ్చిన రాక్షసులు ఘోషయాత్రనాటి రాత్రి తనకు చెప్పటం జ్ఞాపకముంది. తనకు తానూ తన స్నేహితుడు కర్ణుడూ ఎంతో గొప్పవాళ్ళమంటాడు. తనకు తెలిసినట్లు గదా యుద్ధం ఎవరికీ తెలీదుట.

ధృతరాష్ట్రిదేమీ అనలేదు. అలా అన్నా ప్రయోజనం కలిగె అదను దాటి పోయిందప్పటికి. భీష్ముడు ఉండబట్టలేక అర్జునుణ్ణి జయించేవాడే లేడిందరిలోనూ అంటాడు. కర్ణుడే దుర్యోధనుణ్ణి చంపేయాలని ఇలా దుర్బోధ చేస్తున్నాడంటాడు. కర్ణుడికి రోషం వస్తుంది. వెంటనే "ఇదిగో నేను అస్త్రసన్యాసం చేస్తున్నాను భీష్ముడు యుద్ధంలో పడిపోయేదాకా నేను యుద్ధం చేయను" అని వెళ్ళిపోతాడు. భీష్ముడు—"ఇప్పుడు తెలిసుకొను. కర్ణుడు యుద్ధం చేయనని వెళ్ళిపోయినాడు. నేను చేస్తానంటున్నాను. అతడో నేనో—ఎవరో తెల్చుకో"మని దుర్యోధనుని హెచ్చరిస్తాడు. దురోధనుడప్పుడు "తాతా! మా నిర్ణయం నీతి అయినా—అవినీతి అయినా—

మీ అండ చూసుకొని యుద్ధం చేయాలనె నిశ్చయించాము. కరుణించాల్సిందంటాడు. ధృతరాష్ట్రుడు హఠాత్తుగా వచ్చిన ఈ వివాదానికి బాధపడి సంజయుని "ఇంకా నీవేం చెప్పాలో అది చెప్పు" అంటాడు.

ఇదె ప్రారబ్ధ బలం. నా "కర్మ" అంటూ నెత్తి కొట్టుకుంటామే– దానికి ఉదాహరణమిదె! సంధి చేయడమనేది అప్పటిదాకా తన అధీనంలో నున్న విషయం. ఇష్టంలేకపోవడమూకాదు. ఐనా చేయలేదు. దీనివల్ల కలిగిన ఫలితం యుద్ధమయింది. అందుకె అతణ్ని ఎప్పుడూ మనం "దుష్టుడు" అంటూ ఉంటాం. ఫలాన్ని బట్టికదా మంచి చెడూ నిర్ణయించడం!

ఆ సమయంలో మళ్ళీ సంజయుడు– "వాళ్ళింకా ఏమన్నారంటే,— మా రాజ్యం మాకిస్తె సరేసరి లేదంటే కౌరవుల మొత్తం ఐశ్వర్యాన్ని పుచ్చుకోవటం ఖాయం అని చెప్పుమన్నారు. ఇదే నిశ్చయ"మన్నారు. ఇది చెప్పే సమయానికి సభలో మిగిలింది తండ్రీ కొడుకూ సంజయుడూ మాత్రమె. ఇంత కఠినమైన మాట పదిమందినోట పడకపోవటం వారి అదృష్టం అనచ్చునేమో–

ధృతరాష్ట్రుడు అడుగుతాడు "పాండవుల బలంచూసి వచ్చావు. మన బలం సంగతి నీకు తెలుసు. వీరిద్దరిలో ఎవరు గెల్చేట్టున్నారో నీవు చెప్పు" అంటాడు

సంజయుడు–ఆసంగతి నన్నడగద్దు. నీ తండ్రినే (వ్యాసునే) అడుగు,— అంటాడు.

ధృతరాష్ట్రుడు నిజమెననుకొంటాడు. ఆయనే చాల సరిగా చెప్పగలిగిన వాడు. వెంటనే గాంధారిని పిలిపిస్తాడు. కృష్ణద్వైపాయనుని మనసా స్మరిస్తాడు. వీరి మనోబల కారణంగా గాని ఆయనకు వీరిపైగల అభిమానం అనుగ్రహంవల్ల గాని వచ్చి ప్రత్యక్షమవుతాడు. కాని ధృతరాష్ట్రుని ప్రశ్నకు సంజయునె సమాధానం చెప్పాల్సిందని ఆదేశించి, అతడికి తెలిసిన విషయం సరియైందేననీ అతడు తన ఎదుటనె చెప్పగలడనీ అంటాడు. అప్పుడు సంజయుడు—

"ఈ రెండు సేనలకూ తేడా వాసుదేవుడే! విష్ణువె!! ఆయన పాండవుల పక్షాన ఉన్నాడు. ఎంత కఠిన కార్యాలనైనా ఆటలాడినట్లు చేయగలవాడు. ఆయనకున్న సుదర్శన చక్రం ఆయన మాయా బలంచేత పాండవులకున్న అన్ని ఆయుధా

గ్గానూ వ్యాపించి నిలిచింది అనేది తెలిసికొనాల్సిన సంగతి. సమస్త జగాలకూ విష్ణువే యైన ఆ శ్రీకృష్ణుని పోల్చితె అతడె ఎక్కువ అని చెప్పాలి.

ధృతరాష్ట్రుడు, "విష్ణుని గూర్చి నాకు విశదీకరంగా చెప్పాల్సింది" అని ప్రార్థిస్తాడు. అందుకు సంజయుడు, "వ్యక్తికి సాత్త్విక రాజసిక తామసికాలనే మూడు గుణాలుంటయి. వాటి పాళ్ళు ఎప్పటికప్పుడు మారుతూ ఉంటాయి. ఏది ఎక్కువగా ఉంటే ఆ మనస్తత్త్వం అతడికి ఉన్నదంటూ ఉంటాం. సత్త్వగుణం ఎక్కువ చేసి విషయ విమర్శనం చేసి జ్ఞానం పొందితె—ముందు బుద్ధీ, తరువాత మనసూ ఆ పైన ఇంద్రియాలూ శుద్ధమైతె— భగవంతుడె సర్వత్ర ఎలా వ్యాపించి ఉన్నాడో అవగతమవుతుంది. అప్పుడే ఆ విష్ణు నెఱుగటం : అదె విద్య, మిగిలింది అవిద్య, కేవలం విద్యవల్లనె విష్ణు నెరుగాలి !" అంటాడు. వ్యాసుడు అదంతా సత్య మని స్థిరమని చెప్పి ఆశీర్వదిస్తాడు.

దుర్యోధనుడు మాత్రం "ఏది యేమైనా అర్జునుని స్నేహితుడయిన శ్రీకృష్ణుని నేను సేవించే ప్రసక్తే లేదంటాడు.

—: ఇది ద్వితీయాశ్వాసము :—



# మహాభారత కథలు

## ఉద్యోగపర్వం—తృతీయాశ్వాసము

## 1. సంధిప్రయత్నం

సంజయుడు ఉపప్లావ్యానికి వచ్చి పాండవులతో సంధి విషయం మాట్లాడి వె[ళ్లి] పోయిన మరునాడు ధర్మరాజు సహోదర సహితంగా ద్రౌపదిని వెంటబెట్టుకొ[ని] శ్రీకృష్ణునింటికి వెళ్ళి ఆయనతో సంప్రదిస్తాడు.

"కృష్ణా ! మా తండ్రి తరువాత తండ్రంతటి వాడివి నీవు. ఇప్పుడు నీ సహా[య]యం మా కవసరమైంది. దుర్యోధను డవినీతిపరుడు. నీవు మా మధ్య సంధి చే[సి]నట్లయితె మా పాలికి వచ్చిన రాజ్యం మేము సుఖంగా అనుభవిస్తాము. నిన్న సంజయుడెలా మాట్లాడేడో నీకు తెలిసే ఉంది. రాజ్యం మాత్రం ఇవ్వడట ! సాత్త్విక సంపన్నులమై మేము మాత్రం యుద్ధానికి గడంగరాదట !

"నేను మా అమ్మనీ బంధుజనాన్నీ సంతోషింపజేయాలనే ఉద్దేశ్యంతో సంధి చేసికొని పాండవులం కౌరవులం విడివిడిగా బ్రతుకుతూ ఎవరి సాధనలు వారు చేసికో వచ్చుననే భావంతో ఐదూళ్ళు మా అయిదుగురుకూ ఇచ్చివేయవలసిందని అడిగేను." ఆ మాత్రం దుర్యోధనుడు తన అధికారాన్ని వదలుకోలేడా ? మేము మంచివాళ్ళమనీ వాళ్ళు చెడ్డవాళ్ళనీ ఎవరికివారు అనుకొంటూ ఉంటాము. మమ్మల్ని ఆ ఐదూళ్ళలో వదలి వారు వారి మంచిచెడులను చూచుకోరాదా ! ఒకరి నొకరు చంపుకోవలసిన అవసరమేమిటి ? పగ అనేది వదలి ఎవరి పనులు వారు చేసికోవచ్చునుగదా !

"శాంతి కావాలయ్యా ! పగ శాంతిని నాశనం చేస్తుంది. సంధి దాన్ని సమ కూరుస్తుంది, అందుకని శాంతి కలిగింపవయ్యా ?"

అక్కడకు వెళ్ళి మాయందు పక్షపాతంతో మాట్లాడవద్దు. వాళ్ళకూ మాకూ సమమైన హితం కలిగే విధంగా సంధి చేయాల్సింది.

నీ మాటలకు దుర్యోధనాదులు పరుష వాక్యాలు పలుకటం కద్దు. కురువృద్ధులు చెప్పే మాటలనతడు వినని వాడు కావచ్చు. ఐనా మనం, ఆ సలహా వింటున్న వాళ్ళంగానూ వాళ్ళు విననివాళ్ళుగానూ ప్రపంచానికి అవగతం కానిచ్చి, కురువృద్ధు లేంచెపితె దానికి ఒప్పుకొని రావటం మేలుకదా అంటాడు. ధర్మరాజు ఒకవేళ మా

పెత్తండ్రే అవినీతిపరుడై మాట్లాడినా నీవు విజృంభించి మాట్లాడి సంధి చెడగొట్ట వద్దు సుమా; నీవే ఈ రాయబారానికి తగిన వాడవని నాకు తెలుసుగాక. ఇన్ని చిక్కులు తొలగింపగలిగేది నీ ఒక్కడవె.

కాని నాకొక్కటే భయంగా ఉంది. నీవు శాంతుడవై ప్రవర్తించినా కుటిలాత్ములు కావటంచేత దుర్యోధనాదులు నీకు కష్టాలు తెచ్చిపెట్టారో ఏమో! నిన్ను పంపి ఆ సంకటాలు నీ పరం చేయటం నాకు హితవు కావటల్లేదు— అన్నాడు ధర్మరాజు.

అందుకు శ్రీకృష్ణుడు ఆ దుర్యోధనాదులే అలాంటి పని చేస్తారనీ వాళ్ళే దుష్టాత్ములనీ అనుకొంటున్నావా ధర్మరాజా! ధృతరాష్ట్రుడూ అలాంటివాడే! వారి పక్షాన భీష్మద్రోణాదులున్నారని వారు రొమ్ము విరుచుకొని ఉన్నారు. కష్టం లేకుండా రాజ్యం వశపరచుకోనిస్తారా? వాళ్ళు అధర్మానికి వెనుకాడనివారుకదా! అందుచేత ఈ సంధికి ఒప్పుకోరు.

శ్రీకృష్ణుడిక్కడ ఒక లోక విషయం ప్రస్ఫుటం చేస్తున్నాడు. ఎవరిబ్రతుకు వారు బ్రతుకుతాము ఆస్తి విడగొట్టుకొని—అని ఆలోచించటం పగలేని వారు అనుకొనేమాట. అనగా కలిసి ఉండాలనేవారు ఆత్మీయత కలవారనాలనిపిస్తుంది. ఇక దుర్వృత్తులైన దుర్యోధనాదులకు సద్వృత్తులైన పాండవులంటేనే పడదుకదా! ఇద్దరూ ఒకే రకమైన ఆలోచనగలవారయితె సంధి కుదరవచ్చుగాని రెండవ పక్షం వారినెలాగయినా నశింప చేయాలనే వారితో ఎలా సంధికుదురుతుంది? కుదరదు. ఈలోక విషయం ఆధారంగా శ్రీకృష్ణుడు స్పష్టంగా ఈ సంధి కుదరదని చెపుతున్నాడు.

ఎందుకు వారంత చెడ్డవారంటున్నాడీ శ్రీకృష్ణుడనేదికూడ ఆయన మాటల్లో విశదమవుతుంది. "ద్రోణభీష్మాదులు చూస్తుండగా సభలో మీకెంత కీడు తలపెట్టారానాడు! మీరు అరణ్యానికి వెళ్ళేటప్పుడెలాటి మాటలు ఆ దుష్టచతుష్టయం మాట్లాడినారట! అలా చేసినందుకు సమస్త జనులూ వారిని ఎంత తిట్టుకొంటున్నారో నీకు తెలీదా? జనుల తిట్లకు గురియయేవారు దైవోపహతులే అవుతారు. వారు అప్పటికె చెడినవారనాలి. క్రూరాత్ములు వాళ్ళు. వాళ్ళను నశింపజేయటం ఆవశ్య కర్తవ్యం. వారియందు నీకు-అనగా సత్త్వపూర్ణుడవైన నీకు - బంధుత్వమేమిటి!" అన్నాడు.

"నేను వెళ్తాను. నీ మంచితనం ప్రస్ఫుటమయ్యేటట్లు కౌరవ సభలో మాట్లాడుతాను. ఆ దుర్యోధనుడు బ్రతికున్నంతవరకూ భూమి నీకు పంచి ఈయడమనేది ఉండదు. కచ్చితంగా యుద్ధం వచ్చితీరుతుంది. అందుకు ప్రయత్నాలు చేస్తూ ఉండండి సుమా!" అన్నాడు శ్రీకృష్ణుడు.

భీముడు శ్రీకృష్ణుని మాటలను విచిత్రంగా విన్నాడు. మహాయుద్ధం జరిగి వంశ నాశనము కాబోతుంటే ఎలాగయినా సంధికి ప్రయత్నంచేసి ప్రజానాశం తొలగించాల్సిన సమయంలో శ్రీ కృష్ణుడింత కచ్చితంగా యుద్ధం వచ్చేది ఖాయమని చెప్పటం చిత్రమనుకొన్నాడు. ఈయన నిజంగా ఈ మాటలు చెప్తున్నాడా ! కేవలం దుర్యోధనాదుల మనస్తత్వాన్ని దూషించడానికి మాత్రమె అన్న మాటలా ఇవి! అని సందేహపడ్డాడు.

భీముడంటున్నాడు. "శ్రీకృష్ణా! యుద్ధం వస్తోంది_వస్తోందని మమ్మల్ని భయపెట్టుతున్నావటయ్యా! నీవన్నట్లు -నాకు తెలుసు- నీవు చెప్పిన మాటనెలాగో ఆ పాపాత్ముడైన దుర్యోధనుడు వినడు. నాకు ఆతడంటే ఎంతో అయిష్టం, ఐనానరె వంశనాశం కారాదనే లక్ష్యంతో -పోనీ ఆ ధృతరాష్ట్రుడు చెప్పినట్లే ఆస్తి విడగొట్టుకోకుండానే పాలూనీరూలా కలిసి బ్రతుకుదామనిపిస్తుందిగాక. ఐనా అలా ఉన్నరోజుల్లో పూర్వం వాడెంత దుర్మార్గం చేశాడో ఎరుగుదువుకదా. ఏమైనా ఇలా చెప్పువారితో:- అన్నదమ్ములం. ఒకరితోనొకరం పోట్లాడుకొని ఇతర్లగేలిని పొందటం సబబుకాదని చెప్పు.

శ్రీకృష్ణుడు ఆశ్చర్యపోయినాడు. భీముడిలాటి మెత్తటి సందేశం పంపుతాడని తాననుకోలేదు. మన కనిపిస్తుంది. – 'శ్రీకృష్ణుడు భగవానుడంటారు. భీముడు రజోగుణం కలవాడు కదా! కనీసం భీముడి సాత్విక ఆలోచనైనా శ్రీకృష్ణుడికి లేదా? అలా ఆశ్చర్యపోవడమెందుకు" అని, శ్రీకృష్ణుని తత్త్వం పక్షపాత రహితమైన తత్త్వం. భారతయుద్ధం అయిపోయింతర్వాత తాను ద్వారకకు వెళ్తూ దోవలో ఉదంకుని ఆశ్రమానికి వెళ్తే- ఆ ఉదంకుడు అడుగుతాడు_ "బంధువులందర్నీ చంపించావా" అని. అందుకు చక్కగా నవ్వేసి "అవును! వాళ్ళ వాళ్ళ కర్మవశాత్తూ వాళ్ళు యుద్ధంలో చచ్చిపోయారు!" అంటాడు. అదె అతడి నిజమైన మనఃస్థితి. ఐతె మరి భీముడ్ని యుద్ధానికి ప్రోద్బలం చేయజూస్తున్నాడేమని మళ్ళీ సందేహం కలుగుతుంది మనకు. ఎందుకనంటే యుద్ధంవచ్చితీరే అవకాశ

మున్నట్లు అతడికి తెలును. దానికి భీమార్జునాదులు సుముఖంగా ఉండాలిగనుక వారి బుద్ధిని ప్రబోధింపజేస్తున్నాడు. యుద్ధం ప్రారంభింప జేయటంకాదు. అది ఎప్పుడో ప్రారంభమయింది పద్దెనిమిది అక్షౌహిణీల బలం సమావేశమై ఉంది కురుక్షేత్ర ప్రాంగణంలో.

ఆశ్చర్యంతో శ్రీకృష్ణుడు మాట్లాడుతాడు "ఇదేమిటి! భీముడిలా మాట్లాడటం వింతగా ఉందె! యుద్ధమంటే ఎంతో మక్కువగలిగిన ఇతడు అన్నగారికి రాజ్య సంసిద్ధి కలుగుజేయాలి అనేమాటను వదలి ఇలా పిరికివానివలె మాట్లాడుతున్నాదేమి?'' అంటాడు. భీముడప్పుడు—"అను, అను, అలాగే,అను. యుద్ధంలో ప్రతాపం చూపి 'అప్పుడేమన్నావయ్యా? అని రెట్టిస్తానుగాక'' అంటాడు. శ్రీకృష్ణుడు ఇంకా నిశితమైన విధంగానే మాట్లాడుతూ, – "అర్జునుడు యుద్ధంలో నా సహాయం కోరినాడులే. మేమిద్దరం యుద్ధార్థులం. నీకోసం అందుకోనం ఆశపడ్డాములేవయ్యా బాబూ! అంటాడు. భీముడికి దీంతో మహాకోపం వస్తుంది "అవునవును, మీరిద్దరే యుద్ధం చేయగలవాళ్ళు కాబోలు. అలా మీరు యుద్ధం చేసేటప్పుడు మిర్రెక్కి చూస్తాములే" అంటూనే భీముడికి కోపం పెరిగిపోయి యుద్ధంలో ''నేనిలా చేస్తాను అలాచేస్తానంటూ గంధగజప్రకరాల్ని చంపేస్తాను. శత్రువుల్ని చంపేస్తా"నంటాడు. అప్పుడు శ్రీకృష్ణుడు తగ్గినవాడై –"నాకు తెలిదుటయ్యా నీ ప్రతాపం ఊరికే అన్నానుగాని" అంటాడు. ''మాకు యుద్ధ విషయంలో కుదురు నీవేగదయ్యా!!" అంటాడు.

అప్పుడర్జునుడు మాట్లాడుతాడు. అర్జునుడు శ్రీకృష్ణుడు భగవంతుడేననే నమ్మకానికి దగ్గరగానున్న మనస్తత్వం కలవాడు. అందుకని ఆయనతో "నీవు కావాలనుకుంటే యీ యుద్ధమనే కీడు రాకుండా చేయగలిగినవాడివి. అలాంటివాడిని "సంధి ఎలా అవుతుంది? కానేకా"దన్నట్లు మాట్లాడావు! మా పీడగల వక్షపాతంతో మేమనుభవించిన కష్టాలు తలచి అలా అని వుంటావు" అంటున్నారు. "అయిందేదో అయింది. పడ్డ కష్టాలు వెళ్ళిపోయినయి. ఇప్పుడు సంధిచేసే మార్గం చూడు" అలా మంచిదికాదనే చిత్తం నీకుంటె స్పష్టంగా చెప్పేయి. ఈ సంధివద్దని నీవు చెప్పటం మేమువినడం ఇది క్రొత్త విషయమేమీకాదుగా అన్నారు.

అందుకు శ్రీకృష్ణుడు–"ఛీ. ఛీ. అదికాదయ్యా నా ఊహ. కృషిచేసి తీరాలి. కర్తవ్యం వదలిపెట్టడానికి వీల్లేదు. సంధి చేయడానికి వెళ్ళాల్సిందె. వెళ్తాను. కాని

ఒకటి జ్ఞాపకం పెట్టుకొను. ఏ కృషికయినా ఫలితం కలిగేది దైవంవల్లనేనన్నేది మరువకు"మన్నాడు.

ఇంకా అంటున్నాడు. "కౌరవులు సంధి కొడబడేవాళ్ళే అయితే, పుట్టినప్పటి నుంచీ ఇప్పటివరకూ ఇంతటి పాపాలు చేస్తుండేవారంటావా?" అతలా ఉంచు, ఉత్తర గోగ్రహణ సమయంలో భీష్ముడు నీ విజృంభణం చెప్తూ రాజ్యం పంచి కౌరవ పాండవులు ఏలుకోవడం మేలనిచెప్తే దుర్యోధనుడేమన్నాడో విన్నావుకదా! "నేను రాజ్యమీయను-సూదిమోపినంతయినా యీయ"ననలేదా? అందుకని సంధి పొసగ దన్నాను-ఐనా పోయి మాట్లాడి, కనీసం వారి బలాబలాలేవో చూసివస్తానుగాక— అన్నాడు శ్రీకృష్ణుడు.

ప్రయత్నానికి అవకాశమున్నదంటే శ్రీకృష్ణునికి చేతకానిది లేదని పాండవుల నమ్మకం. అందుకని నకులుడు "శ్రీకృష్ణా నీ చాకచక్యం మాకు తెలుసు. నీవు వెళ్ళి మాట్లాడినట్లయితె సంధి కుదురుతుందని నా నమ్మకం. అక్కడి పెద్దలనంద రనూ న్యాయమైన దోవకు తేవలసింది" అంటాడు—

సహదేవుడు మాత్రం తీవ్రంగా లేచి చెప్తాడు. ఇప్పటివరకూ మహాయోధు లైన యుధిష్ఠర భీమార్జుననకులుల మాటలు వింటున్న యోధవరులు నిట్టూర్పులు విడుస్తూ నీళ్ళు చప్పరిస్తున్నారు. ఇప్పుడు సంధేమిటి నా మొఖం అంటూ. ఇప్పుడు సహ దేవుడు చెప్పేమాటల్తో మహోత్సాహులై శభాష్ అంటూ వికసిత ముఖాలు కల వారవుతారు. సహదేవుడంటాడు— "ఈ పిచ్చి మాటలన్నీ ఎందుకు. మనమేమైనా అడుక్కోవటానికి పోతామా కౌరవుల దగ్గరకి? ఇలాటి పాడుపని చేయాలని మనం ఆరంభిస్తే మన చుట్టూ ఉన్న ఈ యోధవరులు, ఆలోచనా పరులు ఛీ అనరా? ధర్మం ధర్మమని ఒక వేళ సంధికి వెళ్ళినా వాళ్ళ దృష్టిలోనైనా ఆ సంధికి ఒప్పుకొన్నా ఒప్పందం నిలుస్తుందంటావా? అబద్ధం. నేనన్నానని అక్కడిలా చెప్పు శ్రీకృష్ణా:— ఒప్పొట్టాక్టు ప్రకారం మా సగం రాజ్యం నీవు పదమూడేళ్ళుంచుకొనటం. మేము అరణ్యాలు తిరిగి అజ్ఞాతవాసం చేసి రావటం అయిపోయింది. ఇలాటి స్థితిలో నీ వుంటే, మేము నీ స్థితిలో ఉంటే నీకు తిరిగి రాజ్యం ఈయకపోతే, ఎలా ఉంటుంది? మాయలు పన్నడం మానెయ్యి. జాగ్రత్త అని చెప్పు" అన్నాడు.

చివరకు ద్రౌపది శ్రీకృష్ణునితో అంటుంది. "ఐదూళ్ళయినా చాలని ధర్మ రాజా అడగడమేమిటి? వీరిబలం వాళ్ళకి చాలనిదని అందరూ అనుకోరా? వాళ్ళని

జయించలేమని భయమా వీరికి? ఎందుకంత తక్కువవరచుకొన్నారు వీరిని వీరు? వాళ్ళు అవికూడ వీరికి ఇవ్వమన్నప్పుడైనా యుద్ధం చేస్తారో చేయరో వీరు! నేను ఇలా అన్నానని మీ మంచితనాన్ని త్యాగం చేసి అవప్రథ పడకండిసుమా! చేతనయినంత మట్టుకు—మనకూ కర్తవ్యమైన పని జరిగే వీలుగానూ ధర్మస్థితికి వ్యతిరేకం లేకుండాను సంధి నడపాల్సింది.

నన్నెంత దైన్యస్థితికి తెచ్చారువారు? ఏక వస్త్రనయినదాన్ని పట్టి దాసినని సభకు తెచ్చాడా దుశ్శాసనుడు. ఈ వెంట్రుకలు పట్టి ఈడ్చి తెచ్చాడు. ఇప్పుడు సంధి చేసి వాళ్ళతో కలిసి మనవలసిందని మీరంటే ఓహో నేను కోడలుగా వెళ్ళనా అక్కడకు దాసిగా వెళ్ళనా? అది నిశ్చయించండి ముందు! నా కడుపులో మండుతున్నది క్రోధాగ్ని—దానిని ఆర్పగలిగేదెవరు? దుస్సేనుని శరీరం తునియలు తునియలుగానయి రూపంచెడిపోయి ఉన్నప్పుడుకాక మరొక మార్గంద్వారా ఈ అగ్ని చల్లారుతుందా? ఇంత అలుకను అగ్నిని మూటగట్టినట్టు ఒడిగట్టుకొని ఉన్నాను. దీనిని ఆర్పలేకపోతే ఈ భర్తల తేజస్సు ఎందుకింకా?" అంటుంది.

శ్రీకృష్ణుడామెను ఓదార్చి "నీవేం దుఃఖపడకమ్మా! కౌరవులెలానూ రాజ్యమివ్వరు. యుద్ధం వచ్చితీరుతుంది. ఇంత అధర్మపరులకు శుభమెలా కలుగుతుంది? బ్రహ్మవారికి యుద్ధంలో చావునే వ్రాసిపెట్టాడు" అంటాడు.

శ్రీకృష్ణుడు సంధికిగాను పురానికి ఎప్పుడు బయలుదేరాలో కూడ ధర్మరాజే తారాబలం లెక్కచూసి నిశ్చయిస్తాడు. అది మరునాడే అయింది.

ఆనాడు శ్రీకృష్ణుడు కాలకృత్యాలు తీర్చి సూర్యోపాసనచేసి, అగ్ని నారాధించి మంత్రాక్షతలూ దర్భలూ తీసికొని, సాత్యకికి కబురంపి మాట్లాడుతున్నాడు. "సాత్యకీ! నీవుకూడ నాతోబాటురా. దుర్యోధనుడు దుష్టుడు. అందువల్ల చక్రాయుధాలుకూడ రథంలో పెట్టించు" అన్నాడు. సూతుడ్ని పిల్చి రథం సిద్ధం చేసి గరుడధ్వజం ఏర్పాటుచేసి తెమ్మన్నాడు. మంగళ తూర్యాల మధ్య రథమెక్కి వీడ్కోలు ఇచ్చేవాళ్ళను సంభావించి బయలుదేరాడు భగవానుడు.

ధర్మరాజు అప్పుడంటాడు. కృష్ణా నీవు వచ్చావని తెలిసి మా అమ్మ కుంతి, పోయిన ప్రాణాలు కూడుకొని వచ్చినట్లు లేచి ఎదురుచూస్తూ ఉంటుంది, ఆమెకు చెప్పు—"పాండవులం అగ్గరమమ్మా" అని. ఇన్నాళ్ళు ఆమె పడిన కష్టమంతా తీరి

పోయేట్లు "ఆమెను ఆదరించిరా" అని కన్నీరు కార్చుతాడు. ఇన్నాళ్ళూ పాలలో పడిన బల్లిలా ఆమె ఉంటూ ఉంది అక్కడ బహుశ నంటాడు. దిక్కులేని దానిలా అక్కడ ఆమె పడుంది. "చూడు కృష్ణా-కష్టాలు తీరే సమయం వస్తోందని చెప్పు ఆమె ఎప్పుడూ "అన్నిటికీ కృష్ణుడే ఉన్నాడు అంటూ ఉంటుంది" అన్నాడు ధర్మరాజు.

అర్జునుడంటాడు- కౌరవుల "సమ్మతితో కార్యనిశ్చయం" చేశారా సరేసరి. లేకపోతె సపుత్ర మిత్రంగా-సద్దైన నందన గ్రొచ్చిపాతుదున్ అన్నానని చెప్పు అంటాడు. ఈ మాటలకు భీముని శరీరం ఒక్కసారిగా ఉబ్బిపోతుంది. 'ఆహా!' అని బ్రహ్మాండం దద్దరిల్లేటట్లరుస్తాడు. అందరికీ నవ్వుముఖాలు ప్రస్ఫుటించినయి.

రథాలు బయలుదేరి వెళుతున్నాయి. ఎంతో దూరం వెళ్ళిన తరువాత ఈ భగవానుడి రాకకోసం నారద జమదగ్ని కణ్వాది మహామునులు అక్కడ వేచి యుండటం కన్పడుతుంది. వెంటనే శ్రీకృష్ణుడు రథందిగి వారికి నమస్కరించి కుశలమడిగి, ఇలా వచ్చారేమంటాడు. అందుకు నారదుడు "పుణ్యాత్మా నీవు కౌరవ సభలో ఎలాపలుకుతావో ఆ తీరు తెలియాలనే ఉద్దేశ్యంతోనూ, భీష్మాదులెలా వింటారో చూడాలనీ ఉంది మా కందరకూ. మేమూ ఈ రాయబారం చూడటానికి వస్తాము-అన్నాడు. భగవానుడు "అలాగే-అలాగే రండి తప్పకుండా-వెళ్దామా?" అన్నాడు. నారదుడు ఆయన్ను దీవించి "మీరంతా పదండి-మేము చేరే అక్కడకు చేరుకుంటాము" అని శ్రీకృష్ణాదులను పంపివేశాడు.

ఎల్లప్పుడూ సత్త్వంలో ఉంటూ బ్రతుకుతున్నవాళ్ళు ఋషులు కృష్ణుడూ అంతేనని వారికి తెలుసు. ఈ తామస రాజసాల వలయంలో ఉన్నప్పుడు సత్త్వపూరులెలా మాట్లాడుతారనేది తెలియాలని వారి ఆశయం. ఆ రాజసం తామసం వచ్చి ఆయన్నూ ఆవరిస్తాయా? లేక ఆయనే వాటిని తెచ్చి ఉపయోగిస్తాడా అని తెలియాలని అలా వస్తామన్నారు.

శ్రీకృష్ణుని దౌత్యబలగమంతా కుశస్థలం చేరేటప్పటికి సాయంకాలమయింది. అక్కడి బ్రాహ్మణులెదురు వచ్చి ఆరాత్రికి తమ ఇండ్లకు రావలసిందన్నారు. శ్రీకృష్ణుడు మాత్రం విశాల స్థలంలో డేరాలు వేయించి తనవారినంతా ఉండండని

చెప్పి తానూ సాత్యకి మొదలయిన ముఖ్యులు సమయోచితంగా ఆహ్వానించినవారిని గౌరవించి ప్రవర్తిల్లారు.

శ్రీకృష్ణుడు తమతో మాట్లాడ్డానికి వస్తున్నాడన్న సంగతి ధృతరాష్ట్రునికీ ధార్తరాష్ట్రులకూ తెలిసింది. ధృతరాష్ట్రుడు భీష్మాదులనూ కర్ణాదులనూ కూడ పిలి పించి "సర్వలోకాభిగమ్యుడైన ఆ మహానుభావుడికి మనమభిగమ్యులమైనామిప్పుడు. ఆయనకు సంతుష్టి నెవరు కలిగిస్తే వారికి శుభమంటారు. అందుకని ఆయన్ను సమాదరించే ప్రయత్నాలుచేసి గృహాలంకరణాది మంగళ ప్రకారాలు జరుపాల్సింది. అతడికి మనమీద ప్రియం కలిగేటట్లు ప్రవర్తించాల్సింది" అంటాడు. అందుకు భీష్మాదులూ సంతోషిస్తూ అంగీకరించారు. కర్ణాదులూ వారి కారణాల ఆధారంగా వారూ అంగీకరించారు.

ధృతరాష్ట్రుడు విదురుని పిల్చి కృష్ణునికెన్నో వివిధ మణిమయ రథాలు, జవనాశ్వాలు, భద్రసామజాలు, రత్న విభూషణాలు, దాసీ నివహాలూ, ఇస్తానంటాడు వెంటనే విదురుడు ధృతరాష్ట్రుని రాజసికదానవృత్తిని కనిపెట్టి "రాజా పాండవులకు ఐదూళ్ళివ్వనన్న లోభివి శౌరికి ఇవన్నీ ఇస్తానంటున్నావు! లంచమిద్దామని అంటున్నా వల్లె ఉంది. నీ వెంత చేస్తే మాత్రం అర్జునుడ్ని వదలి శ్రీకృష్ణుడు వస్తాడనుకొన్నావా మనవైపు! అసంభవం. అతడు మనవద్ద కెందుకు వస్తున్నాడో తెలిసి ఆ పనిని వంచింపకుండ నెరవేర్చటం అతడికి ప్రియం చేయడమవుతుంది సుమా!" అన్నాడు భీష్ముడు.– నీ వేమిచ్చినా ఈయకున్నా, కేశవుడైన శ్రీకృష్ణుడు తన పంథా మార్చు కొనేది ఉండదు. ఆయన నారాయణుడె అతడు చెప్పింది విని నీవూ నీవాళ్ళూ ఆ ప్రకారంచేస్తే పగ తొలుగుతుంది" అన్నాడు. దుర్యోధనుడు "అది జరగనిపని. ఆయన సగం రాజ్యాన్ని పాండవుల కిమ్మంటాడు. నేనొల్లను. అదలావుంచి నేను శ్రీకృష్ణుడ్ని ఇక్కడి వాణ్ణిక్కడ బంధించి వేస్తాను. అప్పుడు పాండవులు రెక్క లూడిపోయిన పక్షులయిపోతారు" అంటాడు. భీష్ముడు అది నీ నాశనానికి నీవు చేసికొనేవని అని హెచ్చరించి ఇలాటి మాటలు నేను విననంటూ వెళ్ళిపోతాడు. ధృతరాష్ట్రుడు దుర్యోధనుని మందలించి ఇలాంటివి ఆలోచించి నిశ్చయించినప్పుడు చేయాల్సినవిగాని, మనసులో ఊరికె పీటిని ఆలోచిస్తూ ఉన్నావంటే ఆయన చెప్పి నట్లు చేటుమూడే పనులు చేసి వేయగలవురా! ఇలాంటివి తలబెట్టకు, దూతను అలా అవమానించడం ధర్మంకాదు" అంటాడు.

మరునాడు శ్రీకృష్ణుడు పురంలో ఆహ్వానితుడై రాజ ప్రాసాదాలకు వెళ్తుంటే ప్రజలు మిద్దెలెక్కి చూస్తున్నారు. ఈ మహారాజకీయవేత్తేనా గోపికలతో ఆడుకొన్నది. బాలుడుగా పూతనాదుల్ని చంపింది! రోటికి కట్టబడింది! కంసుని చంపింది న్నీ! వెన్నలు దొంగిలించింది!! అంతేగాక "శ్రుతి శిరోభాగముల దన సుభగ చరణ నరసిజామోదమును గూర్చు చతురుడితడే!" అంటున్నారు. శ్రీకృష్ణుడు కేవలం పరమాత్మేనని గోకుల బృందావనంలో వాళ్ళకు తెలుసు. మధుర వాసులకు తెలుసు. ఆయన మహత్తరమైన శక్తిగల మహానుభావుడనీ భగవంతుడే అయియుండ వచ్చుననీ ద్వారకావాసులకు తెలుసు. కురుక్షేత్ర వాసుల్లో అతడు రాజకీయవేత్త అనే సంగతితోపాటు ఈయన భగవానుడే అనే ప్రథ మాత్రం తెలిసి ఉన్నది. స్వయంగా తెలీలేదు. ఆయన హఠాత్తుగా ఏ విశ్వరూపమో చూపిస్తే "ఓహో ఈయన భగవానుడే"నని విశ్వసించడానికి తగిన ప్రవృత్తి ఉందన్నమాట. మన మయితె ఇంతకాలమయింతరువాత పుట్టిన కారణాన అదంతా ఇంద్రజాలమో మెస్మరిజమోననే అనుమానంపడే అవకాశం ఉంటచ్చుగాక.

శ్రీకృష్ణుడ్ని ధృతరాష్ట్రాదులు ఆహ్వానించి ఎదురేగి తెచ్చి అర్ఘ్యపాద్యాదు లిచ్చి అర్చిస్తారు! శ్రీ కృష్ణుడు వారిని మెచ్చుకొన్నవాడై తాను విదురునింటికి పోయివస్తానని చెప్పి వెళ్తాడు. విదురుడు భోజనం తన ఇంట్లో ఏర్పాటు చేస్తానంటే సరేనని వెళ్తాడు కుంతి ఇంటికి. ఆమె అశ్రుపూరిత నయనాలతో వచ్చి ఎలుగెత్తి ఏడుస్తూ శ్రీకృష్ణుని కౌగలిస్తుంది. ఆయన ఆమెనోదార్చుతాడు.

ఆమె అంటుంది—"కృష్ణా! నా బిడ్డలు నీ శిక్షణలో పెరిగినారు గనుక పుణ్యా పరులూ శూరులూ అయి ఉన్నారు. కాని నన్ను ఇక్కడ వదలి అడవులబడిపోయి నప్పుడు నా హృదయాన్ని వాళ్ళతోపాటు తీసికొనిపోయినారనుకో! వాళ్ళు అంతా కులాసగ ఉన్నారా? నా కోడలికి నా కొడుకులకంటె నాపయినెక్కువ భక్తి ఆమె ఎన్ని ఇదుములు పడింది!" కంటనీరు కార్చుతున్నది కుంతి. తనవారి పూర్వబాధ లన్నీ వరసగ్రుచ్చి వాక్రుచ్చింది. చివరకు ఇదంతా ఒకటీ— ఈ పదమూడేళ్ళా ఈ బావకొడుకుల అధీనంలో ఉండటం ఒకటీ నాకు' అన్నది. వీళ్ళు అంతా క్రూరులు— ఒక్క విదురుడు తప్ప. నేను వీళ్ళందర్నీ నా పుత్రులతో సమానంగా భేదించని విధంగా చూసుకొంటున్నాను. ఈ నా ధర్మానికి ఆధారమైన ఫలం నీవూ నా బిడ్డలూ దుష్టముక్తులై సుఖంగా మనడం నే చూడగలగనని నమ్మి ఉన్నాను'— అన్నది.

నీ స్నేహితులయిన నీ బావలకు నే చెప్పే మాటలున్నాయి. విని వారికిచెప్పు 'రాజపుత్రులైనవారు వేడుకొనాలని పోవడం నిప్పు తన వేడిమిని వదలడమే"నని యుధిష్ఠిరునకు చెప్పు. భీమార్జునులతో "వారిని నేను కన్నదెందుకో అందుకు సమయం ఇప్పుడు కలిగిందని చెప్పు.''

''భుజబలమున జీవించుట నిజధర్మము–మెత్తబడుట నింద్యము అని మాద్రీ ప్రజలకు జెప్పు. ద్రుపదాత్మజ(ఃగార్యం బదుగుమనుము–తగ నందరతోన్" ఏంచేయాలో ద్రౌపదినడిగి తెలిసికొమ్మంటోంది కుంతి. కోడలిపై ఎంత నమ్మకం!!

"కృష్ణా! నా యలత నార్పవలసింది నన్ను కడతేర్పవలసింది" అని వాపో యింది కుంతి.

శ్రీ కృష్ణుడామెను ఆదరించి, "వినమ్మా నీబాధల్ని హరింపకపోతె ఎలాగమ్మా తప్పకుండా నీ పుత్రులు శత్రువుల్ని గెల్చి సామ్రాజ్యం పొందటం నీవు చూస్తావు గాక–అంటాడు. ఆమె కృష్ణుని కొనియాడుతుంది.

ఆ తరువాత సాత్యకి, కృతవర్మ సమేతుడై దుర్యోధనుని మందిరానికి సాగి వెళతాడు. అక్కడ జనులు సంభ్రమ మందుతుండంగా సింహాసనాసీనుడయి ఉన్న ధృతరాష్ట్రుడు బాహ్లిక భీష్మాది ప్రభుతులతో ఎదురువచ్చి శ్రీకృష్ణునీ సాత్యక్యాదు లనూ ఆహ్వానిస్తాడు.

కొంతసేపు కుశలప్రశ్నమైన మీదట శ్రీకృష్ణుడు తమ ఇంట భోజనం చేయక విదురునింటకు వెళ్తానన్నందుకు దుర్యోధనుడు తప్పపట్టుతాడు. బాంధవ్యం చూడకపోతున్నావంటాడు. అందుకు శ్రీకృషుదు సమాధానం చెప్పితీరాలనే స్థితిలో దుర్యోధనుడు మాట్లాడుతాడు. అందుకు శ్రీకృష్ణుడు చాల గట్టిగా సమాధానం చెప్పవలసి వచ్చింది. చివరకు– "పగవారింట్లో భోజనం చేయరాదయ్యా! నేను పగ వాడినా అనబోతావేమో! నీకు పాండవులంటే కోపం. వాళ్ళు నాకు ప్రాణ సములు. నా ప్రాణాలపై అలిగినవాళ్ళు మీరు– పగవాళ్ళు కారా నాకు?'' అంటాడు. అలా చెప్పి విదురునింటికి వెళ్ళిపోయినాడు.

విదురుడు మహాభక్తియుతుడై బ్రాహ్మణులచే భోజనం పెట్టించినాడట. ఆ తరువాత కవిగణక ప్రముఖ విద్వజ్జన గాయక పాఠక వాంశిక వైణికాదులువచ్చి

కాలక్షేపంగావించారు. రాత్రయిన మీదట శ్రీకృష్ణుడు విదురునింటనే పవ్వళించాడు. ఆ రాత్రి మాట్లాడుతూ విదురుడు రహస్యంగా చెప్తాడు—శ్రీకృష్ణునితో — "కౌరవు లంతా నీవు చెప్పబోయే మాటలనాదరింపవద్దని నిర్ణయించుకొన్నారు. నిన్ను పరుష వాక్కులతో బాధ పెట్టటంకద్దు. నీ వందుచేత అక్కడకు వెళ్ళనె వెళ్ళకుండటం మంచిది"—అని.

అందుకు శ్రీకృష్ణుడు చెప్పిన సమాధానమేమంటె "బంధువులు పోరాడు తుంటే వాళ్ళలో కొట్లాడైనా ఆ పోరాటాన్ని ఆపకపోతే అతడు క్రూరకర్ముడవు తాడు. అందుకని శాంతికోసం ప్రయత్నం చేయాలి. చేస్తాను. అలా ప్రయత్నం చేయకపోతె కృష్ణు డిలాగని రేపు నన్ను తిట్టరా జనులు? ఆ తిట్టటం అజ్ఞానం వల్లనే అవుగాక. అయినా ప్రయత్నం చేస్తాను. 'వారు నా మాట వినకపోతే పోనీ వారికర్మ.' నాపై తులువపని నారంభించేటట్లయితె—నా ముందర వాళ్ళు నిలవ గలరా?" అన్నాడు కృష్ణుడు. తాను భగవంతుడనె ఊహనిచ్చాడు. విదురుడు సమాధానపడి వెళ్ళిపోయినాడు.

శ్రీకృష్ణుడు గోకులంలో పెరిగినప్పటినుంచీ అమాటకొస్తే తాను పుట్టబోయే ముందునుంచీ ప్రతి సన్నివేశంలోనూ తాను భగవంతుడని చెప్తూనే వచ్చాడు. కంసుణ్ణి చంపడానికి భగవంతుడె దేవకీ గర్భంలో పుట్టి తమను సంతోష పెట్టుతాడని మధురా పురవాసులు కనిపెట్టుకొని ఉన్నారు. శ్రీకృష్ణుడు మధురకు రావడమేమి— కంసుని చాకలిని చంపి, ఏనుగుల్ని చంపి చాణూర ముష్టికుల్ని చంపి ఇతడు నాయకుడని పించాడు. ధర్మరాజాదులతో రాజకీయాలు నడిపించి వేత్త అనిపించుకొంటూ కూడ తాను భగవంతుడనే సంగతెని అవసరమయిన చోటనల్లా వ్యక్తంచేస్తూనే ఉన్నా డనేది తెలియవలసినట్టిది!

తెల్లవారినమీదట కాలకృత్యాలయేటప్పటికి కౌరవ పక్షదొరలొచ్చి శ్రీకృష్ణుని దర్శించి ధృతరాష్ట్రి పేరోలగానికి రావలసిందని తమవెంట తీసికొని పోతారు. అక్కడ విదురుడు ఎదురువచ్చి చేయిపట్టి పరమాత్మను తీసుకొని వెళ్తాడు. కృత వర్మాదులు శ్రీకృష్ణునికి దగ్గరకు చేరారు. దుర్యోధనాదులు రవిముందరి దీపాల్లా వెలతెల పోతున్నారు. అంతా పేరోలగానికి వెళ్ళి, తనకని అక్కడ ఏర్పాటు చేయ బడిన ఆసనం పై పునకు శ్రీకృష్ణుడు వెళ్ళంగానే నారదాది మునులు ఆయనకు అవుపడ్డారు. అప్పుడు భీష్మునికి శ్రీకృష్ణుడు చెప్పి వారికి అర్ఘ్యపాద్యాదులిప్పించి

ఆసనాలిప్పించి ఆ తరువాత ఆసీనుడయినాడు. అంతా సముచితాసనాల నధిష్ఠించిన తరువాత జలదస్వన గంభీరతతో శ్రీకృష్ణుడంటున్నాడు.

"రాజా! నేనెందుకు వచ్చానో చెప్తాను. నీకు తెలియంది లేకపోయినా తగవు, పరమహితము అయిన దానిని తనవారికి చెప్పవలసి యుండటం భారత సంప్రదాయం కనుక వచ్చాను. పాండవులూ మీరు పాలూ నీరూలా కలసి యుండటం మేలు అనేది నీవు తెలిసి నడపవలసి ఉంది. వారూ వీరూ నీకు వేరుకాదు. ఎన్నాళ్ళనుంచో నీవూ నీ తమ్ముడూ కలిసి ఈ సామ్రాజ్యాన్ని పెంచి పాలిస్తున్నారు. ఇప్పుడు ఈ క్రమం తప్పాల్సిన అవసరం లేదు. ఇతర్లెలా అనుకొన్నా ఈ వంశానికి కుదురు వయిన నీవు మాత్రం సద్భావంతో ప్రవర్తించాల్సిన కర్తవ్యం ఉంది.

నీ పుత్రులు మంచి యేదో తెలియక మసలుతున్నారు. మీరంతా సంధిచేసుకొని ఒకటై మనడం మంచిది. నీవశంలోనున్న విషయమిది. ఇంకొకరితో నేమిటి గాక! అటున్న భీమార్జునుల్ని గెలవగలిగేదెవరో తెలిసికొను ముందు. వారూ వీరూ యుద్ధంలో చావడంకంటె శాంతి మేలనేది తెలిసికో. యుద్ధంవస్తే భూప్రజలందరకూ చేటు కలుగుతుంది. శాంతి కలిగితే సర్వభూపతులూ నిన్ను సేవిస్తారు.



పాండవులు ఒక్కటిగా నీతో చెప్పమన్నమాటలు చెప్తాను. తమ తండ్రి జయించి తెచ్చిన అర్ధరాజ్యం తమకెలాగయినా వస్తుందనీ, అంతేగాక మీతో చేసికొన్న సమయం ప్రకారం పదమూడేళ్ళు ఎన్నో చిక్కులు పడి శ్రమ పడ్డారుగనుక తమకు రావలసిన రాజ్యం తమకు ఏడుగడవైన నీవు ఇస్తావనీ నమ్మి ఉన్నారు. అది ధర్మం. ధర్మాన్ని పాలించే దేవుడున్నాడు అని చెప్పమన్నారు. అంతకంటె ధర్మం ఇంకేదీలేదనేది నే చెప్తున్నాను.



ధర్మరాజు దిగ్విజయంచేసి భూపతి సమాజమంతా కొలువుచేసేటట్లు చేసిన రోజుల్లో నీ సుతులూ మంత్రులూ కపటద్యూతమాడి ద్రౌపదిని భంగపరిచారుకదా! అప్పుడు భీమార్జునులు విజృంభించదలచినా ధర్మరాజు వారిని వారించి అరణ్యాల్లో బాధలుపడి ఇప్పుడింకా మీతో కలిసి మనగోరుతున్నాడు. అతని మంచితనం నీకింతకంటె చెప్పాల్సిన పనిలేదు. నీ కుమారుల అతిలోభం మాన్పించి పాండవుల్ని ఆదరించు. వాళ్ళు నిన్ను సేవించడానికి సిద్ధమై ఉన్నారు. అలా నీకిష్టం కాకపోతే యుద్ధానికి సిద్ధమై వస్తున్నారు — జాగ్రత్త" పాండవుల సంధికయిన సంసిద్ధతనూ

అది తప్పితే యుద్ధ సంసిద్ధతనూ సభ్యులు విని మహాసంతుష్టులైపోయి మనసుల్ని ధర్మరాజాదులకు సన్నిహితంగా ఉంచుకొంటున్నారు.

జమదగ్ని పూర్వకథ నొకటి చెపుతూ దంభోద్భవుడనే రాజు తన కెదురు లేదనుకొంటూ నరనారాయణుల నెదిరిస్తే వారు ఇలాగె ఎంత ధర్మం చెప్పినా వినక పోయినాడు. అప్పుడు నరుడు యుద్ధంలో ఆ రాజును సర్వనాశనం చేశాడు. ఆ నరనారాయణులే అర్జున శ్రీకృష్ణులనే సంగతి మరువకుమన్నాడు.

కణ్వుడు, గరుడుడు, అహంకారంతో విష్ణుని చులకన చేసినప్పుడు గర్వ భంగము నొందిన కథను చెప్తాడు. మాతలి ఇంద్రుని రథసారథి. ఆయన కూతు రయిన గుణకేసికి పెండ్లి సంబంధం చూస్తూ ఆర్యకుడనే నాగరాజు మనుమడయిన సుముఖునికి ఇవ్వవచ్చని అనుకొనికూడ గరుత్మంతుడు ఈ సుముఖుని తండ్రి నప్ప టికె చంపినవాడై సుముఖునిపై పగపట్టి యున్నాడని తెలిసి పెండ్లి స్థిరం చేయ లేదు. సుముఖుడు ఇంద్రుని కలిసి తన ఆయువును పెంపుచేసికొనాలని ఆయన వద్దకు వెళ్ళినప్పుడు అక్కడ శ్రీ మహావిష్ణువుకూడ ఉన్నాడు. వారిద్దరి సమ్మతిపై సుముఖుడు చిరాయువుగా నవుతాడు. పెండ్లి జరిగిపోతుంది. కాని గరుడుడువచ్చి ఇంద్రుని కలిసి పేచీ పెట్టాడు. అక్కడ విష్ణువు కూడ ఉన్నా తాను మత్సరించి వాగ్వాదం చేశాడు. సుముఖుని అదృష్టానికి కారణం విష్ణువేనని ఇంద్రుడు చెప్పి నప్పుడు, గరుడుడు అదితి సంతానాన్నంతనూ ఒక్క నా ఈకతో మోస్తాను నేను. అది గమనింపకుండా నీ విలా చేశావని ఇంద్రునితో విష్ణుని చులకనచేస్తూ అన్నాడు. అప్పుడు విష్ణువు తన ఒక్కచేతిని గరుడునిపై నుంచి "మోయుమయ్యా ఈ చేతిని" అన్నాడు. గరుడునికి అది భారమై అణగారిపోయి, "ఎఱకలు విచ్చుచు దుండము దెరచుచు వ్రేగడరి సొగసి త్రెళ్ళి వివశుడై" పోయినాడు గరుడుడు. విష్ణు తిరిగి కరుణించి అనునయించాడు. అందుచేత గర్వం తగింది కాదనేది తెలియుమని కణ్వుడన్నాడు.

నారదుడు చెప్తాడు చమత్కారంగా – బలవంతుల ఎదుట కొలదులవారి గర్వము నిలువదయ్యా! ఇదేతప్ప ఇంకోపని నేను చేయననే వానికెంత అలజడి కలుగుతుందో తెలుసునా? గాలవుడు విశ్వామిత్రుని శిష్యుడు. తాను గురుదక్షిణ ఏమియ్యాలని విద్యా అవసాన సమయాన గురువునడిగితె ఆయన నాకేమీ వద్ద న్నాడు. ఎన్నో చెప్పాడు విశ్వామిత్రుడు ఆ ప్రయత్నం మానుమని. కాని గాలవుడు

పట్టుదలతో హఠం పట్టాడు. అప్పుడు విశ్వామిత్రుడు 800 వందల తెల్లని గుఱ్ఱాలని ఒక్క చెవిమాత్రం నీలంగానున్న వాటిని తెచ్చి ఇమ్మంటాడు

అలాంటివి అన్ని ఎక్కడ దొరుకుతవి. వెతికి వేసారి గరుత్మంతుడు తన స్నేహితుడని అతడ్ని సహాయమడుగుతాడు గాలవుడు. గరుత్మంతుడు అతడ్ని తనపైనెక్కించుకొని ఎక్కడికో వెళ్తుంటే గాలవుడు వేగానికి క్రింద ఒక పర్వతం మీద పడిపోతాడు. ఇకనా ప్రయాణంమాని గరుత్మంతుడు గాలవుణ్ణి తన స్నేహితుడైన యయాతికి చూపి మార్గం చెప్పవలసిందని అర్థిస్తాడు యయాతి. తన కుమార్తె యైన మాధవినిచ్చి ఈమెను ఏరాజువద్ద అలాంటి గుఱ్ఱాలున్నాయో ఆ రాజుకు ఇచ్చి ఆ గుఱ్ఱాలు పుచ్చుకొను. అంతేగాని నా దగ్గర ఆ గుఱ్ఱాలు లేవంటాడు.

మాధవిని తీసికొని ఇక్ష్వాకు రాజువద్దకు వెళతాడు గాలవుడు. ఆ రాజు తన వద్ద రెండువందలే అలాంటి గుఱ్ఱాలున్నవంటాడు. మాధవికి ఒక వరముంది. పుత్రుల్ని కన్నప్పటికి ఆమె కన్యగానే పరిగణింప బడాలని! ఆ వరము నాధారంగా ఆమె ఇక్ష్వాకునకు పుత్రుని కనేదాకా ఉంచి ఆ రెండువందల గుఱ్ఱాలనూ ఆయన వద్ద పుచ్చుకొని ఆమెను తీసికొనివెళ్ళి అలాగే ఇంకా ఇద్దఱు రాజుల కామెనిచ్చి మొత్తం ఆరువందల గుఱ్ఱాలనే సంతరిస్తాడు. మిగిలినవి దొరికే అవకాశం లేక పోయింది.

అప్పుడు గరుడుని సలహామీద— మాధవిని విశ్వామిత్రునకే ఇచ్చి పుత్రుని పొందేటట్లుచేసి ఆ మిగిలిన రెండువందల గుఱ్ఱాలకు బదులుగా ఆమెనిచ్చివేస్తాడు. విశ్వామిత్రుని గరుడుడూ గాలవుడూ కూడ ప్రార్థించి ఒప్పించాల్సి వచ్చింది అడిగిన గురుదక్షిణ ఎక్కడ ఇవ్వగలిగాడు గాలవుడు? కనుక పట్టుదల కూడదనేది గమనీయం అన్నాడు నారదుడు.

దుర్మాన మనేది తగనిది. యయాతి దుర్మానం చేతకదా ఇంద్రుని స్వర్గంనుంచి పంపివేయబడి తన మనుమల నాశ్రయించి తిరిగి శీలం సరిచేసికొన్నాడు! అన్నాడు.

"నిర్బంధము, దుర్మానము దుర్బుద్ధికి గాక తగునె దుర్యోధన నీ మార్బలమె పాండవులకున్ దౌర్బల్యము వాపు శుభము దలకొనుసంధిన్"

— అని చెప్పాడు.

దుర్యోధనుడు అన్నీ విని– "మునులారా! నన్ను బ్రహ్మ ఎందుకు పుట్టించాడో అలాగే అవుతుంది గాక. నాకు రుచించని పలుకులెందుకు అనవసరం?" అంటాడు. వెంటనే ధృతరాష్ట్రుడు, "మీరు చెప్పినట్లు చేయడమె మేలు అవుతుంది. కాని వీడు నా మాట వినటల్లేదుగదా!" అంటాడు.

శ్రీకృష్ణుడు అప్పుడు నేరుగా దుర్యోధనునితో మాట్లాడుతూ, "అల్పబుద్ధులు చెప్పేమాటలు వింటే నీకేమి ప్రయోజనముండదు. పాండవులతో కలిసి బ్రతకడం భీష్మాదుల కెంతో ఇష్టం. ఆకలయితె మునిండి తింటారా? తింటే బలమొస్తుందా? అలాగె కర్ణ, శకుని, మొదలయినవారి మంత్రిత్వం నీకు ఉపయోగించదు. తోడబుట్టిన భీమార్జునులు మహావీరుల సాయం వద్దని ఇతర్ల నాశ్రయించటం తెలివితక్కువ. ఇప్పుడు పాండవులు ఎత్తివస్తె వారిని గెలువగలిగేదెవరు? భీముడొక్కడు చాలు సర్వులనూ ఎదిరించడానికి."

పోనీ ఒక ఉపాయం చెప్తాను చెయ్యి. పాండవులలో అర్జునుడు ఒక్కడిన్నీ మీలో తగినవానినొకడ్ని యుద్ధం చేయుమందాము. ఎవరు గెలిస్తె వారి పక్షం గెలిచినట్లు, అలా చేస్తె జనక్షయం కాకుండనుండగలదు. కులనాశం కాకుండ చేయవయ్యా! పాండు కుమారులంతటివారు నీతోకూడి ఉంటామంటుంటే సిరిరా మోకాలొడ్డుతున్నావేమి?" అంటాడు.

భీష్మ ద్రోణులు కూడ ఈ కృష్ణుని మాటవిని ధర్మరాజును గౌరవించి అంతా కలిసి మెలిసి ఉండుమంటారు. ఆ చెప్పడంలో ధర్మరాజు పాదాలకెరిగి భక్తిచేయుమంటారు.

వెంటనే దుర్యోధనునకు మండిపోతుంది. అప్పుడంటాడు– "మీరు ఇన్ని మాటలు మాట్లాడుతారుగాని, నేను చేసిన తప్పేమిటి? జూదం ఆయన ఇష్టంమీదనె ఆడేడు. ఓడిపోయినాడు. అరణ్యాల్లో ఎన్నో చిక్కులు పడ్డామని ఇప్పుడు మత్స్య పాంచాలాది రాజులచేర్చి మమ్మల్ని చంపేస్తామంటూ ఉగ్రకర్మ చేస్తున్నాడు దుర్మార్గుడై. చిన్నతనంలో ఎరుగని వాణ్ణయి వాళ్ళకు రాజ్యం పంచిఇస్తే ఊరుకున్నాను గాక ఆ పొరపాటుకు ఇప్పుడు నన్ను రాజ్యం మళ్ళీ ఇమ్మంటారా? ఇప్పటి స్థితి ఏమంటే.—

"ఎవ్వరైన సంగ్రామమునన్ జయంబుగొని
రాజ్యము చేయుట నిశ్చయించితిన్"

—అన్నాడు.

పాండవులచే అధర్మమనటం వల్ల శ్రీకృష్ణుడు కోపం తెచ్చిపెట్టుకొన్నాడు. వెంటనే– సరె యుద్ధానికె సిద్ధం అవు. నీ వల్ల ఏ తప్పు లేదంటావు! తప్పులుగాక ఎప్పుడైనా ఒప్పు చేశావా? వాళ్ళకు విషంపెట్టి పాముల కఱపించి నీటిలో ద్రోసి, లక్కయింట్లో కాల్చి చంపాలని ఎంత ప్రయత్నించావు? చివరకు కపటద్యూతం పెట్టి ఇంత చేటు తెచ్చావు. అన్నదమ్ములు జూదమాడి స్త్రీల తలబట్టి సభలోకి ఈడ్చి చీరలొలుస్తారా ఏ మానవులైన నీవు తప్ప" అని ఉద్రేకంగా అంటున్నాడు.

అక్కడి వాతావరణంలో శ్రీకృష్ణుని మాటలకు ఎక్కువ ప్రాధాన్యమిచ్చే వారున్నట్లు దుర్యోధనాదులకు అర్థమవుతోంది. దుశ్శాసనుడామాటె అంటూ ఇక నిన్ను తీపికొనిపోయి ధర్మరాజు కాళ్ళమీద వేస్తారు. అనే అర్థం స్ఫురింపజేశాడు. వెంటనే దుర్యోధనుడు ఆసనంనుంచి లేచి వెళ్ళిపోయినాడు. అతడి తరువాత కర్ణాదులు, శకుని, తమ్ములు లేచిపోయి ఒకప్రక్క మంతనమాడుతున్నారు.

శ్రీకృష్ణుడు అప్పుడంటాడు. భీష్మాదులతోనూ రాజుతోను. శరీరంలో ఒక చోట దుష్టమాంసం కురుపై లేచినప్పుడెలా దానిని కోసివేసి చికిత్స చేస్తామో అలా నేనొకసారి కంసుణ్ణి చంపి మా వంశానికిగల దుష్టతను కోసిపారేశాను. మీరూ అలా చేస్తే పాండవులూ కౌరవులూ కలిసి యుండటం సంభవమవుతుంది అన్నాడు.

ధృతరాష్ట్రుడు ఈ సూచనకు గడగడలాడిపోతాడు. గాంధారికి కబురుచేసి రప్పించి దుర్యోధనుని పిలిచి ఆమెచేత చెప్పిస్తాడు. కాని అతడు వినలేదు. హఠాత్తుగా లేచివెళ్ళిపోయి కర్ణాదులతో కుట్రచేసి శ్రీకృష్ణుని బందీచేయాలని తాళ్ళు తెస్తాడు. అదిచూచి వారి మంతనం గ్రహించి సాత్యకి కృతవర్మను బయటకు వెళ్ళి తమ బలములను జాగరూకులంచేసి కయ్యానికి సిద్ధం చేయవలసిందని పంపి, తానువచ్చి శ్రీకృష్ణునితో ఆసంగతి చెప్పి ఆయన సమ్మతితో–అక్కడి సభాసదులతో అంటాడు.

"అదుగో చూడండి కౌరవుల అశక్తదుర్జనత! నిప్పును తమ బట్టలో బంధిచాలని చూస్తున్నారు శ్రీకృష్ణుని శక్తి నెఱుగని చవటలు" అన్నాడు. విదురుడు

అదరిపడి, ధృతరాష్ట్రునికి చెప్తాడీ సన్నివేశం. ధృతరాష్ట్రుడప్పుడు రాజుగా తన కుమారుల్నీ వాని అనుచరులనూ దగ్గరకు సభలోకి పిలిపించి చీవాట్లు పెట్టుతాడు.

శ్రీకృష్ణుడు నవ్వుతూ "రాజా నాకు అనుజ్ఞనియ్యి. నేను తగిన విధంగా తగినవారికి తగినట్లుచేసి వెళ్ళివస్తాను" అంటాడు. నీవిక్కడ రాజువయినా నన్ను శిక్షించనీ నీబదులు కొంత-అనిద్వని దుర్యోధనాదుల్ని చూచి "నేను ఒక్కణ్ణిగదా అని నన్నుబట్టేదామనుకొన్నారా!" అంటూ పక పక పక నవ్వేశాడు. అప్పుడు వారందరకూ-ఆయన ఫాలంలో బ్రహ్మ వక్షాన విరూపాక్షుడు వదనానవహ్ని ప్రక్కల ఇంద్రవరుణయమ కుబేరులు ఆదిత్యమరుద్విశ్వేదేవాశ్వినులూ ఉద్భవించి అవుపడుతారు. అంతేగాక, బలదేవుడు హలంతోనూ, అర్జునుడు గాండీవంతోను రెండు ప్రక్కలా ఉగ్రులై నిలుస్తారు. పాండవులంతా కన్పడుతారు. శంఖచక్రగదా ఖడ్గశక్తి శార్ఙ్గప్రముఖ నిఖిల సాధనాలు వెలసినయి. సభాసదులందరకూ శ్రీకృష్ణుని కాంతికి కళ్ళుమూసికొనిపోయినవి. భీష్మవిదుర ద్రోణసంజయులకు శ్రీకృష్ణుని దయ కారణంగా ఈ విశ్వరూపము సందర్శనమయింది. దేవతలు దుందుభుల్మ్రోశారు. కల్పవృక్షం పుష్పవృష్టి కురిసింది.

ధృతరాష్ట్రునికి ఈ సంరంభమంతా వినపడుతోందిగాని కనపడటల్లేదు. భగవంతుడైన శ్రీకృష్ణుడు చేసిన చిత్రము ఏదో తనకు తెలియటల్లేదు. అందుకని "స్వామీ నీ చరణములను నేను చూచేట్లు ప్రాసాదించు"మని ప్రార్థించాడు. వెంటనే ఆ విశ్వరూపం అతడికిన్నీ సందర్శితమయింది. ధృతరాష్ట్రుని మనసు బాగుకు తిరిగింది. ఇది ఆయన జీవితంలో కలిగిన మలుపు. ఇప్పటినుంచీ అతడి ఆలోచనలు సత్త్వగుణాత్మకమై ఉండటం చూస్తాము.

అతడన్నాడు. "స్వామీ ఈ నీ పవిత్రమైన రూపం చూచినమీదట ఇకదేన్నీ నేను చూడదలచలేదు. ఈ దృష్టి తీసివేయవలసింద"ని. తిరిగి గ్రుడ్డితనము అతడి నావహించింది. రాజరికం చేయడానికి అడ్డంగానున్న గ్రుడ్డితనం మళ్ళీ ఆవరించిం దతడికి. ఐహిక విషయాలకైన గ్రుడ్డితనమె శరీరానికి మిగిలింది. మనసులో సత్త్వం చేరింది.

శ్రీకృష్ణుడు మునీంద్రులవద్ద శెలవుతీసికొని సాత్యకితో కృతవర్మతో వెళ్ళిపోతాడు సభనుంచి. ఇది శ్రీకృష్ణ రాయబారము—

ఈ "వ్యాసముని" రచనలో కొన్ని అంతరార్థమైన విషయాలున్నాయి. ధర్మరాజు అష్టాంగయోగి, ఈయన, నాల్గూళ్ళ పేర్లుచెప్పి మొత్తం అయిదూళ్ళు వాటితో సహా ఇస్తే యుద్ధం చేయనని రాయబారం పంపాడు. ఆ నాల్గూళ్ళ పేర్లున్నూ శరీర వివిధ స్థానాల్లోనున్న స్వాధిష్ఠాన, మణిపుర అనాహత విశుద్ధ చక్రాలను సూచించే పేర్లు. అవి పంచభూతాలకు ప్రతీకలు. అవి తన సాధనకు అడ్డురాకుండా తన వశంలో ఉంటే ముక్తిని తాను సాధింపగలనని నమ్మకం ఆయనకు. అసాధన వీలుఅయేటట్లయితె దుర్వృత్తులన్నిటినీ నాశం చేసేదాకా సాధన నాపవలసినపని లేదని బోధ. అభయవృత్తికి ప్రతీక అయిన భీముడు సంధి అయినా ఫరవాలేదు. కాకపోయినా ఫరవాలేదు అనీ ఏ క్షణాన ఎప్పుడు ఎదురవస్తె అప్పుడు ఈ దుర్వృత్తుల్ని నాశనం చేసేయగలనన్న ధీమాతో "చేయించు సంధి చేయించు నేనున్నా" ననే, "అభయాత్మకమైన ధైర్యం ఉంటే చాలు ముక్తినందవచ్చు"ననేదీ సూచిస్తున్నాడు. అర్జునుడు పరమాత్మమీద భారంవేసి ఆయన ఎలాచేస్తే అలాగ ఇదైనా అదైనా మనకు–సాధకునకు–ఋజుత్వముంటే ఇంకేమీ ఫరవాలేదని అన్నాడు.

నకులుడు వైరాగ్యానికి ప్రతీక. యుద్ధం ఎందుకు? సంధియేమేలు అన్నాడు. సహదేవుడు జ్ఞాన ప్రకాశానికి ప్రతీక. జ్ఞానం ఉన్న చోటతమో వృత్తులు నిలువడానికిలేదు. వాళ్ళ నాశనం కావలసిందేననేది వాని వాదం అయింది అందుకె. ద్రౌపది ముక్తికామనకు ప్రతీక. దుర్వృత్తులను ఆదరింపనే జాలని స్థితి, అందుకని యుద్ధం రావలసిందేనన్నది.

శ్రీకృష్ణుడు నిర్వృతి తత్త్వం. దుర్వృత్తిపరులు నాశనమైనారా సద్వృత్తిపరులు నాశనమవుతారా అనే ప్రశ్న అక్కరలేదు. నిర్వృత్తిని ఆశ్రయించిన వృత్తులకు సహాయం చేయడమె కర్తవ్యమాయనకు నాల్గు నిర్దిష్టమైన ఊళ్ళూ మరొకటీ మొత్తం ఐదూళ్ళూ దుర్యోధనాదు లిచ్చినట్లయితె ఆయన సంధిని స్థిరపరచేవాదే కాని అలా జరుగలేదు. ఐనా జ్ఞానప్రకాశం ముక్తికాదు అనే సహదేవ ద్రౌపదులనే సద్వృత్తులు సమాధానపడకపోయేదివికదా! అనిపిస్తుంది. అందుకె ఆయన దుర్వృత్తులన్నీ నాశనమై తీరాలి అని పట్టుపట్టింది అనిపిస్తుంది. ఐనా వంధి చేయడానికి వచ్చాడుగదా అనిపిస్తుంది. సంధివల్ల తామసికవృత్తులు అడ్డం రాకుండా ఉంటే సాత్వికవృత్తులతో అష్టాంగ యోగంచేసి తరించే అవకాశంకూడ శ్రీకృష్ణుడంగీకరించడమె సంధి చేయడానికి రావడం!

ఇది తృతీయాశ్వాసం

# మహాభారత కథలు

## ఉద్యోగపర్వము–చతుర్థాశ్వాసము

## 1. కర్ణుని స్థిరత

కౌరవ పేరోలగంలో శ్రీకృష్ణుడు విశ్వరూపాన్ని సభ్యులలో కొందరికి చూపించి కొందరికి కేవలం కళ్ళు మూసేసుకొనిపోయే కాంతి చూపెట్టి దుర్యోధనుడి కుట్రను ధిక్కరించి వచ్చేశాడు. సాత్యకి, కృతవర్మ సమేతుడైనవానిని ధృతరాష్ట్రాదులు బయటిదాకావచ్చి వీడ్కోలిచ్చారు. ధృతరాష్ట్రుడు కృష్ణునితో–"కృష్ణా! నేనెన్ని చెప్పినా ఈ దుర్యోధనుడు వినకపోయినాడు కదా నీ ఎదుటనే! నేను అలా చెప్పి ఈ విపత్తు తప్పించ చూచానా కదా అనేది నీమనసుకు తెలియటం నాకు కావలసింది. ఇతర్లు ఏమనుకొంటేనేంగాక"–అన్నాడు. తాను అలా అంత అనుభూతితో దుర్యోధనుడికి చెప్పింది అదే మొదలు అనిపిస్తుంది.

శ్రీకృష్ణుడు ఒక చిరునవ్వునవ్వి రథం కుంతీ గృహానికి నడిపించాడు. అంతా అక్కడకు ఆయన్ను అనుసరించారు. ఆయన రథందిగి ఆమెకు నమస్కారం చేశాడు. కుంతికి సంధికావడం ఇష్టంలేదు. ఇప్పుడు సంధి చెడిపోయింది గనుక ఈ విషయం చెప్తే అమె అత్యంత సుఖాన్ని పొందగలదు. గనుక ఆమెకు ముందుగా ఈ సంగతి చెప్పాలెననుకొన్నాడు పరమాత్మ, అక్కడ జరిగిన సంగతులన్నీ ఆమెకు చెప్తాడు.

కుంతి గంభీర అయింది. ఇలా అంది. 'అసలు నీయంతవాణ్ణి ఈ సంధికి గాను పంపటం ఎంత నికృష్టం! అర్జునుడూ భీముడూ ఎందుకొప్పుకొన్నారీ సంధి కావాలనే మాటను? ద్రౌపది పడ్డ పాట్లు మర్చిపోయారా? ఇప్పుడు సంధి కాలేదుగనుక ఇక చింతించాల్సిన పనిలేదు.' క్షేమంగా వెళ్ళిరమ్మని పంపివేస్తుంది కృష్ణుని. ఇది విని భీష్మాదులు బెమ్మరపోతారు. "ఓహో కుంతి అనే చెలియలికట్ట కాస్తా పాండవులనే సముద్రానికి తెగిపోయింది. ఇంక మనను ముంచి యెత్తటం ఎంతోకాలం పట్టదనుకొంటారు.

శ్రీకృష్ణుడు అందరితో 'వెళ్ళివస్తా'నని చెప్పి మీరంతా ఇకరావద్దు ఉండిపొండి అంటూనే, కర్ణుని చేయిపట్టి నన్ను పంపివద్దువుగాక నాతో రమ్మని తీసికొనిపోయి

రథమెక్కించుకొన్నాడు. సాత్యకి వేఱుయానంలో వెంటవస్తూవీరి మాటలను వినలేదు.

అప్పుడు శ్రీకృష్ణుడు కర్ణుడికి చెప్తాడు–"నీవు వృద్ధజనోపసేవివి. నాకు తెలుసు ధర్మం తెలిసిన వాడివి. నీవు సూర్యుని వరంచేత కుంతికి పుట్టినవాడవు. ఈ పాండవులలో అందరికంటే పెద్దవాడవు. నీవు పాండవులలో చేరితే మొత్తం ఆరుగురవుతారు. రాజ్య పరిపాలన నీవంతు అవుతుంది. ద్రౌపది ఆర్గురకు భార్యగా కాగలదు" అంటాడు.

కృష్ణుడు అజ్ఞానం దేశంలో పోగొట్టడానికి ఉద్భవించిన పరమాత్మ అయియుండి ఇలా మాట్లాడినాడేమనే సందేహం కలుగుతుంది. శ్రీకృష్ణుడు ధర్మాధర్మాల విభజించి ధర్మం ప్రతిష్టాపన చేయడానికికదా పుట్టింది؛ "ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అన్నది అయనేకదా؛ అనిపిస్తుంది. ధర్మసంస్థాపనమే ప్రాతిపదికగా రామావతారమెత్తి ధర్మగతిని తెలియచెప్పి వెళ్ళిపోయినాడు. దుష్టసంహారమె ప్రధానంగా పరాశురాముడై వెళ్ళిపోయినాడు. ఇప్పుడు జ్ఞానోపదేశం చేసి అజ్ఞానాన్ని వెళ్ళగొట్టడం ప్రధానంగా ఈ శ్రీకృష్ణుడు అనుసరించాడనేది గమనీయమైన విషయం.

జ్ఞానమంటే ؛ జ్ఞానమంటే భగవద్గీత పదమూడవ అధ్యాయంలో 8వ శ్లోకం అయిన "అమానిత్వ మదంభిత్వం— "అనే దానినుంచి 12వ శ్లోకంవరకూ చెప్పిన వేవో అదే జ్ఞానం. "అజ్ఞానం యతతోఽ న్యథా"అని–మిగిలిందంతా అజ్ఞానమేనట.

శ్రీకృష్ణుడు వెన్న దొంగలించిన రోజుల్లో ప్రపంచాన్ని ప్రేమించి శుద్ధ సత్త్వగుణం వృద్ధి పొందించుకొని భగవానుని నిరంతరం స్మరించడం గోపికలకూ గోవులకూ నేర్పాడు. గోపికలనుంచి గర్వితమైన సమ్మతితోనే వాళ్ళ నవనీతం దొంగలించి సర్వులకూ పంచి పెట్టాడు. స్వ–పర–భేదం తొలగించి అందరు భగవంతుని పేర అప్తులైనా మనే విధం భోధించాడు గోకులంలో.

తిరిగి మధురవెళ్ళి ధర్మాఽధర్మాలు బోధించి యాదవులకు తమ కాళ్ళమీద నిలువగలిగిన స్థితి చెప్పి "స్వార్థం కాదయ్యా–కావలసింది؛ నిస్వార్థమైన సమర్థత" అంటూ తాను కంసుని చంపి రాజ్యం తనకు ఇస్తామంటె వద్దని ఉగ్రసేనునికిచ్చి ధర్మం ఆధారంగా మనడమె జ్ఞానమని బోధించాడు. ధర్మం అనేది నిస్వార్థతేనని చెప్పి నడిపాడు.

ఇప్పుడి కురుక్షేత్రంలో అజ్ఞాన ప్లుతమైన రాజకీయంలోచేరి ధర్మం ఏమిటో చెప్పించుదామనే నిశ్చయంతో రాయబారానికివచ్చి మాట్లాడి వచ్చాడు. ఇప్పుడు కర్ణునిచే ధర్మం ఏదో చెప్పించడానికిగాను అంటున్నాడు—"నీవు వృద్ధోపసేవివి—ధర్మసంవేదివి" అని. ఆ తరువాత స్వార్థాన్ని రేగకొట్టుతూ మాట్లాడుతూ కర్ణునితో అతడ్ని రాజునేచేసి యుధిష్ఠిరుణ్ణి అతడి కింకరుడిగా చేస్తానంటున్నాడు. ఈ ఆశకు కర్ణుడు లొంగిపోతే దుర్యోధనాదులతో సరిసమానమైన అజ్ఞానునిగా నిశ్చయింప వలసివచ్చేది. అందుకే సంభాషణం మొదట్లోనే "వారికీ నీకూ, భేదమున్న"దని సూచిస్తూ నీవు ధర్మసంవేదివి అన్నది. ఆమాట అనంగానే బహుశ కర్ణుడు "ఈ అధర్ములతో చేరినావేమిటి" అని కృష్ణుడు తనను అడుగుతాడనుకొని వుండచ్చు. కాని కృష్ణుడు మరొక స్వార్థ విషయాన్ని ధర్మంగా చూపతగినట్లు మాట్లాడటం జరిగింది.

ఈ ఆశకు కర్ణుడులోనై "అలా అయితే వచ్చేస్తా"నంటే-'నీకు కుంతీ కొడుకువనే సంగతి ఆదివరకె తెలుసనుకున్నా. పాపం అది తెలీక ఇన్నాళ్ళూ ఈ దుర్మార్గులతో చేరేవా! సరే నేను పాండవులతో ప్రస్తావించి తగిన విధంగా చేస్తాను' అనేవాడేమో. దాంతో కర్ణుడు కూడా వట్టి దుర్నయ పరుడేననె ప్రథ ప్రపంచంలో కలిగేది. అలాగాక కర్ణుడు బుద్ధిమాన్ గనుక స్వార్థంలో దిగక నిస్వార్థంగా "ధర్మం కాదు నేను రాజకీయ పక్షం మారడం"- అనగలిగాడు. రాజకీయ విషయంలో అతడు చెప్పుకోతగ్గవాడై భారతంలో వెలిశాడు. కృష్ణుడు అతడ్ని నీవు వృద్ధోపసేవివి అనడంలోనే మంత్రం వేశాడు బాగుపడడానికి.

ఒకవేళ అధర్మం అని తెలియక స్వార్థంతో కర్ణుడు 'పాండవుల పక్షానికి వస్తాను' అని అన్నట్లయితే దుర్యోధనాదుల కదితెలిసిన క్షణాన విరసం కలిగేది కర్ణునితో. పాండవులూ అంగీకరింపక పోయేవారు బహుశ. వారు దుర్యోధనాదుల్ని అనగా దుష్టశక్తుల్ని చంపుతామని శపథాలు చేశారుకదా.

అందుచేత కృష్ణుడు కర్ణుని పరీక్షించి ఇతడు జ్ఞానియా కేవలం అజ్ఞానియా తెలియాలనిగాని, లేదా ఇతనికి జ్ఞానం (అంటే అమానిత్వం-అదంభిత్వం ........ ఆత్మవినిగ్రహం వైరాగ్యం, అసక్తి సమచిత్తత్వం) కలిగించాలనే ఊహతోగాని అతడి అంతరాంతరాల్ని స్పృశించాడనేది గమనింపవలసిన విషయం.

అంతేగాక కర్ణుడు అనే పేరు యోగానికి ప్రతీక. అమనస్క యోగం: అనగా ఇంద్రియాలు మనసులో మనసు బుద్ధిలో బుద్ధి ఆత్మలో లగ్నం చేసే ధ్యానం (మెడిటేషన్) యోగమంటారు. ధానివల్ల ఆ క్షణంలో అమనస్కత సిద్ధించినా అది ఆపి ప్రపంచంవైపు తిరగంగానే బుద్ధీ మనసులు బురదగుంటలోకి వెళ్ళిపోతవి. ఆ సుఖం తాత్కాలికం, దీనిని- ఆ అమనస్కతను - నిరంతరం పొందాలంటే జ్ఞానం అత్యవసరం. దానిని కర్ణునికి ప్రసాదించాలని నిర్వ్యాతిత త్వ ప్రతీకయైన శ్రీకృష్ణుని భావం. అందుకే ధర్మం సంగతి వృద్ధసేవనం సంగతి ముందు హెచ్చరిక చేసి ఈ స్వార్థ పూర్ణమైన ఎరను కర్ణునికి వినిపించాడు అనిపిస్తుంది.

ద్రౌపదికి నీవు ఆరవ భర్తవనే యెర పెట్టటం శ్రీకృష్ణ నంతవానికి తగినది కాదంటారు కొందరు. (వ్యాసుడీ మాట వ్రాయలేదు) అది అసంభవము అనీ నల్గురిలో వరువుండదనీ అనైనా కర్ణుడు తన ఉపపాదన కాదంటాడనేమొ మంచీ చెడూ తెలిసినవాడె కాని అతడినుండి బయటకు వచ్చే మాటమాత్రం పరమ పగ ఈర్ష్య కార్పణ్యంలో ఉంటున్నయి. ఇప్పుడు శ్రీకృష్ణుడు అతడ్ని పరీక్షిస్తున్నాడు. తనంత వాడితో కూడ ఈ కర్ణుడు అతి న్యూనంగానే ప్రవర్తిస్తాడా అని. అలా కాకుండా చేయాలనే అతడ్ని ఉద్ధరించాలనే ఈ సంభాషణం మొదలుపెట్టాడు. శ్రీకృష్ణ రాయబారంవల్ల బాగుపడ్డవాళ్ళు అందుచేత ఇద్దరూ ఒక్క ధృతరాష్ట్రిదేకాదు.

ఇంతకూ కర్ణుడు శ్రీకృష్ణుని ప్రతిపాదనానికి అంగీకరించలేదు. అది ధర్మం కాదు పొమ్మన్నాడు. నిజానికి శ్రీకృష్ణుని విశ్వరూపం తానూ దర్శించాడు. ధృతరాష్ట్రి పేరోలగంలో, ఆయన పరమాత్మ అనే ఊహ అదివరకే ప్రచలితమై ఉంది. ఇప్పుడు బహుశ కర్ణుని మనసులో స్థిరమైంది.

కర్ణుడంటాడు కృష్ణునితో-ధర్మరాజుతో నేను కుంతీ సుతుడనని చెప్పకు. అలా చెప్తే అర్జునుడి మాటెలావున్నా ధర్మరాజు ఇక యుద్ధంచేయడానికి గాని రాజ్యం చేయడానికిగాని ఒప్పుకోడు—చూడు కృష్ణా!

"అట్టి ధార్మికు డాధిపత్యంబుజేయ వలవదేశాశ్వతంబుగ వసుధకెల్ల:"

అంటాడు ఇంకా—

క. అనుజులు ఋత్విజులుగ నీ
పని యిటు సేయుమని నీ వుపద్రష్టవుగా
విను "కురుకుమార వశు విశ
సనము" న రణయజ్ఞ మతడు సమ్మతిఁజేయన్.

దానివల్ల మావంటివారికి ఈ కురుక్షేత్రంలో సద్గతి కలుగుతుంది అన్నాడు.

ఈ మనస్థితివల్ల కర్ణుడు స్వార్థం నిరాకరించి చాల మంచి కీర్తి తెచ్చు కొన్నాడు. తాను చాల గొప్ప మెట్టు నెక్కినట్లుగా కూడ అనుకొన్నాడు. నిస్వార్థమైన పనిచేసినవారు ఇలాటి ఉన్నతి నంది ఆ స్థితిలో స్థైర్యాన్ని పొందుతారు. భీష్ముడు తనను అర్ధరథుడన్నందుకు పదిరోజులు అసలు యుద్ధంలోకే కర్ణుడు రాక పోయినాడు. బహుశ ఈ ధర్మ యుద్ధంలో కౌరవులతోచేరి యుద్ధం చేయడాని అంతరాంతరాల్లో వైమనస్యమా అనిపిస్తుంది. ఆ సత్వస్థితివల్ల కలిగిన స్థిరత సామాన్య మనడానికి వీలులేనిది.

శ్రీకృష్ణుడు అప్పుడైనా "నీవు ధర్మ ప్రకారమె చెప్తున్నావు అనలేదు. అధర్ములతో కలిసేందుకు చెప్పే మాటల్లో ఎంత మెలుకువ, ధర్మం కనబరిచినా మాత్రం దానిని ధర్మమని అనేదెలా? అందుకని అలా అనలేదు. పైగా యుద్ధం వచ్చితీరుతుంది. వచ్చే అమావాస్యనాడే ప్రారంభమవుతుంది. అర్జునునితో యుద్ధం చేసి నీవు గెలవడం అసంభవం. అతడివద్ద దివ్యాస్త్రాలున్నాయి. గాండీవం అక్షయ తూణీరాలూ ఉన్నాయి. అతడిముందు 'నే'నుంటాను నాగలమీద. నీకు తరం కాదనేది తెలిసికొను, అంటాడు. వెంటనె కర్ణుడు-నాకు తెలుసు. గెలుపు ఆ ధర్మ రాజుకె కలుగుతుందని. ఇక నీవేం చెప్పనక్కరలేదు. అందుకె నేనటు రానంటున్నా నంటాడు. అంటే ధర్మరాజే రాజ్యం చేయటం ప్రజలకూ భూమికీ మేలని సూచన ఎప్పుడు తెలిసి వుంటుంది సంగతి కర్ణునకు విశ్వరూప సమయంలో తప్ప?

ఇంత రహస్యంగా మాట్లాడిన మాటలు బయటపడితె చిక్కు అని తెలిసి కర్ణుడు చివరకంటాడు-

శకునీ, దుశ్శాసనుడూ, నేనూ కారణం ఈ యుద్ధానికి. వాళ్ళిద్దరూ కూడ మిమ్మల్ని చేరితే నేనూ వస్తాను, అంటాడు నిజంగా చేరేవాడేనా? అంటే-అసలా ప్రసక్తి రానేరాదని తెలుసుగనుక అలా మాట్లాడాడు కర్ణుడు అని చెప్పచ్చు. శ్రీకృష్ణుడు కర్ణుని తమవైపు రమ్మనడంకూడ అది జరగనిదేనని తెలిసే; రాజ్య దౌత్య నీతిజ్ఞుడు diplomat గా పలికిందేనని తెలియాలి.

శ్రీకృష్ణుడు వెళ్ళిపోయిం తర్వాత కుంతి సంతోషాన్ని అనుభవిస్తూ లోపలి కెళ్ళి యుద్ధ విషయం వితర్కించుతోంది. డబ్బాధనం కోసం తమవార్ని వధించటం

ర్మమూకాదు తేలికైన పనీకాదు. భీష్మ ద్రోణ కర్ణాదుల్ని జయించటం మాటలూ ాదు. కర్ణుడికి భీమాదుల మీద మహాకోపం. కర్ణునకు భీమాదులు తనకు సహోదరు లనని తెలిపితే ఈ యుద్ధం వల్ల కలిగే తీక్షణత కొంత తగ్గుతుందేమోననుకొన్నది ెంటనే కర్ణుడు అనుష్టానం గంగ దగ్గర చేసికోంటూ ఉంటాడని తెలిసి అతడ్ని లుపడానికి అక్కడకు వెళ్తుంది.

అక్కడ అతడి అనుష్టానమయేవరకూ ఒక ప్రక్క నిలచి తరువాత అతడ్ని పలుకరించి విషయం చెవుతుంది, అతడు కౌంతేయుడే గాని రాధేయుడు కాదని. ఈమె కూడ కర్ణుని, ధర్మరాజు పక్షం వహించి రాజ్యమేల వలసిందంటుంది. నరే నంటే ఈమె అందుకు ఒప్పించగలదా: అసలు ఆ ఉద్దేశ్యమేలేదు. కేవలంవారు నీ సహోదరులేను అని చెప్పడమే ఈమె ఉద్దేశ్యం. సహోదరులు కనుక అతడు యుద్ధ నమయంలో ఏదైని కొంత కనికరం చూపించాలెననే ఆమె ఆశ. కర్ణుడు ఈ విషయాన్ని ముందే ఆలోచించి నిర్ణయానికి వచ్చినవాడు గనుక శ్రీకృష్ణునికి చెప్పిన సమాధానమె ఆమెకూ చెప్పి అలా చేయడంవల్ల తాను హాస్యాస్పదుడు కావటం ఇష్టంలేదంటాడు. కాని తల్లి తనవద్ద ఏదో అర్థించితే తాను కాదంటున్నాడు. అదికాక పోయినా తద్విషయికమైన దేదో చెప్పాలి కనుక తనకు అర్జునునిపై పగ బాగా ఉన్నదనీ అర్జునుడు చస్తే తనను కలుపుకొని కౌంతేయు లయిదుగురనీ తాను చచ్చినా కౌంతేయు లయిదుగురేనని ఊరటపొందవలసిందంటాడు. ఇతరుల నెవ్వ రినీ తాను చంపనుగాక అంటాడు.

కుంతికి తెలుసు అర్జునునితో ఇతడు సమానబలుడే అనుకొన్నా అర్జునున కున్న భగవత్సహాయం దివ్యాయుధాలూ కారణంగా అతడ్ని ఇతడు జయించడం కల్ల అని. అలా ఊహించి, ఇతరుల నెవ్వరినీ చంపనన్న మాట మర్చిపోవద్దనేది తిరిగి జ్ఞాపకం చేసి వెళ్ళిపోతుంది.

తల్లికయినా కొడుకులందరిమీదా ఒకే విధమైన ప్రేమ ఎల్లప్పుడూ ఉంటుం దనుకో వీలులేదు ఇతర్లతో పోల్చినప్పుడైతే వీరెవరుగాని (సరిసమానంగా) ప్రియ మైన వారవుతారుగాని వారిలో వారికిగల తేడాలు కారణంగా నైతే వారివారిపై గల ప్రేమలూ తేడాగానేఉంటయి. పైగా కుంతికి కౌంతేయులపైనేగాక పాండవులపై కలిగిన ప్రేమ ప్రపంచంలోని జనులు వారిని కౌంతేయులుగా కీర్తించటంచేత

ఇనుమడించి ఉంటుంది. నకుల, సహదేవులుకూడ కుంతీ పుత్రులుగానే చెప్తూ కర్ణుడు కౌంతేయులయిదుగురు అనటంకూడా అందుకు నిదర్శనమె.

శ్రీ కృష్ణుడు తిరిగి ఉపప్లావ్యం జేరి ధర్మరాజాదులకు జరిగిన విషయాలను కథనం చేస్తాడు. "ఎన్నో చెప్పాను. చెప్పించాను, కినుక తెచ్చుకొని జంకించాను. భంగించాను. ధిక్కరించాను, తృణీకరించాను మళ్ళీ శాంతవచనాలు పలికాను. వాళ్ళు చివరకు ఘోరదుర్నయ వృత్తికి దిగిన సమయాన అమానుషమైన మాయలు కొన్ని నేనూ చేయవలసి వచ్చింది. ఏంచేసినా సంధిమాత్రం కాలేదు అన్నారు.

అప్పుడు కూడ ధర్మరాజు చిత్తశుద్ధితో శ్రీ కృష్ణుని సలహా అడుగుతాడు— కృష్ణా! మేము ధర్మచ్యుతి చేసినవాళ్ళం కాకుండా ఏంచేయమన్నా అదిచేస్తాం నీవు చెప్పు ఇప్పుడు కర్తవ్యం" అంటాడు. దానికి కృష్ణుడు చిత్రంగా కుంతి చెప్పిన మాటలు, భీష్మ,ద్రోణ, బాహ్లికులకు దౌత్య సమయాన కలిగిన మనఃక్లేశం చివరకు కౌరవులలో దుష్టచతుష్టయం తనను బంధింప జూచిన విషయం చెప్పి ఇక నీయంద ధర్మం లేదు. యుద్ధమే శరణ్యమంటాడు.

ధర్మరాజు మాత్రం దిగాలుపడి తమ్ములవంక చూచి—ఇకమీరు నిర్ణయం చేయండయ్యా మన కర్తవ్యమేమిటో నంటాడు. అర్జునుడు "విదురాది మహాత్ములూ శ్రీకృష్ణుడూ యుద్ధము చేయమంటుంటే ఇంకా సందేహమెందు" కంటాడు. వెంటనే యుధిష్టిరుడు యుద్ధాన్ని నిర్ణయిస్తాడు. శ్రీకృష్ణుని సమ్మతితో ధృష్టద్యుమ్నుని సేనాపతిగా చేస్తారు. దండనాయకులుగా ద్రుపదుడు, విరటుడు, సాత్యకి, జరాసంధతనయుడైన సహదేవుడు, చేకితానుడు, శిశుపాల తనయుడైన దృష్టకేతువు శిఖండి ఈ ఏడుగురూ ఉండాలన్నారు. ఆనాటికి మంత్రాంగం చాలించి విశ్రాంతి తీసికొని మరునాడే వారి వారిని ఆయా విధంగా అభిషేకం చేశారు.

## 2. సైన్యసమారంభం

ధర్మరాజు అర్జునుడి వద్దకు వచ్చి-"నీవు ఎప్పుడూ అన్నిచోట్లా వ్యాపించి అందరకూ కంటికి రెప్పలుగా నిల్చి, రహస్యంగా ప్రేమలో ఉపాధ్యాయునిలా సలహాలనిస్తూ వీర బుద్ధితో రక్షిస్తూ ఉండు. ఇక నీకు రక్ష ఎవరంటావేమో, ఇదుగో ఈ పరమేశ్వరుడైన కృష్ణుడే రక్ష-అన్నాడు.

వెంటనే ప్రస్థానభేరి మోయించారు. సైన్యాలన్నీ వచ్చి నిల్చి తమ తమ అధికారయుతమయిన పదవులనందుకున్నారు. మరునాడు మళ్ళీ అలాగే కలిసి ఏర్పాట్లు

నరానరి ద్రౌపది మందిరానికి వెళ్ళి ఆమె ఆశీర్వచనాలూ, పుణ్య స్త్రీల అక్షతలూ గ్రహించారు. బ్రాహ్మణుల ఆశీర్వచనాలు పొందారు. అప్పుడు కృష్ణార్జునులూ, భీమ నకుల సహదేవులూ తమ తమ రథాయుధాలతో వచ్చారు. ధృష్టద్యుమ్నుడు సైన్యాన్ని నడుపుతున్నాడు. ఇలా ధర్మరాజు సైన్యంతో మంగళతూర్యాలతో–కురుక్షేత్రానికి ప్రయాణమై వెళ్ళాడు. హిరణ్వతీ అనే నదివద్ద విడిదల దిగారు. శ్రీకృష్ణుడు ఆది అందరకూ తెలియదో అని శంఖం పూరించాడు. భీమార్జున నకుల సహదేవులు సహా ధర్మరాజూ శంఖం పూరించాడు.

## 3. భీష్మునికి సేనాధిపత్య పదవి

ఇలా పాండవులు సమాయత్తులై యుద్ధానికి వచ్చి విడిసినారని తెలసి దుర్యోధనుడు తన సైన్యాలలో ఒక్కొక్క అక్షౌహిణికి ఒక్కొక్క దండనాథుడుగా ఫలాన అని ఏర్పాటు చేశాడు–ద్రోణుడు, కర్ణుడు, అశ్వత్థామ, బాహ్లికుడు, శల్యుడు, కృపుడు, భూరిశ్రవుడు, శకుని, కృతవర్మ, కాంభోజుడూ, సింధురాజు వీరిని దండనాథులుగా అభిషేకించాడు, వీరందరనూ నడుపగలిగినవాడు భీష్ముడు గనుక ఆయనను అప్పుడాశ్రయించి "కుమారస్వామి దేవతల సైన్యాన్ని నడిపినట్లు తమరు నా ఈ సైన్యాన్ని నడపవలసిం"దని అర్థిస్తాడు.

భీష్ముడు తాను కౌరవ పక్షంలో యుద్ధం చేయక తప్పదన్న చిత్తంలో ఉన్నాడు గనుక సర్వసైన్యాధిపత్యం వహించడానికి అంతరంగికంగా అతడికభ్యంతరం లేదు. కాని ఈ దుర్యోధనుడు కర్ణుని సలహాలు పొంది వాటిని పాటిస్తుంటే తన సర్వసైన్యాధిపత్యాధికారం నామమాత్రం అవడమేగాక ఎన్నో చికాకులూ చిక్కులూ రావటం కద్దు. అందుకని ఆయన అంటాడు–"ముందు కర్ణునైనా పంపు లేదా నన్నైనా పంపు యుద్ధం చేయడానికి అంతేగాని–," అని చెప్పబోతున్నాడు తన మనసులోని మాట. వెంటనే కర్ణుడందుకొని, "ఈ విషయం క్రొత్తదేంకాదు– నేనిదివరకే చెప్పానుకదా! ముందు భీష్ముడు యుద్ధం చేసి పడిపోతేగాని నేను యుద్ధం చేయనని" అన్నాడు, వెంటనే భీష్ముడు "ఓహో అలాగయితే సరే"నని సర్వ సైన్యాధిపత్యం వహించాడు.

కర్ణుడు చెప్పే సలహాలను తెచ్చి నా సలహాతోసివేయరాదనే షరతు భీష్మునిది. చిత్రంగా కర్ణుడు–భీష్ముడు పడిపోయేవరకూ తాను యుద్ధమే చేయనంటాడు.

ఇది విధివశమనాలెనా-వద్దా! ఎప్పటినుంచో యుద్ధం చేయాలి అర్జునునితో అనుకొన్న కర్ణుడు ఇలా ఎందుకు వెనక్కు లాగేడు? అత్యవసరమైన క్షణాన అనిపిస్తుంది.

దానికి కారణం బహుశ ఒకటుంది. భీష్ముని సర్వసైనాధిపత్యం వహించుమని అడుగంగానే భీష్ముడు తానాపని చేయగలనంటూనె, నన్ను ఎదిరించేవాడెవరూ లేడీ భూలోకంలోకాని, అర్జునుడ్ని మాత్రం నేను జయించలేను. అతడికి నాకంటె ఎక్కువ శరవిద్య తెలుసును అన్నాడు. దాంతో కర్ణుడు ఈ భీష్ముడు అర్జునుని చేతిలో చావటం ఖాయం అనుకొన్నాడు. తాను యుద్ధంచేసి అర్జునుని గెలువడానికి కావలసినంత అవకాశం ఉంటుందనే నిర్ణయానికి వచ్చియుండచ్చు. ఈ లోగానే తాను యుద్ధంచేసి అర్జునుని జయించినా కీర్తి మొత్తం ఈ ముసలి భీష్మునికె వస్తుందిగాక.

అదీగాక మరొక భావంకూడా అతడి అంతరాంతరాల్లో ఉండియుండవచ్చు. భీష్ముడు పడిపోతె సర్వసైన్యాధిపత్యం తనకెవచ్చే అవకాశమున్నది. సర్వసైన్యాధిపతిగా తాను యుద్ధంలో పాల్గొనడం అతి ముఖ్యం అనుకొని ఉండవచ్చు.

ఈ నిర్ణయం నిశ్చయంచేసి భీష్ముని సర్వసైన్యాధిపతిగా అభిషేకం చేశారు కౌరవులు.

అప్పుడు బలరాముడు పాండవులవద్దకు తన కొద్ది పరివారంతోవచ్చి తాను సరస్వతీ తీర్థానికి వెళుతున్నాడనీ, ఈ యుద్ధం రాకుండా సంధి చేయవలసిందని తాను శ్రీకృష్ణునికి చెప్పినా అతడు చేయకపోయినాడనీ, కౌరవులు పాండవుల్ని పెట్టిన బాధలకు ధర్మరీత్యా కౌరవులీ యుద్ధంలో నశించటం ఖాయమనీ చెప్పి తానీ దుస్థితిని చూడలేక వెళ్ళిపోతున్నానంటూ వెళ్ళిపోతాడు. భగవదంశ కలిగిన బలరాముడు భగవంతుడే అయిన శ్రీకృష్ణుని అపార్థం చేసుకొని అతడే తను చెప్పినట్లు సంధిచేయక పోయినాడనటం ఏమిటి అనిపిస్తుంది. తను ఎలా సంధి చేయాలను కొన్నాడో శ్రీకృష్ణుడూ అలాగే సంధిచేయాలనుకొన్న విషయం మర్చిపోయినాడు కావలె. తను సంధికై వెళ్ళినట్లుంటె తాను సంధి చేయగలిగెవాడా? అనేది ఎవరూ చెప్పగలిగిన సంగతికాదు. కాని బలరాముడు మాత్రం సంధి సంభవమై యుండేది అని అనుకొన్నాడనిపిస్తుంది ఐతె మరి తానే ఎందుకు వెళ్ళే ప్రయత్నం చేయలేదో! శ్రీకృష్ణుడు భగవంతుడు గనుక అలా చేయగలడని బలరాముడు నమ్మి యుంటాడుగాక-తనపై తనకె అలాటి నమ్మకం ఒకవేళ లేకపోయినాను! ఉపాధి

అనగా శరీర ధారుఢ్యంవల్ల-అన్నగారైనందువల్ల-తాను మహాబుధుడు అనుకొనటం వల్ల-అలాంటి అభిప్రాయం బలరామునికయినా కలుగటం ఆశ్చర్యమైన విషయం కాదనేది గమనీయం।

రుక్మి శ్రీకృష్ణుని బావమరిది. అతడివద్ద విజయమనే కార్ముకం ఉంది. గాండీవం తరువాత అంతటి మహత్తు కలిగినది. దానిని ధరించి తన సైన్యంతో వచ్చి అందరి ఎదుటా అర్జునునితో గర్వపూర్ణుడై అంటాడు - నీవు యుద్ధాన్ని—

"చేయవెఱచితేనిం జెప్పునాకు
నెదురులేదు జగతి నెవ్వరు-నీకు దో
ద్పడి జయింతు నెట్టి పగఱనైన." అంటాడు.

అహంకార మెంతటి స్థితిలో మాట్లాడింపచేస్తుందో గమనించటం ఇక్కడ అవసరం. "నీకు చేతకాకపోతె నాకు చెప్పు చేస్తాను" అనే మాట యుద్ధం చేయాలనా? అధికారం చలాయించాలనా? చెప్పేది! అందుకని అర్జునుడన్నాడు. "గంధర్వ సేనను తరిమేటప్పుడూ విరాటుని గోవర్గాన్ని తప్పించి తీసుకపోయేటప్పుడూ నీ గొప్పదనం నాకు తెలికపోయిందయ్యా సరేలే వెరచానంటేగాని నీవు సహాయం చేయవుగనుక మాకక్కర్లేదు. నీ సహాయం అవతలివారికి కావాలేమో పోయి అడుగు" అన్నాడు. కౌరవులవద్దకెళ్ళికూడ ఇలాటి సమాధానమె రుక్మి పొందాడు. బలరాముడూ రుక్మి ఈ ఇద్దరూ తప్ప మిగిలిన రాజులందరూ ఈ యుద్ధంలో పాల్గొన్నారు.

ధృతరాష్ట్రుడు సంజయుని పిల్చి ఇలా అన్నాడు,

క. బవరము కీడని యెరుగుదు, నవినీతుండైన కొడుకునదలిచియుడుపం
దివిరియు నోరాదమి దైవవశం బప్పునికి మనకు వగపింకేలా?

క. ఎయ్యది కానున్నది యది యయ్యెడుజేయునది కలదె!
—అన్నాడు. ధృతరాష్ట్రుడి మనసు శ్రీకృష్ణుని విశ్వరూపం చూసినప్పటినుంచి సత్వగుణాత్మకమయింది. "నేను కొడుకు నదలించడానికి నోరురాని వాణ్ణయినాను. అది దైవవశం" అంటున్నాడు. ఎలా కావాలో అలా అవుతుంది. "ఇంక నా మనసులో వగపే లేదా విషయంలో" నంటున్నాడు అనేది గమనీయం.

ఇది పరమసత్యంకాదూ? ఉలూకుడనేవాడు పాండవుల దగ్గరకు దుర్యోధనా దులచేత పంపబడినవాడై వాళ్ళను సవాలుచేస్తూ రండి యుద్ధానికి ఎన్నో ప్రతిజ్ఞలు చేశారుగదా అని రెచ్చగొట్టాడని చెప్తున్నా శ్రీకృష్ణుడు అప్పుడు "తగినట్లుగా సిద్ధంగా ఉండండి. చేసిన వాగ్దానాలన్నీ చెల్లిస్తారు"అని పంపించేస్తాడు ఉలూకుని. ఉలూకుడు వచ్చి దుర్యోధనాదులకు ఆ మాటలు చెప్పగానే—భీష్ముడు దుర్యోధనాదు లకు ధైర్యం చెప్తాడు. నేనుండగా మీకు ఏ భయమూ లేదుగాక అని. ఇక ఎవరు అతిరథులు అనే సంగతి చర్చకు వచ్చింది.

దుర్యోధనుడడిగినమీదట భీష్ముడు తమలోనివారి లోని అతిరథులు ఎవరో చెప్తూ దుర్యోధనుడు, కృతవర్మ, శల్యుడు, భూరిశ్రవుడు, కృపుడు, ద్రోణాచార్యుడు, అశ్వత్థామ బాహ్లికుడు అన్నాడు. సమరథులు, దుర్యోధనుని తమ్ములూ, సుదక్షిణుడూ లక్ష్మణకుమారుడూ, బృహద్బలుడూ, దండధారుడూ, శకుని, హలాయుధుడూ, భగదత్తుడూనన్నాడు. మహారథులు సైంధవుడూ, త్రిగర్తపతులయిదుగు రూను. అర్ధరథులు నీలుడూ విందాను విందులూ కర్ణుడూ నన్నాడు.

కర్ణుడు అర్ధరథుడు గావడానికి కారణం చెప్పాడు—ఏమంటే అతడికి కవచ కుండలాలు పోవటం, పరశురాముని శాపముండటమూను—అన్నాడు భీష్ముడు. వెంటనే ద్రోణుడు ఇంకో ముఖ్యవిషయం చెప్తాడు. కర్ణుడు యుద్ధంచేసే సమయంలో హఠాత్తుగా ఒక్కొక్క క్షణంలో మతిని పూర్తిగా కోల్పోతూ ఉంటాడు—అమనస్కుడవుతూ ఉంటాడు. ఈ విభాగం ఇలా చేయటంతో కర్ణుడికి భీష్మునిపై ఉద్ధృతమైన కోపం వస్తుంది.

వెంటనే భీష్ముని ఎదిరించినవాడై "నీవే అర్ధరథుడ" వంటాడు. దుర్జనుడ వంటాడు. ఎన్నో మాటలాడుతాడు. భీష్ముడు—"ఈ దుర్యోధనుడు పెద్ద బరువు నా నెత్తిన పెట్టటంచేత నిన్ను క్షమించుతున్నానుగాని లేకపోతే చంపేసేవా"ణ్ణంటాడు. అప్పుడు దుర్యోధనుడు ఇద్దర్నీ సర్దిచెప్పి పాండవుల్లో అతిరథమహారథులెవరో చెప్పవలసిందంటాడు.

అప్పుడు భీష్ముడు అతిరథులెవరంటె యుధిష్ఠిరుడు, భీముడు, సాత్యకి, అభిమన్యుడు, ధృష్టద్యుమ్నుడు, సేనాబిందుడు, పాండ్యుడు, కుంతిభోజుడు, ఘటోత్కచుడు, అని చెప్పి ఇంకా కూడ ఉండి యుండవచ్చునన్నాడు.

సమరథులు :- కవలు, ఉత్తరుడు, కాళ్యుడూను. మహారథులు-ద్రౌపదీయుల యిదుగురు, విరాటుడు, శిఖండి, ధృష్టకేతు, భోజుడు, వానితమ్ములు, ఉత్తమౌజుడు, సత్యజిత్తు, కేకయ పతులయిదుగురు, కాశీరాజు, నీలుడు, సూర్యదత్తుడు, శంఖుడు, విరటుని జ్ఞాతులు, చిత్రాయుధుడు, చేకితానుడు, రోచమానుడు-వీరు. ఇక అర్థ రథులు ధృతవర్ముడు మొదలైనవారు అన్నారు.

ఇక అర్జునుడు ఏ తరగతి అని చెప్పే అవకాశంలేదు ఎవరికీకూడ. వాసు దేవునితో కూడియున్నవాడాతడు. అభిమన్యుడూ అంతటివాడే. మనలో అశ్వత్థామ శక్తికూడ అంతటిదే-నన్నారు. ఇంకా అన్నారు.

"ఒక్క విషయం ముఖ్యమైనదేమంటే పైన చెప్పిన తరగతుల వాళ్ళల్లో ఎవరూ నా ముందు నిలువనే నిలువజాలరు. కాని శిఖండి ఎదుట మాత్రం నేను నిలువను. ఎందుకంటే అతడిని నేను వధింపను. అతడు నా ఎదుటకు రాకుండా మీరుచేసికొనాలి". అన్నారు.

వెంటనే దుర్యోధనుడు అందుకు కారణమేమిటో చెప్పవలసింది అని అడుగు తాడు. దానికిగాను భీష్ముడు వారికి అంబోపాఖ్యానమంతా కథగా చెప్తాడు.

## 4. అంబోపాఖ్యానము

భీష్ముడు దుర్యోధనునకు చెప్తున్నాడు-శిఖండి పూర్వజన్మలో అంబ అనే కాశీరాజపుత్రి. మా తండ్రి శంతనుడు పోయిన తరువాత చిత్రవీర్యుడు కొన్నాళ్ళు రాజ్యంచేసి చనిపోయినాడు. విచిత్ర వీర్యునికి పెళ్ళికాలేదు. అతడికోసం కాశీరాజు తన కూతుండ్రు ముగ్గురకు స్వయంవర మేర్పాటు చేశాడని విని వాళ్ళను బలిమితో ఇతర రాజుల నోడించి తెచ్చాను. వారిలో పెద్దది అంబ. ఆమె తాను సాళ్వుని ప్రేమించినట్లూ, తన తండ్రి అది ఎరుగక స్వయంవరం తనకుకూడ ఏర్పాటు చేసినట్లు చెప్పింది. అందుకని ఆమెను కొందరు పుంస్త్రీలతోపాటు సాళ్వునివద్దకు పంపాను.

సాళ్వుడు ఆమెను గ్రహించలేదు. ఆమె తిరిగి నా వద్దకు వచ్చినా ప్రయోజనం లేదని నామీద పగబట్టి సాధించాలని తపసు చేయడం ఆరంభించి అనేక తీర్థాలు తిరిగింది. ఒక పుణ్యస్థలంలోనున్న సమయాన హోత్రవాహనుడనేటటువంటి-ఆమె తాతగారు-తల్లితండ్రి-వచ్చి ఆదరించి, పరశురాముని ఆశ్రయించినట్లయితే

ఆమె కోరిక తీరగలదంటారు. పరశురాముడు ఆ మరునాడే రావడంవల్ల ఆమెను పరిచయంచేసి ఆమెను ఉద్ధరించుమంటారు. ఎలా ఆమెనుద్ధరించడం? సాల్వుని ప్రసన్నుని చేయడమా లేక భీష్ముని ప్రసన్నుని చేయడమా? అని ఆయన అంబని ప్రశ్నిస్తాడు. ఆమె సాళ్వుని ప్రసక్తి వద్దుగాక—భీష్మునే సాధించాలని తపస్సును ఆరంభిస్తున్నానంటుంది. అసలుపోయి కొసరుందన్నట్లు సాల్వుని ప్రేమకాదు మిగిలింది. నాపై పగ ఇదె వాసనగా అనేది.

పరశురాముడు భీష్మునికలసి ఈమెను నీ తమ్మునికి పెండ్లిచేసికోవలసిందంటాడు. ఈ కోరిక యథాతథంగా అంబ కోరినట్లు లేదుకాని ఈ స్థితిలో ఆమె తనకది సమ్మతం కాదని మాత్రం చెప్పలేదు. భీష్ముడొప్పుకొనక అది అధర్మమన్నాడు. "ధర్మం ఇదీ అని చెప్పగలవాడ్వైన నన్ను శిష్యుడవై ధిక్కరిస్తున్నావు కాచుకోమన్నాడు" పరశురాముడు భీష్ముని.

భీష్మ పరశురాముల కిద్దరకూ బ్రహ్మాండమైన ఖండనం ఇరవయిరెండు రోజులు జరిగింది. గంగాదేవి వద్దని చెప్తే ఎవరూ వినకపోయినారు. కొన్నిసార్లు పరశురాముడూ కొన్నిసార్లు భీష్ముడూ యుద్ధంలో మూర్ఛపోయి లేచారు. భీష్ముని గంగా, అష్టవసువులూ కాపాడుతున్నారు. ఒకనాటి రాత్రి అష్టవసువులు భీష్మునకు సమ్మోహనాస్త్రమనేదాన్ని ప్రయోగోప సంహారాలుపదేశించి యుద్ధానికి పంపారు.

ఆనాడు యుద్ధం చాల పట్టుదలతో నడిచింది. పరశురాముడు బ్రహ్మాస్త్రమే ప్రయోగించాడు. భీష్ముడూ దాని నెదుర్కోడానికి బ్రహ్మాస్త్రమే ప్రయోగించి అదే సమయమనుకొని సమ్మోహనాస్త్రాన్ని గురువైన పరశురామునిమీద ప్రయోగింపబోతున్నాడు.

ప్రపంచం ధర్మాఽధర్మాలతో సమ్మిశితమై యున్నా ధర్మం నశించిపోతోందన్న సమయానికి దేవతలూ భగవంతుడు జోక్యం కలిగించుకోవటం భారతంలో ఉంది. నారదుడు దేవముని, ఆయన అక్కడ ప్రత్యక్షమై భీష్ముని 'ఆగాగు' మన్నాడు. అదుగో అష్టవసువులు వచ్చారు నిన్ను ఈవనినుంచీ ఆపడానికి చూడమని వారిని ఎదుట చూపించాడు. వాళ్ళు ఈ నారదముని చెప్పినట్లు వినుమన్నారు. ఇంకా ఇంకా ఎందరో మునులు వచ్చారు. వారంతా గంగాదేవితో మాట్లాడారు. ఆమెను తీసికొనిపోయి పరశురామునితో మాట్లాడారు. ఒక క్రమానికి భీష్మ పరశురాములు అంగీకరించి తమ అస్త్రాలనుపసంహరించుకొన్నారు. అంబను పిల్చి పరశురాముడు

తాను ఆమెకు చేయగలిగిన సహాయమింకేమీ లేదనీ తన కోపి నంతా చేయడమయి పోయిందనీ అన్నాడు. ఆమె తపసే శరణ్యమని వెళ్ళిపోయింది. ఆమె భీష్ముని చంపడానికే శపథం చేసింది. ఆ జన్మలో నైనాసరె తరువాత జన్మలోనయినాసరె. జన్మాంతాన మిగిలే కాంక్షలే వాననలు. వాటిని సాధించాలనే మళ్ళీ పుట్టటం వేషం మార్చి.

తరువాత చాల కాలానికి ఆమెకు శివుడు ప్రత్యక్షమై ఆమె కోరికను తరువాతి జన్మలో ఆమె తీర్చుకొనగలదని చెప్పాడు. ఆమె ద్రుపదునకు ముందు బాలికగా పుట్టి తరువాత కుమారుడై శిఖండి అనే పేరుతో భీష్ముని చంపవలసిందన్నాడనికూడ నారదుడు భీష్మునకు చెప్తాడు.

ద్రుపదుడు భీష్ముని చంపగలిగిన కుమారుడు కావాలని శివునిగూర్చి తపసు చేశాడు. శివుడు శిఖండిగా బాలికగాపుట్టి తరువాత పురుషుడై అర్జునుని సహాయంతో భీష్ముని చంపగలడని అనుగ్రహించాడు.

అలాగే ఆ ద్రుపదునికి బాలిక వుడితే ఆమె ఎలాగయినా పురుషుడు అవుతాడుగదా అని కొడుకేనని చెప్తూ దశార్ణ దేశ రాజు కూతురునుదెచ్చి వివాహం చేస్తారు. కాని ఆ పెళ్ళికూతురు ఈ పెళ్ళిపీటలమీద మనిషి కేవలం బాలికేనని గ్రహించి అప్పటికూరుకొని ఇంటికి వెళ్ళి దాసీకి చెప్తుంది. ఆ దాసీ అందరికీ చెపుతుంది. ఆమె తండ్రిగారికి కోపం వస్తుంది. ఎవరిచేతనో ముందు కబురుపంపి అసలు విషయం తెలిసి రమ్మంటాడు. ఆ మనిషితో ద్రుపదాదులు నిశ్చయంగా శిఖండి మగవాడేనని బుకాయించి పంపేస్తాడు. దశార్ణరాజు తృప్తినందక వెంటనే ద్రుపదునిమీదకు దండెత్తి వస్తాడు.

పెద్ద చికాకు వచ్చిందని యెరిగి శిఖండి తాను ఆత్మహత్యైనా చేసుకోవాలని అడవిలోపలికి వెళ్తుంది. అక్కడ స్థూలకర్ణుడనే యక్షుడు వచ్చి శిఖండి ఏడ్వటం చూసి ఆమెకథ విని, దయాకరుడై సహాయం చేయ నిశ్చయించి, తన పురుషత్వాన్ని శిఖండికీ, శిఖండి కన్యాత్వం తనకూ అంతరణచేసి తిరిగి ఇంటికి వెళ్ళి నీవు పురుషుడవని నిరూపించి ఒక పదిరోజుల్లో తిరిగి వచ్చేసెయి. నా పురుషత్వం నేనూ నీ స్త్రీత్వం నువ్వూ పొందుదామంటాడు. ఆ తరువాత ఎప్పుడో శివుడి వరం

ఫలించి శిఖండి పురుషత్వం నిలుస్తుందని ఇద్దరూ నమ్మి ఈ సంవిద నేర్పాటుచేసి కొన్నారు.

శిఖండి తిరిగి ఇంటికివెళ్ళి తాను మగవాడని నిరూపించేసరికి దశార్ణదేశాధీశుడు సిగ్గుపడి ద్రుపదుని మర్యాదలంది తిరిగి వెళ్ళిపోతాడు. శిఖండి సమయ ప్రకారం తిరిగి స్థూల కర్ణుని అడవికి వెళ్ళేసరికి స్థూలకర్ణుడు స్త్రీ రూపంలోనే వుండి తనకు కుబేరుడు శాపమిచ్చాడనీ-దాని ప్రకారం తాను స్త్రీగానే ఉండిపోవాలనీ, శిఖండి బ్రతికియున్నంతవరకూ ఇది తప్పదనీ ఆ తరువాత తిరిగి తాను పురుషుడవుతాడనీ చెప్పాడు. ఈ విధంగా శిఖండి పురుషుడైనాడు. ఇతడ్ని నేను ఎదుర్కొననని ప్రతినచేశాను అన్నాడు భీష్ముడు. దుర్యోధనుడు నిట్టూర్చాడు. రేపటినుంచి కురుక్షేత్ర యుద్ధం.

ఇది ఉద్యోగపర్వం



# మహాభారత కథలు

## భీష్మ పర్వము- ప్రథమాశ్వాసము

### 1. విద్యాక్రమణిక

భారతం వేదార్థ బృంహితం. ఎందుకనంటే వాచ్యార్థంలో ధర్మప్రతి పాదకమూ, పరమార్థంగా వేదాంతార్థమూలను చెప్పి మోక్ష సాధనను తెలియజేస్తుంది గనుక. యుద్ధపర్వాల్లోకూడ ఆపరమార్థమె ద్యోతకమవుతుంటుంది.

మహా వాక్యాల అర్థమె మోక్ష సాధనం: "అహంబ్రహ్మాస్మి" వాక్యం ఏమంటుందంటే "వ్యక్తి తానే భగవంతుడని తెలియాలి" అంటుంది. ఈ సాధనను క్రిందటి పర్వాలు అనేక ఆఖ్యానాల్లో ఉపాఖ్యానాల్లో సూచించినయి. సాత్త్వికులయిన పాండవులు దుర్వృత్తులయిన కౌరవులు పెట్టే చిక్కులనుండి తప్పించుకొని నిర్వృతి తత్త్వాన్ని (శ్రీకృష్ణుని) చేరడానికి చేసిన సాధన అది. కాని, "నేను బ్రహ్మను" అని తెలిసి సమాధిలో ఉంటే చాలదు సాధకుడు. ఆ తరువాతిదైన "సర్వంఖల్విదం బ్రహ్మ" సాధనకూడ చేయాలి. బ్రహ్మమే అయిన 'తాను' తిరిగివచ్చి ప్రపంచమంతా బ్రహ్మమేననే సమదర్శనం పొందాలి. అది అజ్ఞాతవాసంలో పాండవులారంభించారు.

ఆ తరువాత–ఇంకాసత్ వృత్తులుంటే–వాటిని సంతరించుకోవటం చేయాలి. అందుకె ఉద్యోగపర్వంలో బలాలు సేకరణ జరిగింది. పాండవులు సేకరించిన బలాలు సత్ వృత్తులనిబోధ. ద్రుపదుడు–విరాట్ – ఈ పేర్లలో ఆ సత్‌వృత్తులు సూచింపబడినై.

సాధనతో దుర్వృత్తులు తమకు అడ్డం రాకుండా సాత్త్వికవృత్తులు సంధిచేసికొనాలని ధర్మరాజు ఆశయం: కాని దుర్వృత్తులు అందుకు అంగీకరించలేదు. నిష్పక్షపాతీ నిర్వృతితత్త్వ ప్రతీక అయిన–శ్రీకృష్ణుడు,–ఆ దుర్వృత్తుల్ని నాశనం చేస్తేనేగాని మోక్షం రాదని చెప్పి యుద్ధం చేయడానికె నిశ్చయం చేయించాడు.

భీష్ముడు కర్మయోగి. సత్‌వృత్తులతో చేరవలసినవాడె. కాని దుర్వృత్తులకు సహాయపడుతున్నాడు. అందుకని అతడు అసమగ్ర కర్మయోగిగా మాత్రమే అయి

నాడు. కర్మయోగీ సత్‌ప్రవృత్తిపరుడూ అవడంవల్ల అతడిని జయించడానికి ఋజు ప్రవర్తకుడైన అర్జునునకు పదిరోజులు పట్టింది. అలాగె ద్రోణుడూ అసమగ్ర జ్ఞాన యోగె. అతడ్ని జయించడానికి ఐదురోజులు పట్టింది; కర్ణుడు అసమగ్ర యోగమూ ర్గావలంబి. ఇతడిని జయించడానికి రెండు రోజులు పట్టింది. శల్యుడు ద్వైతానికి ప్రతీక. ఒక్క రోజంతా పట్టింది జయించడానికతడ్ని. అశ్వత్థామ జ్ఞానె కాని దుర్వృత్తులతో కలిశాడు. ఋజుతత్త్వ ప్రతీక అయిన అర్జునుడు, నిర్వృతితత్త్వ ప్రతీక అయిన శ్రీకృష్ణ సహాయంతో అభయుడైన భీముని సహాయంతో మాత్రమె వీరినందర్ని నిర్జింపగలిగాడనేది జ్ఞాపకముంచుకోవాల్సిన బోధ—

ధృష్టద్యుమ్నుడంటే జ్ఞాన ప్రకాశం కలవాడని అర్థం. అతడు సర్వసైన్యాధి పతి. భీముడు రక్షకుడు. అతడభయుడు. అభయుడే రక్షకుడు. ఇది తత్త్వ విష యం. తత్త్వ విషయం తరిచిచూస్తెగాని తెలీదు. అందులో ఆసక్తి లేనివాళ్లు కథను మాత్రమే విని అనందించాలి. ఈ తత్త్వ విషయక విద్యను నేర్వడానికి నిరచి చూడటమె కీలకం.

## 2. తామసం నుంచి సత్త్వానికి

కౌరవులూ పాండవులూ యుద్ధానికి సన్నద్ధులై కురుక్షేత్రం చేరారు. రాజ ప్రాసాదంలో ధృతరాష్ట్రిదులు కొందరే ఉన్నారు. ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుని విశ్వరూపాన్ని దివ్యదృష్టి కలిగి చూసినప్పట్నుంచీ సద్బుద్ధిని సంతరించుకొంటు న్నాడు. మనిషికి శరీరం, మనసూ బుద్ధీలని మూడున్నయి. ఇంతకుపూర్వం ధృత రాష్ట్రుడి శరీర మనోబుద్ధులు మూడూ స్వార్థంతోనే, పుత్రులమీది మమకారంతోనే, మంచీ ధర్మం వీటిని తోసేసి మనినట్లు అవుపడింది. ఇకముందు కొంత మార్పు మనకె తెలుస్తుంటుంది. మనిషికి, ముందు మంచికి మారేదీ_మారకలిగిందీ బుద్ధి- ఎందుకనంటే శరీరానికి మనసుకూ కార్యకారణ సంబంధ సూత్రం ఆలోచిస్తే కార్య కరణ సంబంధం అర్థం చేసికొని "పూర్వపు బుద్ధి సరికాదు_ఇదీ సరియైనది" అనే తర్కయం చేయగలుగుతుంది. ధృతరాష్ట్రుడిప్పుడీ స్థితిలో ఉన్నాడు. శ్రీకృష్ణుడు గోపికల్ని ఉద్ధరించాడనీ మధురావాసుల్ని కొందర్ని ఉద్ధరించాడనీ వింటాము. వాళ్ళు సత్త్వగుణులూ, రజోగుణులూ కావటంచేత ఉద్ధరించాడనటంకద్దు. కాని అజ్ఞానాంధు డైన ధృతరాష్ట్రుని బుద్ధిని ముందుగా మంచివైపుకు త్రిప్పిందీ శ్రీకృష్ణుడె. ఇవ్వ

ాపిన రాజరికం, ఆరోమగడుగా ఉండే తనం వదలించి కర్ణుని స్థిరతకు తెచ్చింది ్రీకృష్ణుడే!

ఇంటిదగ్గర తాపీగా కూర్చొని ఆలోచిస్తున్న ధృతరాష్ట్రుడు సంజయుడితో ంటాడు—ఈ భూమి కోసం కౌరవ పాండవులు కాంక్ష పెంచి ఒకరితో ఒకరు ోట్లాడి చస్తారల్లే ఉంది. ఇలాంటి లుబ్ధ బుద్ధులుంటారా? అని, అందుకు మనసు ంతవడిపోతోంది. దానికి ప్రస్తుతం శమం కలుగజేసేవారు కావాలి. అందుకే ాయి ఉంటుంది. వేదవ్యాస మహర్షి విచ్చేశాడు. అయన ధృతరాష్ట్రుదులచేత ిత్కృతుడై అంటాడు. "నాయనా, కాలం అయిపోయి రాజులు యుద్ధంలోకి దిగిపో ుినారు. దీనికోసం చింతపడిపోకు. ఆ నాశనం చూస్తానంటే నీకు దివ్యదృష్టినిస్తా" ంటాడు. శ్రీకృష్ణుడి దృష్టి ఇస్తానన్నప్పుడు ధృతరాష్టుడు "ఈ లౌకికమైన దృష్టి ందుకునాకు? ఇక నిన్ను చూచిన మధురానుభూతి చాలు" అన్నాడు. అలా అనడా ికి కారణం భగవదిచ్ఛ మాత్రమే. ఇప్పుడు వ్యాసుడా దృష్టి ఇస్తానన్నప్పుడు చూడ లసి వచ్చేది రాజుల మరణాలూ నాశనమూ కావటంవల్ల వద్దన్నాడు. ఒకవేళ పాండవులు చచ్చినా చూడలేడు. కొడుకులేచస్తే అసలే చూడలేడు. ఇదీ ధృతరా ష్ట్రుని స్థితి. కాని తనకు జరిగిన సమాచారం ఎవరైనా చెప్తే వినాలని ఉందన్నాడు. వ్యాసుడు అక్కడే ఉన్న సంజయునికి దూరశ్రవణం, దూరదర్శనం, మనోరహస్య సాధనంవంటి శక్తులనిచ్చి ఆయుధాలు అతడికి తగులవుగాక అని వరమిచ్చి ఎప్పటి కప్పుడువచ్చి యుద్ధ విషయాలు ధృతరాష్ట్రునకు చెప్పవలసిందని ఆజ్ఞ ఇచ్చాడు. భగవంతుడైన శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని బుద్ధియందు వేసిన బీజం పెరిగి మొక్క వడానికి గాను వ్యాసుడు ఈ ఏర్పాటు చేశాడనిపిస్తుంది. బుద్ధిచేత మనసు జయించ బడాలి. బుద్ధి సరియైన దోవవైపు తిరిగినంత మాత్రంచేత చాలదు. మనసూ శరీరం కూడా అనుకూలించాలి. లిరగబడకూడదు. అదీ సాధన.

వ్యాసమహర్షి మళ్ళీ అంటున్నాడు—ధృతరాష్ట్రునితో—"నీ బిడ్డల్ని పిల్చి సర్ది చెప్పి నీ తమ్ముడి రాజ్యం పాండవులకిప్పించెయ్యి. శాంతి కలుగుతుంది. చూడు నాయనా! మా వంటి (కండ్లున్నవాళ్ళము) వాళ్ళకే ఈ రాజ్యం ప్రియం కాకుండా ఉంది. అది నీ కెందుకయ్యా!" అన్నాడు. వెంటనే ధృతరాష్ట్రు దండుకొంటాడు వ్యాసుని స్థాయిని! "స్వామీ మీరు చెప్పింది హితమైన మాట. (ఆత్మోన్నతికి తగిన మాటన్నమాట) నేనీ సంగతిని గ్రహించిన తరువాతకూడ పిల్లలకు చెప్పడానికెంతో ప్రయత్నం చేశాను. ఇక వాళ్ళకు చెప్పగలిగినవాడను కానునేను. నాకు మించిన

కార్యమది'' అన్నాడు. ఇలా ఎందుకన్నాడు? తను చెప్తే వాళ్ళెందుకు వినరు. వాళ్ళ అర్థంకాదనా? తనకు కలిగిన యుక్తాయుక్త వివేక జ్ఞానం వాళ్ళకు చెప్పలేకపో మనేదానికి అర్థమేమిటి? అనిపిస్తుంది. కాని దానికి కారణం మొన్నటివరకూ తా దుష్ట చతుష్టయంతో ఏకీభవించి పనులు చేసిన కారణం అయ్యుండాలి. అందుచేత తాను ఇప్పుడు చెప్పేమాటలు వెన్క్కు తిరిగి వస్తవని భయం. అందుకే సమయ మించిపోయిందని ధృతరాష్ట్రుడంటున్నది. వ్యాసుడప్పుడు "ఐతే ఇంకేమన్నా తెలిసికొనాలనుకొంటున్నావా'' అంటాడు. తన పొరపాటో-కొడుకుల తప్పో-ఏ ఒకటి కారణంగా యుద్ధం వచ్చింది. వ్యాసమహర్షి దివ్యజ్ఞాని కనుక ఒకవేళ చెప్తా మోనని "ఈ యుద్ధంలో ఎవరు గెలుస్తారో చెప్పు''మని కోరతాడు. అందుకు ఋషి "యుద్ధ ఫలితం వైపునకే ప్రయాణించే ఈ ప్రపంచంలోని అనేక శకునా చూస్తుంటే మంచే కలుగుతుందనిపిస్తోంది. ఐనా యుద్ధ ఫలితం దైవాధీనమైంది ముందెవరూ చెప్పలేము'' అని వెళ్ళిపోయినాడు.

శుభశకునాలున్నయి అంటూనే చెప్పలేమంటాడేమి వ్యాసమహర్షి? కర్మఫల ఎప్పుడూ అన్నిచోట్లా కచ్చితంగా ఒకే ఒకటై ఉండదు. పెద్ద వరదలో వేలా జనం చచ్చిపోతే పదినెల్ల పసిపిల్ల ఒక చెట్టు కొమ్మమీద ఇరుక్కుపోయి బ్రతికిందం వరదననుభవించడం వరకే ఆపిల్ల ప్రారబ్ధం. మిగతావాళ్ళకు శరీరం వదలిపోవడ కూడాను. శకునాదులవల్ల ఏదో కష్టానికి గురిఅయే అవకాశం, చెప్పచ్చుగాక. కా వారివారి పూర్వ లేదా తత్కాల కర్మల ఫలితంగానే వారికి ఫలితం కలుగుతు టుంది. అంతేగాక పాండవులు గెల్చి ధర్మం నిలబడుతుందని తెలిసి వ్యాసుడి మంచి అనిపించింది. ఆ ఫలితం ధృతరాష్ట్రునికి తెలిస్తే వెంటనే దుఃఖించదా సుఖించలేకపోను. తాను యుద్ధం ఆపలేడు! ఫలితం వ్యతిరేకం! ఫలం? దుఃఖ లేదా ఉదాసీనం. వ్యాసుడు "మంచె'' అని వెళ్ళిపోయినాడు. ఆ మహర్షి మనసున పట్టుకోవటం ధృతరాష్ట్రుడి వంతు. అది అతడి కర్తవ్యం. అందుకనె ఆయన చెప్ప కుండా వెళ్ళిపోయాడు.

సంజయుడు ధృతరాష్ట్రునికి ఈ భూమి ప్రమాణం అందులోని నవఖండాలు చెప్పి మేరువుకు దక్షిణ ఖండమె భారత వర్షమనీ చెప్పి అందులో ఇంతకు పూర్వ రాజులంతా ఎన్నోసార్లు కొట్టుకుని నశించారనీ అందుచేత ఇప్పుడు కౌరవ పాం వులు పోరాడటం అది ఆశ్చర్యమేమీకాదనీ అన్నాడు. ఇందులో ఎవరు గెలుస్తార ఎవరు గెలవరనేది చాల రొటీన్ విషయం. భగవంతు డెటు ఉంటె అటు గెలుస్తార

న్నాడు. తాను వెళ్ళి యుద్ధం కొంత అయిం తరువాత సమాచారం చెప్పడానికి ను వస్తానని చెప్పి వెళ్ళిపోయినాడు.

ఒంటరిగా ఉన్నప్పుడే బుద్ధి ఆలోచించాలి. ఆ ఆలోచన మంచికి తిరిగితే నిషి బాగుపడుతాడు. లేదా కేవలం ఇంద్రియ సంబంధమైన విషయాలవైపు నుభవాలవైపు తిరిగితే కృశించిపోతాడు. ధృతరాష్ట్రుడు మరి ఎలా ఆలోచిస్తున్నా నేడి చివరకతడు సంయమిగా శరీర త్యాగం చేసేదాకా పెరిగాడు గనుక చివర రకూ ఇక సరియైన ఆలోచనలే చేస్తున్నాడని చెప్పవచ్చు.

ఇన్నాళ్ళూ కౌరవులతో చేరి చేసిన దుర్నయాలవల్ల ధృతరాష్ట్రుడి అహం కారం ప్రజ్వలించింది దుష్టత్వంతో, కాని శ్రీకృష్ణ దర్శనం వ్యాసబోధనం సంజయుని సలహా భారతయుద్ధ క్రమాల కారణంగా అహంకారం శమించి ఒరిగిపోవడం ధృత రాష్ట్రుని ప్రవర్తనంలో చూస్తాము. అతడింకా మనసూ శరీరాల్నీ దోవకు తెచ్చుకో వలసి ఉన్నాడు. అవి హఠాత్తుగా తిరగబడి అతడిచేత పాండవులకు వ్యతిరేకంగా మాట్లాడడమనే పనిని చేయిస్తుండటం అవుపడుతూనే ఉంటుంది గాక, ప్రతి మనిషీ కూడ ఇలాగే ముందు బుద్ధిని దోవలో పెట్టి నెమ్మదిగా మనసును మరలించుకోవాలి. శరీరం బాగపడానికి అభ్యాసం అవలంబించి చెయ్యాలి. చచ్చేలోగా శరీరం వంగక పోయినా తరువాత కలిగే శరీరం మనోబుద్ధులకు అనుకూలంగానే రాగలదనేది ఋతము.

## 3. యుద్ధ సంరంభం

సంజయుడు యుద్ధరంగంనుంచి పది రోజుల తరువాత తిరిగి ధృతరాష్ట్రుని వద్దకు వస్తాడు. భీష్ముడు యుద్ధంచేస్తూ దెబ్బతిని పడిపోయినాడని రోదిస్తూచెప్పాడు అస్త్రాలనే శయ్య చేసి అతడ్ని పడుకోబెట్టారు. పదిరోజులు పాండవ సైన్యాలను చెండాడి చివరిరోజున శిఖండి బాణాలకు వ్రాలిపోయినాడని ఆక్రోశించాడు సంజయుడు.

ఈ సంగతి వింటూనే ధృతరాష్ట్రుడు మూర్ఛబోయి శైత్యోపచారాల తరువాత లేచాడు. "దేవాఽసురులొక్కటై అయన్ను జయించలేనంతటి మహా మహుడు శిఖండి అనే కృత్రిమ వాయువుచేత అణగిపోయాడా, అంతటి సామర్థ్యం శిఖండి

ఎలా గడించాడు? ఆ భీష్ముని శౌర్యం బలం శీలం పరాక్రమం అవన్నీ అనాశనమ కదా అనుకొన్నాము!" అంటాడు.

"శిఖండి తాతగారిపైకి విజృంభించినపుడు మిగతా కౌరవులంతా ఏమయిపోం నారు? అడుకోటానికి పోయినారా? ఓహో ధర్మపరుడైన నా తండ్రిని తమ తాతః చంపి రాజ్యం పొందాలని పాండవులు తొడరినారా? పాపం పుణ్యం ఆలోచించేవాళ లేకుండా పోతున్నారా? జూదంనాడే యుద్ధం చెయ్యాలి చెయ్యాలని ఉవ్విళ్ళూ తుండే ఈ కౌరవులకు ఆధారమే భీష్ముడనుకున్నాము. ఇప్పుడింకా వీళ్ళ కెవ ధారం?" అంటున్నాడు ధృతరాష్ట్రుడు.

తండ్రివంటివాడు మరణశయ్య చేరటం ఒక దుఃఖం. చిన్నప్పటి నుం అతడ్ని ఆధారంచేసి యుద్ధానికి లాక్కొచ్చిన తన పుత్రులకు ఆధారం కాస్తా అణ పోవటం ఇంకో దుఃఖం. ఈ దుఃఖాలు మనసుకు వెంటనే కలిగేవె. వీటిః నియంత్రణ చేయాలంటే బుద్ధి ప్రధానం. పుట్టినవాడు చావడం ఖాయం. యుద్ధమన్న తర్వాత చావులు చూడాల్సిందె. వినాల్సిందె. ఒక క్రమానికి ధృతరాష్ట్రుడు ఈ సంగతి గ్రహించి దుఃఖంమాని జరిగిన యుద్ధక్రమం చెప్పవలసిందంటాడు. జరగ కూడంది జరిగింది. ఇక నేదైనా వినగలను. చెప్పెయి: విశదీకరిస్తూ యుద్ధం సంగతి చెప్పేయ్యమంటాడు—

## 4. భీష్మాభిషేకం

అప్పుడు సంజయుడు జరిగిన యుద్ధ కథను చెప్తాడు. మర్నాడు సేనాధిపతు లంతా సైన్యాలతో సహా వెళ్ళి యుద్ధ రంగంలో నిలుస్తారు. అప్పుడు భీష్ముడు రాజులనందరనూ పిలిచి ఇలా చెప్పాడు. "ఇది యుద్ధం! మనకు సంక్రమించింది. ఇది వచ్చేవరకే వారిది తప్పు—వీరిది కాదు అనే వివాదాల చర్చ. ఇది వచ్చిన తరు వాత ఇందులో పాల్గొనే రాజులందరకూ గెలవడమో చావడమో ఇదే వ్రాయబడిన వ్రాత. గెలిస్తే ఈ ప్రపంచ సుఖాలు పొందడం. చనిపోతే స్వర్గం చేరచ్చు. ఆ సుఖాన్ని పొందచ్చు. ఇంట్లో ఉండి రోగంతో చచ్చేవారికి ఈ స్వర్గ ద్వారం తెరిచి ఉండకపోవచ్చు. కనక చచ్చేదాకా యుద్ధం చేసి చివరకు మిగిలి వుంటే గెల్చాం అనుకోవటమే మీరిక చేయాల్సిన పని" అంటాడు.

యుద్ధంలో సైనికుని మనస్తత్వం భీష్ముడు చెప్పినట్లు ఉండాలి. ఆ యుద్ధ రంగంలో ప్రేమ దయ దాక్షిణ్యం ఉండాల్సిన పనిలేదు. కోపం, అసూయ, ?గ ఇవి ఉన్నట్లే ఉంటవి గాని నిజానికి అవి ఉండనేరాదు. యుద్ధం చేయడం కర్త ?్యం కనక చేయడమేగాని నీ స్వంత మేధలో ఉన్న పగ దీర్చుకొనటం కాదు. ?నేది ముఖ్యంగా గమనీయమైన విషయం.

అంతా ఉత్సాహంతో యుద్ధానికి ఉన్ముఖులవుతారు.

దేవతలూ గంధర్వులూ కిన్నరులూ అంతా వచ్చి ఆకాశంలో ఈ యుద్ధం చూడాలనే ఆసక్తితో నిల్చున్నారు.

అప్పుడు పాండవులు కూడా యుద్ధ రంగానికి వరుసగా వస్తారు. వారి సర్వ సైన్యాధిపతి ధృష్టద్యుమ్నుడు అర్జునుడు, భీముడు, యుధిష్ఠిరుడు, కవలు ఇంకా ?ందరూ అక్కడకు చేరుతారు. ధర్మరాజు సేనాధిపతుల్ని పిల్చి 'గెలవడమో ?ావడమో' ఇదే కర్తవ్యం అని బోధించాడు.

ధృతరాష్ట్రునికి సందేహం కలుగుతుంది. "వారూ వీరూ ఒకచోట చేరి ?ప్పుడు కౌరవుల బలగం చాల పెద్దదిగానూ దానితో పోల్చి చూస్తే పాంతవుల ?లం చిన్నదిగానూ అవుపడుతూనే ఉంటుంది గదా? పాండవులు యుద్ధం చేయా ?ిందేనని సాహసించడానికి కారణమేమిటి" అని సంజయుని అడుగుతాడు. సంజ యుడు, నేనూ ఆ సంగతే చెప్పబోతున్నాను. ఈ బలాల తేడాను చూచి ధర్మరాజు అర్జునునితో అననే అంటాడు కౌరవసేన పెద్దదని; అందుకు అర్జునుడు చిన్న నవ్వు నవ్వి, అన్నాడు-

ముని వరుడైన నారదుడు మున్నొక యప్పుడు సెప్పె ధర్మ నా
శనులగు వారలన్ ప్రబల సైన్యము గల్గిన యేని గొంచెమై
సను రిపుసేన గెల్చునని నాకు, గురుండును, దేవతానదీ
తనయుడు నేర్పడన్ వినగ దాను పరాశర సూరుడున్ కృపన్

అంటే అధర్మపరులకు పెద్ద బలం ఉన్నా, శత్రువులకు చిన్న బలం కలిగి వున్నా ఆ శత్రువుల చేత వారు ఓడిపోవటం తథ్యమని దేవముని చెప్పాడట. అలా అర్జునుడు అని పైగా "భీముడున్నాడు మనకు; నీవు నీ సామర్థ్యం ఎఱుగవు గాక;

నీవు చాలు వీళ్ళను నిర్జించడానికి" అని చెప్పాడు. తన విషయం చెప్పటంలో "నీ దయవల్ల ఈ భగవంతుడైన శ్రీకృష్ణుని రక్షణతో నేనూ, నా గాండీవం ఉన్నాం" ఇంకేంకావాలి అంటాడు.

ఆ ప్రక్కవారూ ఈ ప్రక్కవారూ వ్యూహాలు మోహరిస్తారు. వాటిని వర్ణించి చెప్తాడు సంజయుడు. అలా చెప్పి నరనారాయణులుండటం చేత పాండవ పక్షబలం ఉబ్బుగా అవుపడింది; కృష్ణార్జునులే ముందు శంఖాలు పూరిస్తూ వచ్చారు. ఆ తరువాత రెండు బలాలవారూ యుద్ధంలో పాటించాల్సిన నియమాలు చెప్పి వాటిని పాటించడానికి అంతా అంగీకరించారు.

ఆ నీతి ఏమిటంటే యుద్ధం చేయడానికి ముందుకు వస్తున్న వాణ్ణి కొట్టవచ్చునని ఏదో పనిలో పరాయత్తంగా ఉన్న వాణ్ణి కొట్టరాదు. మాట్లాడుతూ ఉంటున్నప్పుడు కొట్టరాదు. క్రిందపడ్డ ఆయుధం తీసికొనేటప్పుడు కొట్టరాదు. శక్తి తగ్గిపోయి, భయపడిపోయిన వాణ్ణి చంపరాదు". ఈ నియమాలు ఒప్పుకున్నారు.

ఇక కలబడి పోట్లాడ్డమే ఆలస్యం.

ఆ సమయంలో ధర్మరాజు తన కవచం ఆయుధాలూ రథంలో వదలి క్రిందికి దిగి పాదచారిగా చేతులు ముడుచుకొని నమస్కరిస్తూ భీష్ముని రథం వైపునకు వెళటం ఆరంభిస్తాడు. మిగతా వాళ్ళంతా ముఖ్యంగా భీమార్జున నకుల సహదేవుల్ను ధృష్టద్యుమ్నుడూ ఆశ్చర్యపోతూ ఉంటారు. "ఈయన యుద్ధం మానేద్దామ"ని చెప్పడానికి వెళ్తున్నాడా అని భయపడ్డారు. గొడప పడిపోయినారు. ప్రశ్నలు వేస్తున్నారు. ధర్మరాజు మాత్రం పలక్కుండా వెళ్ళిపోతున్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునునికి తన ఊహ చెప్పాడు. భీష్ముడు పెద్దరికం గలవాడు. పెద్దల ఆశీర్వచనం తీసికొని యుద్ధం చేయటం వల్ల జయం కలుగుతుంది, అందుకె ఈ ధర్మరాజు అలా భీష్ముని కలవడానికి వెళుతున్నాడు. మనమూ వెనుక నడుద్దాము పదుండని ఆయన వెనుక అర్జున భీమ నకుల సహదేవులు బయలుదేరి వెళతారు.

ధర్మరాజు సరాసరి భీష్ముని సమక్షానికిపోయి సమస్కారం చేస్తాడు. మిగతా వారంతా చిత్రాల్లో బొమ్మల్లా నిలుచున్నారు, "అనఘుడా! నీకు వ్యతిరేకంగా యుద్ధం చేయబోతున్నాను. నీనుంచి అనుజ్ఞకోసం వచ్చా"నంటాడు ధర్మరాజు. భీష్ముడు సంతోషించి నీవు ఈలాటి పని చేయకపోయినట్లయితె శపించేవాడ్ని

అంటాడు. ఎదిరి సైన్యంలో తమ పెద్దలున్నప్పుడు వారి అనుజ్ఞను అభివ్యక్తంగానో గర్భితంగానో అడుగటమనేది పూర్వం ఉండేది. అర్జునుడు ఉత్తర గోగ్రహణంలో ముందుగా ద్రోణాచార్యునికి భీష్మ కృపాదులకు బాణాలు చెవివద్దకు పాదాలవద్దకు వెళ్ళి పడిపోయేటట్లు వదులుతాడు—కుశల ప్రశ్నము ప్రణామము అన్నట్లు. ఐతే అది ఒకళ్ళనొకళ్ళు చంపేసుకొనే యుద్ధం కాదు. ఇది ఇంచుమించు ఒకళ్ళనొకళ్ళు చంపేసుకోవాలని ఏర్పాటు చేసికొన్న కదనరంగమె. ఈ కదన రంగంలో కూడ ఇలాటి అనుమతి పొందటం అప్పటి యోధులు ఊహించలేదు గనక పరమాశ్చర్యంలో ఈ ధర్మరాజు పనినే తిలకించారు. ధర్మరాజుకూ అప్పటి ఇతరులకూ ఇదే భేదం.

ఈలాటి పని ఇప్పటి యుద్ధాల్లో చేయడం సంభవమా? కానేకాదు. తమ పెద్దలు తమ ప్రక్కనేగాని ఎదుటివారి ప్రక్కనుండి యుద్ధం చేయడం ఇప్పుడుండనే ఉండదు, అలా అంటే వాళ్ళకు పెద్దరికం ఏర్పడమనేది ఉండదు. ఎందువల్లనంటే పూర్వం వారు శరీరం వేఱుగా మనసు వేఱుగా భావించి శరీర కర్తవ్యం అంటూ, ఒకరికీ, మనసుతో మరొకరికీ సహాయం చేసేవారు. ఇప్పుడలా ఎవరూ చేయరు. శరీరం మనతోపాటె నడిపించడం అలవాటు. ఒకవేళ ఏ కారణానైనా మనసు మారిందా శరీరాన్నికూడ ఆ ప్రకారమె మార్పుచేసి కుట్రగా ప్రవర్తించడం ఇప్పటి అలవాటు అనిపిస్తుంది. అనగా కర్తవ్యం అనే హద్దులేదు. ఇప్పటి యుద్ధాల్లో ఎదురు బడి యుద్ధం చేయడం సకృత్తు. రహస్యంగా ఎక్కడో దాగి కొట్టడం అది ఎవరికి తగులుతుందో అప్పటికి తెలీదు. 18 రోజులు జరిగిన భారత యుద్ధం ఇప్పటి తుపాకులూ స్టెన్‌గన్‌లూ ఉంటే కేవలం 18 నిముషాల్లో అయిపోయేది. కాని అవి అప్పుడు లేవనుకోవద్దు. పాశుపతం అలాటిది. ఈ 18 అక్షౌహిణీల బలాన్ని రెండు నిముషాల్లో నాశనం చేయగలదు పాశుపతం—అని అర్జునుడు చెప్పనే చెప్పాడు. కాని తాను దానిని వాడలేదు. సైంధవుని తలను ఆకాశంలో ఆడించవలసి వచ్చేదాకా.

ఇంతకూ ఆ స్థితిలో ధర్మరాజు చేసిన పని కుట్రకాదు. ఉపాయాంగమైన సమావేశం. అంతా ఇదిచూచి "ఓహో! ఈ పనికా ఇయన వచ్చింది" అనుకొన్నారుగాని ఇది కుట్ర అనుకోలేదు. కుట్ర అనుకుంటే బాణాల్తో కొట్టకపోయేవారా? భీష్ముడూ అది సమంజసమె అనుకొన్నాడు. మంచిపని చేశావన్నాడు. అలాగే చెయ్యి యుద్ధం; ఇందులో తప్పేదేముంది?" అన్నాడు. వెంటనే ధర్మరాజు "నాకు హితమయే కార్యం తలపెట్టండి" అన్నాడు. "అంటే నీ ఆలోచనేమిటి" అని భీష్ముడంటాడు "నిన్ను గెలిచే ఉపాయం కావాలి" అని సమాధానం॥.

వెంటనే భీష్ముడి ముఖంలో నవ్వు తొలగిపోయింది. సంభాషణం కర్తవ్యా నికి వ్యతిరేకమవుతున్నదనుకొని ఉంటాడు. అందుకని, "నేను ఆయుధం చేతిలో ధరించినంత సేపున్నూ నన్ను దేవతలే జయించలేరు. అది వదిలితె జయించాల్సింది ఇప్పుడిక ఈ విషయం మాట్లాడటం తగదు—వెళ్ళు"మంటాడు. ధర్మరాజు మెత్త పులి. ఆ సందు చూచుకొని, సరె ఇప్పుడు సమయం కాకపోతె మరొకసారి మిమ్మల్ను కలుస్తానని చెప్పి సెలవు తీసుకొని వెళ్ళిపోతాడు. ద్రోణుని కృపుని కలుస్తాడు. ద్రోణుడూ అదే మాట చెప్పి పైగా దుస్సహమైన కీడు సమాచారం నిజాయితీ పరుని నోటినుంచి వింటే ఆయుధం పట్టక ప్రాయోపవేశం చేస్తానుగాక. అలాటప్పుడు ఎవరైనా చంపాల్సిందేగాని నన్ను గెలిచేవాళ్ళు లేరంటాడు. కృపుడు తాను చావ మనేది లేదంటూ ధర్మపరుడవైన నీవె గెలువుమని దీవిస్తాడు. శల్యునికి ఉద్యోగ సమయంలో చేసికొన్న కరారు జ్ఞాపకం చేసి అనుజ్ఞ తీసికొని తిరిగి స్వరథాలవద్దకు వెళ్ళి తిరిగి యుద్ధ సన్నద్ధులవుతారు పాండవులు.

కర్ణుడు యుద్ధరంగంలో లేడనేది మర్చిపోవద్దు. ఐతె ఈ యుద్ధం ఎలా జరుగు తుందో చూడాలనే ఆసక్తివల్ల దూరంగా నిల్చి చూస్తున్నాడు. శ్రీకృష్ణుడది గమ నించి తానై వెళ్ళి అతడితో "నీవు భీష్ముడు సర్వసైన్యాధిపతిగా నున్నంత కాలం యుద్ధం చేయవటనే। పోనీ ఊరికె ఎందుకుండాలి। ఇది ఒక క్రీడగా పరిగణించివచ్చి ధర్మరాజు తరపున అంతకాలం యుద్ధం చేయరాదా?" అంటాడు. అందుకు కర్ణుడు "అప్పుడు కోపం వచ్చింది—అయనతో కలిసి యుద్ధం చేయనన్నాను. అంతేగాని కౌరవనాథునకంకితం చేసిన ఈ ప్రాణం ఇంకొకరికి చేర్చుమంటావా?"అన్నాడు.- అన్న మాట చెల్లించి తీరుతాననే పట్టుదల కర్ణుడికి ఎక్కువైంది అనిపిస్తుంది. నిజానికి శ్రీకృష్ణుడు చేసిన సూచన కూడా ఎవరుగాని పాటించేది కాదు. మనసు ఎలా ఉంటే అలా శరీరం చేయదంగదా నూత్రం! అప్పుడు కేవలం కర్తవ్యానికె ప్రాధాన్యం ఉండేది. సరదాకు వచ్చి మా తరపున యుద్ధం చేయమంటే చేసేవారుండరు. కర్త వ్యం కాని పనులన్నీ కామసంకల్పంచేత చేసేవి. వాటిని వర్జించాలి. అలా వర్జించిన వాడే పండితుడన్నాడు కృష్ణుడే. "యస్య సర్వేసమారంభాః కామ సంకల్ప వర్జితాః। జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుం పండితంబుధాః" శ్రీకృష్ణుడు ఇలా అడుగటం హేళనకుతప్ప నిజంగా కర్ణుడు వచ్చి తమవైపు యుద్ధం చేస్తాడనికాదు. కర్ణునికిగల మంచి లక్షణాల్లో ఇది ఒకటి అని ప్రస్ఫుటం అయిందీకారణంగా.

తర్వాత ధర్మరాజు ఎలుగెత్తి తమవైపునకు వచ్చి యుద్ధం చేయదలచినవారు స్వేచ్ఛగా వచ్చి మర్యాదలంది యుద్ధం చేయండి అని ఆహ్వానిస్తాడు. అప్పుడు కౌరవులు నూర్గురకూ సవతిబిడ్డ అయిన యుయుత్సుడు తన అనుయాయులతో వచ్చి పాండవ పక్షం చేరుతాడు. అప్పటికి యుద్ధానికి తయారీ పూర్తి అయింది.

## 5. భగవద్గీతా

ఇంతకూ అర్జునుడు తన రథాన్ని రెండు సేనలమధ్యనూ పెట్టించి తాను ఎవరితో యుద్ధం చేయాలో ఆలోచిస్తూ కౌరవ సేనలో అందరనూ చూస్తాడు. తీరా వాళ్ళంతా సోదరులు, తండ్రులు, తాతలు, మామలు ఇలా ఉండటంచేత వాళ్ళందరినీ చంపితె తనకు పాపమనీ, వారిని చంపిన తరువాత సంపాదింపబడే రాజ్యాన్ని ఎవరితోసహా అనుభవిస్తాము గనకఅనీ ప్రశ్నించుకొని ఈ యుద్ధం చేయకుండా ఉండాలి. అనీ అలా తనవారందర్నీ కాపాడగలుగవచ్చుననీ భావించి యుద్ధం చేయనంటాడు. అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునునకు తత్వ విషయం చెప్తూ—

"కర్తవ్యం అనేది చేయడానికే నీవూ నేనూ వాళ్ళూ అంతా ఈ శరీరాలను ధరించింది. ఈ శరీరాలయితే చస్తవిగాని నేనూ నీవూ అతడు అనేవాళ్ళు చావనే చావరు. వాళ్ళు చచ్చిపోతారని దుఃఖించి కర్తవ్యం మానేయడమంత తెలివి తక్కువ మరేదీలేదు." నిజానికి యుద్ధం చేస్తున్న యోధుడు నేను చేయనని వెనక్కు తిరిగితే ఏం చేస్తాం? కాల్చిపారేయి వీణ్ణి అని తన అధికారిచేతనే అనిపించుకొనడా? అది అంత నికృష్టమైన పని. "సమాజసేవలో భాగంగా యుద్ధం చెయ్యాల్సిన కర్తవ్యం వదిలి పెట్టితె. పరమ స్వార్థపరుడవై పాపం చేసినవాడివయిపోతావు గాని సమాజం కోసం యుద్ధం చేస్తే పాపంవచ్చే ప్రసక్తిలేదు" అని చెప్పి శ్రీకృష్ణుడు పరమాత్మ తానే అయి ఈ ప్రపంచమూ దానినడక నడిపేవాడూ తానేఅయి ఎలా నడుపుతున్నాడో చెప్తాడు. "నేను" అనేది భగవంతుడేను, అంటూ తానే అన్ని రూపాలూగానయి, విశ్వం అయి విశ్వరూపాన్ని అర్జునునకు దర్శనం చేయిస్తాడు. అర్జునుడు భయపడిపోతాడు. ఆ విశ్వరూపంలో దుర్యోధనాదులు నాశనమైపోతుండటం చూస్తాడు అర్జునుడు.

"ఆ విశ్వరూపాన్ని ఉపసంహరించి శ్రీకృష్ణుడు బ్రహ్మవిద్యకు అన్వయం చేస్తూ అర్జునుని ప్రశ్నలనిటికీ సత్యమైన సమాధానాలు చెప్తాడు. నాడి–నావారు

వీళ్ళను చంపటమేమిటి అనే రాగపూర్ణమైన మోహం అర్జునునకు వదలిపోతుంది. పరమేశ్వరుడు-విశ్వం-ప్రపంచం-సమాజం ఇవి వ్యక్తికంటె గొప్పవని సమాజసేవ ఏదో అదె వ్యక్తికి స్వధర్మమున్నూ అయి ఉంటున్నదని తెలిపాడు. అర్జునుడు యుద్ధం చేస్తానని మళ్ళీ యుద్ధ సన్నద్ధుడవుతాడు. ఈ విశ్వరూప సందర్శనం ఒక్క అర్జునునకే కనపడింది. కాని వ్యాసభగవానుని అనుగ్రహంవల్ల సంజయునికికూడా తెలిసింది. ఈ కృష్ణార్జున సంవాదం అంతా సంజయునికి వినపడింది. ఆయన దానిని తలచి తలచి హృదయంలో అంతటా సంహృష్టుడయినాడట. ఈ సంగతి ధృతరాష్ట్రునకు చెప్పి చెప్పి సంజయుడంటాడు—

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్రపార్థోధనుర్ధరః

తత్ర శ్రీ ర్విజయోః భూతి ధృవానీతిర్మతిర్మమ- అంటాడు.

ధృతరాష్ట్రుని మనసు మంచివైపుకు తిరిగింది గనుక అతడు అంతావిని నిట్టూర్చి-అలాగయితే-ఇక యుద్ధం ఎవరు ఎలా మొదలుపెట్టి ఏమేం చేశారో చెప్పాల్సిందని సంజయునడుగుతాడు. సంజయుడు చెప్పటం ఆరంభించాడు.

## 6. యుద్ధారంభం

"ముందుగా దుశ్శాసనుడు పురిగొల్పంగానె కురుసైన్యాలు కదలినయి. భీష్ముని రథం ముందుకు నడుస్తుంది. అప్పుడు భీముడితోపాటు పాండవుల సైన్యం ముందుకు నడుస్తుంది. భీముడు శంఖం పూరిస్తాడు. అతడిని దుశ్శాసన దుర్ముఖ దుష్ప్రహ దుర్మర్షణ వివింశతి వృషసేనులు ఎదుర్కొంటారు. ఆతరువాత ద్రౌపదీ పుత్రులు సహా ధృష్టద్యుమ్నుడూ ఇతరులూ వచ్చి యుద్ధం చేస్తారు.

అర్జునుడు-భీష్మునీ, సాత్యకి-కృతవర్మనీ అభిమన్యుడు-కోసలరాజునీ భీష్ముడు-భీమునీ దుశ్శాసనుడు-నకులుడ్నీ ఎదుర్కొంటారు. ధర్మరాజు-శల్యునితో అశ్వత్థామ శిఖండితో యుద్ధం చేస్తారు. ఇలా మధ్యాహ్నమయేటప్పటికి భీష్ముడు విజృంభించి సర్వత్ర తనే ఉన్నట్లు రథాన్ని నడిపించి పాండవుల సేనను చిందర వందర చేస్తాడు. తలకాయలు తెగిపోవటం రథాలు విరిగిపోవటం గుఱ్ఱాలు పడిపోవటం ఏనుగులు కూలిపోవటం జరుగుతుంది.

పాండవ సైన్యం బెంబేలు పడిపోతుంటే పాండవుల పక్షంలో మళ్ళీ ఒక పెద్ద ఆశను లేవగొట్టింది అభిమన్యుడు! ఇతడు శల్యుణ్ణి, కృతవర్మను, దుర్ముఖుణ్ణి కృపుణ్ణి ఇందర్నీ నొవ్వచేసి వచ్చి భీష్ముని ఎదుర్కొంటాడు. ఓహో! వీడు ఆపివ్వచ్చుడికంటె తీసిపోయేవాడుకాదని సర్వులూ అనుకొంటారు. ఇంతలో అభిమన్యుడు భీష్ముని కేతనం విరగగొట్టేస్తాడు. శంఖాలు పూరిస్తారు పాండవులు.

భీష్ముడు హఠాత్తుగా విజృంభించి గాలివానలా పాండవ సైన్యాలను ఊచకోత కోసినట్లు నరుకుతూ ఉంటాడు. పాండవ సైన్యం మళ్ళీ బెంబేలు పడిపోతుంది. ఆ సాయంత్రమంతా అలా భీష్ముడు పాండవ సైన్యాలకు భయాన్ని కలిగిస్తూనే ఉన్నాడు.

సూర్యాస్తమయ సమయానికిపోరు ఆపుతారు. పాండవ సైన్యంలో వారి మొగాలుముడుచుకొని ఉన్నాయి.

## 7. సందేహాల చర్చ

ఈ పట్టులో భీష్ముడు కర్ణుని తనతోపాటుగా యుద్ధం చేయనీకపోయిన కారణమేమిటనేది సందేహంగా అవుపించటంకద్దు. కర్ణుడు అంటే యథాతథంగా భీష్మునకు క్రోధంలేదు. కాని దుర్యోధనుని చెడగొట్టుతున్నవాడు కర్ణుడని భీష్ముని నమ్మకం. నిజానికి తన సలహా ఒక ప్రక్క కర్ణుని సలహా ఒక ప్రక్క ఉంటే దుర్యోధనుడెప్పుడూ కర్ణుని సలహానే అనుసరించటం నిజం. ఈ కారణంచేత తాను సర్వసేనాధిపత్యం చేయాలంటే మరొక ప్రక్క ఈ కర్ణుడు దుర్యోధనుని చెవులు కొరికేటట్లయితే అసలు వ్యూహాలు దెబ్బతినిపోవటం కద్దు. అందుకు భీష్ముడు జాగ్రత పడ్డాడని అనిపిస్తుంది. ఇక కర్ణుడు బహుశా, భీష్ముడు పడిపోయిం తరువాత నయితే దుర్యోధనుడు తనకే సర్వసైన్యాధిపత్యమిస్తాడు అనే నమ్మకంలో ఉండి ఉండవచ్చు. ఇప్పుడె యుద్ధంలో పాల్గొన్నట్లయితె తాను అప్రధానుడుగా ఉండి హఠాత్తుగా సర్వసైన్యాధిపత్యం వహించగలగటమనేది ఇంచు మించు అసంభవమయిన సంగతికదా అనుకొని ఉండవచ్చు. ఈ కారణాలచేత కర్ణుడు యుద్ధంలో మొదట పాల్గొనలేదు.

ఇంకో చిత్రమైన విషయం ఏమిటంటే ధర్మరాజు భీష్మద్రోణ కృప శల్యుల వద్దకు వెళ్ళి వాళ్ళు ఎలా జయింపబడతారో చెప్పమని అడగడం. అంతకంటె ఆశ్చర్యం వాళ్ళు అది చెప్పటమున్నూ. ఇలాటిది ఈరోజుల్లో సంభవం కానేకాదు. కాని రామాయణ కాలంలోకూడా రావణుడు జటాయువుతో పోరిపోరి నీశక్తి ఎక్కడ ఉందో చెప్పమంటె జటాయువు తన రెక్కల్లో ఉన్నదంటుంది. రావణుని అలాగే జటాయువడిగితె తన భుజంలో ఉన్నదని రావణుడు అబద్ధం చెప్పినట్లు వింటాము. యుద్ధం చేస్తున్నప్పుడుకూడ ఎవరికివారు తమ శక్తియుతమయిన చోటు ఫలాన అని చెప్పటంకద్దు. దానిని తెలియజెప్పమని అలా చెప్పినట్లయితె నిన్ను నేను జయింపగలననీ ఒక ఛాలెంజి చేయటం మామూలు అనిపిస్తుంది. భీష్ముడు విల్లు తన చేతుల్లో లేకపోయినప్పుడే ఎవరైనా తనను గెలువగలడు అనటంతో అర్జునుడు ఎంతసేపటికీ భీష్ముని చేతిలో వింటిని విరగగొట్టడానికే ప్రయత్నించటం యుద్ధంలో చూస్తాము. చివరకు అతడు తీసిన వింటినల్లా అర్జునుడు విరగగొట్టే స్తుంటే శిఖండి భీష్ముని బాణాలతో గ్రుచ్చివేస్తాడు.

ద్రోణుడు తాను ప్రాయోపవేశం చేస్తే తప్ప ఇంకెవరూ గెలువలేరని చెప్తాడు. పైగా "వినరానిమాట వింటే నేను ప్రాయోపవేశం చేస్తాననటం"కూడ ద్రోణునికి పాండవులంటె ఎంత నమ్మకమో తెలుస్తుంది. ఎప్పుడూ అబద్ధం చెప్పని వాడు ఆ కీడూసంగతి చెప్పితేనే ప్రాయోపవేశం చేస్తానంటాడు. అంటే ధర్మరాజు అలాంటి మాట ఏమయినా అన్నప్పుడే తప్ప మిగతావారెవరు ఆ మాటలు అన్నా ఆయన ప్రాయోపవేశం చేయడన్నమాట. ద్రోణుడికి నమ్మకం—ధర్మరాజు అలాటి మాట ఆటకాయితనంగా గాని మోసంగాగాని అనడని. ఇతర్లంటే తనకు లెక్క లేదు. ఈ కారణంచేత తనగుట్టు స్పష్టంగా పాండవులకు చెప్పినా, తనకేమీ బాధ లేదని తెలుసు. అందుకని వారిమీద ప్రేమకొద్దీ చెప్పేశాడు. వాళ్ళు దానిని ఉపయోగించుకొనే స్థితి లేదని నమ్మినాడు అనిపిస్తుంది.

శల్యుడు అదివరకే చేసిన వాగ్దానం మాత్రం జ్ఞాపకం పెట్టుకొంటానన్నాడు. అతడే పరిస్థితుల్లో ఆ వాగ్దానం చేయాల్సి వచ్చిందో విన్నాం.

భీష్ముడు సద్వృత్తికి చెందినవాడు కౌరవుల్లో చేరటం ఎందుకని అనేది మరొక సందేహం. యుద్ధ కథనంలో వ్యాసమహర్షి యోధుల పేర్లలో ఎన్నో విషయాలు సూచిస్తూ రచనచేశాడు. భీష్ముడు అంటే భయంకరుడు అని కూడ

అర్థం. యుద్ధం వచ్చేవరకూ తామసిక వృత్తులు కలిగిన అందరకూ భయంకరుడై ఆ తరువాత యుద్ధంలో భయంకరుడై ఉన్నాడు. అయనకు దేవవ్రతుడని పేరుంచాడు. కర్మప్రవృత్తి సాధన చేస్తుంటాడని సూచన. అది సాత్త్విక వృత్తి. ఐతే చివరకు దుర్వృత్తులతో కలిసేడుగదా! అది ఒకొక్కప్పుడు సంభవం అవుతుంటం చూస్తూనే ఉంటాం. ఉదాహరణకు — నిన్నటివరకూ అత్యంతంగా ప్రేమించిన తండ్రి ఇవాళ ఆస్తి నెవరికో వ్రాసి కొడుకును సాధించే మన సత్వం ఎంత తరుచుగా చూస్తాము. నిన్నటివరకూ నీవల్ల నాకీ సిరిసంపదలు కలిగాయన్న భర్త ఇవాళ ఆ భార్యనె ఇంట్లోంచి వెళ్ళగొట్టటం చూడమా? అలాగే సాధకుల్లో కర్మ ప్రవృత్తి కలిగి ఉంటూనె ఒకానొక ప్రారబ్ధంవల్ల సాత్త్వికం వదలి తామసికంలో పడిపోతారు. అజామిళుడలాంటివాడు. చిట్టచివరకుగాని వోవ పూర్తిగా వెనక్కు తిరగకపోయింది కర్మ మార్గం అనుసరిస్తూనే. దుర్వృత్తులకు సహాయ పడటమె అసమగ్ర కర్మమార్గి ఇతడనవలసి వచ్చిన కారణం భీష్ముని విషయంలో.

అసమగ్ర కర్మయోగికి దుర్వృత్తి కలిగినట్లయితె దాన్ని జయించటం–అతడిలోని సద్వృత్తియైన సాధకునకు – చాలకష్టమె. దానికి ఋజు ప్రవర్తనం, (అర్జునుడు) అభయం (భీముడు) నిర్వృతి తత్త్వంతో స్నేహం (శ్రీకృష్ణునితో) ఇన్ని కావాలని బోధ.

ఇది ద్వితీయాశ్వాసం

# మహాభారత కథలు

## భీష్మ పర్వం - ద్వితీయాశ్వాసం

## మొదటి ఆరు రోజుల యుద్ధం

కౌరవ పాండవ సంగ్రామం ఆరంభమయింది. భీష్ముడు దుర్నివారుడై పాండవ సైన్యాన్ని తరిమి తరిమి కొట్టాడు. ఆనాటి సాయంత్ర మయేటప్పటికి పాండవులు వెలవెలబోయి తలలు వొంచుకోవాల్సి వచ్చింది. ఇది మొదటిరోజు యుద్ధం.

ఆ రాత్రి ధర్మరాజు తమ్ముళ్ళీ దృష్టద్యుమ్నుడ్నీ తీసికొని శ్రీకృష్ణుని విడిదలకు వెళతాడు. ఆయనతో "ఔహో ఈ భీష్ముని శౌర్యం ఎంత వెక్కసంగా ఉంది మన బలాన్నంతనూ అతడే చంపేస్తున్నాడు. అర్జునుడేమీ చేయలేక పోయినాడు. భీముడెంతని ఓర్వగలడు? నేనేమో మీమీద ఆశలు పెట్టుకున్నాను. ఏం చేయాలో గోచరించటల్లేదు. యుద్ధం మాన్పించి నేను అరణ్యాలకు వెళ్ళిపోతాను. నీవు చెప్పు నా కర్తవ్యమేమిటో- నేనలా చేస్తాను" అంటాడు ధర్మరాజు.

శ్రీకృష్ణుడు ధర్మరాజుకు ధైర్యం చెప్పి 'నీ వ్యతిరేకులందర్నీ నేను క్రమస్ఫూర్తితో లయం చేస్తాను సరా?' అంటాడు. తాను భగవంతుడనీ ఒకానొక క్రమంలో భీష్ముడు సమయింపబడుతూనే ఉన్నాడనీ సూచన. దృష్టద్యుమ్నుడు "నేనగ్ని గుండంలో పుట్టింది ద్రోణుణ్ణి చంపడానికే. రేపు చూడండి- ఎంత ఘోర యుద్ధం చేస్తానో"నంటాడు. అంతా గుండెలు విరుచుకొని తమ తమ నెలవుల కెళ్ళిపోతారు.

మరునాటి యుద్ధం మరీ ఘోరమయిపోయింది. పాండవుల క్రౌంచవ్యూహాన్ని భీష్ముడు ఒక్కసారిగా వచ్చి చిందరవందర చేస్తాడు. అర్జునుడు వెళ్ళి భీష్ముని ఎదుర్కొనాలని చూస్తాడు-కాని, శ్రీకృష్ణుడు ఆయనకు వీళ్ళంతా సహాయం రావటల్లేదా? వీరందర్నీ కొట్టు. తర్వాత అటుపోదామని సలహా ఇస్తాడు. అర్జునుడికి తాను భీష్ముని ఎదిరించడమనే అద్భుత కార్యానికి ముందు మరోపని పెట్టటంతో ప్రయత్నించి విజృంభణం ఉధృతం చేయాల్సి వచ్చింది. ఆ ఉధృతిలో ద్రోణ, శల్య

చేస్తాడో ఇతడూ అలాగే చేస్తాడంటున్నారంతా. లక్ష్మణకుమారుణ్ని నొవ్వగొట్టాడు. మిగతా వాళ్ళ మదమణుస్తున్నాడు. అప్పుడు దుర్యోధనుడొచ్చి కలబడతాడు. వెంటనె అర్జునుడి రథం విద్యుల్లతలా వచ్చి సర్వ సైన్యాన్నీ హడలగొట్టుతుంది. అది శ్రీకృష్ణుని చాకచక్యమో లేదా అయన అనుగ్రహమో! ఇలా రెండవనాటి యుద్ధంలో పాండవుల కౌశలం ప్రకటితమయింది.

మూడో రోజు భీముడూ దుర్యోధనుడూ ఎదురుపడి యుద్ధం చేస్తారు. దుర్యోధనుడు మూర్ఛిల్లటంచేత రథసారథి అరదాన్ని దూరం తోలుకు పోతాడు. కౌరవ సైన్యాలు వెరగుపడిపోతయి. కొంత సేపటికి దుర్యోధనుడు లేచి అందరనూ యుద్ధానికి తిరిగి పురికొల్పి నిష్ఠూరాలాడతాడు. "మీ చేతనే నేను భంగపడ్డా"నంటాడు. భీష్ముడతడి అజ్ఞానానికి నవ్వుకొన్నాడు.

"ఇవాళ చూడు నేను పాండవ సైన్యాలను ఎలా చండాడుతానో"- అంటూ భీష్ముడు అప్పటికప్పుడు బయలుదేరి వెళ్ళి అర్జునుడ్ని ఎదుర్కొంటాడు. అసమయాన అర్జునుడూ మహా విజృంభణంలో ఉన్నాడు. సైన్యాలు తెగిపడుతున్నాయి. రంగస్థలమంతా రక్తమాంస కళేబరాలతో నిండిపోతున్నది. భీష్ముడు అర్జునుని విజృంభణం చూసి నరనారాయణుల కెదిరి సందిగ్ధమైన యుద్ధం చేయడం ఇష్టంలేక దుర్యోధనుని సంతోషపెట్టాలంటే మిగతా సైన్యాలల్లో అధిక సంఖ్యలో మందిని చంపేయాలని అలా ఆరంభించాడు.

ఇది గ్రహించినవాడు శ్రీకృష్ణుడు. వెంటనే భీష్ముని ఎదిరింపుమని అర్జునునకు చెప్తాడు. అలాగె ఎదిరించినా భీష్ముని విజృంభణమేమీ తగ్గలేదు. ఆయన బాణాలు వచ్చి శ్రీకృష్ణునికి తగులుతున్నయి. పాండవ సైన్యాలు పారిపోతుంటే ఎవరో మళ్ళీ పురికొల్పుతున్నారు. వెంటనె-

శ్రీకృష్ణుడు సుదర్శన చక్రం చేత ధరించాడు. "జగత్సంహారోన్ముఖుడైన రుద్రుడిలా భీష్ముని మీదకు వెళుతున్నాడు. భీష్ముడు వెంటనే చేతులు జోడించాడు"- "పరమేశ్వరా! రా! రావాల్సిందె. కృతార్థునిగా నన్ను చేయాల్సింది. నీలో విలీనం కావటం కంటె నాకు కావలసిందేమిటి! ఇది నాకే మేలు." అని నమస్కరిస్తాడు. అర్జునుడు పరుగెత్తుకొని వెంట వస్తున్నాడు. "కృష్ణా! కృష్ణా! ఆగు. ఆగు నేను ఉన్నాను. (ఇంకా చావలేదు) ధర్మరాజు శౌర్యం ధైర్యం వీర్యం నాశనంచేసి ఇలా

నీవు వెళ్ళటం న్యాయంకాదు." అంటూ కాళ్ళకు అడ్డంపడతాడు. తన పరువూ, తన అన్నలపరువూ పోయిందని బాధ అర్జునునికి!

శ్రీకృష్ణుడు నిర్వృతి తత్త్వం. ఆయన సుదర్శనాన్ని కర్మిష్ఠియైన భీష్మునికి చూపాడు అంటే అది కేవలం కర్మిష్ఠికి జ్ఞాన దర్శనం కలిగించాడని అర్థం. సాధకుడు కేవలం కర్మిష్ఠి అయినప్పుడు జ్ఞానదర్శనం కావటం పైమెట్టు. భీష్ముడు దీనిని గ్రహించినవాడై "కృష్ణా అదె_ అదె కావాల్సిందినాకు. నేను తామసికంలో ఉన్నాను. నన్ను నీవు ఉద్ధరించడానికి సుదర్శనం నాకు తెస్తున్నావు! రావాల్సింది" అంటాడు. అసమగ్రత వదలి భీష్ముడు జ్ఞాని అవుతాడిప్పుడని బోధ. తిరిగి ఋషులు వసువులు భీష్మునకు అవుపడి అవతారం చాలించవయ్యా అని జ్ఞానబోధ చేయబోతారు. దానికిది ప్రాతిపదిక.

శ్రీకృష్ణుడు శాంతిస్తాడు. "శెబాష్ నీ వాగ్దానం పాటిస్తానంటె మంచిదె"నని ఉపక్రమిస్తాడు. నిజంగా తాను చక్రం ప్రయోగించాలనే ఉద్దేశ్యం శ్రీకృష్ణునికిలేదు. కేవలం అర్జునుడ్ని ఉత్తేజపరచి ఎదుటివాణ్ని భ్రమ పెట్టటం చేశాడు శ్రీకృష్ణుడనేది గమనీయం.

కొంత సేపటికి సూర్యుడస్తాద్రి చేరడంచేత యుద్ధం ఆనాటికి ఆపేశారు. అలా మూడవనాటి యుద్ధం శ్రీకృష్ణుడు చక్రం పట్టడం దాకా నడిచింది.

నాల్గోరోజు యుద్ధంలో అర్జునుడు విచ్చలవిడిగా రథాన్ని నడిపించి విజృంభించి వెళ్తూ సైన్యాలను కలగుండు వడేస్తాడు. అది చూచి భీష్ముడు, ద్రోణుడు, దుర్యోధనుడు, వివింశతి, కృతోత్తముడు, దత్తుడు, శల్యుడు వీరంతా ఒక్కసారివచ్చి అర్జునుని ఎదుర్కోవాలని ప్రయత్నిస్తారు. కాని అభిమన్యుడు అడ్డంవచ్చి అందర్నీ బాణాలతో నొవ్వగొట్టేస్తాడు ఈ అభిమన్యుని విక్రమానికి ఆకాశంనుంచి చూస్తూ దేవతలు విస్తుబోతారు. భీష్ముడు ఈ అభిమన్యుని తప్పించుకొని వెళ్ళి అర్జునునెదుర్కొంటాడు. అభిమన్యుడు అశ్వత్థామ హృదయాన్ని బాణాలతోగుచ్చి శల్యుడి జండా ఊడగొట్టి దుర్యోధనుడి ధనస్సు విరగ్గొట్టి సోమదత్తుడ్ని నొవ్వజేస్తాడు. ఈ సంకులంలో ధృష్టద్యుమ్నుడు శల్యుడి కుమారుడ్ని చంపేస్తాడు.

ఈ కథనం విని ధృతరాష్ట్రుడంటాడు —"నిజానికి మనుష్య ప్రయత్నం

ఏందుకూ పనికిరాదు. దైవంఎలా తలిస్తే అలా జరగాల్సిందే. అసంఖ్యాకమైన కౌరవబలం ఇలా పాండవుల చేత ఓడింపబడటం అది దైవ నిర్ణయం."

సంజయుడు వెంటనే "అదే నిశ్చయమైన మాట. మిగతా కథ విను. మధ్యాహ్న మయేటప్పటికి భీముడు గదతీసికొని లేచాడు. "ఇవాళ ఈ యుద్ధం చివరిదాకా తేల్చేస్తాను" అన్నాడు. ఈ సంగతి గాలిలా అందరికీ తెలిసి పోయింది, దుర్యోధనుడు వెంటనే తమ్ముల్ని దొమ్మిగా భీమునిమీదకు పంపుతాడు. వాళ్ళంతా ఒక్కసారిగా తనవైపు వస్తుంటే, భీముడు "అహా! భలె! భలె? అంటూ ఆహ్లాదపడిపోతున్నాడు. వెంటనే రథం దిగాడు. మగధరాజు ఏనుగెక్కి వస్తుంటే ఏనుగునీ ఆ రాజునీకూడ ఒక్కసారిగా చంపేస్తాడు. నడక సాగిస్తూ గదసారిస్తూ దోవలో ఉన్న ఏనుగుల్నీ రథాల్ని గుర్రాల్నీ అన్నిటినీ చితకబొదుస్తూ వెళుతు న్నాడు. కౌరవ సైన్యాలు పారిపోతున్నాయి.దుర్యోధనుడు పురికొల్పితె మళ్ళీ వచ్చి నిల బడుతున్నయి. అలావచ్చి భీముడి స్థయిర్యాన్ని అచ్చెరువుతో చూస్తూ ఉండి పోయినయి.

దుర్యోధనుడూ తమ్ములూ వచ్చి భీముని ఎదుర్కొంటారు. భీముని దెబ్బలు తిని తిని తమ్ములంతా పారిపోతే తెరపి వచ్చింది కదా అని భీముడు రథం తెప్పించి దాంలోకి ఎక్కుతాడు. దుర్యోధనుడొక్కడూ నిశిత బాణాలతో భీముని కొట్టి మూర్ఛ నొందింపజేస్తాడు. సూతుడు భీముని రథం అవతలకు తోలుకొని పోతాడు. దుర్యోధనునితో అభిమన్యుడూ ద్రౌపదేయులూ కృష్ణుని కుమారులూ అంతా తలపడు తారు. వెంటనే భగదత్తుడు తన సుప్రతీకమనే ఏనుగుతో వస్తాడు. అభిమన్యుడూ ఇంకా కొందరు దానిని ఎంతో బలంగా ఎదుర్కొంటారు. కాని ఆ ఏనుగు విజృంభించినదై పాండవ సైన్యాన్ని కలవర పరుస్తూ ఉంటుంది. ఇంతలో ఘటోత్కచుడు వచ్చి మాయలు పన్ని కౌరవ బలాలను నాశనం చేయడమారంభిస్తాడు. ముందుగా ఆ భగదత్తుని ఏనుగును అణచిపారేస్తాడు ఇంతలో సూర్యాస్తమయమవుతుంది. భీష్ముడు యుద్ధం ఆపేస్తాడు.

ధృతరాష్ట్రుడు అడుగుతాడు :— ఎప్పుడూ పాండవులే ఎక్కువ బాగా యుదం చేస్తున్నట్లు అవుపడుతుందే! అందుకు కారణమేమిటంటారు

సత్యం అని చెప్పి, దుర్యోధనుడు కూడ ఈ సంగతినే భీష్మునితో అప్పుడు ప్రస్తావించాడనీ అప్పుడు భీష్ముడు దుర్యోధనునితో ఇలా అన్నాడని చెప్తాడు.

"ఈ సంగతి నీకు ఎన్నోసార్లు చెప్పాను. పాండవులకు వాసుదేవుని సహాయమున్నది. అయన పరమేశ్వరుడు. వారికి అసాధ్యమనేదిలేదు. ఆయనను వారు ఆధరించుతారు. నీవు ఆదరింపవు, కృష్ణార్జునులే నరనారాయణులనే దేవతలు. అధర్మభూయిష్టంగా ఉన్న ఈ లోకంలో వారిద్దరూ అవతరించి భూమి భారాన్ని తీర్చాలని బ్రహ్మ ఆసించడంచేత ఇలా అయింది. నీవు ఈ ప్రశ్నలిక వేయకు" అంటాడు.

ఆ మరునాడు ఐదవ రోజు యుద్ధం.

దుర్యోధనుడు ద్రోణుడికి మళ్ళీ ఆ ప్రశ్ననే అడుగుతాడు. "మీరు ఒక్కొక్కళ్ళు ప్రపంచాన్నంతనీ జయించగలిగిన వాళ్ళు ఇప్పుడిలా వెనక్కు ఉండపోవటానికి కారణమేమిటి?" ద్రోణునకు చురక తగిలి చిన్న సమాధానం ఘాటుగా చెప్పి అక్కణ్ణుంచి వెళ్ళిపోతాడు. ఏమనంటే "సముద్రంలో సొరకాయ బుర్రవేసి తీస్తే వచ్చే నీళ్ళు సొరకాయ బుర్రెడేవుంటవి. అంతటి వాళ్ళను గెలవటం మాకు శక్యమవుతుందా?" అంటాడు.

భీముని యుద్ధమే ఈనాడు కూడ ప్రస్ఫుటంగా విజృంభించి అవుపడుతుంది. అర్జునుడూ అశ్వత్థామా తల పడుతారు. అశ్వత్థామ యుద్ధంలో ఎంతో నొచ్చి కూడ యుద్ధం సాగిస్తూనే ఉన్న సమయంలో అర్జునుడు – "ఈ విప్రుడితో ఎందుకి జాగు" అని ఆ స్థలం వదలి వెళ్ళిపోతాడట. అంటే విప్రుడైన అశ్వత్థామను–అతడు చిరంజీవి గనక–చంపగలిగేది లేదనిగాని లేక కేవలం విప్రుడిమీది భక్తివల్లగాని అర్జునుడు అలా చేశాడనిపిస్తుంది. అతడికి ఎప్పుడూ కూడ వళ్ళు తెలియని కోపం వచ్చినట్లు చూడం యుద్ధంలో. భీముని యుద్ధానికీ ఇతకి యుద్ధానికీ తేడా అది. కోపమనేది అంత సంపూర్ణంగా అర్జునునికి కూడ వస్తే పాశుపతాస్త్రం వేసి మొత్తం యుద్ధం మూడు నిముషాల్లో పూర్తి చేసేవాడేననేది మర్చిపోరాని విషయం.

ఈనాటి యుద్ధంలో అభిమన్యుడు ఒకేసారి చాలమంది శత్రుపక్షం వారిని నిర్జించుతాడు. సౌమదత్తి అనే కౌరవవీరుడు ఈ ఐదవనాడు ఎంతో పరాక్రమంతో యుద్ధం చేసాడు. అతడ్ని సాత్యకి తోటివారు వారి కుమారులూ పదుగురు నిలవేసి

"మాలో ఒక్కణ్ణి నీవు కోరుకో యుద్ధం చేస్తామంటారు. సోమదత్తుడు మీ అందర్ని పూర్తి చేస్తాను రమ్మని యుద్ధం చేసి పది మంది తలకాయలు ఒక్కసారిగా త్రుంచి నేలమీద పడేసాడు. ఇదిచూచి సాత్యకివచ్చి మత్సరంతో పోట్లాడి రథాల్ని సూతుల్ని నాశనం చేసికొంటారు. నేలమీద నిలుచొని పట్టుదలతో సౌమదత్తి సాత్యకుల యుద్ధంలో పెనుగులాడుతుండగా అటుప్రక్క కురురాజు ఇటుప్రక్క భీముడు వచ్చి వాళ్ళిదర్నీ తమ రథాలమీద నెక్కించుకొని తీసుకొని పోతారు.

ఇది ఐదవ రోజు యుద్ధం.

ఆరవనాటి యుద్ధంలో పాండవులు మకర వ్యూహం పన్నుతారు. ఈనాటి యుద్ధం వర్ణనం విన్న తరువాత ధృతరాష్ట్రుడు పాండవులు గెలువటమనేది దైవ సంకల్పం అనీ వారె తప్పక గెలుస్తారనీ నిశ్చయం చేసుకొని తన కుమారుడు తన మాట వినకపోవటానికి కారణం "కర్మవశం చేతనే"నని సంజయునితో అంటాడు.

ఇదె నిశ్చయమైన మాట. ఈ సందర్భంలో సంజయుడు అంటాడు ధృత రాష్ట్రునితో,—"నీ కుమారుల దుఃఖానికి వాళ్ళు చేసిన కర్మ కారణం అనేది అబ వృంచు. నీ దుఃఖానికి నీవు చేసిన ఉపేక్ష, దీనంతకూ మూలం, ఆనాడు నీవు ఉపేక్షించిన జూదం"—అని "పరమార్థమైన కీలకం తెలిసికొన్నావు కనక ఇక నిశ్చ లంగా జరిగిన కథ వినాల్సింది" అంటాడు.

భీముడు సైన్యాలకు భయంకరుడై వెలిగే సమయంలో, నీ కుమారుల పన్నెండు మంది ఒకచోట కూడి అంతా కలిసి భీముని సమయించాలని ఆలోచన చేశారు. అంతా అతణ్ని చుట్టుముట్టుతారు. ఆ సమయాన భీముడు తన రథాన్ని ఆపించి, ఆ రథాన్ని అక్కడె నిలుపుకొని ఉండాల్సిందని సూతుడికి చెప్పి నేలమీదికి దూకి గదతో సైన్యాలను ఛిన్నాభిన్నం చేస్తూ, వెళ్ళటం ఆరంభించాడు. ధృష్టద్యు మ్నుడు, భీముడు ఒక్కణ్ణి పన్నెండు మంది ఎదిరించటం ఎరిగినా, ద్రోణునితో యుద్ధం చేస్తుండటం చేత చాలసేపు రాలేకపోయినాడు. చివరకు తాను వచ్చి చూస్తే వట్టి రథం ఉన్నది-భీముడు లేడు. అదేమంటె ఇలా వెళ్ళిపోయాడు సన్నిక్కడే రథాన్ని పెట్టుకొని ఉండుమన్నాడని రథసారథి చెప్తాడు. తీరా ఆవైపు చూస్తే భీముడు వెళ్ళిన దోవనె అటూ ఇటూ రథాలు, ఏనుగులు, గుర్రాలు చచ్చిపడి ఉండ టం వల్ల వాటి ఆధారంగా తన రథాన్ని తోలించుకొని ధృష్టద్యుమ్నుడు వెళ్ళి భీముని కలుస్తాడు.

భీముడు మళ్ళీ విజృంభ కాండ నారంభించి దుర్యోధనుడూ వాని పన్నెండు ‌రు తమ్ముళ్ళను భీభత్సంగా ఎదుర్కొంటాడు. దుర్యోధనుడు తప్ప అంతా పారి ోతారు. పట్టుదలగా దుర్యోధనుడు నిల్చిపోతాడు. భీముడు అదిచూసి మహా సంబర డిపోతాడు. బాణాలు వేసి దుర్యోధనుని శరీరాన్ని తూట్లు కొట్టుతాడు. దుర్యో నుడు మూర్ఛపోతాడు. అప్పుడు కృపుడు అతడ్ని తన రథమెక్కించుకొని వెళ్ళి ోతాడు.

ఇంతలో సూర్యాస్తమయ సమయం రావడంవల్ల యుద్ధం ఆనాటికి ఆగిపో ుంది. ఇది ఆరవనాటి యుద్ధం.

ఇది ద్వితీయాశ్వాసం.



# మహాభారత కథలు

## భీష్మపర్వము - తృతీయాశ్వాసం

## చివరి నాలుగు రోజుల యుద్ధం- భీష్ముని పతనం

ఏడవరోజు ద్రోణుడు యుద్ధం చేస్తూ, విరాటుని కుమారుడయిన శంఖుడ్ని చంపేస్తాడు. ధృష్టద్యుమ్నుడూ దుర్యోధనుడూ యుద్ధం చేస్తారు—దుర్యోధనుడి రథం విరిగితె శకునివచ్చి అతడ్ని తన రథంమీద అవతలకు తీసికొనిపోతాడు. భీముడు కృతవర్మతో పోరి అతడిని విరథుని చేస్తాడు.

అంతవరకు విని ధృతరాష్ట్రుడు మళ్ళీ సంజయునితో "ఎప్పుడూ మనవాళ్ళే తగ్గిపోతున్నట్లు చెప్తున్నావు ఇది ఏమి మాయ?" అంటాడు. అందుకు సంజయుడు "మరి ఏం చేయను? నీ పక్ష సైన్యం,నదులు సముద్రంలో కలిసి తమ ప్రభావాన్ని ఏమాత్రం వెలిగించుకోలేకపోయినట్లే, పాండవ సైన్యంలో చేరి నశించిపోతున్నారు. ఇదంతా నీవుచేసిన తప్పువల్ల కలిగినదెనంటాడు.

ధృతరాష్ట్రుడు ఉద్యోగపర్వాంతంలోనే సద్బుద్ధిని కొంత సంతరించాడు కాని తనవారు గెలవకపోతున్నారే అని బాధ కనువరచడం చూస్తాం. మనిషికి ముందుగా బాగుపడేది బుద్ధి—బుద్ధి అలా సరిగా ఉండటమయింతరువాతకూడ మనసు ఎప్పటికోగాని సాధనమీదగాని, దోవకురాదు. కథవినంగానే వీళ్ళు నా వాళ్ళు వాళ్ళు పెరవాళ్ళు అనే భావం మనసుకి వస్తుంది. "అది సరికాదు—ఇద్దరూ నిజానికి నావాళ్ళే" ననే భావం బుద్ధిద్వారా విమర్శచేసి ఆలోచిస్తేనేగాని తెలిదు. అది కలగడానికె సంజయుడు మళ్ళీ మళ్ళీ ధృతరాష్ట్రుడు జూద విషయంలో చేసిన ఉపేక్షను జ్ఞాపకంచేసి, బుద్ధికి మళ్ళీ చైతన్యాన్ని కలుగజేస్తుంటాడు.

భగదత్తుడు తన సుప్రతీకమనే ఏనుగులోవచ్చి యుద్ధం చేస్తాడు. దానిని ఎదుర్కొన్నది ఒక ఘటోత్కచుడే. భీముని గదాయుద్ధంవల్ల సైన్యాలు నుగ్గు నుగ్గు అవుతూనే ఉన్నయి. అర్జునుడు సైంధవులపని జట్టుతూ ఉంటాడు. అప్పుడు సూర్యాస్తమయం కావడంవల్ల యుద్ధం ఆనాటికి ఆపేస్తారు.

ఎనిమిదవరోజు యుద్ధం కూర్మ వ్యూహంతో భీష్ముడు ఆరంభిస్తాడు. పాండవులు శృంగాటక వ్యూహం పన్నుతారు.

ఈనాటి యుద్ధంలో సునాభుడు మొదలయిన ఎనమండుగుర్ని ఒక్కసారిగా భీముడు చంపేస్తాడు. కౌరవులు నూరుమందిలో ముందుగా చచ్చినవారువీరే. కౌరవ సేనలో వారంతా "ఇంకేముంది భీముడు ఆనాడు సభలో చేసిన ప్రతిజ్ఞను తీర్చుకొంటున్నాడ"ని గోలపెట్టారు. దుర్యోధనుడు భీష్ముని దగ్గరకు వెళ్ళి ఈ చావుల సంగతి చెప్పి నిష్ఠురాలాడుతాడు—పాండవులు నా తమ్ముల్ని చంపేస్తుంటే రోషం శోకం లేకుండా ఉన్నావంటాడు. భీష్ముడు చాల బాధపడిపోతాడు. ఇరకాటకంలో పడ్డాడు. చివరకు అంటాడు. వాళ్ళ సామర్థ్యం వర్ణించి చెప్పినప్పుడు నీవు నా మాటలు నమ్మలేదు. ఆ భీముడ్ని ఎదురింపగలిగినవారు మన సేనలో ఏ ఒక్కరైనా ఉన్నారనుకొంటున్నావా ఇప్పుడైనా—అంటాడు. వీరస్వర్గమే మనకు గతి అని యుద్ధం చేయాలి. అలా చేస్తానుగాక అని రంగంలోకి వెళ్తాడు.

ఈ ఎనిమిదో రోజునే అర్జునునికీ పాతాళ రాజపుత్రికీ పుట్టిన ఇరావంతుడనే కొడుకు చనిపోతాడు. అతడు అలంబసుడనే రాక్షసునితో మాయా యుద్ధం చేస్తూ పాముగానై ఝుడిపిస్తుంటే, అలంబసుడు గరుడడై వచ్చి ఆ పామును పట్టేని చంపేస్తాడు, భీముడె అర్జునునకు ఈ సంగతిచెప్పి ఇరావంతుని శవం చూపిస్తాడు. అర్జునుడు దుఃఖిస్తాడు. శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి చూస్తూ ఉంటారు, అది భగవద్గీతను జ్ఞాపకం చేయటమె. ఒక క్రమానికి అర్జునుడు శ్రీకృష్ణుని ముఖం చూస్తాడు. ఆయన చిన్న నవ్వు నవ్వుతాడు. అప్పుడు,—

కని, యతడు తెలిసి, నీచే
వినినది యిది మున్ను,—దీని విడిచితి—నహితం
జన తేరునడుపు కురుబల
వినిపాతన పాటకమున విహరించుటకున్

అంటాడు. శ్రీకృష్ణుడు చెప్పిన భగవద్గీతా తత్త్వం ఇతడికి మొట్టమొదటగా ఇక్కడ అదనుకువచ్చింది అనేది గమనీయం.

ఘటోత్కచుడు ద్రోణాచార్య ప్రభృతులతో మహా భయంకరంగా పోరుతుంటాడు. ధర్మరాజు వీనికి సహాయంగా భీముని పంపుతాడు. మళ్ళీ యుద్ధం సంకుల

మవుతుంది. ఇదిచూచి దుర్యోధనుడు భగదత్తును పిలచి సుప్రతీకమనే ఏనుగును తీసి కొనిపోయి ఆ హిడింబ కుమారుణ్ణి జయించుమనీ, ఇంకెవరికి ఆ పని సాధ్యంకాదనీ పొగిడి పంపుతాడు. కాని ఆ సుప్రతీకాన్ని ఘటోత్కచుడు నొవ్వజేస్తాడు కొంత సేపట్లో సూర్యుడస్తాద్రి చేరగానే యుద్ధం ఆనాటికి చాలిస్తారు.

శిబిరానికి వెళ్తూ దుర్యోధనుడు కర్ణుని రావలసిందని కబురు పంపుతారు. ఆ రాత్రి కర్ణ శకుని దుశ్శాసనులతో మంతనాలు నడుస్తవి. రాజు కర్ణునితో అంటాడు. ఈ ఎనిమిది రోజుల యుద్ధంలో మన సైన్యం ఎక్కువ నశించింది. ఏంచేయాలో చెప్పాల్సింది అంటాడు. కర్ణుడు నిర్భయంగా అంటాడు. "రేపు భీష్ముని యుద్ధానికి రాకుండా చేయవయ్యా నేనువచ్చి పాండవ సేనల మదమడగిస్తాను" అంటాడు. ఇలా అనడంలో తాను సర్వ సైన్యాధిపత్యం వహించి యుద్ధం నడపాలనే కాంక్ష ఉత్సాహం మాత్రమె కర్ణుడికి ఉన్నట్లు అవుపడుతుంది. దుర్యోధనుడు భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలు తన పక్షానికి హితాన్ని కోరకనె పాండవ బలాలతో యుద్ధం చేస్తున్నారని చెప్పనే చెప్పాడు కర్ణునితో. అందుకనె కర్ణుడిలా అంటాడు. అతడి ఉద్దేశ్యం బహుశ ఒక్క భీష్మునేనేమిటి ద్రోణ ద్రోణి కృపులందర్నీకూడ యుద్ధాన్నుంచి తగ్గించివేయుమనె అయి ఉంటుందనచ్చు. ఇలాటి చవకబారు ఊహలు ఉన్న వనె భీష్ముడు అతడు యుద్ధంలోకి రాకుంటేనే తాను యుద్ధం చేస్తానన్నాడు ఏదయినా వీరి పరస్పర స్పర్ధలు దుర్యోధనుడిని మరికాస్త పాడుచేసినవనేది నిజం.

ఈ మంతనానికి తగ్గట్టుగా దుర్యోధనుడు ఆ అర్ధరాత్రివేళ భీష్ముని శిబిరానికి వెళ్ళి ఆయన్ను నిద్రలేపి, మళ్ళీ వెనకటిలాగానే "నీవు పాండవుల్ని జయించటల్లేదు. నిన్ను ప్రార్థిస్తున్నానుగాక నన్ను అలా వదలి రేపటినుంచీ కర్ణుని యుద్ధానికి పంపాల్సిందం"టాడు.

ఈ మాటకు భీష్ముడు ఎంత బాధపడ్డాడో వర్ణించలేము. నిజానికి తన శాయశక్తులా యుద్ధంచేసి శ్రమపడుతున్నాడు. తనపై తన పక్షపు రాజుకే నమ్మకం లేకపోతె మానధనుడైన భీష్మునకు ఎలా అనిపిస్తుంది. క్షణం మాట్లాడలేక ఆగిపోయినాడు. నిట్టూర్పువదిలాడు. "ప్రాణాలు ఒడ్డి పోరాడుతున్నాను నాయనా నీవు అలా మాట్లాడ్డం సరికాదు. అర్జునుడు ఖాండవం దహింపజేసేటప్పుడు ఇంద్రునీ దేవతలనూ జయించాడు. శివుణ్ణి మెప్పించి గొప్ప అస్త్రాలు పొందాడు. నీవూ నేనూ కర్ణుడూ సహా ఓడిపోయి ఉత్తర గోగ్రహణ సమయంలో గోవులను అర్జునునకు వదలివేసి

వచ్చాము. ఘోష యాత్రలో కర్ణుడూ నీ తమ్ముళ్ళూ గంధర్వులకు వెరచి పారి పోతే వాళ్ళనుంచీ నిన్ను విడిపించాడు. ఇన్నాళ్ళు నీకోసం ప్రాణాలు తెగించి పోట్లాడితె నీవిలా అంటున్నావుకదా! నేను మొదటనే చెప్పాను. గాండీవిని గెలువలేను. శిఖండిని చంపలేను. మిగతావాళ్ళను నాకువదలి వారిద్దర్నీ మీరు గెలవండి. రేపు చూపుతాను నా ప్రతాపం నీకు—ఆ తరువాత మాట్లాడుదువుగాని'' అంటాడు.

తొమ్మిదవ రోజు యుద్ధం ప్రారంభమయింది. కర్ణునికి కబురు పంపక భీష్మునె పెద్దగా ఉంచాడు దుర్యోధనుడు. రంగస్థలంమీద దుర్యోధనుడు మిగతావారితో భీష్ముని ఎదుట అంటాడు—భీష్ముడు పాంచాలురాదిగా గల వారిని జంపి పాండు పుత్రులను గెలువగలనంటున్నాడు. మనమంతా ఈయనకు బాగా తోడ్పడాలి అంటాడు. ఇది ఎంత అవమానకరమయిన ప్రదర్శనం భీష్మునకూ? ఆయన ఖిన్నుడయిపోయినాడు.

ఈ తొమ్మిదో రోజు యుద్ధంలో అభిమన్యుడు చాలా విజృంభించి కౌరవ సైన్యాల్ని తరుముతున్నాడు. ఎంతోమంది వచ్చి ఎదిరించి ఓడిపోతారు. దుర్యోధనుడు అతడిపైకి అలంబసుడన్న రాక్షసుణ్ణి పంపుతాడు. వాడు మాయలువన్ని చీకట్లు కల్పిస్తె భాస్కరాస్త్రం వేసి అభిమన్యుడు ఆ చీకట్లను తరిమివేస్తాడు. అప్పుడు ఎదుటివార నేకమంది యోధులువచ్చి ఒక్కుమ్మడిగా అతనిమీద పడుతారు. అందరికి అన్ని రూపులయినాడన్నట్లు అభిమన్యుడు యుద్ధం చేస్తుంటాడు.

వీరత్వం ఒకటి— ప్రారబ్ధం ఒకటి. అభిమన్యుడు తాను చంపబోయిన శత్రువు దుశ్శాసనుడని తెలియంగానే పెదనాయన (భీముడు) ఇతడ్ని చంపుతానని శపథం చేశాడు నే చంపివేస్తె ఎలాగ అని వదలివేసేవాడు. శకుని కనపడితె నకులుడు బాబాయి చంపుతానన్నాడుగదా నేనెలా చంపను అని వదిలేశేవాడు. ఇలా ఈ వాగ్దానాలతో మనసు సతమతంచేసికొంటున్నాడు. ఇంతలో సాత్యకి సహాయం చేస్తాడు. ప్రేక్షకులకు సంభ్రమంతగ్గుతుంది.

అర్జునుడూ ద్రోణాచార్యులూ యుద్ధం సంకులంగా చేస్తారు. భీముడ్ని కళింగ పతిన్నీ భగదత్తుడున్నూ ఎదుర్కొంటారు. వెంటనే భీముడు రథం దిగేస్తాడు. గద తీసికొంటారు వెండాడుతూ నడుస్తాడు. భీమునకు అలా యుద్ధం చేస్తేనేగాని తమి తీరదు. ఉధృతంగా యుద్ధం చేయగలిగేది రథం సూతుడు బాణాలు వీటి సహాయం తనకి లేకుండా ఉంటేనేననిపిస్తుంది. అప్పుడు ధర్మరాజుపైకి భీష్ముడు వెళ్ళి యుద్ధం

చేయడంవల్ల ధర్మరాజు కేకవేసి భీముని పిలుస్తాడు. ఆ కారణంచేత భీముడు అక్కడకు వెళ్తాడు.

కౌరవుల సేనలో 'గో'మనే శబ్దం పుట్టింది. భీముడు విజృంభణంతో గదవందువు చేస్తున్నాడు. కౌరవ సేనలు ధృతరాష్ట్రుని తిట్టుకొంటున్నారు ఈ యుద్ధం రాకుండ చేయనందుకు. ఇంతలో భీముని రథాన్ని తీసికొని సారథి వెతుక్కుంటూ వస్తాడు భీముని దగ్గరకు. అప్పుడు ఆరథాన్ని ఎక్కుతాడు భీముడు.

మిట్టమధ్యాహ్నమయింది. భీష్ముడు గ్రీష్మభానుడులా వేడెక్కిపోయి విజృంభించాడు. అనేక జలసంతతిని రూపుమాపుతున్నాడు. ఎదురు రాగలిగినవాడెవరూ కన్పడటల్లేదు. పాండవులు ఆశ్చర్యపోతున్నారు. రథికుల్ని హస్తికుల్ని అశ్వికుల్ని అందర్నీ దునిమి పారేస్తున్నాడు భీష్ముడు.

అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునునిపిల్చి "చూశావా మన బలాన్నంతనూ కలంచివేస్తున్నాడు భీష్ముడు. ఇప్పుడు నీవు నీదర్పం చూపవద్దా?" అంటాడు. అంటే అర్థం ఏ పాశుపతాస్త్రాన్నో వేయుమనా? అయియుండవచ్చు! అర్జునుడు మాత్రం అంజాయిస్తున్నాడు.

మళ్ళీ భగవద్గీత సమయంలోని విషాదం కదిలివచ్చింది అర్జునునకు. వెంటనే భగవంతుడి బోధకూడ వచ్చింది మనసులోకి. "సరే ఈ భీష్ముణ్ని పడగొట్టుతాను గాక పోనీ రథాన్ని" అంటాడు. రథం ముందుకు వెళ్తుంటే భీష్ముని బాణాలు వెనక్కు కొట్టుతున్నాయి రథవేగాన్ని. ఇంకెవ్వరూ అడ్డం రావటానికి సాహసించటల్లేదు. శ్రీకృష్ణుడూ దెబ్బలు తింటున్నాడు–అంతె–ఒక్క క్షణంలో క్రిందికి ఉరికినాడు శ్రీకృష్ణుడు. కౌరవ సేనలు అదిరిపోయినారు. ధరణీచక్రము గ్రక్కునన్ గదల భీష్ముని పైకి ఉరుకుతాడు శ్రీకృష్ణుడు. "చచ్చె చచ్చె" నన్నారు అంతా భీష్మునిగూర్చి. భీష్ము డుమాత్రం అంటాడు. "రా నాయనా! మహానుభావా! నాకు అదే మేలు నేనూ అదే కోరుతున్నాను" అంటాడు. అంటే తనకు రాత్రి దుర్యోధనుడి మూలంగా కలిగిన అవమానంవంటిది ఇక కలుగరాదని ఆయన ఆశయం అనిపిస్తుంది. ఇంతలో పార్థుడు వచ్చి కృష్ణుని చేయిపట్టుకొంటాడు "కయ్యము సేయనేనని యకల్మషబుద్ధి ప్రతిజ్ఞచేసి నీవియ్యెడతప్పితేని జగమేమను" అంటూ వెనకనె పోతాడు. అర్జునుడి కళ్ళు చెమ్మగిలిపోతున్నాయి. భీష్ముడు వీరవిహారం చేస్తూ పాంచాలుని సేనను చలిచీమల్ని త్రొక్కి చంపినట్లుగా చంపేస్తాడు.

సూర్యుడస్తాద్రికి వెళ్ళే సమయానికి యుద్ధం చాలిస్తారు.

అనాటి రాత్రి కౌరవులు వెళ్ళి భీష్ముని పొగుడుతారు. పాండవులు తమ సైన్యం బురదలో దిగివచ్చిన గొడ్డులా ఉన్నదని గోల పెట్టుతారుట. అర్ధరాత్రి బయలుదేరి పాండవులు శ్రీకృష్ణుని మందిరానికి వెళ్ళి ఆ భీష్ముని రౌద్రమైన యుద్ధానికి భరించలేమంటారు. ధర్మరాజు యుద్ధం ఆపి తాను అరణ్యాలకు పోవటం మేలు అంటాడు. కాని శ్రీకృష్ణుని, ధర్మం తప్పని ఉపాయమేమైనా ఉంటే చెప్పాల్సిందని అడుగుతాడు. అందుకు కృష్ణుడు, "నీ తమ్ములు అత్యద్భుత బాహువీర్యం కలిగిన వారు. ఈ అర్జునుడు తెగువచేసి యుద్ధం ఉగినట్లు చేయకపోతె నేనే ఆ పనిచేసి గెలుపునిప్పిస్తాను చింత పడవద్దంటాడు.

ఇదంతా అర్జునుని ప్రోత్సహించడం. అవసరమైతె అతడి దగ్గరున్న దివ్యాస్త్రాలు వాడి భీష్ముని నిర్జింపుమని ధ్వని. ధర్మరాజు మాత్రం "అయ్యో నీవు యుద్ధం చేస్తావా. "కయ్యము సేయక తగు సాహాయ్యము సేయుదునన్న నీ మాటను నేను బూటకం చేస్తానా" అంటాడు. "భీముడు తనకు హితాన్ని చేస్తానని మాట ఇచ్చా"డని చెప్తాడు. ఆ భీష్ముని దగ్గరకు వెళ్ళాలనే ఊహ కనవడుస్తాడు. శ్రీకృష్ణుడు వెంటనే ఆ పద్ధతె మంచిదని చెప్పి ఆ అర్ధరాత్రివేళ ఎవరకూ తెలియకుండా భీష్ముని మందిరంలోకి వెళ్తారు. భీష్ముడు వీరినాదరించి, వచ్చిన కారణమడుగుతాడు. ధర్మరాజు తాము గెలిచే ఉపాయమేదో చెప్పుమంటాడు.

భీష్ముడు, యుద్ధంతోనూ ఈ బంధువుల వివాదాలతోనూ, దుర్యోధనుడి నిష్ఠురాలతోనూ బ్రతుకుమీద విసిగి తాను ఎలా యుద్ధంలో పడిపోవాలో ఆ ప్రక్రియ చెప్పేయాలనుకొన్నాడు. శిఖండిని ముందుంచుకొని యుద్ధం అర్జునుడు చేసేటట్లయితె ఆ సమయాన తాను ప్రతిగా యుద్ధం చేయడు గనుక అప్పుడె అర్జునుడు నిశితమైన బాణాలకు తాను పడిపోక ఏమవుతాడు గనక అని ఉపాయం చెప్పాడు.

ఇది చిత్రమైన ఊహ. తాను చనిపోవాలని అనుకున్నాడు గనక ఈప్రక్రియ చెప్పి దాని ప్రకారం నడిపిస్తున్నాడా లేక కేవలం ధర్మరాజాదుల మేలు కోసం తన శరీర త్యాగం చేశాడా భీష్ముడు అనేది ఇదమిత్థమని తెలియదు. దధీచి ఇంద్రునకు తన వెన్నుపూసలనిచ్చినట్లు ఇవ్వవచ్చునుగాక, అలా చేయలేడు. అలా ఇచ్చినట్లయితె దుర్యోధనాదులు కూడ ఔను కాదనడానికి వీలు లేదు. ఆ ప్రభావం అర్జును బాణాలకే ఇవ్వటం చిత్రమైన విషయం.

ఇలా చెప్పిన తరువాత పాండవులూ శ్రీకృష్ణుడు ఆ అర్ధరాత్రి తిరుగు ముఖ మవుతారు. దోవలో అర్జునుని మనసు మథనపడిపోతుంది. ఎత్తి పెంచిన తాతగార్ని ఎలా కొట్టడం అంటాడు. శ్రీకృష్ణుడు రాజధర్మం జ్ఞాపకం చేసాడు యుద్ధంలో చేరిన తరువాత కావలసినంత కర్తవ్యం ఉంటుంది యోధుడికి. అక్కడ అతడు చేసేపని సమాజానికి హితవయిన పని; స్వార్థం చూసుకొని యుద్ధం నుంచి తప్పుకొంటానని అనగలిగే పరిస్థితి లేదు. కౌరవుల్ని సర్వుల్నీ జయిస్తానని మునుపు నువ్వు అన లేదా" అంటాడు శ్రీకృష్ణుడు. అర్జునుడు ఒక ఉపాయం లోచిస్తాడు. శిఖండే భీష్ము నిపై బాణాలు వేస్తుంటె తాను ఇతర్లను కొట్టుతుంటే చివరకు శిఖండే భీష్ముని చంపే స్తాడుగాక అంటాడు. శ్రీకృష్ణుడు వెంటనె "ఆ పద్ధతి నడవదయ్యా. నీ చేతి బాణాలు తప్ప ఇతర్ల బాణాలు ఆయన శరీరాన్ని జొరవు సుమా! నీ ఉపాయం నెగ్గేదికాదు అంటాడు. అర్జునుడు నిట్టూర్చి అప్పటికి ఎలాగవుతుందోలే అంటాడు. అలా కుటీ రాలకు వెళ్ళిపోతారు.

మరునాడు పదోరోజు యుద్ధం ఆరంభమవుతుంది.

పాండవులు శిఖండిని ముందునిలుపుకొని ఉంటారు. కురువీరులలో భీష్ముడు ముందువుంటాడు. భీష్ముడు అర్జునివైపూ అర్జునుడు భీష్ముని వైపు పురోగ మించి యుద్ధానికి తలపడుతారు. శిఖండి కూడ భీష్ముని మీదకు బాణాలు వేస్తాడు. "ఆడదానివై పుట్టి మగవాడైన నిన్ను కొట్టనులే పొమ్మంటాడు భీష్ముడు. నేను మగవాడినే ననిపిస్తాను చూడు నీమీదయుద్ధం చేసి" అంటాడు శిఖండి. భీష్ముడు ప్రక్కకు తిరిగి పాంచాల సైన్యంమీదకు పురోగమిస్తాడు. దుర్యోధనుడు మళ్ళీ భీష్ముని హెచ్చరిస్తూ పాండవుల్ని కొట్టకుండా పోతావేమంటాడు. అప్పుడు భీష్ముడు "రాజా! పదివేలమందిని చంపుతానన్నాను చంపాను. ఇంక చేతి బలుపు తగ్గి నట్లుంది. ఇవాళ నేనో వాళ్ళో సాంతమవుతామనిపిస్తోంది. చూడు నా చేతి బలం ఎలా వుంటుందో" నంటాడు.

భీష్మునకు సహాయంగా కౌరవసేనలు అందరూ వస్తారు. శిఖండి అర్జునులకు సహాయంగా పాండవపతులంతావస్తారు పోరు మహా ఘోరమవుతుంది. భీష్ముడు విజృంభించి పాండవ బలాలను నాశనం చేయడం ఆరంభిస్తాడు. మధ్యాహ్న సమ యానికి భీష్మునకు ఆయాసం వస్తుంది. ఇక శరీరం నుంచి తాను విడవడాల్సి ఉంటుందనీ అదేమేలనీ భావిస్తాడు. అతడు 'చావాలె' ననుకొంటేగాని చావనట్లుగా

వరాన్ని పొంది ఉండటం వల్ల తానిక చావడమే మేలనే భావం అతడికే రావడం సహజమైంది. అందుకని ధర్మరాజుకు వినపడేటట్లుగా అంటాడు. "ఇక మీరు శిఖండిని ముందుంచుకొని నన్ను కొట్టటం అవసరం సుమా" అంటాడు.

శిఖండి భీష్మునిపై బాణాలు వేస్తాడు భీష్ముడు ఇతర యోధులమీద అర్జునుని పైనా బాణాలు వేస్తాడు. దివ్యాస్త్ర మొకటి శత్రువులమీద వేయాలని భీష్ముడనుకొని చూడంగానే శిఖండి అవుపడతాడు. వెంటనే అస్త్రం వేయదంమానుతాడు. ఇంతలో విరాటుని తమ్ముడయిన శతానీకుడ్ని చంపేస్తాడు. వెంటనే భీష్మునికి ఉత్సాహం విజృభించి కాలానలుడై పోతారు.

శ్రీకృష్ణుడు అర్జునుని ప్రోద్బలం చేస్తాడు. శిఖండిని అర్జునుడు ప్రోద్బలం చేస్తాడు. అర్జునుడు ఎంతసేపటికీ భీష్ముని విల్లు విరగగొట్టడానికే ప్రయత్నం చేస్తూ ఆయన వేసిన బాణాలను ఖండించే పని చూసుకొంటున్నాడు. శిఖండి బాణాలు వేస్తుంటే భీష్మునికి తగుల్తునే ఉన్నయికాని వాటికి ఆయన్ను నొవ్వజేసే వసలేక పోయింది. అర్జునుణ్ని మళ్ళీ కృష్ణుడు ప్రోద్బలం చేస్తాడు. ఒక క్రమానికి శిఖండిని ముందుంచుకొని అర్జునుడు తీవ్రమైన బాణాలతో భీష్ముని విల్లుని విరుగగొట్టి ఆయన ఇంకో విల్లు తీసికొనే లోగా వళ్ళు తూట్లు కొట్టుతాడు. భీష్ముడు తనకు తగిలేవన్నీ శిఖండి బాణాలనుకొన్నాడు కొంతసేపు. కాని అవి ఇంత తీవ్రమైన బాధను కలుగ జేయవు కదా అనుకొని అప్పుడు ఓహో అర్జునుడు నా విల్లును మళ్ళీ మళ్ళీ విరగ గొట్టి నా వళ్ళుగూడ తూట్లు చేస్తున్నాడు సుమా ! అనుకొన్నాడు. ఇక మనం ఈ శరీర జన్మను చాలించటం యుద్ధంలోపడిపోవటం మంచిది అనుకొంటాడు. ఆకాశం మీది దేవతలు అందుకు సమ్మతించారు కూడాను. ఆ సంగతి ఆయనకూ సంజ యునకూ మాత్రమే తెలిసింది.

భీష్ముడప్పుడు దుర్యోధనునితో దుశ్శాసనునితో అంటాడు. ఈ బాణాలు అర్జునునివి. శిఖండివికావు. ఇవి అశనిపాతాలు. యమునిద్దకు తీసుకొనిపోయే బాణాలివి. ఇలా అంటోనే అర్జునునిపై బాణాలు వేశాడు భీష్ముడు శక్తిని వేశాడు. వాటన్నిటినీ అర్జునుడు తిరోగమింప జేశాడు భీష్ముని విల్లు విరిగిపోయింది. కత్తీ డాలూ తీసికొని ఉరికి వస్తున్నాడు. అర్జునుడు పాండవ బలాలను ప్రోద్బలంచేస్తాడు, వెళ్ళండి వెళ్ళండి వెళ్ళి భీష్ముని పొడవండి అంటాడు. వారంతా ముందుకువచ్చి ఒక్కసారి చుట్టుముట్టి భీష్ముని శరీరంలో ఎడంలేకుండా అస్త్రశస్త్రాలతో పొడు

స్తారు. భీష్ముడు నేలకు ప్రాలిన క్షణాన అయన శరీరానికి గుచ్చుకొన్న బాణపరం పరే ఆయనకు ఆధారమై ఉండిపోయింది. మహామహుని ప్రతాప కాంతికి మబ్బు కలిగింది.

దేవతలంతా "అయ్యో ఇప్పుడు దక్షిణాయనంకదా! పుణ్యాత్ముడయిన ఇత డిప్పుడు మరణిస్తె ఎలాగన్నారు. భీష్ముడు అది విని ఉత్తరాయణం వచ్చేదాకా నా ప్రాణాలు ఈ శరీరంలోనే అపి ఉంచగలనంటాడు.

మొత్తం యుద్ధం అగిపోయింది. సూర్యుడుకూడ పశ్చిమాద్రికి వెళ్ళి మొఖం జేవిరించుకొని నిలుచున్నాడు. పాండవులూ కౌరవులూ వచ్చి నిలిచిపోతున్నారు. కండ్లనుండి సంతత ధారాపాతంగా అశ్రుకణాలు ప్రయాణిస్తున్నయి. అది ఒక మహా సంఘటన. జరుగరానిదనుకొన్నది జరిగిపోయింది. ఎవరితప్పు ఇది? ఎవరికున్నది ఈ సంఘటన కాకుండా అడ్డుకొనే శక్తి? ఇది ఒక మహామారుతంవంటి కాల మాహత్మ్యం. ఎవరు వద్దన్నా అగేదికాదు. ఎవరు దుఃఖించినా మగిదేదీకాదు.

కాలం అలా వెళుతుంటే ఇలా అది అయిపోవటమనేది ఒకటే సంఘటన. దానిని ఎలా ఆపగలిగేవారు లేరో ఈ భీష్ముని పతనం అనేదికూడా అలాగే అకాల గమనంలో ఒకానొక భాగం. పదిరోజుల యుద్ధంలో ఒకప్పుడు వీరూ, ఇంకొక ప్పుడు వారూ గెలిచినట్లు అవుపడ్డారు అని చెప్పుకోగలమేకాని అరోజు ఆరంభా నికి ముందె ఏమవుతుందో తెలిసికోకలిగిన వారెవరూ ఉండరు.

మన జీవితమూ అంతె, ఇవాళ ఎన్నో మంచిపనులు చేస్తున్నామని కనీసం ఆరంభించామని సంతోషిస్తాం. కాని రేపు చేసిన పనంతా ఏమంత మేలు కూర్చ లేదని పైగా దుఃఖాన్నే తెచ్చిందని అనుకొంటాము, దుఃఖిస్తాము. ఈ సుఖం ఈ దుఃఖం అలలు అలలుగా నిరంతరం రావటం జీవితంలో_ఎవరి జీవితంలోవారు_ విమర్శించి చూడటంవల్ల తమ జీవితం ఈ విశ్వంలో ఎంతటి చిన్నదైనదో లేదా ఈ విశ్వంలో అవశంగా భాగమై వెళ్ళిపోతుంటుందో అర్థమవుతుంది. వేదాంత విషయం ప్రత్యేకంగా చదివి తెలిసికొంటె కేవలం బుద్ధికి కొంత పరిశ్రమ అవుతుంది గాని_ ఎవరి జీవితం వారు ఈ సుఖ దుఃఖాలు ప్రోవుగా తప్పనిసరిగా విశ్వంలోని భాగమై వెళ్ళిపోతుండేదిగా విమర్శచేసి అనుభూతి చేస్తెనే తప్ప- బుద్ధికి మించిన స్థాయిలో అనుభూతికాదు.

అందుకే ఈ భారత కథలో తాదాత్మ్యం చెంది ఆ కౌరవ పాండవులలో ఒకడై చదువరి అనుభూతులను పొందుతుంటే కలిగే వేదాంతానుభూతి, కేవలం పుస్తకం పట్టుకొని వేదాంత విషయం చదివేవారికి కలుగదని అనిపిస్తుంది. కాని అలా కలిగిన అనుభూతిని మళ్ళీమళ్ళీ తలచి జ్ఞాపకముంచుకోకపోతె అది కేవలం పురాణ వైరాగ్యమని అనడం మామూలు కాని దాని ప్రభావం [illegible] మర్చిపోరాదు. వ్యాస మహర్షి మహాభారతాన్ని వేదప్రయోజనం [illegible] పెట్టుకొని రచించాడు. మోక్షసాధన చెప్పడమె ఆయన కృషి. ముక్తి అనేది నివృత్తి తత్త్వం వల్ల రావల్సిందె. భీష్మునిలోని అసమగ్ర కర్మమార్గ ప్రవృత్తిని శ్రీకృష్ణుడు తర్జించాడని అర్థం. అందుకె భగవద్గీతలో కర్మచేస్తూ 'అనాసక్తి' చెప్పి జ్ఞానం అనుసంధానం చేయుమన్నది: భీష్ముని మూడోరోజు యుద్ధంలో ఒకసారి శ్రీకృష్ణుడు తర్జించాడు. సుదర్శనం చూపించాడు. భగవదనుగ్రహం [illegible] జ్ఞానం—అప్పుడప్పుడూ—కర్మిష్ఠికి అవగతమయినా అది నిలుకడ. భీష్ముడు మళ్ళీ [illegible] డంటె అర్థం అదె. ఐతె నివృత్తితత్త్వం వచ్చి పూర్తిగా ఆక్రమించదా అని మనకు సందేహం రావటం కద్దు. అలా జరుగదు. నివృత్తితత్త్వం అలా [illegible] గాని అవరించాలని ఆశించేదే కాదు. నిరాయుధుణ్ణి అని శ్రీకృష్ణుడు చెప్పకొని మరీ యుద్ధంలో చేరటం వల్లె సూచింపబడింది ఇది.

దక్షిణాయనంలో పతనమైన భీష్ముడు, పతనమైనప్పుడు [illegible] జ్ఞానాన్ని ఆర్జించి ఆ తరువాత ముక్తినొందినాడు అని అర్థం. కర్ణుడు [illegible] చూడటానికి వచ్చినప్పుడు భీష్ముడు వానితో అహంకార మమకారాలు [illegible] కోవలసింది అంటాడు అది జ్ఞానబోధ. అంపశయ్య [illegible] భీష్ముడు జ్ఞాని అయినాడనటానికి వ్యాసుడు ఇలా కథను మలచాడు. జలం [illegible] తెప్పించి త్రాగాడంటే— జలం అనేది మాయకు ప్రతీక [illegible] బోధ.

శిఖండివల్ల చచ్చాడేమిటనిపిస్తుంది—అంతవాడైనవాడు [illegible] వట చచ్చింది శిఖండివల్లనట! దీనర్థం 'స్త్రీ' [illegible] స్ఫురింపచేయాలని వ్యాసుని హృదయం అనిపిస్తుంది.

ఇంతకూ కథ ఏమంటే—ఇలాంటి స్థితిలో భీష్ముడు అంపశయ్యపై పడి వున్నాడు



# మహాభారత కథలు

## ద్రోణ పర్వము - ప్రథమాశ్వాసము

### 1. ద్రోణాభిషేకము

సంజయుడు ఐదురోజుల తరువాత మళ్ళీ ధృతరాష్ట్రుని కలిశాడు. యుద్ధ సమాచారం చెప్పటం ఆరంభించి, క్రిందటిసారి నేను వచ్చి భీష్మపతన విషయం నీకు చెప్పి యుద్ధ రంగానికి వెళ్ళేటప్పటికి. కౌరవులు కర్ణుని పిలిపించారు.

కర్ణుడు భీష్ముని పతనానికెంతో చింతించి కౌరవులకు ధైర్యం చెప్పి తానూ భీష్మునితో సమంగా యుద్ధం చేస్తానని మాట చెప్పి యోధ వేషం ధరించాడు. దాంతో అంతా సంతోషిస్తారు. ఆ తరువాత కర్ణుడు రహస్యంగా భీష్ముని చేరి నమస్కరించి, "మహానుభావా! ఆశీర్వదించు. సచ్చరితుడవైన నీకు ఇలాంటి స్థితి రావలసిందికాదు. నీమాదిరిగా యుద్ధం చేయగలవాడున్నాడా? కృష్ణార్జునులిక అనిలానలులుగా రెచ్చి కురు బలాలను కాల్చేస్తారు బహుశ. నేనైతే, ఆ మహాశివుని గెల్చి వచ్చిన అర్జునుడి భుజగర్వాన్ని అణగించాలనుకొంటున్నాను. అందుకు నీ దయ కావాలి" అంటాడు. భీష్ముడాశీర్వదించి "కౌరవులకు నీవే ప్రోపు, ప్రాపు, కాపు కావలసింది" అంటాడు.

కర్ణుడు ప్రాణాయామ యోగానికి ప్రతీక. భీష్ముడు కర్మయోగి. ప్రాణాయామ సమయంలో మాత్రమే ఉన్నతి నందే కర్ణుడు కర్మిష్ఠియైన భీష్మునకు నమస్కరించడమనే ఘట్టాన్ని వ్యాసుడు వర్ణించటం, ప్రాణాయామ యోగంకంటె కర్మయోగం గొప్పదనే సూచన కోసమెననిపిస్తుంది.

కర్ణుడు యుద్ధ రంగానికి రాంగానె దుర్యోధనుడు కర్ణునితో ఇకముందు సర్వసైన్యాధిపత్యం ఎవరికియ్యాలి అనే సంప్రదింపు చేస్తాడు. "నీవే ఉండాలి" అని అనలేదు. నిబ్బరుడైన కర్ణుడు ద్రోణుని సర్వసేనాపతిగా చేయాల్సిందని సలహా నిస్తాడు. వెంటకే ద్రోణునికి సైన్యాధిపత్యమిస్తారు. హఠాత్తుగా కలిగిన ఈ పదవీ ప్రాప్తికి ద్రోణుడు సంతోషించి దుర్యోధనుని "ఏదైనా వరం కోరుకో" మ్మంటాడు.

దుర్యోధనుడు కోరుకొన్న వరమేమంటే "ధర్మరాజును ప్రాణాలతో పట్టి తెచ్చి తనకియ్యాలి అని. ధర్మరాజును చంపివేయమని ఎందుకు కోరలేదు. అందుకు కారణం అలా చంపితె భీమార్జునులు కోపించి కౌరవుల్ని నలిపి నశింపజేస్తారనె భయం! అని దుర్యోధనుడె చెప్తాడు. ధర్మరాజు పట్టుబడితె అతడిచేత మళ్ళీ మాయా జూదమాడి రాజ్యం గెలుచుకోవాలని ఊహట! పోనీ పంచపాండవుల్ని చంపుమందామంటే శ్రీకృష్ణుడు కోపించి తమను చంపి రాజ్యం కుంతికిస్తాడని భయం!

మానవుడి ఊహలు ఎంత సంకీర్ణమై ఉంటాయి!! అప్పుడు ద్రోణుడు, "అర్జునుడు ధర్మరాజును సంరక్షిస్తున్న కాలంలో మాత్రం అది అసంభవం! మిగతా సమయాల్లో ధర్మరాజు యుద్ధరంగం నుంచి పారిపోకుండా ఉంటే పట్టితెచ్చిఇస్తాను" అన్నాడు. దుర్యోధనుడు సరెనని ఈయన ప్రతిజ్ఞను వెంటనె అందరకూ ప్రకటించి చెప్తాడు.

ఈ ప్రతిన సంగతి పాండవులకూ తెలుస్తుంది. అందుకని ఈ యుద్ధంలో సర్వసాధారణంగా అర్జునుడు ధర్మరాజును కాపాడుతూనే ఉండాలి- అని వారు తీర్మానం చేసికొంటారు. ఇంతకూ ఈ నాల్గు రోజుల పర్యవసానం-ధర్మరాజునుపట్టి తేవటం కుదరకపోగా ద్రోణుని ధృష్టద్యుమ్నుడు చంపేశాడు అని సంజయుడు చెప్పాడు. ఈ సంగతి ధృతరాష్ట్రుడు విని మూర్ఛపోతాడు. ఉపచారాలయిన తరువాత లేచి యుద్ధవర్ణనం చెప్పవలసిందని సంజయునడుగుతాడు. సంజయుడు చెప్తున్నాడు:

యుద్ధం ముమ్మరంగా ప్రారంభమైంది. ఆనాడు కౌరవసైన్యం కర్ణునిచూచి కళకళలాడుతోంది. ద్రోణుడు పురోగమించి విజృంభిస్తున్నాడు. అర్జునుడెదుర్కొన్నాడు. పోరు ఘోరమయింది. నెత్తురు ప్రవహిస్తోంది ఆ ప్రవాహంలో పీనుగులు కొట్టుకొస్తున్నయి!

ఒకప్రక్క ధర్మరాజు యుద్ధం చేయడం చూచి ద్రోణుడు ఆయనపైకి రథాన్ని తోలిస్తాడు వెంటనె పాండవ సేనలోనివారు అడ్డుకొంటారు. ద్రోణుడు వ్యాఘ్రదత్తుడ్ని సింహసేనుణ్ణి చంపేస్తారు ఇతర్లను దిక్కుల్లో పడేస్తాడు. చివరకు ధర్మరాజును చేపడతాడు. అంతా ధర్మరాజు పట్టుబడిపోయినాడనె అనుకొన్నారు. ఇంతలో భూమి దడదడలాడించి బాణాల వర్షం తరుముకొంటూ వస్తోంది. ఆ వెనక కృష్ణార్జునుల రథం వచ్చిపడింది. కౌరవులెంతోమందివచ్చి కలబడ్డారు. సైనికు

లసంఖ్యాకంగా చచ్చిపోతున్నారు. రక్తనదంలో మునిగిపోతున్నారు. ధర్మరాజును చెఱపట్టటం అసంభవమయిందానాటికి; సంధ్యా సమయానికి యుద్ధం ఆపేశారు. "ధర్మరాజును పట్టకపోతివె" అనే ప్రశ్నకు ద్రోణుడు దుర్యోధనునితో "అర్జునుడు వచ్చినా మాత్రమే" మనుకొన్నానుగాని, అది సాధ్యంకాని పని అని తెలిసిం' దన్నాడు. ఇప్పటికి పదకొండు రోజుల యుద్ధమయింది.

## 2. సంశప్తకుల ఆటంకం

అర్జునుని ధర్మరాజువద్ద లేకుండా చేయడం. కౌరవుల కర్తవ్యమయింది. త్రిగర్తులు సంశప్తకులూ కలిసి పెద్ద సైన్యమై దూరంగా ఎక్కడో నిల్చి అర్జునుని సవాలుచేసి పిల్చేటట్లూ అక్కడకు వెళ్ళి అర్జునుడున్నప్పుడు ద్రోణుడు ధర్మరాజును వెదకి పట్టుకొనేటట్లూ ఏర్పాటు చేసికొంటారు. ఆ మరునాడు అలా దూరంగా వెళ్ళి నిల్చి అర్జునుని రమ్మని పిలుస్తారు త్రిగర్తులు. అర్జునుడు ధర్మరాజును వదలటానికి ఇష్టపడకపోయినా ఈ సవాలుకు సమాధానమివ్వకపోవటం సరికాదని, సత్యజిత్తు అనే నమ్మకమైన యోధ ప్రముఖుని ధర్మరాజుకు కాపుఉంచి, అతడు చచ్చిన దాకా రక్షింపగలిగినవాడనీ, ఒకవేళ అతడు యుద్ధంలో చనిపోయే పరిస్థితిలో ధర్మరాజు తప్పుకొని యుద్ధరంగంనుంచి తొలగవలసిందె కాని ద్రోణునితో తలపడరాదనీ ప్రార్థించి, చివరకు ఆయన అనుజ్ఞను పొంది త్రిగర్తులను సమయించడానికి వెళ్తాడు.

అర్జునుడు దేవదత్తం ఊదంగానే త్రిగర్తుల గుండెలవిసినయి. పోరు ఘోరమయింది. ఆ త్రిగర్తులతోపాటు, కృష్ణుడు తనకు, బదులుగా పదివేలమంది నారాయణ గోపాలురు తన సమాన బలులు ఉన్నారనీ వారిని దుర్యోధనునకు ఇచ్చాడనీ ఎవరిగురించి చెప్పారో ఆ నారాయణులుకూడ అక్కడఉండి పోట్లాడుతున్నారు. వాళ్ళు చాల పట్టుదలతో పోట్లాడుతున్నారు. అప్పుడు అర్జునుడు తనకు త్వష్టయిచ్చిన మహాస్త్రం వేస్తాడు. దాని ప్రభావంవల్ల వాళ్ళల్లో వాళ్ళె కొట్టుకు చస్తారు. వాళ్ళకు శరీరబలమేగాని బుర్ర లేదని శ్రీకృష్ణుని అర్థమేమొ. బుద్ధి తానుంచుకొని బలం మాత్రం దుర్యోధనునికివ్వదలిచాడనిపిస్తుంది. సూత్రదారి ఆ ప్రభావం తగ్గినమీదట సంశప్తకులు ఒక్కసారిగా వచ్చి అర్జునుని చుట్టుముట్టుతారు. అంతా ఇంకేముంది అర్జునుడు చచ్చాడు చచ్చాడ"న్నారు. శ్రీకృష్ణుడు అప్పుడు వెనక్కు చేరగిలబడి బిగ్గరగా "ఎక్కడున్నావయ్యా అర్జునా అంతా చీకటైనట్లుంది వీళ్ళంతా పైనబడేట

ప్పటికి బిగ్గరగా మాట్లాడు బ్రతికున్నావనైనా నాకు తెలుస్తుంది" అంటాడు. అర్జునుడు ఏమిటీయన మనిషిలా అరుస్తాడు భగవంతుడైకూడ అనుకుంటాడు. ఆగ్నేయాస్త్రంవేసి శత్రు సంహారం ఆరంభిస్తాడు. అప్పుడు అందరకూ ఆదీప్తిలో కృష్ణార్జునులవుపడతారు.

ఇక్కడ ఇలా జరుగుతుంటే ధర్మరాజు సేనపై దుర్యోధనుడు దండెత్తుతాడు. ఏనుగులు గుర్రాలు తెగిపడుతుంటవి. క్రిందబడిన శరీరాల మీదుగా రథాలుపోవడం వల్ల శరీరాలు తునిగి తునిగి పచ్చడి పచ్చడి అవుతున్నయి. చివరకు ద్రోణుడు ధర్మరాజుపైకి ఉరుకుతాడు. కాని సత్యజిత్తు అడ్డంవచ్చి బాణాలతో ద్రోణుని నొవ్వగొట్టుతాడు ద్రోణుడు ఉగ్రుడై సత్యజిత్తు తలకాయను దొల్లచేసి ధర్మరాజాదులమీదకు పోవడానికి ప్రయత్నిస్తాడు. ధర్మరాజు తప్పుకొని పారిపోతాడు. మత్స్యరాజు తమ్ముడు ద్రోణుడికి అడ్డంవచ్చి ప్రాణాలు కోల్పోతాడు. ఆరోజు ద్రోణునకు అడ్డంగా యుధామన్యుడు ఉత్తమౌజుడు, వదానుడు, శిఖండి ఇంతమందివచ్చి ఎదుర్కొంటారు. ధర్మరాజును ధృష్టద్యుమ్నుడు దగ్గర ఉండి రక్షిస్తున్నాడు. ఒకప్రక్క భగదత్తుడు తన ఏనుగులోవచ్చి పాండవ సైన్యాలను కలగించివేస్తాడు. భగదత్తుని ఆ ఏనుగు దశార్ణభూరమణుని ఏనుగునూ,భగదత్తుడా రాజునూ చంపేస్తారు. భీముడు అభిమన్యుడు, సాత్యకి ద్రౌపదేయులు చేకితానుడు ఇంతమందిన్నీ ఆ సుప్రతీకాన్ని కొట్టి చంపలేకపోతున్నారు. పాండవుల సైన్యం పారిపోవటానికి ఉంకిస్తున్నది.

త్రిగర్తులతో ఎక్కడో యుద్ధంచేసే అర్జునునకు సుప్రతీకపు విజృంభణం వినపడుతోంది. వెంటనె శ్రీకృష్ణుని అక్కడకు రథాన్ని త్రిప్పుమంటాడు ఎందుకంటే ఆ సుప్రతీకము దేవతలది. దానిమీద మహాస్త్రశస్త్రాలు పనిచేయవు. తనకే అది లొంగాలి. అందుకే అటు రథాన్ని నడపవలసిందంటాడు. త్రిగర్తులనెలా వదలటం ? ఒక్క క్షణంలో వీళ్ళని మట్టుబెట్టేస్తున్నాను చూడుమని గాండీవ శబ్దాన్ని అవిచ్ఛినారావంగా చేసి బాణాలు వేసి వారినందరనూ నాశనం చేస్తాడు. ఇంకా మిగిలింది సుశర్మ మొదలైనవారు.

రథం రెండోవైపుకు త్రిప్పంగానే వాళ్ళు అరవడం అరంభించారు మమ్ములను గెల్చి వెళ్ళవలసిందని. అర్జునుడు విసిగి కోపంతో సుశర్మను మూర్ఛగొట్టి, "పోనీ, పోనీ రథాన్నని" తొందర పెట్టుతాడు. రథం వెళ్ళిపోతుంది ధర్మరాజాదులున్న యుద్ధ రంగానికి.

రావడంలోనే భగదత్తు అర్జునునిపై కేంద్రీకరించి యుద్ధంచేశాడు. సుప్రతీకం ఒక్కసారిగా వేగంగా అర్జునుని రథంవైపు వచ్చింది. కృష్ణార్జునులపని ముగిసిందన్నారు అంతా. కృష్ణుడు రథాన్ని చిటుకులో తప్పించాడు. ఆ సుప్రతీకం ఆ వేగానికి వెళ్ళి సైన్యంమీద పడిపోతుంది. భగదత్తుడు చాల కోపించి, వైష్ణవాస్త్రాన్ని అభిమంత్రించి వేస్తాడు. వెంటనే శ్రీకృష్ణుడు లేచి అర్జునునకు అడ్డంవచ్చి తన హృదయం చేతులూచాచి అడ్డుకొంటాడు. ఆ వైష్ణవాస్త్రం తన గుండెలకు తగిలి అలా ఒక పుష్పహారంగా అయిపోతుంది.

అప్పుడు అర్జునుడు అంటాడు. "కృష్ణా నీ వెందుకు ఈ పనిచేశావు? నీవు నాపై కరుణా విశేషం కలవాడివికనుక సారథిగా ఉన్నావు. నీకు నేను అడ్డు రావలసిన వాడనుగాని నాకుగాను నీవు అలాంటిపని ఎందుకు చేశావు? అంటాడు. అప్పుడు శ్రీకృష్ణుడు చెప్తాడు. విష్ణువును భూమి సంతోష పెట్టినప్పుడు విష్ణుమూర్తి భూమి కుమారునకు వైష్ణవాస్త్రాన్ని ఇచ్చాడు ఒకప్పుడు. ఆ అస్త్రం ఇప్పుడీ భగదత్తుడి దగ్గర ఉన్నది. దానిని నేను తప్ప ఇంకెవ్వరూ భరించలేరుగనక అలా చేశాను అంటాడు. నరకాసురుని కొడుకే భగదత్తు. నరకాసురుడు భూమికుమారుడు భూమి కుమారుడు కనుక అతడికి ఈ అస్త్రం వచ్చింది. "ఇక కొట్టు ఈ భగదత్తుని" అంటాడు కృష్ణుడు.

అర్జునుడు తీవ్ర బాణంతో సుప్రతీకాన్ని ముఖంమ్మీద కొట్టంగానే అది పడిపోయి చస్తుంది. వెంటనే భగదత్తుని తలను దొల్లగొట్టేస్తాడు అర్జునుడు. యుద్ధం మిగతావారితో సాగుతూనే ఉంటుంది. అందులో అర్జునునిచేత శకుని తమ్ములయిన వృషకుడూ, అచలుడూ చచ్చిపోతారు. శకుని పారిపోతాడు.

ద్రోణుడు ఎటువెళ్ళితే అటుకల్లా దృష్టద్యుమ్నుడు వెళ్ళి అడ్డుకుంటున్నాడు. అశ్వత్థామ నీలుడనే రాజును చంపేస్తాడు. ఆ సమయానికి శంశప్తకులూ నారాయణ గోపాల బలాలూ బ్రతికి మిగిలియున్నవారు వచ్చి చేరుతూ! "మేమేం ఓడిపోయినామనుకున్నావా" అంటూ ప్రగల్భాలు పలుకుతారు. వాళ్ళని అర్జునుడూ భీముడూ కూడ చెదరగొడతారు. భీముని, బాహ్లికుడు అశ్వత్థామ మొదలయినవారంతా ఎదుర్కొంటారు.

ఈ సందర్భంలో అర్జునుడు ఆ సంశప్తకులను చావగొట్టి నారాయణ గోప కుల్ని కొట్టి మహావేగంతో వస్తాడు భీమునికి సహాయంగా. ఇద్దరూ కలిసి ద్రోణుని

వైపు దారితీస్తారు. కౌరవులసేన 'గో'మని గోలపెట్టుతూ "కర్ణా కర్ణా"అని కర్ణుని తలుస్తారు సహాయంకోసం.

కర్ణుడు వెంటనేవచ్చి అర్జునుని ఎదుర్కొంటాడు. మహాయుద్ధం నడుస్తుంది. మధ్యలో ఎందరో చచ్చిపోతారు. కర్ణుని తమ్ములు ముగ్గురు చచ్చిపోతారు. అప్పుడు భీముడు మళ్ళీ తన రథం దిగి గదతో బయలుదేరుతాడు. ఎంతోమందిని ఛేదిం చుతూ పోతాడు కొంత సేపటికి ప్రొద్దుగుంకిందని యుద్ధం చాలిస్తారు ఆనాటికి.

మరునాటి యుద్ధంలో దుర్యోధనుడు ద్రోణునకు మళ్ళీ ధర్మరాజును పట్టివ్వ డానికి ప్రయత్నమేమిటంటాడు. అందుకు సంశప్తకులు మళ్ళీ తాము అర్జునునితో పోరాడానికి తీసికునిపోయేట్లు పన్నాగం చేశామని చెప్పి, ఆనా డుపద్మవ్యూహంలో అభిమన్యుని చంపేశారని సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్తాడు.

## 3. అసమగ్ర జ్ఞానయోగ విలీనము

ద్రోణుడు అసమగ్రజ్ఞానానికి ప్రతీక. ఎందువల్ల అసమగ్రమంటే- దుర్వృత్తు లకు తోడ్పడటంచేత. కర్ణుడు అసమగ్రయోగానికి ప్రతీక. కర్ణుడు ద్రోణునె సర్వసైన్యాధిపతిగా చేయుమనడంవల్ల ప్రాణాయామయోగంకంటె జ్ఞానమె గొప్ప దన్న సూచన వ్యాసమహర్షి ఇవ్వదలచినాడనవచ్చు.

ద్రోణుడు అష్టాంగయోగానికి ప్రతీక అయిన ధర్మరాజును పట్టుతానంటూ అర్జునుడు (అనగా ఋజుమార్గవర్తియై నిర్వృతి తత్త్వమైన శ్రీకృష్ణునితో చేరిన వాడు) లేకున్నప్పుడేననటం గమనీయమైన విషయం. ఋజుమార్గుడై నిర్వృతి తత్త్వాన్ని ఆరాధించేవానికి అసమగ్ర జ్ఞానయోగిచేగాని అసమగ్ర ప్రాణాయామ యోగిచేగాని విఘ్నం కలగదని బోధ. ఋజుమార్గవర్తికాని వానిని మాత్రమె అస మగ్ర జ్ఞానం లేదా యోగం తామసిక వృత్తిలోనికి దించివేయగలదని హెచ్చరిక.

అర్జునుని త్రిగర్తులు దూరంగ తీసికొనిపోయినారనటంలో చిత్రమున్నది. త్రిగర్తులంటె త్రిపుటీయోగ సాధనకు ప్రతీక. ఈ సాధన తత్కాలానికి శాంతి నిస్తుంది. ఆ తరువాత మళ్ళీ ఐహికంలో దిగడమె అవుతుంది. అశాంతి నిలుపుకో డానికి ఋజుప్రవర్తనం, నిర్వృతితత్త్వకు సూచన, ఆకర్షణం అవసరం. అర్జునుడు శ్రీకృష్ణ సహాయంతో వారిపైకివెళ్ళకమనేది ఆ సాధనకు సూచన.

ధర్మరాజు అష్టాంగయోగానికి ప్రతీక. అతడు పారిపోయినాడుట. ఆ సమయాన గరుడవ్యూహం పన్ని ఉన్నారట. ఆయన అందులో చేరక పారిపోయినాడు. గరుడ అంటె వేదమని అర్థం. వేదంలో పూర్వమీమాంస కర్మచేయడం. ధర్మరాజు ఆలా చేస్తూ ఉంటున్న వాడయినా తాను తనను రక్షించుకొనే ప్రయత్నంలో మామూలు కర్మకాండను వదలి నిర్వృతితత్త్వం వైపు మనసు మళ్ళించి వెళ్ళాడని బోధ. నిర్వృతితత్త్వ ప్రాధాన్యం గమనీయం.

ఇది ప్రథమాశ్వాసం.

# మహాభారత కథలు

## ద్రోణ పర్వం - ద్వితీయ ఆఖ్యానం

## అభిమన్యు వధ

పదమూడవరోజు యుద్ధంలో కౌరవులు పద్మవ్యూహాన్ని పన్నారు. అర్జును డెక్కడో యుద్ధం చేస్తున్నాడు.

పద్మవ్యూహాన్ని ఛేదించడం ఒక్క అర్జునునికే తప్ప ఇంకెవరికీ తెలీదు. అభిమన్యునకు మాత్రం లోనికి చొచ్చుకొనిపోవడం వరకూ తెలుసు. ఈ వ్యూహాన్ని ఛేదించటానికి ధర్మ భీమ నకుల సహదేవులకు దోవ ఎక్కడో తెలియదు. అందుకని అభిమన్యుని పిలిచి పద్మవ్యూహాన్ని ఛేదించి లోనికి జొరబడవలసిందంటారు. ఆ వెంటనే పాండవులు అనుసరించి వచ్చి లోపల అభిమన్యునకు సహాయంగా ఉండా లనుకొంటారు.

అభిమన్యుడు దోవకనిపెట్టి వాకిట్లో ఉన్న ద్రోణ సైంధవుల్ని దాటి లోపలకు పోతారు. వారూ అతడ్ని పోనిస్తారు.పాండవులు అనుసరించడానికి ప్రయత్నం చేసినా సైంధవుడు అడ్డుపడ్డాడు. అతడ్ని జయించడం పాండవులకెవరికీ సాధ్యం కాలేదు. అలాకావడం ఆశ్చర్యమైన విషయం. భీముడుకూడ ఏమీ చేయలేకపోవటం చిత్రం. కాని దీనికి దైవికమైన కారణం ఉంది.

సైంధవుడు అరణ్యవాసంలో గంధర్వులచేత ఓడింపబడి, అర్జునునిచే రక్షింప బడిన తరువాత సిగ్గుపడిపోయి రుద్రునిగూర్చి తపస్సు చేస్తాడు. రుద్రుడు ప్రత్య క్షం కాంగానే పాండవుల్ని జయింపగలిగే వరం ఇమ్మంటాడు. రుద్రుడు మాత్రం అది యథాతథంగా కుదరదనీ ఒకే ఒక్క రోజున అర్జునుడు తప్ప మిగిలిన పాండవు లను జయించగలవుగాక అనీ వరమిస్తాడు. ఆ వరం ఈనాడు ఉపయోగించుకొన్న వాడై పద్మవ్యూహంలోకిపోయే వాకిలివద్ద నిలచి వారిని అడ్డుకొంటాడు సైంధవుడు.

లోపలికిపోయిన అభిమన్యుడు మహాశక్తి కలిగినవాడు కావటంవల్ల అందర్నీ ఎదిరించి నొవ్వగొట్టుతాడు. ఏనుగుల్ని గుఱ్ఱాల్ని రథాల్ని పడగొట్టుతున్నాడు. దుర్యోధనుడు, కృపుడు, అశ్వత్థామ, కృతవర్మ, సౌమదత్తి, శల్యుడు, శకుని ద్రోణుడు అంతా ఒక్కసారి ఎదుర్కొన్నారు.

ఈ సమయంలో ధర్మరాజును పట్టితేవాలనే కాంక్షకంటె ఈ నన్నిపాతం లాటి అభిమన్యుని ఎలా చంపేయాలనే కాంక్ష—అత్యవసరమై—కౌరవుల మనసులనా క్రమించింది. అందుకని అలా తహతహలాడి అతడిపైకురుకుతున్నారు.

సురలు సిద్ధులు అభిమన్యుని యుద్ధం ఎంతో మెప్పుదలతో చూస్తున్నారు. అందరి మధ్యనూ ఉండి అందర్నీ జయిస్తూ ఒక్కొక్కడి బింకం—ఊడగొట్టూనె ఉన్నాడు అభిమన్యుడు. ఎదురువచ్చిన ప్రతి ఒక్కరూ ఓడి శృంగభంగమై వెళ్ళి పోతున్నారు. దుశ్శాసనుడు ప్రగల్భాలు గొట్టి వచ్చి పోట్లాడి దిమ్మతిరిగి పారి పోతాడు కర్ణుడూ అలాగే వెళ్ళిపోతాడు. వృషసేనుడు మూర్ఛపోతాడు. శల్యుని కుమారుడు వచ్చి దెబ్బతిని 'గో'మనిపోతాడు. రుక్మరథుడనేవాడు చస్తాడు.

ఇది వింటూ ధృతరాష్ట్రుడంటాడు "ఇలా యుద్ధంచేసి అంతమందిని జయించా డంటే నేను నమ్మటానికి ఎక్కడా అవకాశమయితే లేదుగాని నిస్సంశయంలో నమ్మదగిన కారణం ఒకటుంది—అది ఉందిగనుక నేను నమ్ముతున్నానుగాక" అంటాడు. ఆ కారణం ఏమిటంటే "ధర్మం అధర్మాన్ని గెలువకేం చేస్తుంది", అంటాడు. ధృతరాష్ట్రుని బుద్ధి అలా ధర్మపరమైన సంగతిని మనం మర్చిపోరాదు.

దుర్యోధనుడి కుమారుడు లక్ష్మణుడువచ్చి యుద్ధంచేసి అభిమన్యునిచేత చచ్చి పోతాడు. ఈ కోపంతో మళ్ళీ పారిపోయిన వాళ్ళంతా తేరుకునివచ్చి అభిమన్యునిపై బడతాడు. అందులో దుశ్శాసనుని కుమారుడు ముందుగావచ్చి ఎదుర్కొంటాడు. వానితోపాటు మిగతా అంతాకూడవచ్చి కుట్రచేస్తారు. "ఈ అభిమన్యుని చేతులో ఆ ధనస్సు ఉన్నంతకాలం, మనం అతడ్ని గెలువలేముగాక. పైగా చస్తాము. అందు కని వెనకనుంచి వెళ్ళి అతడికి తెలియకుండ వంచనచేసి విల్లు విరగగొట్టాలి అను కొంటారు.

అప్పుడు కర్ణుడు పాపిష్టివాడై ఒక దుష్టమైన నాటకమాడి, తాను చాలా భయపడిపోయినట్లు నటించి వెనక్కుతగ్గి ఆ అభిమన్యుని వెనక్కు వెళ్ళి వాని విల్లును దునుమాడుతాడు. కర్ణుని శూరవీర తేజత్వం ఇంతేనా అనిపిస్తుంది. అప్పుడే ద్రోణుడు అశ్వాలను చంపేస్తాడు. అభిమన్యుని చేతిలో విల్లు ఉన్నట్లయితె గురుడు వేసిన బాణాలను మధ్యలోనే విరగగొట్టేవాడుగాక. అందరూ అన్నివిధాల నొవ్వ జేస్తారు సిగ్గులేకుండా! చివరకతడు డాలూ కత్తి తీసికొని ప్రచండ యుద్ధం

చేస్తాడు. ద్రోణుడు బల్లెంతో ఆ డాలును పగలగొట్టుతాడు. అభిమన్యుడు తన రథ చక్రం లాగి తీసి దానిని త్రిప్పుతూ తనకు గల విద్యతో ఆకాశంలోనికి గరుడుడులా ఎగిరి యుద్ధం చేస్తుంటాడు. నలుగురూ కలిసి ఆ రథ చక్రాన్ని గూడ శిథిలము చేస్తారు.

చివరకు గదతో దిగి, అభిమన్యుడు దుశ్శాసనుని కొడుకుతో తలపడుతాడు. ఇద్దరూ గదా యుద్ధం చేస్తుంటారు. ఇద్దరూ ఒకరినొకరు కొట్టుకొనడంలో ఇద్దరూ ఒక్కసారిగా పడిపోతారు ఇద్దరూ చచ్చిపోతారు. రాచపీనుగు తోడు లేకుండా వెళ్ళదనే లోకోక్తి ప్రకారం అభిమన్యుడు దివానికి వెళ్ళిపోయినాడు.

అతడి మరణానికి భూదేవి "భో" మని దుఃఖించినట్లుగా చచ్చిపోయే జంతువులు ఏనుగులు"గా"మని అరిచినయి, కౌరవులు మాత్రం పండ్లికిలించారు. కౌంతేయులు మహా దుఃఖంలో మునిగిపోయారు. ఆనాటికి యుద్ధం ఆపేశారు.

ధర్మరాజు అభిమన్యుని మరణాన్ని తలచి ఎంతో దుఃఖపడుతాడు. అర్జునుడు వచ్చి నా బిడ్డడేడి అంటే ఏం చెప్పేది అని బాధపడుతాడు. అతడికి పొంగి వచ్చే దుఃఖం ఆగటల్లేదు. అప్పుడు వ్యాస మునీంద్రుడు వచ్చి, ఎందుకు దుఃఖిస్తావయ్యా! అతడు వీర స్వర్గం అలంకరించి ఎంతో సంతోషంలో ఉండి ఉంటాడు ఈ పాటికి. రాచబిడ్డకు అంతకంటే ఏం కావాలి గనక!

విధి అనేది ఒకటుంది. అది ఎలా జరుపుతుందో ఈ ప్రపంచంలోని సంఘటనలన్నీ అలాగే జరుగుతూ ఉంటాయి దానిని తప్పించడానికి మన – ఎవరి వశమూ కాదు. తప్పనిసరిగా జరిగితీరుతుంటవి. అలా "తప్పనిసరిగా" జరిగే సంఘటన జరిగినప్పుడు, అవి ఆలా ఆయినవని తెలిసి ఊరుకోవడమే గాని దుఃఖించి ఏ ప్రయోజనమూ లేదు.

ఒక కథను చెప్తాను విను. 'ఇది ఇతిహాసం– అకంపనుడనే రాజు శత్రువుల చేత బడినప్పుడు వాని కుమారుడు వచ్చి వానిని విడిపిస్తాడు. మళ్ళి యిద్దరూ శత్రువులతో యుద్ధం చేస్తుంటే ఆ కుమారుడు చనిపోతాడు. రాజైతే గెల్చి వస్తాడు. ఇంటికి వచ్చి పుత్రుణ్ణి గురించి వాపోతాడు. నారదుడు వచ్చి మృత్యుదేవత ప్రభువనీ దాని కథ వినవలసిందనీ ఇలా చెప్తాడు.

'ఒకసారి బ్రహ్మసృష్టి వల్ల భూభారం ఎక్కువవుతుంది. భూమి బ్రహ్మవద్ద మొర పెట్టుకొంటుంది. అప్పుడు బ్రహ్మ ఇంద్రియాలనుండి, మృత్యువు ఉద్భవిస్తుంది.

ఎఱ్ఱటి ముఖం, నల్లని శరీరం ఎర్రని చీరతో పుట్టుతుంది. బ్రహ్మ ఆమెను పిలచి జంతువులన్నిటినీ నీవు సంహరించాల్సిందంటాడు. ఆమె గోల పెట్టుతుంది. "అయ్యో! అ పని నాకొప్పగిస్తావెందు"కని దుఃఖిస్తుంది. ఆమె కంట నీళ్ళు తన దోసిట్లో పట్టుకొంటాడు బ్రహ్మ. ఆమె చలించిపోతుంది. తనకు తపస్సు చేసికొనడానికి అనుజ్ఞ నివ్వమంటుంది. కాని బ్రహ్మ "అలా కాదు నీ కన్నీటిలో ఎన్ని బొట్లున్నాయో అన్నీ రోగాలై జనుల శరీరాలను కృశింపజేస్తవి. నీవు కేవలం వారి ప్రాణాలు ఇవతలకు లాగు. ఆ ప్రాణాలు హాయిగా స్వర్గానికో లేదా మరో దేహానికో వెళ్ళిపోతయి. నీవు చేసే నికృష్టమైన పనేమీ లేదంటాడు. పైగా నేను చేయుమన్న పని నీవు చేస్తుంటే ఏదయినా అధర్మం నాదవుతుందేమో గాని నీదెలా అవుతుంది అంటాడు. ఈ విశ్వానికి నీవు ఈశ్వరివి అంటాడు."

'అందుచేత అలా ఎల్లప్పుడూ జరుగుతూ ఉండటం తథ్యం. వ్యక్తి ప్రాణాలు ఒక శరీరం వదలి మరొక శరీరానికి లేదా లోకానికి పోవటం తప్పనిసరి. నరులు అమరులవుతారు. అమరులు నరులవుతారు. కనుక నీ కుమారునకు వచ్చిన కొలందిఏమిటి! ఏడువవద్దు" అంటాడు నారదుడు అకంపనుని. ఈ జగత్తు దుఃఖాత్మకమైనది. దీనిని వదలి సౌఖ్యాలందుకొనడానికి నీ కుమారుడు వెళ్ళాడు. నీ వెందుకు దుఃఖంచాలి అంటాడు. అదివిన్న మీదట అకంపనుడు దుఃఖాన్ని పోగొట్టుకొన్నాడు. ఇలా వ్యాసుడు ధర్మరాజుకు చెప్తాడు.

వ్యాసుడు ఇంకో ఇతిహాసం కూడ ధర్మరాజుకు చెప్తాడు. "సృంజయుడనే రాజు ఉంటాడు. అతడి వద్దకు నారదుడు వస్తాడు. తనకు పుత్రులు లేని కారణాన సృంజయుడు నారదుని తనకు పుత్రులు కలిగేటట్లు ఆశీర్వదించుమంటాడు. ఆయన అనుగ్రహిస్తాడు. ఆ తరువాత సృంజయునకు కుమారుడు పుట్టుతాడు. అతడి మూత్ర పురీషాలు, బంగారమవుతుంటవి. దానితో సృంజయుడు చాల సంపద కలిగినవాడవుతాడు.

కాని, కొందరు దొంగలు ఈ పిల్లవానిని ఎత్తుకొనిపోయి అడవిలో వాని కడుపు కోసి బంగారం కోసం వెతికి హతాశులైపోయి ఒకళ్ళతో ఒకళ్ళు మత్సరించి కొట్టుకొని చస్తారు. సృంజయుడు పిల్లవాని కోసం వెతికించి చివరకు అతడి శరీరం "చూచి మహా దుఃఖంలో మునిగిపోతాడు. అప్పుడు నారదుడు వచ్చి అంటాడు." మరుత్తుడు, సుహోత్రుడు, అంగుడు, శిబి, దశరథరాముడు, భగీరథుడు, దిలీపుడు,

మాంధాత, యయాతి. అంబరీషుడు, శశిబిందుడు, గయుడు, రంతిదేవుడు, భరతుడు, పృథుడు, పరశురాముడు అనే వాళ్ళు షోడశరాజులు. వాళ్ళు అంతా [illegible] గాని ఎవరైనా బ్రతికేరా" అని పృచ్ఛించి దుఃఖించవద్దని బోధించి వెళ్తాడు.

ధర్మరాజు తన శోకాన్ని ఉడిగించుకొన్నా, అర్జునుడు వచ్చినప్పుడు ఎంత దుఃఖాన్ని అతడు పొందుతాడో గదా అని కించపడుతాడు.

## 2. ప్రతిజ్ఞా పర్వము

అర్జునుడు సంశప్తకులను మట్టుపెట్టి, సూర్యాస్తమయపు వేళకు శిబిరానికి చేరుకొంటాడు. శ్రీకృష్ణ సహితుడై వస్తుంటేనే ఏదో దుఃఖం – ఏదో కీడు మనసును తట్టుతూ ఉంటుంది. శ్రీకృష్ణునితో ఆ మాట అంటూనే శిబిరానికి చేరుకొంటాడు. తనకు ఎదురు వచ్చేవారి మొగాలు దిగాలుపడి ఉంటవి. ఎక్కడా అభిమన్యుడు అవుపడడు. అర్జునుడు గుండె దడదడలాడు తుండగా [illegible] శిస్తాడు. ఆచార్యుడు పన్నిన పద్మవ్యూహంలోకి [illegible] ఊరుకొన్నారా? అంటాడు. అతడికి ఎవరూ చెప్పకుండా అంతా [illegible] త్రెంచుకొన్న దుఃఖం చిప్పిలుతుంది. ఎవరూ ఏమీ చెప్పలేక [illegible] ఎలా పోయినాడో చెప్పాల్సింది అని అరుస్తాడు అర్జునుడు.

అందుకు ధర్మరాజు అతడ్ని పద్మవ్యూహచ్ఛేదనానికి పంపిన మాట వాస్తవమేననీ, తామూ వెళ్ళాలని ప్రయత్నం చేసినా సైంధవుని మూలాన [illegible] పోయినామనీ చెప్తాడు. పైగా అంతా చేరి ఒక్కడైన అభిమన్యుణ్ణి [illegible] కౌరవులు చంపారంటాడు. అర్జునుడు అది విని [illegible] శ్రీకృష్ణుడు, "యుద్ధం చేయడమే జీవికగా [illegible] అభిమన్యుడి కోసం ఇలా దుఃఖించటం [illegible] దుఃఖ సముద్రంనుంచి తేల్చవలసిన పని ఉండగా [illegible] టాడు. అభిమన్యుడు చచ్చినప్పటి [illegible] పోయి కొంత సేపటికి తేరుకొని—"ఇంతా అభిమన్యుడి [illegible] వెళ్ళనీకుండా అడ్డుకొన్న సైంధవుణ్ణి చంపేస్తాను. [illegible] రేపు సాయంత్రం సూర్యాస్తమయం అయేలోగా వాణ్ణి [illegible] అగ్నిలోపడి ప్రాణత్యాగం చేస్తానుగాక." అంటాడు. [illegible]

పాపం పొందుతాను అంటాడు. ఇంకా ఎన్నో అనలు పెట్టుతాడు. గాండీవం తెప్పించి గుణధ్వనం పలికిస్తాడు దేవదత్తం ప్రయోగిస్తాడు. ఈ మ్రోత కౌరవుల శిబిరానికి వినిపిస్తుంది. వారు ఈ ప్రతిజ్ఞ తెలిసి దడదడలాడిపోతారు.

సైంధవుడు గబగబా దుర్యోధనుని ప్రార్థించి వానిని తీసికొని ద్రోణునివద్దకు వచ్చి తనను రక్షించాల్సిందని లేదా పారిపోతాననీ అంటాడు. రాజైయుండి పారి పోవటం అనేపని చేయవద్దనీ "నిన్ను మా మధ్యలో దాచి చుట్టూ మేము నిలిచి రక్షిస్తామ"నీఅభయమిస్తారు ద్రోణాదులు.

ఇక్కడ శ్రీకృష్ణుడు అర్జునునితో "అయ్యో! అంత కఠోరమైన ప్రతిజ్ఞ ఎందుకు చేశావు అర్జునా! ఎంత కష్టం సూర్యాస్తమయం లోపల రేపే సైంధవుని తల తరగడం" అంటాడు. అర్జునుడప్పుడు "నేను ఏమి అంటే ఏమి అన్నిటినీ సరి చేయడానికి నీవులేవా కృష్ణా" అంటాడు. అనగా సాక్షాత్తు భగవంతుడైన నీవని అర్థం. ఇద్దరూ శత్రునిపై కోపంతో చిడిముడిపడుతుంటారు.

ఆ తరువాత రాత్రివేళనే శిబిరంలోకి వచ్చి ఉన్న సుభద్ర, ఉత్తర, ద్రౌపదు లను కలుస్తారు. వారు మహా దుఃఖంలో ఉండటం చూస్తారు.

కర్తవ్యం అనేది మనసులో ఉన్నప్పుడు దుఃఖం అంతగా ఉండదు. అర్జునుడు తన పనులన్నీ అయి శిబిరానికి వచ్చేటప్పటికి ఈ పుత్రశోకం కలిగి దుఃఖించాడు. చివరకు తన కర్తవ్యం సైంధవుని వధించటం అని అనుకొన్న తరువాత దుఃఖం పైకిరాదు. అందుకే జీవితం నడుస్తున్నంత వరకూ కర్తవ్యం వదలివేయకూడదు. అది వదలిన క్షణాన దుఃఖమే కలుగుతుంది. కనీసం దుఃఖం లేని సుఖం కలగదు అనేది ఆలోచించి ప్రతి ఒక్కరూ తెలియవలసిన విషయం అనిపిస్తుంది.

అంతా తమ తమ స్థలాలకు వెళ్ళిపోతారు. కృష్ణుడు అర్జునుని శిబిరానికి వెళ్తాడు. నీళ్ళు తీసికొని ఆచమనం చేస్తాడు. ఒకచోట దర్భలు పరచి శయ్యగా చేస్తాడు. అక్షతలు, గంధపుష్పాలు సమర్పించి, చుట్టూ ఆయుధాలుపెట్టి అర్జునుని అక్కడ చేర్చి దైవపూజ చేయమంటాడు. అర్జునుడు పాద ప్రక్షాళనం చేసి, త్ర్యంబక పూజ చేస్తాడు. "ఇక నీవు సుఖంగా నిద్రపోవాల్సింది! నీకు శుభం కలుగుతుంది." అని శ్రీ కృష్ణుడు చెప్పి దౌవారికుని తీసికొని వెళ్ళిపోతాడు.

శ్రీకృష్ణుడు తన శిబిరానికివెళ్ళి ఈ అర్జునుడు చేసిన ప్రతినను ఎలా నెరవేర్చాలా అనే చింత చేస్తూనే ఉంటాడు. దేవుని ప్రార్థిస్తున్నాడు అది నెరవేరాలని ఉపశ్రుతి అనే జ్యోతిషభాగాన్ని చూస్తున్నాడు. ప్రశ్నలు లెక్కకట్టుతున్నాడు. నిద్రపట్టక ఎదురుగుండా ఉన్న తన రథసారధియైన దారుకునితో అంటాడు.

"చూశావా దారుకా! నరుడు ఎంతటి ఘోరమైన ప్రతిజ్ఞ చేశాడో! ఈ ప్రతిన నెరవేర్చకపోతే అర్జునుడేమయినా అయితే నేను బ్రతుకగలుగుతానా? అర్జునుడు నాలో సగం. నేనే నెరవేరుస్తాను ఆ పని. కౌరవులా నాకు అడ్డం! సూర్యుడస్తమింపకుండా సైంధవుని చంపి, రౌద్ర రసాన్ని చూపిస్తానుగాక. రేపు మన రథం తీసుకురా. గుర్రాల నైదింటినీ కట్టి కనక మణిమాలికాలంకృతముచేసి రథం తీసుకురా. గరుడధ్వజం పెట్టు చక్రగదాస్త్రాలు పెట్టు. నేను పాంచజన్యం ఊదగానే వచ్చివాలాలి మధ్య." అంటాడు. దారుకుడు నవ్వుముఖంతో అంటాడు. "మహానుభావా? అలాగే చేస్తాను కాని నీవు సారథ్యం వహించి యుండగా అర్జునుడు వస్తే ఆయనకు ఇంకేమైనా అడ్డం రాగలదా!" అంటాడు. సెలవుతీసికొని వెళ్ళి పోతాడు.

అక్కడ అర్జునుడు శ్రీకృష్ణుడు పరచిన దర్భలపై నిద్రలోవుండి ఒకానొక కలగంటాడు. అందులో—

"శ్రీకృష్ణుడు అర్జునుని దగ్గరకు వచ్చాడు. అర్జునుడు లేచి ఆయనకు మన్నన నిచ్చి తన సెజ్జపై కూర్చుండచేశాడు. అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునునితో "వగ అనేది చేరనీయకు. వగలో నున్నవారు శత్రువుల్ని జయించలేరు" అన్నాడు. అందుకుతాను "వగపు ఇంకా ఎప్పటికి తెగిపోతుందిగనక? నేను ప్రతిన పూనినాను. ఆ కర్తవ్యం ఉన్నది. అది ఉండగా వగపు అనేదేమిటి గనక. నా ప్రతినకు ద్రోణుడు మాత్రం అడ్డు రాగలడా?" అన్నాడు. అందుకు కృష్ణుడు నీవు పాశుపతాస్త్రం చేత ఆ ప్రతిజ్ఞను పూరించగలవు. కనుక ఆ మంత్రాన్ని సమంత్రక, ముష్టిక, స్థానక, విజ్ఞానంగా జ్ఞాపకం చేసికొనాల్సింది. అందుకు ఆదేవుని ఆరాధించాల్సింది అంటాడు. ఇద్దరూ ఒక్కచో కూర్చున్నవారై ధ్యానం చేస్తారు.

ఆ ధ్యానంలో ఇద్దరూ ఆకాశానికివెళ్ళి కైలాసం చేరుతారు. అక్కడి సరిత్సరోవరంచూసి కుబేరుని విహార స్థానం చూసి ప్రమథ గణాలతో నున్నట్టి పార్వతీ సహితుడైనట్టి శంకరుని చూస్తారు ఆయనకు నమస్కరిస్తారు. ఆయన "మీ ఆగమన

"కారణం చెప్పు" మంటాడు. వీరు ఆయన్ను స్తుతిచేస్తారు. చివరకు శ్రీకృష్ణుడు పార్థుని, పాశుపతాస్త్రమీయుమని కోరవలసిందంటాడు అర్జునుడు శివుని చూడంగానే, తాను తతః పూర్వమె శ్రీకృష్ణునికి చేసిన పూజా సమయంలో వాడిన పూవులు ద్రవ్యాలు శివునిపై నుండటం గమనించడమవుతుంది. వీరిద్దరూ ఒకటేనని సమన్వయించుకొంటాడు. అప్పుడు పాశుపతాస్త్రం దయచేయవలసిందని అర్జునుడు శివుని అడుగుతాడు.

అందుకు శివుడు, అయితే వెళ్ళి ఆ అమృతమయమైన పద్మాకరంలో నా బాణాసనాలూ బాణాలూ ఉన్నవి వాటిని తీసికొనిరావలసిందంటాడు. తీరా అక్కడకు వారు వెళ్ళి చూస్తే రెండు మహోగ్రమైన పాములు నోటినుంచీ మంటలు వెళ్ళగ్రక్కుతూ ఉంటవి. శ్రీకృష్ణార్జునులు అవె బాణాసన బాణాలని నమ్మినవారై శతరుద్రీయాన్ని జపించి, భవుని తమ మనసుల్లో ఉంచుకొని ధ్యానిస్తారు. ఆ కారణం వల్ల ఆ పాములు రెండున్నూ తమ రూపు మార్చుకొని బాణాసనమూ బాణములుగా మారుతవి. వాటిని తాము తీసికొని శంభుని వద్దకు వచ్చి వానిముందు పెట్టుతారు. అప్పుడొక బ్రహ్మచారి కుమారుడు శివుని వెనుకనుండివచ్చి ఆ బాణాలు తీసికొని విల్లు సంధించి, బాణాలను కూర్చి వదలుతాడు. ఆ సమయంలో అర్జునుడు వాటి స్థానకమూ, ముష్టి ప్రకారమూ ఏకాగ్రదృష్టితో తిలకించుతూ ఉంటాడు. అప్పుడే శివుడు మంత్రాన్ని ఉపదేశిస్తాడు.

అర్జునునకు పూర్వం తనకు శివుడుపదేశించిన పాశుపతాస్త్ర ఉపదేశమంతా జ్ఞాపకానికి వస్తుంది. ఆశ్చర్యపోయి శ్రీకృష్ణార్జునులు పరమేశ్వరునికి నమస్కరిస్తారు. అనుజ్ఞ తీసుకొని తిరిగి శిబిరాలకు వచ్చేస్తారు. అర్జునుని 'కల' పూర్తి అయినదై అతడు నిద్రలేస్తాడు.

శ్రీకృష్ణుడు తెల్లవార్లూ మేల్కొన్నవాడై ఆ సమయంలో దారుకునితో మాట్లాడుతూ అర్జునునకు బదులు తానే ప్రతిజ్ఞా నిర్వహణచేస్తానంటూ ఉంటాడు. తెలతెలవారుతుంది.

పద్మవ్యూహ కథలో అంతరార్థముంది. పతనానికి దారితీసే ఊహల కూడలి అని పద్మవ్యూహానికి అర్థం. దానిని పగలగొట్టటం అంటె జనన మరణకారణమును తప్పించుకొనుటమని అర్థం. నిర్వృతి తత్త్వంతో జోడించుకొని యున్న అర్జునుడూ

# మహాభారత కథలు

## ద్రోణ పర్వం – తృతీయ చతుర్థ ఆశ్వాసాలు

## జయద్రథ వధ

జయద్రథుడంటె సైంధవుడె. అతడ్ని చంపేస్తానని అర్జునుడు ప్రతినపట్టాడు. సాయంత్రమయేలోగా చంపాలి.

అది కురుక్షేత్ర యుద్ధం ఆరంభించిన పద్నాలుగోరోజు. కౌరవులు పద్మ వ్యూహం, శకట వ్యూహం, సూచీవ్యూహం, ఇన్నిటినిపన్ని పద్మవ్యూహంలో లోపల ఎక్కడో సేనల కాపుదారీలో దాచివుంచారు సైంధవుణ్ణి. అర్జునుడు ఈ వ్యూహ్యం ఛేదించి సూర్యాస్తమయంలోగా అతడ్ని చంపి ప్రతిన నిలుపుకోవాలి. లేదా ప్రాయో పవేశం చేసి తాను చచ్చిపోవాలి.

అర్జునుడు సాత్యకిని ధర్మరాజుకు కాపుదారీగా ఉంచి వ్యూహ భేదం చేయడా నికి సాగి వెళ్తాడు. దుర్యోధనుని తమ్ముడు దుర్మర్షణుడనేవాడు కొంత సైన్యంతో మధ్యలోనే ఎదిరిస్తాడు. కాని అర్జునుని విజృంభణానికి నిలువలేక పారిపోయినాడు. దుశ్శాసనుడు సహాయం వచ్చి అతడూ సోదరుడితోపాటు పారిపోతాడు–అర్జునుడు "పోకు, పోకు. సభలో శంక లేకుండా మాట్లాడిన మాటలు జ్ఞాపకం చేసికొని నిల వాలిగాని, అందరికీ తలవంపులు తెచ్చే పనులు చేయరాదు." అంటూనే తరుము తాడు.

వ్యూహముఖంలో ద్రోణుడున్నాడు. అర్జునుడు ఆయనకు నమస్కారంచేసి 'నా ప్రతిజ్ఞ నిల్చేటట్లు ఆశీర్వదించండి' అంటాడు. శ్రీకృష్ణుడు "ఈయన్ను తప్పిం చుకు లోపలికి పోవాలి. జయించాలంటే ఇవాళ అయే పనికా"దంటాడు. రథాన్ని ద్రోణుడికి ప్రదక్షిణంగా చుట్టూ నడిపించి వెళ్తుంటుంది. అర్జునుడు బాణాలు ద్రోణునివైపు వేస్తూనే రథంలో మొగ్గరంలోకి వెళ్ళిపోతుంటాడు. ద్రోణుడు వెంట బడి నన్ను గెలువకుండా వెళ్ళిపోవటం సరికాదంటాడు. అర్జునుడు లోపలనున్న యోధులతో పోరాటం మొదలుపెట్టనే పెట్టాడు. ఐనా అన్నాడు–"నీవు నాకు గురు వవు స్వామీ. పగతుడవు కానేకాదు. నిన్ను జయించటమనేదేలేదు"–అంటూ వెళ్ళి

కాడు ద్రోణుడు తాను వ్యూహం మొగలో కావలా చేయాల్సిన కర్తవ్యం జ్ఞాప చేసికొని ఆ స్థానానికి వెళ్ళిపోతాడు.

లోపల ప్రవేశించిన వెంటనె అర్జునుడు భోజరాజును చంపేస్తాడు. శ్రుతా యువు ఎదుర్కొంటాడు. శ్రుతాయువుదగ్గర ఒక గదఉంది. అది వరుణునిది. దానిని శత్రువుమీద వేస్తే గెలుపు తప్పదు. కాని దాన్ని రథికులమీద మాత్రమే వేయాలి. శ్రుతాయువు అది మరచి సారధిమీద శ్రీకృష్ణునిమీద విసురుతాడు. వెంటనె అది శ్రీకృష్ణుని మెడలో హారంవేసి తిరిగి వెళ్ళి శ్రుతాయువునె చంపుతుంది. ఈ సంఘట కు సైనికుల్లో కల్లోలం రేగింది.

దుర్యోధనుడు అర్జునుడి విజృంభణానికి తలతిరిగినవాడై ద్రోణుడి దగ్గరకు వెళ్ళి ఆయన్ను దూషించడ మారంభిస్తాడు"అర్జునుణ్ణి అవలీలగా వదిలేశా"వంటాడు. ద్రోణుడు "అతడ్ని ఆపటం నాచేతకాలేదు. నీవు వెళ్ళి లోపల యుద్ధం చెయ్యి ఇలా నిల్చావేమి"అంటాడు. అందుకు దుర్యోధనుడు "ఇప్పుడు దేవతలే అతడ్ని ఎదుర్కొ నేట్టులేరు" అంటాడు. ఈ నిజం చెప్పినందుకు ద్రోణుడు సంతసంతో ఒక విచిత్ర మైన కవచం మంత్రాలతో సృష్టించి దుర్యోధనుడి ఉరమూ, ఉదరమూకప్పి, ఈ కవచాన్ని బాణాలేం చేయలేవు ధైర్యంగా వెళ్ళి యుద్ధం చెయ్యమని పంపుతాడు లోపలకు. దుర్యోధనుడు సంతోషిస్తాడు.

లోపల అర్జునుడి రథం సైంధవుణ్ణి వెతుకుతూ వెళ్తోంది. అర్జునుడు ఆ దోవ లోనే విందాను విందులిద్దర్నీ చంపేశాడు. గుఱ్ఱాలు అలిసిపోయినవని, తాను రథం దిగి పాదచారిగా యుద్ధం చేస్తూ శ్రీకృష్ణుని వాటికి విశ్రాంతినీయుమంటాడు. శ్రీకృష్ణుడు గుఱ్ఱాలకు అజ్జులు విరచి చేతుల్తో నిమిరి సేదదీర్చి వాటికిగాను నీరు కావాలంటాడు. అర్జునుడు భూమిలోనికి బాణంవేసి, పాతాళంనుంచీ నీరువచ్చేటట్లు చేస్తాడు. గుఱ్ఱాలు త్రాగి సేదతీరుతవి. మళ్ళీ రథమెక్కి మరో యుద్ధానికి ఉపక్రమిస్తాడు అర్జునుడు.

ఈ విక్రమం ఈ చిత్రమైన సంఘటనం చూసి కౌరవ సేనలు అలా నిల్చి పోతయి. ఆ సమయంలో దుర్యోధనుడు ద్రోణుడిచ్చిన కవచం ఆధారంతో మహా ధైర్యాన్ని పుంజుకొని వస్తాడు. నేనున్నాను మీరు భయపడకండి అంటూ అర్జునుని ఎదిరించి నిలుచుంటాడు.

కృష్ణార్జునులు ఆశ్చర్యపోతారు. ఇతడికి ఇంత ధైర్యం ఎలా వచ్చిందా అని శ్రీకృష్ణుడు, వాడు పూర్వం చేసిన కుట్రలు జ్ఞాపకం చేసికొని పగ తీర్చుకో"మంటాడు. అర్జునుడు తీవ్ర బాణాలనొదుల్తాడు-కాని, అవి దుర్యోధనునికి తగిలి క్రింద పడిపోతున్నాయి. శ్రీకృష్ణుడు ఆశ్చర్యపోతాడు. "ఇదేమిటి" అంటాడు. అప్పుడు అర్జునుడు చెప్తాడు—

పూర్వం ద్రోణాచార్యులవారు నాకుకూడ ఒక కవచం, మంత్రపూరితమైంది ఇచ్చారు. అది ఇతనికీ ఇచ్చి ఉంటాడు. దానిని ఒకానొక మహాస్త్రంతో ఊడగొట్ట గలను చూస్తూఉండు అని ఒక మహాస్త్రాన్ని మంత్రించి వేస్తూ ఉంటాడు. అది ఆశ్వత్థామ చూచినవాడై ఆ మహాస్త్రానికి ప్రతి అస్త్రం వేయడంవల్ల అర్జునుని అస్త్రం పనిచేయలేదు. ఆ మహాస్త్రం మళ్ళీ రెండోసారి ఉచ్చాటనం చేయరాదు. ఆ కారణం చేత-అర్జునుడు వాని హృదయ భాగం ఉదర భాగం వదిలేసి, చేతులు పైన ముఖాన బాణాలు దిగేటట్లు కొట్టుతాడు. దుర్యోధనుడు ఏమీచేయలేక యుద్ధంనుంచి తప్పుకు పోతాడు.

వృషసేనుడు మొదలయిన ఎనిమిదిమంది రాగా వారిని ఒక్కసారిగా అర్జునుడు ఎదుర్కొంటాడు. వాళ్ళను జయించబోతున్నందుకు మహా సంతోషంతో దేవదత్తం మ్రోగిస్తాడు అర్జునుడు. ఈ మ్రోత పద్మవ్యూహానికి బయట ఉన్న ధర్మరాజుకు వినపడుతుంది.

అక్కడ సంకులసమరం జరుగుతున్నది. ద్రోణుడు ధర్మరాజు వింటిని విరుగగొట్టేశాడు. అస్త్రాలుకూడ ఒకరిపై నొకరు వేసుకొన్నారు. ధర్మరాజు రథం విరిగి పోయింది. నిరాధారంగా నిల్చిపోయినాడు. సహదేవుని రథం ఎక్కి ప్రక్కకు వెళ్ళి పోతాడు. సాత్యకీ ద్రోణుడూ యుద్ధం చేస్తారు. భీముడూ ధృష్టద్యుమ్నుడూకూడ వచ్చి తలపడుతారు.

ఇంతలో లోపలినుంచీ ధర్మరాజుకు దేవదత్తనాదం పాంచజన్యనాదం వినవస్తుంది. కృష్ణార్జునుల రథమొక్కటే లోపలకు వెళ్ళిందనీ ఇంకెవరూ సహాయంలేక వారు చిక్కుపడుతారనీ ధర్మరాజు ఊహించి సాత్యకిని వారికి సహాయంగా పొమ్మంటాడు. భీమసేనుణ్ణికూడ కొంచెం సేపట్లో పంపుతానంటాడు.

సాత్యకి బయలుదేరి వ్యూహద్వారం దగ్గరే ద్రోణుని చూస్తాడు. ఆయనకు నమస్కరించి లోపలికి అనుజ్ఞనిమ్మంటాడు. ఇతర్లతో యుద్ధం చేస్తూ దూరదూరంగా పోతూనే లోపలకు తప్పించుకొని వెళ్ళిపోతాడు రథంతోసహా. ఎదురుగా కృతవర్మ వస్తె అతడ్ని నొవ్వజేస్తాడు. జలసంధుడనేవాణ్ణి చంపేస్తాడు. అర్జునుడు పోయిన దోవ వెతుకుతూ అతడు చంపిన గుర్రాలు ఏనుగులూ పడినదోవచూసుకొంటూ శత్రువుల్ని దునుమాడుతూ వెళ్తుంటాడు. దుశ్శాసనుడు ఈ కొట్లాటలో దెబ్బలుతిని పారిపోతూ ద్రోణునివైపుకు వెళ్తాడు. ద్రోణుడు "వీరస్వర్గం అలంకరించటం రాజులకు న్యాయంగాని, పారిపోవటంకాదు. సభలో దుర్మార్గపు మాటలు మాట్లాడ్డమంత తేలిక కాదు యుద్ధం. మీ అన్నకు చెప్పి ఇప్పటికయినా రాజీచేయించు" మంటాడు. దుశ్శాసనుడు గుటకలు మ్రింగ వెనకకువచ్చి సాత్యకి చేతులో దిత్తుగా దెబ్బలుతింటాడు. అతడ్ని చంపివేసే అవకాశం వచ్చినా, భీముడి శపథం తలచి, సాత్యకి అతడ్ని వదలివేస్తాడు. ఈపని తెలివితక్కువపనా? లేక గొప్పధర్మమా? ఏది? ఎవరి సంస్కారాన్నిబట్టి వారికి సమాధానం కావలసిందె.

ద్రోణుడు బయట చాలమంది నెదుర్కొని చంపేస్తున్నాడు. బృహత్క్షత్రుడూ ధృష్టకేతూ చచ్చిపోయినారు. జరాసంధుని కుమారుడైన సహదేవుడ్ని చంపేస్తాడు. క్షత్రవర్మను చంపాడు. పెద్దపెద్ద రథికులు చావడం ఇన్నిరోజుల మొత్తంలో కవాళనే మొదలు. నిన్నటి రోజున అభిమన్యుని చావుతో పాండవుల్లోనూ, ద్రోణుని లోనూకూడ ఈ మత్సరం విజృంభించిందనిపిస్తుంది.

ధర్మరాజుకు లోపలకు వెళ్ళినవాళ్ళ సంగతి తెలియక భీముణ్ణికూడ లోపలకు వెళ్ళమంటాడు. భీముడు 'సరే'నని తను కృష్ణార్జునుల్ని చూసేవాకా తన శంఖం పూరించక వారిని చూడంగానే ఊదుతాడనీ ధర్మరాజుకదే గుర్తు అనుకోమనీ అన్నాడు. బయలుదేరాడు. ద్రోణుడు రోషంతో ఎదురై 'ఏం నీకూ అనుమతి కావాలా లోపలి కెళ్ళడానికి? అంటాడు. భీముడు ధిక్కరించుకొని 'నాకు నీ అనుమతా? [illegible]నుండు' అంటూనే రథం దిగి తలవంచి పెద్దపెద్ద అంగలు వేసుకొంటూ ద్రోణుడి బాణాలకు లెక్కచేయకుండా విళ్ళి ఆ ద్రోణుడి రథపు నొగలు పట్టుకొని బయటకు ఒక్క విసురు విసురుతాడు. ఆ గుర్రాలు ఆ రథాన్ని పట్టుకొని నిలబడటానికి కొంత సేపు పట్టింది. ఈలోగా భీముడు లోపలకు వెళ్ళిపోయినాడు. కృష్ణార్జునుల మాటలు విని తన శంఖాన్ని వెల్లువగా పూరించాడు. ధర్మరాజు విని సంతోషించాడు. అర్జునుడు తన ప్రతిజ్ఞ నిక నెరవేరుస్తాడు లెమ్మనుకొన్నాడు.

ఇంతలో కర్ణుడువచ్చి భీముని ఎదుర్కొంటాడు. దుర్యోధనుడుకూడ కర్ణునితో పాటు ఉంటే ఎలా ఉండేదో. దుర్యోధనుడు భీముని వదలినందుకు ద్రోణాచార్యుని తిట్టాలని వెళ్ళాడు. ద్రోణుణ్ణి మందలించబోతె లోపలి వాళ్ళను మీరుచూసుకొనక నావద్దకెందుకొస్తావు? ఇక్కడి యుద్ధం నేను చూసుకొంటానులె—అని ఊరుకొన్నాడు ద్రోణుడు.

ఈలోగా భీముని చేతులో కర్ణుడు చావు దెబ్బలు తిన్నాడు. మరొకరి రథంపై నెక్కి పారిపోతాడు. ఐనా తిరిగివచ్చి యుద్ధం చేస్తాడు. కాని వాని సైన్యాలన్నీ భీముని ధాటికి చాపకట్టుగా పడిపోయినయి.

ఇదివిని ధృతరాష్ట్రుడంటాడు: "పిరికి వెధవ ఆ కర్ణుడేంచేస్తాడు యుద్ధం!—మాటలు మాత్రం కోటలు దాటిస్తా"డన్నాడు. "చెడిపోయేవాళ్ళు నా బిడ్డలుగదా అని కుట్రచేసి మనసులు చెరిచాడు" అన్నాడు.

ఆ ఉద్ధృతంలో భీముడు కర్ణుని విల్లు విరగ్గొట్టాడు. దుర్యోధనుడి తమ్ముళ్ళిని ఐదుగుర్ని చంపేశాడు. కర్ణుడు పారిపోదామనుకొనికూడ వాళ్ళ శవాల్ని చూస్తూ పోలేక పళ్ళ బిగువున నిల్చాడు. దుర్యోధనుని తమ్ముళ్ళ చావుకేకలు, భీముడి అరుపులు, బయటనున్న ధర్మరాజుకు వినిపిస్తున్నాయి.

కర్ణుడి విల్లు మళ్ళీ విరిగిపోయింది. అతడు మరో విల్లు తీసికొనేలోగా భీముడు కత్తీడాలు తీసికొని తన రథం వదలి నడిచి కర్ణుడి రథమెక్కుతాడు. కర్ణుడు ఆ జండా కర్రకు వెనక దాగుంటాడు. భీముడు చేసేదిలేక కర్ణుడు పారిపోయినాడని వెనక్కుతిరిగి క్రిందకు దిగుతాడు. వెంటనే కర్ణుడు బాణాలు వేసి భీముడి డాలు, కత్తి అన్నీ విరగగొట్టి నిరాయుధుణ్ణి చేసి హేళనచేస్తాడు. పోయి అర్జునుడి వెనక దాక్కోమంటాడు. భీముడు ఖిన్నుడై అర్జునుని వెనక్కు వెళ్తాడు. అర్జునుడు కర్ణునిమీద బాణాలు వేయడం ఆరంభిస్తాడు.

సాత్యకి అలంబసుడనే రాజు తల దునుముతాడు. దుశ్శాసనుని త్రిగర్తుల్నీ కళింగుల్నీ గెలుస్తాడు. కృష్ణుడు సాత్యకిని మెచ్చుకొంటూ అర్జునునితో అంటాడు. "ఇతడు నీకు సహాయంగా వచ్చాడు మనకెంతో మేలు అని. అర్జునుడు మాత్రం అక్కడ ధర్మరాజుకు రక్షణ తగ్గిపోయింది కదా అని చింతపడుతాడు. ఇంతలో భూరిశ్రవసుడు వచ్చి సాత్యకిని ఎదిరిస్తాడు, వీరిద్దరిపోరు మహా సంకులమయి నడు

స్తుంది. చివరకు కత్తి, గదల పోరాటాలు అయి మల్లయుద్ధంకూడ చేస్తారు. ఆ యుద్ధంలో సాత్యకి చాల శ్రమతో ఉండటంవల్ల పడిపోతే భూరిశ్రవసుడు అతని కుడిచేతిని త్రొక్కి గుండెమీద రెండోకాలు పెట్టి కత్తితీసి తలకాయ తెగవేయ బోతాడు. కాని దూరాన్నుంచీ అర్జునుడు ఒక బాణంవేసి భూరిశ్రవసుని చేతిని ఖండిస్తాడు. భూరిశ్రవసుడది "అన్యాయ" మంటాడు. అర్జునుడు మాత్రం అభిమన్యు ణ్ణి కుట్రచేసి అంతా కలిసి చంపటం న్యాయమయితె ఇదీ న్యాయమేనంటాడు. నిన్ను రక్షించుకోవాల్సినవాళ్ళ తెలివితక్కువ ఇది. అనికూడ అంటాడు. భూరిశ్రవ సుడు యోగి. అతడు వెంటనే ప్రాణాయామం చేదామని దర్భలు పరుస్తుంటాడు. ఇంతలో సాత్యకిలేచి కత్తితెచ్చి భూరిశ్రవసుని తల నరికేస్తాడు. కృష్ణుడు, అర్జు నుడు ఇంకా ఎంతోమంది "వద్దు" "వద్దం"టున్న మాటల శబ్దం ఆగనేలేదు. భూరి శ్రవసుడు చనిపోయినాడు.

ధృతరాష్ట్రుడు సంజయునడుగుతాడు. అంత పరాక్రమంగా పోరి ఎంతో మందిని నిర్జించిన సాత్యకి భూరిశ్రవసునిచేత అలా ప్రాణాలు కోల్పోయే స్థితికి రావలసిన అవసరమెందుకొచ్చింది అంటాడు. అందుకు సంజయుడు—యుద్ధంలో ఓడిపోవడానికి కారణమేమిటనేది ఏం ప్రశ్న? కాని దీనికి మరొక ఉదంతం ఉంది. శినివంశంవాడు సాత్యకి. వసుదేవుడూ ఆ వంశంలోవాడె. ఒకసారి దేవకి స్వయం వరంలో వసుదేవుని కోసం శిని ఆ పిల్లలను తీసికొని వెళ్ళేటప్పుడు మిగతా రాజు లంతా అంగీకరించినా భూరిశ్రవసుని తండ్రియైన సోమదత్తుడు మాత్రం ఒప్పుకో లేదు. యుద్ధంచేసి ఓడిపోయినాడు. శిని అప్పుడు సోమదత్తుని కొప్పుపట్టిలాగి క్రింద పడేసి కాలితో తన్నుతాడు. సోమదత్తుడు వెళ్ళిపోయి శివునిగూర్చి ఎంతో కాలం తపస్సుచేసి శినిమనుమని పడవేసి తన్నగలిగే కొమారుని కోరుతాడు. ఆ కుమా రుడే యీ భూరిశ్రవసుడు. శిని మనుమడె సాత్యకి. ఆ వరం ఇలా పరిణమించింది అని సంజయుడు చెప్తాడు.

ఆ సమయానికి శ్రీకృష్ణుని రథాన్ని దారుకుడు తీసికొని వస్తాడు. దాన్నెక్కి యుద్ధం చేస్తాడు సాత్యకి. శైబ్య సుగ్రీవ మేఘ పుష్ప వలాహకాలనే గుర్రాలుపూన్చి ఉన్నట్టిది ఆ రథం. కర్ణుడు వచ్చి సాత్యకితో యుద్ధం ఆరంభిస్తాడు. పోరు ఘోరంగా నడుస్తుంది. ప్రొద్దు వాటారుతోంది. కర్ణ దుర్యోధనులు కలిసి ఇక ఈ అర్జునుడు సైంధవుని చంపే అవకాశం లేదంటున్నారు తాము అంతా సైంధవునకు అడ్డం

ఉంటూ సాత్యకి-భీముడు అర్జునులతో యుద్ధం చేస్తున్నారు. నిజానికి ఇంకెంతో సేపులేదు ప్రొద్దుగ్రుంకడానికి. అందుకె ఈ అర్జునుడు ముందుకు వెళ్ళి సైంధవుని కలవకుండా వళ్ళబిగువునైనానరె ఆలస్యం చేయాలని కర్ణుని ప్రార్థిస్తున్నాడు దుర్యోధనుడు. కర్ణుడు యుద్ధం చేస్తున్నాడు. ఒక బాణం వేసి, కర్ణుని చంపేయాలని అర్జునుడు వదలుతాడు కాని వెంటనె అశ్వత్థామ దాన్ని అర్థచంద్ర బాణంతో నాశనం చేసాడు మధ్యలోనె. అర్జునుని కౌరవులంతానూ వాళ్ళ వెనకనుంచీ సైంధవుడూ, బాణాలు వేస్తున్నారు. అర్జునుడు ప్రచండ మూర్తి అయి వారిని చెల్లాచెదరు చేసి సైంధవు నెదుర్కొంటాడు. సైంధవుడు బాణాలు వదలుతూనె చాటుకు తప్పుకొంటూ ఉంటాడు.

అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునునితో తానొక ఉపాయం చెప్తాను చేయుమంటాడు. వెంటనే మాయ చేసి, సూర్యమండలం అవుపడకుండా చేశాడు. అప్పుడు కౌరవులూ సైంధవుడూ అర్జునుని ప్రతిజ్ఞ చెల్లలేదని సంబరపడి కలకలలాడుతు ఉన్నారు. సూర్యమండలం పూర్తి మేఘావృతమవుతుంది. కౌరవులు ప్రొద్దుగ్రుంకిందనె అనుకొన్నారు. సైంధవుడూ బయటకు నిర్భయంగా వచ్చాడు. అర్జునుడు ప్రాణోపవేశ ంచేస్తాడు చూద్దామనుకొని. కాని గంధమాల్యాదులతో అలంకరించిన బాణంతో అర్జునుడు సైంధవుని తలను ఎగురగొట్టుతాడు.

వెంటనే కృష్ణుడు ఆ ఎగిరిన తల క్రింద పడకుండా ఆకాశం మీదనే ఎగురనేస్తూ ఉండవలసిందంటాడు. ఆ అవసరమేమిటో తరువాత చెప్తానంటాడు. పాశుపతాస్త్రం ఒక్కటే అలా చేయగల దంటాడు. అర్జునుడు పాశుపతాస్త్రాన్ని అందుకు ఉచ్చాటనచేసి వదలుతాడు. "సైంధవుడు పుట్టినప్పుడు ఆకాశవాణి ఆతడు యుద్ధంలో ఏమరుపాటులో ఉన్నప్పుడు శిరచ్ఛేదం చేయబడతాడని చెప్పిందట. అప్పుడు తపోబలుడయిన వీని తండ్రి, వీని శిరస్సును క్రిందపడేసిన వాడితల నూరు వ్రక్కలవుతుందని శపించాడు. అందుచేత ఇప్పుడీ తలకాయ క్రిందపడితె అర్జునునకు ముప్పు. అందుకని ఆది వీనితండ్రి ఒళ్ళో పడేటట్లు అభిమంత్రించి పాశుపతం వేయవలసిందంటాడు శ్రీకృష్ణుడు. అర్జునుడు అలా చేయటంవల్ల శమంతకపంచకంలో ఉన్న వృద్ధక్షతుడైనట్టి సైంధవుని తండ్రి తొడమీద సైంధవుని శిరసు పడుతుంది. అతడు వెంటనె దానిని క్రిందకు తోసేస్తాడు ఛీ ఇదేమిటని. క్రిందపడవేసిన వాడు తానే కావటంవల్ల తన శాపప్రకారం తన తల నూరు వ్రక్కలయింది. పాశుపతాస్త్రాన్ని అప్పుడు ఉపసంహరిస్తాడు సవ్యసాచి.

ఈ అద్భుత రసాత్మకమయిన అర్జునుని విలువిద్యను అంతా చూస్తూ నిశ్చేష్టులయినారు. చీకటిమాయ వదలి సూర్యుడు పశ్చిమదిశలో అవుపడ్డాడు. అర్జునుని ప్రతిన నెగ్గింది. మళ్ళీ కౌరవులు యుద్ధానికి ఆరంభిస్తారు.

పరమేశ్వరుడు పాండవులను ఎలా ఎన్ని విధాల రక్షించాడో భారతం ప్రత్యక్షరం చదివితేనే తెలుస్తుంది. ఊరికె విజయ సారథిగా గుఱ్ఱాలు నడిపాడని తెలిసి పాండవులు ప్రతిచోట అన్యాయమైచేసి యుద్ధం గెలిచారనడం సరికాదు. పాశుపతాస్న్ని దాని ప్రయోగోప సంహారాలను ఆ క్రిందటి రాత్రి అర్జునునకు జ్ఞాపకం చేయించటం భగవచ్చెయిదము. శ్రీకృష్ణుని రథందారుకుడు తీసికొని రావాలనే ఆజ్ఞ క్రిందటి రాత్రి శ్రీకృష్ణుడు జారీ చేయటం అది భగవత్కృప. ఇవె గెలుపునకు ఆధారమైన కారణాలు. ఇది భగవంతుడా లేక ఏవో హఠాత్సంభవాలా అని శంక వస్తుంది. ఏమనుకొంటె అది, అవునంటె అవును. కాదంటే కాదు. ఎవరి సంస్కారాన్ని బట్టి వారికది అర్థమవుతుంది.

సైంధవ వధలోనూ కొన్ని అంతరార్థ విషయాలున్నయి. సైంధవుని పేరు జయద్రథుడని వ్యాసమహర్షి వాడినాడు. జనన మరణాల వాసనలకు అతడు ప్రతీక. ఈ వాసనలను జయించటం అర్జునుడు చేపట్టినపని. ఆ జయద్రథుని తండ్రియైన వృద్ధక్షతుడు కర్మిష్ఠియై కర్మలుచేసి తద్వారా యీ వాసనలను పెంచినందువలన జయద్రథునీ ఆ తండ్రినీ నాశం చేస్తేనేగాని ఈ వాసనలు పూర్తిగా నశించవనే బోధను చెప్పడానికి వ్యాసమహర్షి ఉద్దేశించాడనేది తెలియాలి. వాసనలు పుట్టకుండా ఉండాలంటే వాటిని పుట్టించే కర్మల కారకుడైన తండ్రినికూడ చంపవలసి వస్తుందనేది తెలియాలి.

ఇవి తృతీయ చతుర్థాశ్వాసాలు

***

# మహాభారత కథలు

## ద్రోణ పర్వము- పంచమాశ్వాసము

### 1. ఘటోత్కచ వధ

సైంధవవధ అనే అద్భుత రసాత్మక యుద్ధం రిచ్చవడి చూస్తూ యోధు నిలిచిపోయి, సూర్యుడు అవుపించిన కొంత సేవటికి తెములుచ్చుకొని మళ్ళీ యు చేయడాని కారంభిస్తారు. శ్రీకృష్ణార్జున భీమ సాత్యకులు ధర్మరాజును కలిసి నందనలను పొందుతారు. దుర్యోధనుడు చాల నిరుత్సాహాన్ని పొందుతాడు. నుణ్ణి జయించేవాడు తనపక్షాన లేడనుకొంటూనె ద్రోణాచార్యునితో తన సి చెప్పుకొంటాడు. "మొదటి పది రోజుల్లో ఏడక్షౌహిణుల సైన్యం భీష్ముడూ న చారు. ఇవాళ ఎంతోమంది రథవరులూ సైంధవుడూ కూడ నశించారు. ఇక మిగిలి వాళ్ళం ఇవాళ పాండవుల్ని జయించనైనా జయించాలి. లేదా చచ్చినవారితో పా చావనన్నా చావాలి. నీవు మాత్రం పాండవులపై పక్షపాతంకొద్దీ జయా న్ని వాళ్ళ ఇస్తున్నావు" అంటాడు.

ద్రోణుడు గట్టిగా సమాధానం చెప్తాడు- "నేను ఇదివరకెన్నోసార్లు చెప్పాను. పాండవులను దేవతలు కూడ గెలువలేరని! మీరంతా ఎంతోమంది ఉండి లోపటి వచ్చిన ఒక్క అర్జునుని ఎందుకు గెలవకపోయినారు? జూదం ద్వారా చేసిన పా నీ పక్షానికి గెల్పునెలా తెస్తుంది? కాంట్రాక్టు సమయం పరిపూర్తి చేసి వచ్చిన యుద్ధం తెచ్చిపెట్టిన పాపం నీది. అందులో నేనూ చేరాను. నేనుమాత్రం ఎల గెలిచేది? అయితే-ఇప్పుడు చూడు. నేను పాంచాలురనూ ఇతరులనూ ఓడిస్తాను అందాకా నేను కవచం విప్పనుగాక" అంటాడు.

దుర్యోధనుడు కర్ణుని వద్దకు వెళ్ళి ద్రోణాచార్యుని పక్షపాతి అంటూ అత వల్లనే అపజయం కలుగుతున్నదంటాడు. కర్ణుడు కూడ నిష్పక్షపాతంగా "సైంధవుని చావుకు కారణం కేవలం దైవేచ్ఛ. ద్రోణుడు తన శక్తిమేర పోట్లాడాడు. గెలువ లేనప్పుడింకేం చేస్తాడు: నేనూ అలాటి స్థితిలోనే ఉన్నానుగదా! మన పాపమేదో ప్రతీకారం చేస్తున్నట్లె ఉంది మనకి! విషం పెట్టాం! ఇళ్ళుకాల్చాం అడవులకు పంపాము ఈ పాపఫలంగా మనకు కట్టికుడుపుతున్నాడేమో భగవంతుడు! ఐనా

ఇప్పుడు భావనకాదు కావలసింది; కర్తవ్యం; ఇప్పుడు చూడు [illegible] సేనెలా ఎదుర్కొంటానో" అంటాడు. శ్రీకృష్ణరాయబారం నాటినుండి కర్ణుడు [illegible] డవుతున్నాడనిపిస్తుంది.

ఆనాటి సంధ్యాకాలంలో జరిగేయుద్ధంలో అశ్వత్థామ మహాహవం చేశాడు. ఘటోత్కచునితో చేసిన పోరులో అతడొక్కడే నిలవకలిగాడు. ఘటోత్కచుని కుమారుని చంపేశాడు.

దుర్యోధనుడు కర్ణుడుకృపుడు అశ్వత్థామల వద్దకు వచ్చి ఇప్పుడే యుద్ధం చేయాల్సిన సమయమని హెచ్చరిస్తుంటే కర్ణుడు "చూడు సేనెలా [illegible] జయి స్తానో" నంటాడు. కృపుడైతే "ఎందుకొచ్చిన వ్యర్థపు మాటలివి" అని పూర్వపు ఓటమిలను జ్ఞాపకం చేస్తాడు. వెంటనే కర్ణుడు కృపుని నాలుక కోసేస్తానంటే అశ్వ త్థామ కల్పించుకొని కర్ణుని చంపేస్తానని అడుపడేస్తాడు. [illegible] కృపుడూ వాళ్ళని శాంత పరుస్తారు. [illegible] ఐనా అశ్వత్థామ తాను పాండవుల నెదుర్కొబోతున్నా [illegible] మీ నాయనా పక్షపాతులు మీరు ఇతర్ల నెదుర్కొనేంది నాలు" [illegible] మాదులు ఆనహ్యించుకొని - "మీరేమన్నా అనుకోండి. కాని [illegible] గమనించండి" అని యుద్ధంలో చొరుమకుపోతాడు.

రాత్రి పడింది. ఐనా యుద్ధం ఎవరూ ఆపలేదు. [illegible] రాత్రిపూట కూడ యుద్ధం నడిచింది. [illegible] మాత్రం ద్వంద్వ యుద్ధాలు చేస్తున్నారు. [illegible] యుద్ధం చేస్తుంటారు. కర్ణుడు సహదేవుని [illegible] పొట్టనుతాకి పోయి అర్జునుని వెనక [illegible] తల్లికి తానిచ్చిన వరం సఫలం చేశాడు. [illegible] యుద్ధం చేస్తున్నారు.

ఇంతలో సాత్యకి అసాధ్యుడై [illegible] చంపిన విధంగా ఈ సాత్యకిని కూడ [illegible] స్తారు. కాని అర్జునుడు తనపైకొచ్చిన [illegible]

ఇతర్లనీ జయించి సాత్యకికి సహాయం వస్తాడు. అలా అర్జున, సాత్యకి ధృష్టద్యు మ్నులు తమ ప్రతాపం వెలయిస్తారు.

కాని కౌరవుల తరపున కర్ణుడు ఆ అర్ధరాత్రిన సూర్యునిలా విజృంభించి పాండవ బలాల నాశనం ఆరంభించాడు. ధర్మరాజు వెరగుపడిపోయి రాత్రివేళ రాక్షసుల కెక్కువ బలం అని ఘటోత్కచుని పిలచి కర్ణుని ఆపుచేయమంటాడు. ఘటోత్కచుడు అలంబసుని చంపి ఆ తరువాత కర్ణునెదుర్కొంటాడు. ఇంతలో అలాయుధుడనే రాక్షసుడు కర్ణునికి సహాయంరాగా ఘటోత్కచుడు వాడ్ని చంపే స్తాడు. ఇక మిగిలింది కర్ణుడేననుకున్నా రెవరో. కర్ణుడుకూడ తన ముప్పును తెలిసి కొన్నాడు. చివరకు అర్జునునికోసం ప్రత్యేకంగా ఇంద్రుడినర్థించి తెచ్చి ఉంచుకొన్న శక్తిని ఘటోత్కచునిమీద ప్రయోగించి వానిని చంపేస్తాడు. కౌరవసేనలు అప్పటికి గాలి పీల్చుకొన్నారు. పాండవ సేనలు విచారంలో కుమిలిపోయారు.

ఐతె ఆ శక్తి కర్ణుడు ఖర్చుపెట్టేశాడని శ్రీకృష్ణుడు రథంమీదనే లేచి నిలబడి మహాసంతోషాన్ని ప్రదర్శిస్తూ నాట్యం చేస్తాడు. అర్జునుడు "అదేమిటి పామరుడిలా నృత్యం చేస్తావు! చచ్చినవాడు మనవాడైతె?" నంటాడు. అందుకు కృష్ణుడు "ఓయి నాయనా! ఆ శక్తి వాడు నీమీద ఎప్పుడు ప్రయోగిస్తాడోనని క్షణ క్షణం తల్లడిల్లిపోతున్నానీనాల్గు రోజులున్నూ. ఇప్పుడు నిన్ను బ్రతికించుకొన్నానని నా సంతోషాన్ని ఆపుకోలేకుంటా ఉన్నా"నంటాడు. "ఆ శక్తివల్ల పోయినాడుగాని ఈ ఘటోత్కచుణ్ణి వదలించుకోవటానికి ఇంకో మార్గమేముందేదంటావు!" అన్నాడు. అర్జునుడు తన పరిస్థితిని అర్థంచేసికొన్నవాడై "ఐతె ఈ నాల్గు రోజులనుంచీ కర్ణుడు నాపై ఆ శక్తినెందుకు ప్రయోగింపలేదు" అనె సందేహం వెలిబుచ్చుతాడు. అందుకు శ్రీకృష్ణుడు "అయ్యో దాన్ని నీపై ప్రయోగించాలనే కృతనిశ్చయంతోనే రోజూ కర్ణుడు యుద్ధానికి వస్తున్నాడు. అతడికి అది యుద్ధ సమయంలో జ్ఞాపకం రాకుండా చేయడానికి నేనెంతో శ్రమపడవలసి వచ్చింది" అని తన యోగీశ్వర త్వాన్ని సూచించాడు.

## 2. ద్రోణ వధ

ఈ సంఘటన తరువాత ధర్మరాజుకు చాల కోపం వస్తుంది. తాను కర్ణుని వధిస్తానని బయలుదేరతాడు. వెంటనె వ్యాసమహర్షి ప్రత్యక్షమవుతాడు. అర్ధరాత్రి

యుద్ధ రంగంలోకి ఈయన ఇలా ఎందుకు వచ్చినట్లు? అయన ధర్మరాజుతో "ఘటోత్కచుడు పోయినందుకు దుఃఖమలా ఉంచు. ఆ శక్తి అర్జునునిమీద వేసినట్లయితె నీవు దుఃఖాన్ని భరించగలవా? ఇది ధర్మానికి జయం కలగడానికె జరిగిన సంఘటన ఈనాటికి ఐదో రోజున నిన్ను రాజ్యరమ వరిస్తుంది. సక్రమతతో యుద్ధం చేయించు" అని వెళ్ళిపోతాడు.

తరువాత యుద్ధం జరుగుతున్నా అంధకారం వల్లా అమిత శ్రమవల్లా సాగటల్లేదు. అందుకని అర్జునుడు ఒక ప్రఖ్యానం చేసి చంద్రుడుదయించేవరకూ యుద్ధం ఆపుతాడు.

ఈ విరామంలో దుర్యోధనుడు ద్రోణుని సూటి మాటలాడి నీవు పక్షపాత బుద్ధితో ఎంత యుద్ధం చేస్తావో దాన్ని దూరంగాపోయి పాండవేతరులతో చేయుమంటాడు. ద్రోణుడు ఎలా ఈ మాటల్ని భరించాడో అది ఊహ్యమేకాని సహింపతగిందికాదు. అలాగే అతడు దూరంగా వెళ్ళి ఉండి పాంచాలురనూ మాత్స్యులనూ యుద్ధానికి ఆహ్వానిస్తాడు.

అలా యుద్ధం చేస్తుండగానే తెల్లవారుతుంది. అప్పటినుంచీ పదిహేనో రోజు యుద్ధం. ద్రోణుడు యుద్ధంలో విరాటునీ ద్రుపదునీ కూడ చంపేస్తాడు. అర్జునుడూ ద్రోణుడు యుద్ధంచేయక తప్పలేదు. ఇద్దరు బ్రహ్మాస్త్రాలను వేస్తారు. అర్జునుడు కేవలం ద్రోణుని అస్త్రాల నెదుర్కొనటం మాత్రం చేశాడనీ తిన్నగా యుద్ధం చేయక గురువనే గౌరవం క్రింద దాగికొన్నాడనీ ధర్మరాజాదులనుకొంటున్నారు. అందుకని శ్రీకృష్ణుడు వారితో చెప్తాడు. "ఈ ద్రోణుని గెలవడం దేవదానవులకే చేతరాదు. దీనికి నేనొక ఉపాయం చెప్తాను. అయన దగ్గరగా వెళ్ళి అశ్వత్థామ హతుడైనాడని చెప్పాలి ఎవరైనా. అప్పుడాయన ప్రాయోపవేశం చేస్తే అప్పుడే ఆయన్ని మనం గెల్చినట్లు, అంటాడు. 'అశ్వత్థామ' అంటే అర్థం జ్ఞానమని ; ద్రోణుని జ్ఞానం భూసంబంధమైన ఈ ఇచ్ఛలతో హతమవుతోంది. ఈ సంగతిని ఆయనకు తెలుపడం శ్రీకృష్ణుని ఇచ్ఛ ;; ఇది అంతరార్థపరమైన మాట!

కథలో ఎప్పుడూ సత్యం పలికేవారి బుద్ధి ఎప్పుడైనా కార్యసిద్ధికోసం అబద్ధం చెప్పాలని నిశ్చయించినా పలు మాత్రం యూయదు. దానికి ఆత్మవంచనకావాలి. అందుకొక వ్యాజం కావాలి. అందుకని భీముడు ఇంద్రవర్మ అనేవాని ఏనుగ

అయిన అశ్వత్థామ అనేదాన్ని చంపి, ద్రోణునివద్దకు వెళ్ళి "అశ్వత్థామ హత॥" అంటాడు. కాని ద్రోణుడికి భీముని నిజాయితీమీద నమ్మకంలేదు. పైగా కోప॥ వస్తుంది. కోపంకొద్దీ శత్రు సంహారం చేస్తున్నాడు.

అప్పుడు మహాఋషులు ఆయనకు గోచరిస్తారు. ఇది జాగ్రతావస్థలోనే జ॥ గింది. వారితరుల కెవరికీ అవుపడలేదు. వారాయనతో అంటారు. "భరద్వాజ॥ నీవు వేదవేదాంగ విదుడవు. నీవు యుద్ధం చేయడమేమిటి? ఇంతవరకు చేస్తే చేశావు కాలపరిపూర్తి ... ంది. ఆయుధాలు వదలి శాంతిని పొందాల్సింది" అంటారు నీ జ్ఞానం హతమయిపోతోంది" అని అర్థం. దుర్యోధనునివల్ల తనకు కలిగిన అ॥ మానము తాను పెద్దరాజులయిన పాంచాల విరాటుల్ని చంపడమూ, భీముడు చెప్పి॥ సంగతి నిజం అయితె తాను ఆయుధాలు విడువ వలసి యుండదగిన తన నియ॥ మమూ, చివరకు ఈ మహర్షుల హెచ్చరిక – వీటివల్ల ద్రోణుని మనః స్థితి మా॥ పోతోంది. అనగా తన చావు వైపునకు మనఃస్థితి తిరిగింది. అయినా సంగతి నిశ్చయంగా తెలిసికొనాలని, ధర్మరాజును పిల్చి అడుగుతాడు—

ధర్మరాజును అప్పటికే శ్రీకృష్ణుడూ భీముడూ ఈ అబద్ధం చెప్పి పాండవ॥ బలాన్ని ద్రోణుని విశిఖాలనుంచి తప్పించాల్సిందని కోరుకొంటూనే ఉన్నారు. ధర్మ॥ రాజు అప్పటి కర్తవ్యాన్ని ఆలోచించి విచారించి, అబద్ధం స్ఫురింపజేస్తూ భీముని వలె వలకడానికి అంగీకరించి ఉన్నాడు. "అశ్వత్థామ చనిపోవడమయింది" అని బిగ్గరగా ద్రోణునితో చెప్పి, "అది ఒక ఏనుగు మాత్రమేననుకోండి" అని గొణు గుడుగా అని తన మనసుకు గాయం కాకుండా ప్రవర్తిస్తాడు. దాంతో ద్రోణుని రథం ఆగిపోయింది.

ద్రోణుడు తానప్పటికె పాండవులకు ఎంతో అన్యాయం చేసినట్లు తలచి బాధ పడిపోతున్నాడు. ధర్మపక్షానికి అన్యాయం చేశాడని బాధతో తన నియమం పాటించే వీలు చూచుకొన్న క్షణాన తాను కూలబడిపోతున్నాడు రథంమీద. ధృష్టద్యు మ్నుడు వచ్చి ద్రోణుని మీద బాణాలు వేస్తుంటాడు. ద్రోణుడు వాటిని వారిస్తుం టాడుగాని అస్త్రాలు ప్రతిభాసించటల్లేదు. దూరం నుంచి సాత్యకి ఎవరితోనో తాను యుద్ధం చేస్తూకూడ ద్రోణాచార్యునిపై బాణాలు తురుముతాడు భీముడు ధృష్టద్యు మ్నునకు ద్రోణునకూ మధ్య నిల్చి ధృష్టద్యుమ్నుని "నీవు పో"మ్మంటాడు ధృష్ట ద్యుమ్నుడు అలా తప్పుకొన్న క్షణాన ద్రోణుడు యుద్ధం పూర్తిగా మానివేసి॥

సంగతి కురువీరులను పిల్చి చెప్పి యోగసిద్ధుడై తన తేజోమయ శరీరాన్ని భౌతిక శరీరాన్నుంచి లేపి పైకి వెళ్ళిపోతాడు. అతడి తేజోమయమయిన శరీరం ఆకాశంలో వెళ్ళిపోవడం సంజయుడు, శ్రీకృష్ణార్జునులు, ధర్మరాజూ, కృపాచార్యుడూ మాత్రం చూశారు. మిగతావారికి కన్పడలేదు. ఎందుకు కన్పడలేదు? ఎదురుగా వచ్చి దాటి వెళ్ళిపోయే స్నేహితులనే చూడవు మన కళ్ళు ఒకప్పుడు! తేజోమయరూపం చూడక పోవటం ఒక లెక్కా? ధృష్టద్యుమ్నుడు గండ్రగొడ్డలి కత్తితో వస్తున్నాడు ద్రోణాచార్యుని తల నరికేద్దామని. సాత్యకి, ధర్మరాజు, అర్జునుడు "వద్దు వద్దు అది మాను" అంటున్నంతలోనే ధృష్టద్యుమ్నుడు వచ్చి ద్రోణుని శిరస్సు నరిగి వేస్తాడు బ్రతికి యున్నవాని శిరస్సునే తాను దునిమినట్లు అతడి భావం.

ఇలా ద్రోణుడు నాల్గురోజులూ, ఒక రాత్రీ, ఐదవరోజులో ఇరవయి ఘడియల కాలం మహాయుద్ధంచేసి పరమపదించాడు ఈనాడు మిగిలిన పది ఘడియలలోనున్నూ అశ్వత్థామ విక్రమించటం చూస్తాము.

## 3. నారాయణాస్త్ర ప్రయోగం

ద్రోణవధ చూస్తూ కౌరవ యోధులంతా రిచ్చవడి నిశ్చేష్టులై ఉండటం అశ్వత్థామ ఎరిగివచ్చి ఇది ఇలా ఎందువలనయింది అని తెలిసికొని క్రోధపూరిత మనస్కుడై మారణ కాండకు ఉపక్రమిస్తున్నానని ప్రకటించి కౌరవ సేనలను మళ్ళీ పురికొల్పి నడిపిస్తాడు. ధర్మరాజు ఈ కౌరవ సేనను చూచి "వీళ్ళు మళ్ళీ రావటానికి కారణమేమిటి! ఇంద్రుడే వారికి సహాయం చేయటల్లేదుకదా" అని అర్జునునితో అంటాడు.

అప్పుడు అర్జునుడు అశ్వత్థామే వాళ్ళ రాకకు కారణమని చెప్పుతూ, "ధర్మరాజా! నీవు ధార్మికుడవని, శిష్యుడవని, సత్యవ్రతుడవని మహాదరంతో ద్రోణుడు నిజమైన సంగతేమిటని అడిగాడు. నీవు చెప్పిన తరువాతనె తన కుమారుని చావు నిజమేనని నిశ్చయించాడు. చలమువల్ల ఇలా రాజ్యాన్ని పొందాల్సిన స్థితి పట్టింది మనకు. లోకానికి 'వెలి' అయినామనుకోను. నేను వద్దువద్దంటుంటే కూడ ధృష్టద్యుమ్నుడు ద్రోణుని శిరస్సు నరికేశాడు అడుగో ఇప్పుడు మహోద్ధతుడై వస్తున్నాడు అశ్వత్థామ. అతనినుంచి ఈ ధృష్టద్యుమ్నుని తప్పించటానికి నీవశం నావశం అవుతుందని అనుకోను. చేసిన పాపఫలాన్ని తప్పించటం మన వశంలో ఉండదు"

అంటాడు. "ఇవి అర్జునుడు ధర్మరాజుతో ఉక్రోషంతోనే అన్న మాటలు. ధర్మరాజు చేసింది తప్పు పనేను అని అర్జునుడు నిర్ధారించి మరీ అన్నాడీ మాటలు.

ఇది చూస్తే ధర్మరాజుకంటె ఎక్కువ ఋజుబుద్ధి అర్జునునియందు ఉన్నదని పిస్తుంది. కాని నిజానికి ధర్మరాజు యుద్ధ విషయమైన భయంతో ఉన్న సందర్భంలో చేసిన పనికి అర్జునుడు ఆ యుద్ధభయం తొలగిపోయిం తర్వాత తప్పు పట్టుతున్నాడనేది మర్చిపోకూడదు. పైగా అర్జునునకు మహాస్త్రాలున్నవి. వాటి కారణంగా తెలుసుకొంటె ద్రోణుని గెలువగలననే ధైర్యం అర్జునునకున్నది. కాని మహాస్త్రాలు అయనపై వేయటల్లేదు తాను. సైన్యాన్ని పాంచాలుడిని; విరాటుని చంపేశాడప్పటికె ద్రోణుడు. ధర్మరాజు పాండవుల పక్షాన పెద్ద. యుద్ధ ఫలితం అతడిది. అతడికి అంతకంటె అపధ్ధర్మం లేదనిపించి అలా అర్థమాత్ర అబద్ధ మాడాడు. అదె రాజనీతి అనె ముసుగు క్రిందకు చేర్చి పాటించాడు. అర్జునుడిప్పు డనటానికేమిగాక. నిజానికి ఇప్పుడైతె ధర్మరాజె ద్రోణుడంతటి వానిని చంపించి నందుకు కించపడుతున్నాడు గాక.

ఇంతకూ అర్జునుడిలా కోపించి మాట్లాడితె భీముడు అర్జునుని మందలిస్తాడు. ఇంతటి యుద్ధంలో ఇరుక్కొని రాజనీతిని పాటించటం మాని అడవిలో తపస్సు చేసే వారిలా ఆలోచించమంటావా? ఇప్పుడు మళ్ళీ కౌరవులు వస్తున్నారంటే మనం ఊరు కుంటామా? నేను వీళ్ళను అడ్డుకొని తిరగగొట్టనా? అంటాడు. ధృష్టద్యుమ్నుడు కూడ అర్జునునితో, ఉపాయం, గొప్ప నేర్పరితనం లేని సైన్యాన్ని అస్త్రాలు వేసి చంపేశాడా ద్రోణుడు అది న్యాయమా? నేను ఆ ద్రోణుని చంపడానికే పుట్టాను కనక చంపేశానుగాక అంటాడు. ఇతడి వాదం మరీ చిత్రం అనిపిస్తుంది. పాంచాలు రకు పాపం యుద్ధ కౌశలం లేకుండా చేసి ద్రోణుడు చంపటం అన్యాయమంటాడు.

ఇది విని సాత్యకి మండిపడి. నీ నాలుక చీలికలు కాదేం? నీ తల వేయి వ్రక్కలు కాదేమి? గురుని చంపిన ఫలం నిన్ను కట్టికుడుపదేమి? ఇంకా అలాటి మాటలంటే నీ నాలుక గొంతు కోసేస్తానంటాడు. ఇద్దరూ ఈ విషయంలో తట్లాడుతారు. సహదేవుడూ, కృష్ణుడూ వచ్చి వారిని విడదీస్తారు. అంతా మళ్ళీ కౌరవులతో యుద్ధానికి సన్నద్ధులవుతారు.

ఇంతలో అశ్వత్థామ వచ్చి నారాయణాస్త్రాన్ని వదులుతాడు. అది మహా దీప్తిచ్ఛటలతో అర్ధ చంద్రాకృతితో వస్తున్నది. పాండవ సైన్యం భయ విహ్వల

మయిపోయింది. అర్జునుడింకా ఏం చేయడానికీ తోచక ఊరుకొన్నాడు. ధర్మరాజు అర్జునుని మాటలకు ఉడికిపోతున్నాడు. చివరకు రోషంతో అంటాడు.

పాంచాలి కయిన పరాభవం చూస్తూ ఊరుకున్నాడు ద్రోణుడు పదిమందితో జేరి అభిమన్యుని నాశనం చేశాడు. కొంచెంసేపాగితె అర్జునుడు అగ్ని ప్రవేశం చెయాల్సిన పరిస్థితిలో అర్జునునకు సహాయానికిగాను పోకుండా మమ్మలను అడ్డు కొన్న ఆయన చేసిన అధర్మాలకు సరిసమానంగా మనం చేసిందేమిటి. ఇక ఎందుకు ఇదిగో నేను ఆ అస్త్రాన్ని ఎదుర్కొని నశిస్తాను ఆ నారాయణాస్త్రంవల్ల నశించటమె మేలు. ఎవరి దోవనవారు పారిపోయి ప్రాణాలు రక్షించుకొనండి అంటాడు.

పరిస్థితి గమనించి అప్పుడు శ్రీకృష్ణుడు బిగ్గరగా అందరకూ వినిపించే ట్లుగా "ఓహో! సైనికులారా ఏనుగులనూ రథాలనూ ఎక్కి ఉండక క్రిందకి దిగండి. అస్త్రాలు క్రింద ఉంచెయ్యండి. అలా ఉంటే ఈ అస్త్రం మిమ్మలనేమీ చేయదుగాక." అని హెచ్చరిక చేస్తాడు. అర్జునుడు వారుణాస్త్రంవేసి ఆ తరువాత క్రిందకు దిగుతాడు అందరితో బాటు. కృష్ణుడు చెప్పినట్లు నమస్కరిస్తారు. కాని భీముడు మాత్రం అందుకు ఒప్పుకొనక అలాగే గదతో రథంమీద ఉంటాడు. శంఖం పూరిస్తాడు.

అప్పుడా ఆయుధం కేవలం భీమునిపైకి మాత్రమె విజృంభించింది. వారు ణాస్త్ర కారణంగా ఆతడి వళ్లు ఇంకా కాలలేదు. కృష్ణార్జునులు వచ్చి భీముని పట్టు కొని దింపి గద ఆవతలకు లాగుతారు. అప్పుడు నారాయణాస్త్రం శాంతిస్తుంది. దుర్యోధనుడు అశ్వత్థామను తిరిగి ఆ అస్త్రాన్ని వేయవలసిందిగా అడుగుతాడు. కాని దానిని తిరిగి వేయడానికి వీలులేదు. అందుచేత సాధారణ బాణాలతోనే అశ్వ త్థామ యుద్ధం చేస్తాడు. కొంతసేపటికి ఆగ్నేయాస్త్రం వేస్తాడు. దానికి ప్రతిగా అర్జునుడు బ్రహ్మాస్త్రాన్నే వదలుతాడు. అప్పటికి అశ్వత్థామ ఇంక ప్రయోజనము లేదని యుద్ధం మానేసి, "అస్త్రాలు పని చేయకపోతె ఏమి ప్రయోజనం అని అస్త్రా లపై విశ్వాసరాహిత్యాన్ని వ్యక్తపరుస్తాడు.

ఆ సమయంలో వ్యాస మహర్షివచ్చి అశ్వత్థామతో అంటాడు. "శ్రీకృష్ణార్జు నులను నారాయణాస్త్రం ఏమి చేయలేదయ్యా. శ్రీకృష్ణుడే నారాయణమూర్తి. విష్ణువు. ఆయన మైనాక శైలంలో చాల కాలం తపస్సుచేసి, శివుని దర్శింపజేసికొని ఏ అస్త్రాలతోగాని చావులేని వరం పొందాడు. నరుడూ నారాయణుని అంశతో

జనించినవాడే.అందువల్ల నీ అస్త్రంతో వారికెలాంటి బాధగానిక లుగలేదు. నీవుకూడ తపస్సంపన్నుడవే సందేహంలేదు. వారికీ నీకూ ఉన్న అంతరానికి కారణం శివుని నీవు మృత్తికతో విగ్రహంగాజేసి పూజించావు. వారు శివుని లింగముగాజేసి పూజించారు. ఆ కారణంచేత వారు పై స్థాయివారయినారు. అందుచేతనే నీవు వారిని జయింపలేకపోయినావు. కర్తవ్యం వదలిపెట్టాల్సిన అవసరం లేదునీకు. వెళ్ళి యుద్ధం చెయ్యి" అంటాడు. వ్యాసుడు అశ్వత్థామ వ్యాసునికి, శివునకు, కేశవునకు నిండు హృదయంతో నమస్కరించి తిరిగివెళ్ళి రథమెక్కుతాడు యుద్ధం చేయాడానికి.

కాని ఆనాటికి యుద్ధం కొంతసాగినా అహస్సు అయిపోవటంచేత ఎవరి శిబిరాలకు వారు వెళ్ళిపోతారు.

శిబిరాలకు వెళ్ళింతరువాత వేదవ్యాసుడు అర్జునునికి అవుపడతాడు. అప్పుడు అర్జునుడు ఆయన్ను ఒక ధర్మసందేహమడుగుతాడు. "స్వామీ: నేను శత్రుసంహారం చేయబోయినపుడు నాకు ముందే ఒక పురుషుడు నేలమీద కాళ్ళు ఆనకుండా నడుస్తూ—

కిరణముల్లసిల్ల, తనకేల నుదగ్రపు శూలముండగా
బోరిఁబోరి నందు ఘోరముగ బుట్టిన శూలపరంపరన్ గరం
బరుదుగ వారినెల్లఁదెగటార్చగ నేవెనుకన్ శరంబులం
గురియుచు జంపినాడ ననుకొందు జయంబు సముద్భటంబుగన్

ఆ పురుషుడెవ్వడో చెప్పాల్సింది: అంటాడు. అందుకు వ్యాసుడు ఆ మహాపురుషుడు రుద్రుడనిచెప్పి ఆయన్ను స్తుతింపతాడు. మహాదేవుడు, పశుపతి, శివుడు మొదలైన నామముల అర్థమునుచెప్పి అట్టి పరమేశ్వరుడె నీకు వరదుడయి సన్నిధి చేశాడు. ఆయనను స్మరించి నమస్కరించు నీకు జయమవుతుంది అంటాడు. అర్జునుడు రుద్రునకు నమస్కరించి వేదవ్యాసునకు నమస్కరిస్తాడు.

సంహారకర్త అయిన శివుడు అలా సైన్యసంహారం జనక్షయం చేస్తుండటం అర్జునునకు అవగతమయింది. ఇదంతా భగవంతుడె చేస్తున్నాడనిపిస్తుంది. ప్రపంచమంతా పరమేశ్వరునికి అవయవాల కూటమిగా ఉంది. మనం మన అవయవాలతో పనులు చేస్తున్నట్లు, ఈ ప్రపంచంతో భగవంతుడు తనకు తోచిన పనులను చేయిస్తూ ఉంటున్నాడని తెలియాలి. ఇది వాస్తవసరళి.

'ద్రోణ' అంటే జ్ఞానానికి సూచన. ఆ జ్ఞానం సాత్త్విక వృత్తులలో కలువక తామసిక వృత్తుల్లో కలువడం మోక్షసాధనకు వ్యతిరేకం. ద్రోణుడు ఈ కారణం చేతనె అసమగ్ర జ్ఞానానికి ప్రతీక అయినాడు. జ్ఞానాన్ని ఋజు ప్రవృత్తి (అర్జునుడు) యథాతథంగా జయించలేదు. జ్ఞాని అయిన ద్రోణుడు అందుకనె అస్త్రసన్యాసం చేసేదాకా ఎవరిచే జయింపబడలేదు. అసమగ్ర కర్మకాండకు ప్రతీక అయిన భీష్మునిలాగానే అసమగ్ర జ్ఞానియైన ద్రోణుడుకూడ దేవతలూ మునులూ స్వయంగా వచ్చి బోధచేయటంవల్ల అస్త్ర సన్యాసం చేశాడు. ధృష్టద్యుమ్నుడు అన్యాయంగా ప్రాణం పోయిన శరీరంనుంచి ద్రోణుని తల నరికేశాడుగాక. "అశ్వత్థామ హతః కుంజరః" అన్నప్పుడు, అశ్వత్థామ అంటె జ్ఞానము 'కుం' అంటె భూ సంబంధమైన దానిలో "జరః" అంటె నశించిపోవటం అనేదాన్ని 'హతః' అంటె నాశనం చేయి అని-స్ఫురింపచేస్తున్నది. ఋషుల సూచనలను విని ద్రోణుడు ఆ నశించిపోయే భూ సంబంధాన్ని హతంచేసి, జ్ఞానంలో లీనమై ప్రాయోపవేశం చేశారు. అసమగ్ర జ్ఞాని కావటంచేత తానై యథాతథంగా మోక్షం పొందలేదు. ఋషులు, మునులువచ్చి చెప్పవలసి వచ్చింది శుద్ధ జ్ఞానాన్ని! ఇది వ్యాసుడుచెప్పే బోధ.

ద్రోణపర్వం సమాప్తం



# మహాభారత కథలు

## (కర్ణ పర్వం - ప్రథమాశ్వాసము)

## కర్ణుని సైన్యాధిపత్యం- శల్యుని సహాయం

పదిహేడో రోజు యుద్ధం పూర్తి అయింతరువాత సంజయుడు తిరిగి ధృతరాష్ట్రునిచేరి, కర్ణుడు వధింపబడ్డాడని తెలియజేస్తాడు. ధృతరాష్ట్రుడు తన కుమారునికున్న సహాయంకాస్తా కూలిపోయిందని విలపిస్తాడు. "ఈ చావులన్నీ వినటానికి నేను బ్రతికున్నట్లున్నాను. ఇక బ్రతుకను-చచ్చిపోతాను" అంటాడు.

తిరిగి బుద్ధి ప్రబోధించింది. "భగవంతుడు ఇలా ప్రపంచంలో జరుపుతుంటే చిత్రాతిచిత్రమైన పనులకు మనిషి దిగులూ చింతా పడాల్సిన పనిలేదు. అవిచూస్తూ ఆయన చేస్తున్నాడిలా అని తెలిసికొంటూ ఉండటమె కర్తవ్యం. దానివల్ల మాత్రమే నిరంతరం భగవంతుడ్ని శ్రమలేకుండా తలుచుకోవటం అలవాటు అవుతుంది. ఇలా అనుకొని ధృతరాష్ట్రుడు-"ఇక చెప్పు జరిగిన సంగతులన్నీ పూసగ్రుచ్చి" అంటాడు. సంజయుడు చెప్తున్నాడు.

ద్రోణాచార్యుడు చనిపోయిననాడే అశ్వత్థామ విజృంభించి పాండవ సేనను చీకాకు పరచి దుర్యోధనునకు సలహాచెప్పి కర్ణుని సైన్యాధిపతిగా చేయాల్సిందంటాడు. దుర్యోధనుడు మహా సంతోషంతో కర్ణుని సర్వసైన్యాధిపతిగా అభిషేకిస్తాడు.

పదహారోరోజు యుద్ధం ఆరంభించేటప్పుడు కర్ణుడు కృష్ణార్జునులను చంపేస్తాడని దుర్యోధనుడు ఘనంగా నమ్మి ధీమాగా ఉన్నాడు.

భీముడూ క్షేమధూర్తీ, కర్ణుడూ, నకులుడూ, భీముడూ, అశ్వత్థామ, సాత్యకీ విందాను విందులూ, శ్రుతవర్మ చిత్రసేనుడూ, ప్రతివింధ్యుడూ, చిత్రుడూ ఇలా తలపడి యుద్ధం చేస్తారు. కౌరవ పక్షంలోని విందాను విందులూ చిత్రసేనుడూ చిత్రుడు మరణిస్తారు. ధర్మరాజూ దుర్యోధనుడూ ఎదుర్కొన్నారు.

కర్ణుడు నకులుని రథాన్ని విరగ్గొట్టి అతడ్ని చంపకుండా మాత్రం వదిలిపెట్టి అవమానిస్తాడు. "వెళ్ళి అర్జునుని వెనుక దాక్కొను" మంటాడు. నకులుడు ఖిన్నుడై

వెళ్ళి ధర్మరాజు రథమెక్కుతాడు. శకుని కుమారుడు యుయుత్సుణ్ణి ఓడించితే యుయుత్సుడు పారిపోతాడు.

ధర్మరాజు దుర్యోధనుడి రథం విరుగగొట్టాడు. వెంటనే దుర్యోధనుడు అశ్వత్థామ రథమెక్కి పారిపోయినాడు. మళ్ళీ మరొక రథంలో తిరిగివచ్చి ఘోరంగా ధర్మరాజుతో యుద్ధం చేస్తాడు. ధర్మరాజు శక్తినివేసి దుర్యోధనుని మూర్ఛపొందిస్తాడు. వెంటనె కృతవర్మ మధ్యకువచ్చి కల్పించుకొన్నాడు. అర్జునుడు, భీముడు, అశ్వత్థామ వీళ్ళంతా ఈ సంకులమైన సమరంలో చేరి యుద్ధం చేశారు.

కర్ణుడు అప్పటివరకూ సాత్యకితో యుద్ధం చేసిచేసి వచ్చి అర్జునుని చూచి వెంటనె ఎదుర్కొంటాడు. ఇలా నడుస్తున్న సంకుల సమరం సూర్యుడు క్రుంకే వరకూ జరిగింది. అప్పుడు యుద్ధం ఆపేస్తారు.

కర్ణునకు ఒక విషయం తోచింది. అర్జునునకు శ్రీకృష్ణుడంతటివాడు సారథిగా ఉండటంచేత అతడికి తనకన్నా ఎక్కువ అనుకూలత కలిగిస్తోంది. తనకు సమర్థుడైన సారథి ఉండటం అవసరం. అందుకు శల్యుడే తగునని అనుకొన్నాడు. వెంటనె దుర్యోధనుని వద్దకు వెళ్ళి చెప్పి శల్యునందుకు ఒప్పించాలని కర్ణుడూ బయలు దేరి శల్యుని వద్దకు వెళ్తారు.

శల్యుడు దుర్యోధనుడు చేసిన అభ్యర్థనవిని తాను రథికుడై యున్నవాడిని సారథిగా చేయాలనటం తనకు అవమానంకదా అని వాదిస్తాడు. అప్పుడు దుర్యోధనుడు త్రిపురాసుర సంహార సమయంలో శివుడు రథికుడై బ్రహ్మంతటివాడిని సారథిగా చేసికొన్నాడు అని ఆ కథంతా చెప్పుకుంటూ వస్తాడు. ఆ కథేమిటంటే,—

ముగ్గురు అసురులు శమదమాది గుణాలు కలిగి ఉన్నవారై తపస్సుచేసి బ్రహ్మ నుంచి మూడు పురాలు పొంది నిర్భయులై ఆ పురాలతో ప్రపంచాన్ని మోదిస్తూ సర్వులకూ మహాభయాన్ని కలుగజేస్తారు. ఇంద్రాది దేవతలు ఒకరొకరు సంప్రదించుకొని శివుని రథికుడుగా, విశ్వకర్మ నిర్మితమైన [illegible] చక్రాలుగా సముద్రమె దాని అక్షంగా, వేదాలు అశ్వాలుగానేసి [illegible] యుద్ధ సంరంభం చేస్తారు. కాని తగిన సారథి కావాల్సి వచ్చింది. రథికునికంటె సారథి గొప్పవాడై ఉండాలని యోచించి దేవతలు సర్వులూ వెళ్ళి బ్రహ్మను సారథిగా ఉండాల్సిందని ప్రార్థిస్తారు. బ్రహ్మ రథికునికంటె సారథి గొప్పవాడనే

నిజము అంటాడు. అందుచేత కర్ణుడు మీకంటె గొప్పకాదు. మీగొప్పతనం వల్లనె సారధిగా మీరుండివలసిందని కోరుతున్నాము. మీ బుద్ధి చాకచక్యం కారణంగానె శ్రీకృష్ణునితో మీరు సమానులైన కారణంగానే మిమ్ముల్ని మేము సారధిగా నుండ వలసిందని అభ్యర్థిస్తున్నామని ఒప్పిస్తారు.

ఈ కథకు తాత్త్వికమైన అర్థమున్నది :—

జీవుడికి జాగ్రతు, స్వప్నం, సుషుప్తులనే అవస్థలున్నాయి. ఈ మూడు అవస్థలే కథలోని మూడు పురాలు. ఈ మూడు అవస్థల్లోనూ మనసు అనేక విధాలనడచి పోతూ పరిపరి విధాల బాధలు పొందుతూ ఉంటాడు జీవుడు. ఆ మూడు స్థితుల్లోను ఉన్నది తానొక్కడేననేదాన్ని అనుసంధానంచేసి ఆ'నేను' పరమేశ్వరుడేననే బాణంవేసి ఆ పరమేశ్వరునే చూస్తుంటే మూడు పురాలూ సరళరేఖలో చూడటం కలిగి జీవుడు పరమేశ్వరుని పొందగలడని అంతరార్థం.

దుర్యోధనుడింకా శల్యునితో కర్ణుడు హీనకులజుడుకాదు. అలా అయినట్ల యితె అంతటి పరశురాముడు ఇతడికి అన్ని అస్త్రశస్త్రాలను ఈయకనేపోయి ఉండే వాడు—అన్నాడు.

ఒక క్రమానికి శల్యుడు అంటాడు. "ఐతే నాకు వాక్స్వాతంత్ర్యం భావ స్వాతంత్ర్యం ఉన్నదనేది కర్ణుడు ఒప్పుకోవాలి. నాకు తోచిన విధంగా మంచీ చెడూ చెప్తాను. ఆ సందర్భంలో కర్ణుని మెచ్చుకొనకపోవటం కద్దు. కర్ణుడు మాత్రం కోపగించుకోరాదు. ఈ షరతుకు లోబడి సారథ్యానికి ఒప్పుకొంటాను" అన్నాడు.

కర్ణుడు అందుకు ఒప్పుకొంటాడు. ఇక పదిహేడవ రోజు యుద్ధం శల్యుని సారథ్యంతో కర్ణుడు చేస్తాడు.

❋❋

# మహాభారత కథలు

కర్ణ పర్వం – ద్వితీయాశ్వాసం

## 1. శల్య సారథ్యం

పదిహేడో రోజు యుద్ధానికి వెళ్తుండగా దుర్యోధనుడు కర్ణుని అర్థిస్తాడు– "ఎలాగయినా ధర్మరాజును తప్పక పట్టుకోవలసింది. వీరూ వారూ అనేమిటిగాక శత్రువులందరనూ జయించవలసిందే"నంటాడు. కర్ణుడు తన రథాన్ని యుద్ధం వైపుకు తరలింపజేస్తాడు.

అలా వెళ్తూ "ఇవాళ పాండవుల్ని దిగ్భ్రాంతుల్నిగా చేస్తాను" అంటాడు. వెంటనె దగ్గరలోనున్నాడు కనుక, శల్యుడు–"అనంగానే సరికాదు–మహా శౌర్య ధనులైన పాండవుల్ని చులకన చేయటం తప్పు! అర్జునుని గాండీవ నిర్ముక్త నిశిత శరాలూ భీముని గదా ఘాతాలూ వీటివల్ల కలిగే మెఱుపులు కళ్ళు మూయిస్తున్నప్పుడన గలగాలి ఆ మాట–చేతనయితే." అంటాడు.

మనసులో కోపం పొడమినా కర్ణుడు అప్పటికి ఊరుకొని శంఖారావం చేస్తాడు. కౌరవులంతా ఉద్ధృతంగా పొంగి తనకు సహాయంగా జయ శబ్దాలు పలికి నిలుస్తారు. కర్ణుడు మళ్ళీ హుంకరించి, "అర్జునుడు ఏమన్న ద్రోణుణ్ణి మించినవాడేం గాక? నా దగ్గర పరశురాముడిచ్చిన భార్గవాస్త్రమున్నది. అర్జునుణ్ణి నిశ్చయంగా ఇప్పుడు జయించేస్తాను" అంటాడు. శల్యుడు–"అర్జునుడు నీతో ఎన్నిసార్లు యుద్ధం చెయ్యలేదు? అప్పుడెంత అద్భుత విక్రమాన్ని చూపాడు! నీవు పోయి పరాభవమై తిరిగి వచ్చావు కాదా? అంగార పర్ణుని జయించాడు. ఘోష యాత్రప్పుడు చిత్ర సేనుని జయించాడు; ఖాండవ దహనమప్పుడు ఇంద్రుని జయించాడు. వాళ్ళందరి కంటె నువు గొప్పవాడివయితె ఆ కథ వేరు. లేనప్పుడు నీకీ ప్రగల్భం పనికిరాదు." అంటాడు. కర్ణునకు చెప్పరానంత కోపం అసహ్యం వేస్తాయి. కాని అంతా అణచుకొని, "సరె, మేమిద్దరం యుద్ధం చేస్తున్నప్పుడు చూసి మాట్లాడకుండా ఉండ" మ్మంటాడు.

పెద్ద కార్యం చేయబోతూ ఉద్రేకాలు పెంచుకొని ముందే శత్రు నిర్లక్ష్యం చేయ రాదనేది శల్యుని సలహా. అది చెప్పటంలో మాత్రం కర్ణుని అవమానించిన తీరుగా

అర్జునుని భూషిస్తూ మాట్లాడుతాడు శల్యుడు. కర్ణుడు రథికుడై తాను సారధి కావటంలో ఒక పెద్ద ఈర్ష్య శల్యుడికి ఉండి ఉంటుందనిపిస్తుంది. "సింహ్వాం ముందు నక్కతో నీవు సమానమంటాడు. లేడి వంటివాడివంటాడు. ఏనుగ ముందు కుందేలు వంటివాడివంటాడు కర్ణుడు మాత్రం "నీకు గుణం తెలియగలిగిన వివేకమే లేదు. నేను ఈ జయం కోసం అస్త్ర శస్త్రాలను ఎప్పటినుంచో అభ్యసించి పూజిస్తున్నాను. నేను గెలువకపోవటం ఉండదుగాక. ఎంత మంది అర్జునులయితె మాత్రం నాకు లెక్కేమిటి? నా దగ్గర భార్గవాస్త్రమున్నది." అంటూ శల్యుని తూష్ణీం భావంతో త్రోసేస్తాడు. శల్యుడు వదలక "అర్జునుడితో నీవు పోటీ పడటం కాక హంసల పోటీలా ఉంటుంది. ఒక కాకి బలిసి పొగరెక్కి ఒకసారి అది ఉన్న ఊరికి ఒక హంసల సమూహం వస్తె వాటితో తనకు నూరు రకాల నడకలు వచ్చని ప్రగల్భాలు చెప్పి మీకు వచ్చునా అంటుంది. హంస రాదనేటప్పటికి కాకులన్నీ నవ్వుతయి. చివరకు సముద్రం మీదకు ఎవరెంత దూరం పోతాలోననే పోటీ పెట్టుకొంటయి. కొంత దూరం పోంగానే వసంతకాలేసంప్రాప్తే కాకః కాకః పికః పికః అన్నట్లు కాకి క్రిందకు తూలిపోయింది. హంసలు దయ తలచి దానిని నీటిలో మునిగిపోనివ్వక మళ్ళీ తెచ్చి వడ్డున వదులయి. కనుక ఆ కాకిలాగా ముందె ధిక్కరించి మాట్లాడకు" అంటాడు శల్యుడు.

కర్ణుడు శారీరకంగా ఉద్ధృతంగా ఉన్నా మానసికంగా కొన్ని చిక్కులు జ్ఞాపకానికి వచ్చి బాధపడుతున్నాడు. తనకు పరశురాముని శాపం ఉంది. అది మనసు కొచ్చినప్పుడల్లా సతమతమవుతూ ఉంటాడు. పైగా అతడిచ్చిన శాపం "మంత్రం అవసరమైనప్పుడు. నీకు ఉపయోగింపక పోతుందిగాక" అని. అది ఒక పెద్ద అవాంతరమై జడిపిస్తున్నది. ఒక బ్రాహ్మణుని అవుదూడ తన బాణంతో చచ్చిన కారణాన ఆ బ్రాహ్మణుడూ తిట్టాడు-"నీవు ఎవరిని జయించాలనుకుంటావో అతడి చేతనే చంపబడతా"వన్నాడు.-"నీ రథం భూమిలో క్రుంగిపోతుంద"న్నాడు తానెంతో ప్రార్థించాడు ఈ శాపం పరిహరించాల్సిందని. "ఈ పాప ఫలం ఈ జన్మతోసరి" అని మాత్రం అనుగ్రహించాడు జన్మాంతరాన పాపం ఉండదుగనుక- ఇక అదె సుఖమా అనిపించే పరిస్థితి కర్ణున కివ్వుడు. ఆ సుఖం కోసం జన్మ వదిలేయాలనె ఊహ రావటం చిత్రం.

తనకు ధైర్యం చెప్పేవాళ్ళు లేరిప్పుడు. శల్యుడు వ్యతిరేకి అయి మాట్లాడుతున్నాడు. అందుకని కర్ణుడు ఈ శాపాలు రెంటి విషయం బహిరంగంగా కౌరవు

కు చెప్పి 'ఇవి నా కడ్డం రాకపోతే కృష్ణార్జునులైతే మాత్రం నాకు లెక్కా?" అన్నాడు. అలా అనుకంపనకోసం కర్ణుడు తపించిపోయినాడనిపిస్తుంది శల్య సారథ్యం కారణంగా. 'మళ్ళీ అన్నాడు: ఇప్పటికింకా ఆ బ్రహ్మాస్త్ర మంత్రం నాకు జ్ఞాపకంలోనే ఉంది. పోనీ–రథాన్ని అర్జునుని మీదకు" అన్నాడు.

శల్యుడు మళ్ళీ "ఏమో! ఉత్పాతాలెన్నో అవుపడుతున్నాయి" అంటున్నారు. అది వినక యుద్ధరంగంవైపు దృష్టి సారించుతాడు కర్ణుడు.

మహత్కార్యాలు చేసేవారికి తగిన ధైర్యం చెప్పే సహచరుడుండాలి పక్కన. అలాంటి తోడుకోసమె జీవితంలో వివాహమైత్రిన్నీ, యుద్ధ సమయంలో రథికునకు సారథి మైత్రిన్నీ కావాలి!

## 2. కర్ణుని కౌశలం

పదిహేడవరోజు యుద్ధం ఆరంభమయింది. ఈ యుద్ధం అర్జునుడూ కర్ణుడూ మధ్య జరుగుతుందని ఎందరో ఆశించారు. ఆ యుద్ధంలో చచ్చి స్వర్గానికి చేరేవారి నాహ్వానించాలని అప్సరసలు దండలతో ఆకాశంలోనిల్చి ఉన్నారు. కాని అర్జునుడు సంశప్తకులతో యుద్ధంలో ఉండిపోయినాడు. కర్ణుడు ధర్మరాజు [illegible] కొంతసేపు. తరువాత పాంచాలరాజ కుమారులతో యుద్ధం చేసి [illegible] చంపేస్తాడు. పాంచాల రాజులే ఎదుర్కొంటే [illegible] చంపేస్తాడు. కర్ణుడికి సాయంగా తన ముగ్గురు కొడుకులూ యుద్ధం చేస్తున్నారు. ధర్మరాజుతో యుద్ధం చేసి దాని రథసారథిని చంపేస్తాడు. ధర్మరాజు [illegible] కర్ణుడు వెంటపడి నిలిపి అవమానపరుస్తాడు. [illegible] బతక్క చేతగాని యుద్ధంమెందుకు తలపెట్టావంటాడు. [illegible] అర్జునుడి వెనక దాక్కోమంటాడు. కర్ణుడి బాణాలు ధర్మరాజు [illegible] ధర్మరాజు సహదేవుని రథమెక్కి పోతాడు. [illegible] చేస్తాడు. కర్ణుడు వెంటబడుతాడు. బాణాలు [illegible] వేస్తాడు ఎంత 'పోనీలే' అనుకొంటున్నా. [illegible] రాజును చంపితే లాభమేమిటి అనలేదు [illegible] చూపుతాడు. కర్ణుడు ధర్మరాజును వదిలేసి [illegible] ధర్మరాజు శిబిరానికి వెళ్ళి విశ్రాంతి తీసుకొంటాడు.

ఇలా ధర్మరాజునవమానించటం చూస్తూ భీముడు మహాకోపంతో ఊప్పెన వస్తున్నాడు-చంపేస్తాను కర్ణుణ్ణి అంటూ. శల్యుడు చెప్పంగానే కర్ణుడు ఈ భీము ఎదురొచ్చి యుద్ధం చేశాడు. కాని భీముని తీవ్రబాణాలు తగిలి కర్ణుడు మూ పోతాడు. భీముడు వెంటనే వచ్చి వీడినాలుక కోసేస్తాను "ఎన్ని దుష్టపలుకులు వ ద్రౌపదీ వస్త్రాపహరణానికి కారణమయిందో ఈ నాలుక" అంటున్నాడు. అప్పు శల్యుడు యుక్తిగా నీవు వీడి నాలుక ఇప్పుడు కోశావంటె చచ్చి ఊరుకుంటాడ వీడ్ని చంపేస్తానని ప్రతినబట్టిన అర్జునుడి కెంత పరాభవమో యోచించు—అన్నాడ వెంటనే భీముడు కర్ణుని వదలి వెళ్ళిపోతాడు.

కర్ణుడు తిరిగి తెలివి తెచ్చుకోవడానికి కొంత సేపు పట్టింది. ఈలో భీముడు శ్రుతవర్మ శిరస్సు నరికేస్తాడు. రంగస్థలమంతా రక్తమాంసమేదో శిథి వయవాలతో నిండి వాహినై పారింది.

సంశప్తకుల యుద్ధంలో ఉన్న అర్జునుడు వారిపై నాగాస్త్రం వేశాడు. పాము వారి కాళ్ళకు చుట్టుకొని కదలకుండా చేసాయి. అర్జునుడు బాణాలు వేసి మార కాండ సాగిస్తున్నాడు. అప్పుడు సుశర్మ గరుడాస్త్రం వేసి పాముల్ని నశింపచేస్తాడు అర్జునుడు సంశప్తకుల్ని చావగొట్టి చప్పబడ్డ యుద్ధరంగం చూసి రెండో ప్రక్క కర్ణుడు విజృంభించటం శ్రీకృష్ణునకు చూపి "అక్కడకుపోనీ రథాన్ని అంటాడు.

ఈ తెల్ల గుర్రాల రథం వస్తుంటే 'ఓహో! వీరు నరనరాయణులు వస్తున్నా రని ఆకాశం నుంచి సంభాషణలు విన్పడుతున్నయి. అశ్వత్థామ ఇంతలో వచ్చి ఎదుర్కొంటాడు. అశ్వత్థామతో అర్జునుడు చేసిన యుద్ధం విక్రమాన్ని చూపటల్లే దనిపిస్తుంది. అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునునితో "ఏం నీ బాహువుల్లో బలం వెన కాడుతోందా? ఈ బ్రాహ్మణుని నొవ్వచెయ్యరాదని ఊరుకొన్నావా" అంటాడు. అప్పుడు అర్జునుడు అశ్వత్థామ జండా విరగ్గొట్టి రథసారథిని కొట్టి అతడి చేతుల మీద కంఠంమీద కాళ్ళమీద బాణాలు గ్రుచ్చుతాడు. అశ్వత్థామ రథం త్రిప్పుకొని తప్పుకుపోతాడు.

కృపాచార్యుడు శిఖండిని ఓడించి సుకేతుణ్ణి చంపేస్తాడు. కర్ణుడు మూర్ఛ నుంచి తేరి వచ్చింతర్వాత పదిమంది పాంచాలురనూ పదకొండుమంది దొరలనూ చంపుతాడు. దృష్టద్యుమ్నుడు అశ్వత్థామచేత దెబ్బలు తింటాడు. రథం రథసారథీ

పోవటంచేత కత్తీడాలూ తీసికొని యుద్ధం చేస్తూనే ఉంటాడు. ఐనా పాండవ సైన్యాలు వెరగందిపోతున్నాయి.

అర్జునుడూ కర్ణుడూ యుద్ధం చేయలేదన్న మాటేగాని అర్జునుడు కూడ అసంశప్తకులతో పెద్ద యుద్ధం చేశాడు. అలాంటి యుద్ధం అదివరకెన్నడూ చూడలేదని సంజయుడంటాడు. సంశప్తకుల్ని అణచివేసి అర్జునుడు కర్ణుడు విజృంభించిన దిక్కు చూస్తాడు. అక్కడ పాంచాలురు దెబ్బలు తింటున్నారు. అక్కడ ద్రౌపదీ పుత్రులుకూడ ఉన్నారు. అందుకని అక్కడకు రథం పోనీమని శ్రీకృష్ణుని కోరుతాడు. భీముడెక్కడో యుద్ధం చేస్తున్నాడు.

కర్ణుడు సూర్యునిలా వెలుగుతున్నాడు. అర్జునుడు అతడ్ని చూసి అవాక్కయి పోయినాడు. కర్ణుడు భాస్కరాస్త్రం వేశాడు. దానికి విరుగుడు అర్జునుని వద్దలేదు. అది పాండవ సేనను చాలమందిని మట్టుబెట్టింది. ఆ సమయంలో శ్రీకృష్ణుడు ధర్మరాజు రంగభూమిలో కన్పడటల్లేదంటాడు. అర్జునుడు నిస్పృహుడై — "కృష్ణా! ఈ కర్ణుని ఇవాళ జయించడం అసంభవం. మన రథం వెనక్కు మళ్ళించు" అంటాడు. శ్రీకృష్ణుడు భీముని దగ్గరకు రథాన్ని తెచ్చి ధర్మరాజు విషయమడుగుతాడు. భీముడు ఆయనకు దెబ్బలు తగలడంచేత శిబిరానికెళ్ళాడంటాడు. ఆయన్ని చూడాలి అని అర్జునుడన్నప్పుడు భీముడు "నీవుపో. నేనిక్కడ ఈ ప్రక్కా ఆ ప్రక్కా కూడ యుద్ధం చూసుకొంటాను" అంటాడు. అర్జునుని రథం శిబిరానికి వెళుతుంది. కృష్ణార్జునులు ధర్మరాజు శయనించి ఉండటం, వెళ్ళి నమస్కరిస్తారు.

ఇది ద్వితీయాశ్వాసము

# మహాభారత కథలు

## కర్ణ పర్వము – తృతీయాశ్వాసం

## త్రిగుణాల విన్యాసం

ధర్మరాజు కర్ణుని చేత దెబ్బలు తిని, యుద్ధరంగం వదలి శిబిరంలో ఉన్నాడని విని పరామర్శించడానికి అర్జునుడూ కృష్ణుడూ వెళ్లారు. వీరిని చూచి ధర్మరాజు "వీరిద్దరూ ఆ కర్ణుని చంపేసి వచ్చి ఉంటారు" అనుకుంటాడు. తానంటే శరీర శ్రమ తీర్చుకోవడానికి వచ్చాడుగాని కృష్ణార్జునులు యుద్ధరంగం వదలి ఎందుకు వస్తారు? కర్ణుని చంపేసి యుద్ధం పూర్తిచేసి వచ్చి ఉంటారు" అనుకొంటాడు.

వెంటనే వారిద్దరినీ అందుకు పొగడటం ఆరంభిస్తాడు. "అంత పరాక్రమ వైన కర్ణుని మీరుగాక ఎవరు జయించగలిగారు" అంటూ మాట్లాడుతుంటాడు. నిజానికి కర్ణుని మహా విజృంభణాన్ని ఎదుర్కోనడానికి తాను ఒక క్షణాన వెఱచిన సంగతి అర్జునునకు కలత పెట్టుతోంది. ఈ ధర్మరాజు ఆశయం ఫలింపకపోవటం అలా ఉండగా ఆయన ఫలించిందనే పెద్ద నమ్మకంతో వీరిని పొగడటం తలకొట్టుకొన్నంత పనయింది అర్జునునకు.

అప్పుడు అర్జునుడు తాను సంశప్తకులతో పోరాడిన విధం, అర్జునుడిలా యుద్ధం చేస్తుంటే భీముడు కర్ణునీ, దుర్యోధనుని తమ్ముళ్ళనూ చిత్తుగా ఓడించటం సంగతీ పూసగ్రుచ్చి వర్ణించి చెప్తాడు. చివరకు ఇప్పుడు "నిన్ను చూచిపోదామని వచ్చాము మమ్ము పంపాల్సింది. ఆ కర్ణుని చంపేస్తాను" అంటాడు.

కర్ణుడింకా బ్రతికి ఉన్నాడని వినంగానే ధర్మరాజు రెచ్చిపోతాడు. "ఓహో నేనే కర్ణునికి ఓడిపోయాననుకోనక్కర్లేదు. భీమ నకుల సహదేవులుకూడ మునుపు ఓడిపోయారు. ఇప్పుడు నీవు ఓడిపోయివచ్చావు. మనతో కలవడంచేత ఈ శ్రీకృష్ణుడూ ఓడిపోయినాడు. ఇక మనం యుద్ధానికి పోవాల్సిన పనిలేదు. ఎవరి ఇష్టం వచ్చినట్లు వారు వెళ్ళిపోవచ్చు. నీకు చేతకాదని మొదటనె చెప్పినట్లయితె ఈ యుద్ధానికె నేను దిగకపోదునే! కర్ణుని వధిస్తాను యుద్ధంలోనని ప్రతిజ్ఞచేసి నన్నిలా తెచ్చి చెడిచావు. కురు సంఘాన్ని జయిస్తావు నీవని చెప్పిన ఆకాశవాణి కూడ నన్ను వంచించింది. నీవు కర్ణుని చేతులో చావుతప్పి ఇలా వస్తావనుకోలేదు.

అక్కడ భీముడొక్కడే చిత్తశుద్ధితో యుద్ధం చేస్తున్నాడుగాక. ఇవాళ ఆ అభిమన్యుడుగాని ఘటోత్కచుడుగాని బ్రతికియున్నట్లయితె బాగుండేది. ఐనా ఎందుకు ఇలా భయపడివచ్చావు? నీ ప్రక్కన ఈ హరి ఉండగా ఆయన్ను రథికుడుగా చేసి గాండీవం ఇచ్చినట్లయితె కర్ణుని నిముషంలో చంపెయ్యకపోయినాడా?" అంటాడు ధర్మరాజు.

అర్జునుడు దర్పం కలిగినవాడు. గాండీవంమీద మహానమ్మకం, మహాభక్తి. ఆ గాండీవం ఇంకొకరికిచ్చి వేయమంటే భరించలేడు. తన మనసులో అనుకొన్నాడు ఒకప్పుడు-అలా అన్నవాడి తల తీసేస్తానని. ఇప్పుడా ప్రతిజ్ఞ జ్ఞాపకమొచ్చింది. వెంటనే కత్తి తీస్తాడు. శ్రీకృష్ణుడు "ఏమిటేమి"టంటాడు. అర్జునుడు ప్రతిజ్ఞ విషయం చెప్పి ధర్మరాజు తల తీస్తానంటాడు. కాని ధర్మరాజును చంపటం అధర్మమె ఐనా నాకు అసత్యదోషం రాకుండ చెయ్యి- అందుకు ఏం చేయాలో చెప్పు అంటాడు అర్జునుడు శ్రీకృష్ణునితో. అందుకు శ్రీకృష్ణుడు-"నీకు వృద్ధసేవ లేకపోవటంవల్ల ఇదంతా వస్తున్నదయ్యా! అందుకే చేయరాని పనులు చేస్తానంటూ ఉంటావు. అత్యుత్తమ ధర్మాలు రెండున్నాయి. సత్యమూ, అహింస అనేవి అవి. అహింసద్వారా సత్యాన్ని పరిరక్షించటం ముఖ్యం. అసత్యంవల్లనైనాసరె అహింసను రక్షించాలి అంటారు మేధావులు. ధర్మపరుడైన ఈ భ్రాతను చంపటం ధర్మపథం కానేకాదు" ధర్మరాజు మనకు ఏలిక ప్రభువుగా అతడు నిన్నామాటలు అనటమనేది అధర్మమనే వీలులేదు. అందుకు నీవు మాట్లాడక ఊరుకొనుటమే ధర్మం. ఇక నీ ప్రతిజ్ఞ ప్రకారం ఎలా నడవాలనేదానికి చెప్తాను వినవలసింది. ఇతడ్ని దూషించు ముందు. అది అయన తల నరికినంతకు సమానం. ఆ తరువాత ఆయన కాళ్ళమీద పడి క్షమింపుమని వేడుకొను. దానికి ఇదె మార్గం-ఆచారం అందు.

సర్వులూ-మనం సహా-త్రిగుణాత్మకులె, రాగద్వేషాలు స్వార్థ త్యాగాలు పుట్టుతూ పోలుస్తూ ఒకదానినొకటి పోలియజేస్తూ ఉంటాయి. ఇవి ఇలా వెళ్తూ ఉన్నప్పుడె ఇది మంచి అది చెడు అనే సూక్తులు ఉదయిస్తయి. ఒకదానికి మరొకటి శాస్తి. అర్జునునకు కర్ణుడంటె భయం కలిగింది యుద్ధరంగంలో. శ్రీకృష్ణుడు అతడ్ని ధర్మరాజు దగ్గరకు తెచ్చాడు. తిట్లు తిట్టించాడు. అర్జునునకు రోషాన్ని ఎక్కించడానికి. ధర్మరాజు తాను ఓడిపోయి వచ్చిన బాధతో అర్జునుని ఉత్తమం మధ్యం ఎరుగకుండా తిట్టేస్తాడు. అర్జునుడి దర్పం దెబ్బ తింటున్నది. యుద్ధం

చేయాల్సినవాని దర్పందెబ్బ తింటే ఎలా బాగా యుద్ధం చేయగలడు ? ఆ దర్పం పునర్ధరించుకొనడానికి ధర్మరాజు తల నరికేస్తానుగాక—మరి నా ప్రతిజ్ఞ అలా ఉంది కదా అంటాడు అర్జునుడు. రజోగుణం తీవ్రంగా మూర్తిభవించింది వానిలో. కాని ఆ రజోగుణం సోదరునే చంపే స్థితికి పోతె దుఃఖానికి దారితీస్తుంది. భగవంతుడయిన కృష్ణుని ముఖం చూస్తాడు అర్జునుడు. ఆ రజోగుణం శాంతి అయే వరకూ ధర్మరాజును కేవలంతిట్టుమంటాడు శ్రీకృష్ణుడు. రజోగుణం శాంతి అవుతుంది సరె. ఈ తిట్టిన పాపం-ప్రభువుని, అన్నగార్ని తిట్టిన పాపమెలా పోయేది? సత్త్వగుణం తెచ్చుకొని ప్రణిపాతం చేసి మెట్టు నెక్కుదువుగాక అంటాడు శ్రీకృష్ణుడు. అర్జునునికి భగవంతుడు స్నేహితుని రూపంలో సన్నిహితంగా ఉండి ఇలా మహా విషయాలు విడమర్చి చెప్పటం భారతంలో అంతటా మనం గుర్తించటం అవసరమనిపిస్తుంది.

నరునకు నారాయణుడు సర్వవిధాలా స్నేహితుడై ఇలా వానిచుట్టూ స్నేహితుడుగా, గురువుగా భ్రాతగా, తల్లిగా, ధరిత్రిగా ఆకాశంగా ప్రకృతిగా ఉండి పాఠాలు చెప్పటం మనకు అనుభూత కావాలి. అందుకే ఈ కథలు చదవటం చెప్పుకోవటం అనిపిస్తుంది.

అప్పుడు అర్జునుడు ధర్మరాజును దూషిస్తాడు "నీవు యుద్ధం విషయం నాకు చెప్పటం హాస్యాస్పదం. నీకు యుద్ధం చేయటం వస్తుందా ఏమిటి? జూదమంటే అది మమ్ములనందర్నీ అరణ్యాలపాలు చేశావుగాని. వట్టి ప్రల్లదాలు పలికే చెనటివినీవు" అంటాడు. ఇలా అంటూ ఉండంగానే రజోగుణం శాంతి పొందిందై తప్పు చేస్తున్నట్లు అర్జునుడి హృదయం గోలపెట్టుతుంది. ఛీ—ఛీ—ఈ పాడుపని చేసినందుకు చావటం మేలు అని ఆ కత్తితో మెడ నరుక్కుంటానంటాడు. ఆత్మహత్యకు సమానమైనపని మరొకటుంది ఆ పని చేయరాదా అని శ్రీకృష్ణుడంటాడు. ఏమిటంటే—తనను తాను పొగడుకొనటం. అందుకు వీలుగానే ఉంది ఇంకా అర్జునుని రజోగుణం. వెంటనే తన గొప్పలు చెప్పటం ఆరంభిస్తాడు. "నేను రుద్రుడి తరువాత రుద్రుణ్ణి" అంటాడు. ఆపని చేశాను ఈపనిచేశాను ద్రోణుని గెల్చాను ఇలా మాట్లాడుతాడు. ఇన్ని అని ధర్మరాజుకు నమస్కరించి, "అయ్యా నేనేదో కొన్ని మాటలు మాట్లాడాను వాటిని మనసులో ఉంచుకొనవద్దు" అంటాడు. "నీ అధీనంలో నన్ను సంపూర్ణం ఉంచేస్తాను. నీ విప్పుడు పంపు—ఆ కర్ణుని చంపేస్తా" నంటాడు.

ధర్మరాజు కోపగించుకొని "అవును యుద్ధభయం కలిగిన నన్ను రాజుగా చేయడమెందుకు? నేను అరణ్యాలకు వెళ్ళిపోతాను. భీముని రాజుగా చేయాల్సింది" అని ప్రయాణం కట్టుతాడు. అప్పుడు ఆయనకు నమస్కరించి, ఇలా చెప్తాడు.

"ఇప్పుడు అర్జునుడాడిన మాటలన్నీ మనసులోంచీ వచ్చినవికావు. అలా మాట్లాడితేగాని తన తల త్రెంచుకోకుండ ఉండటమనేది జరగదు గనక అలా అన్నాడు. ఇది ఒకానొక ధర్మాన్ని చేసి చూపడానికీ, అలా చూపినందువల్ల తనమనో బుద్ధులు మళ్ళీ ధర్మం మీదకే ప్రసరించడానికీగాను అలా చేయవలసి ఉంటుంది. అలా ధర్మపరంగా నడవబడే యీ త్రిగుణాత్మకమయిన మనోబుద్ధులే పురుషార్థాలను పొందగలిగేది నీవు ధర్మం తెలిసినవాడవు. కనక దీనికి దుఃఖపడవద్దు" అంటాడు శ్రీకృష్ణుడు.

ధర్మరాజు "మహానుభావా! నిజమైన విషయం ఎంతసూక్ష్మంగా ప్రపంచంలో మనుష్యుల మేధల్లోకి రాకుండానే జారిపోతుంది! నేను ఈ ధర్మాన్ని గ్రహింపలేక ఎన్నో తిట్టాను. నాకు తగినట్లు బోధింపగలిగిన అనఘమూర్తివి నీవు అనుగ్రహించావు." అంటాడు.

అర్జునుడు ధర్మరాజు పాదాలమీద ఇవ్వరుపడి క్షమాపణ వేడుకొంటాడు. సత్త్వగుణావిద్ధుడైన ధర్మరాజునకు సాత్వికుడే అయిన అర్జునుడు ప్రణమిల్లినాడు. అర్జునుడు లేచిన తరువాత "ఇదంతా ఆ కర్ణునివల్ల కలిగింది. వాణ్ణి చంపితీరాలి" అనే ఊపు తెచ్చుకొంటాడు. దీనికోసమె ఈ శిబిరాలవైపునకు అర్జునుని తెచ్చాడు శ్రీకృష్ణుడు. అర్జునుడు శ్రీకృష్ణుని భగవంతునిగా జ్ఞాపకం తెచ్చుకొని, "కర్ణుడు చావాలి" అనే ఆలోచనను నీవు చేయాల్సింది అని ప్రార్థిస్తాడు. శ్రీకృష్ణుడు,-ఓహా నీవు కాక ఇంకెవరు చంపుతారు కర్ణుని. ఆ పని తప్పక చేయగలుగుతావుగాక-ముందు ధర్మరాజు ఆశీర్వచనాలు తీసికొని బయలుదేరు మంటాడు. వెంటనే అర్జునుడు ధర్మరాజుకు నమస్కరిస్తాడు. ఆయన ఆశీర్వదిస్తాడు. వెంటనె బయలుదేరి కృష్ణార్జునులు యుద్ధ రంగానికి వెళ్తారు.

దోవలో శ్రీకృష్ణుడు అర్జునునకు ఒకప్రక్క ధైర్యం చెప్తాడు. కర్ణుని నీవే జయిస్తావని. మరొక ప్రక్క జ్యోతిషం చెపుతాడు కృపాశ్వత్థామలుకూడ నీచేత జయింపబడతారని. వాళ్ళు ఏకో బంధువుగదా అని మాత్రం నీవు ఉపేక్ష చేయ

వద్దంటాడు. ఇన్నాళ్ళూ కర్ణుడు జయింపబడని కారణం కురుసేనా సంఖ్యా బలం తగ్గించుతూ ఉండటమె అంటాడు. నీకంటె మగవాళ్ళిక్కడెవరూ లేరంటాడు భీముడుకూడ నీ అస్త్ర బలాన్ని సహాయంగా చూసుకొనే యుద్ధం చేస్తున్నాడంటాడు శల్యుడు మేనమామ అయితే మాత్రమేమిగాక. పరులతో కలిసి పరాక్రమిస్తున్న వాణ్ణి చంపెయ్యాల్సిందే నంటాడు. కర్ణుడు గదా మీరు లక్కయింట్లో ప్రమాదాన్ని తప్పించుకొనడానికీ నానా అవస్థలు పడవలసి వచ్చిందానికి కారణం! అంటాడు. రాయబార సమయంలో ఈ కర్ణుడు నన్నే బంధించేయాలని చూశాడుగదయ్యా! అంటాడు.

ఇంతటి పౌరుష ప్రబోధనల పరమాత్మ అయిన కృష్ణుడు అర్జునునకు ఎక్కించటం చూస్తే కళ్ళు చెమ్మగిల్లుతవి. అదివరకూ ఉన్నయి-గాండీవం అక్షయ తూణీరాలు, అర్జునుని ధైర్యసాహసాలూ, ఇప్పుడూ ఉన్నయి. అప్పటి వాటి బలంవేరు. ఇప్పటి నీటి బలానికి అవి దిగదుడుపు అనిపిస్తుంది. ఎంతటి శరీరం ఉన్నా లోపలి నుంచీ ఈ ప్రబోధాత్మకమైన విజృంభమాణ శక్తి ఉంటేనేతప్ప లేకపోతె అలా క్రిందకు దిగవడిపోతుందా శరీరం? "గాండీవంస్రంసతేహస్తాత్" అనే స్థితికి దిగజారుతుంది అనేది గమనీయం.

అక్కడ భీముడు ప్రచండ యుద్ధంచేస్తూ ధర్మరాజును చూడటానికి వెళ్ళిన అర్జునుడు రాలేదేమా అనీ ధర్మరాజు చాల బాధపడున్నాడేమోననీ, అర్జునుడుకూడ వెళ్ళి తిరిగి రాలేనంత ప్రమాదంలో ఉన్నట్లయితె ఇక్కడ ఈ కౌరవుల్ని జయించి మాత్రం ప్రయోజనమేమిటి అనీ అనుకొంటూ ఉంటాడు. ఇంతలో కౌరవ సేనలు కలగుండుపడి తప్పుకొని పారటం చూస్తాడు భీముడు దూరాన. అది ఏమిటంటాడు. తనుగాక ఇంకా అక్కడ తమ తరఫున అంత యుద్ధం చేస్తున్నవాళ్ళెవరంటాడు. కేవలం కృష్ణార్జునులను చూసి కౌరవ సైన్యం పారిపోవటం తెలిసి మహా సంతోషాన్ని పొందుతాడు భీముడు.

## 2. కర్ణవధ

ధర్మరాజును గూర్చిన చింత వదుల్తుందప్పుడు భీముని మనసునుంచీ. మళ్ళీ యుద్ధాన్ని విజృంభింపజేసి పగతురులను కొట్టుతూ ఉంటాడు. ఈ యుద్ధంలో శకుని మూర్ఛపోతాడు కర్ణుడు వస్తాడు. భీముడు శిఖండి ద్రౌపదీ కుమారులు అంతా ఎదు

ర్కొంటారు. ఈలోగా అర్జునుడువచ్చి భీమునకు ధర్మరాజు కుశల విషయం చెప్తాడు.

భీముని దుశ్శాసనుడు ఎదుర్కొంటాడు. బాణాలు వేస్తూనే భీముడు ఆసభలో చేసిన ప్రతిజ్ఞ ఇవాళ తీర్చుకొంటాను అంటాడు. అప్పుడలాటి పనిచేశావు-ఇప్పుడి లాటి పనిచేశావు అని ఎన్నో సంగతులు జ్ఞాపకం చేస్తాడు. ఇలా చెప్తున్నంతలోనే దుశ్శాసనుడు భీముని రధాశ్వాలను చంపేస్తాడు. ఈపని తన కర్మ కొద్దీ చేశాడని పిస్తుంది. భీముడు అప్పుడు రథందిగి గద తీసుకొని బయలుదేరుతాడు. దాంతో దుశ్శాసనుడి రధసారధిని రధాన్ని నుగ్గుచేసి దుశ్శాసనుణ్ని కొట్టి నేలపడేస్తాడు. వెంటనే వానిమెడమీద తనకాలు పెట్టి "దిక్కున్నచోట చెప్పుకో ఇప్పుడే నీ గుండె చీల్చి నెత్తురు తాగుతా" నంటాడు. చచ్చినవాని హృదయంలోని రక్తాన్ని ముఖాన జల్లుకొని మహాభీకర రూపంతో అట్టహాసంచేసి ఆనందిస్తాడు. కౌరవసేన కిమిన్నాస్తిగా నిల్చింది క్షణంపాటు.

ఈ దారుణాన్నిచూసి కౌరవుల నూర్గురిలో పదిమందివచ్చి భీముని ఎదుర్కొని ప్రాణాలు వదిలేస్తారు. కర్ణుడు ఇది చూస్తూ వెలవెల బారిన ముఖాన్ని వ్రేల వేసి ఊరుకొంటాడు. శల్యుడు గుర్తుచేస్తే అప్పుడు భీమునితో తలపడుతున్న వృషసేనునికి సాయంగా వెళ్తాడు కర్ణుడు. ఇంతలో ఇరుపక్షాలవారు ఎంతోమంది వచ్చి తమ తమ వారికి సాయం చేస్తుంటారు. అర్జునుడుకూడ విజృంభించి యుద్ధం చేస్తున్నాడు. వృషసేనుడికీ అర్జునుడికీ పోరు ఘోరమవుతుంది. అర్జునుడు వృషసేనుని తలకాయను తెగవేస్తాడు. వృషసేనుడు కర్ణుని కుమారుడే. ఇలా అర్జునుడు ఆ పసివానిని చంపటం కళ్ళారా చూసిన కర్ణుడు ఉద్రేకుడై అర్జునుని పిల్చి యుద్ధం ఆరంభిస్తాడు. వీరిద్దరి యుద్ధంకోసం అప్పటి ప్రజల్లో ప్రతి ఒక్కరూ ఆత్రుతతో ఎదురుచూస్తున్నారు ఎన్నాళ్ళనుంచో. ప్రజలేకాదు బ్రహ్మరుద్రేంద్రాదులుకూడ ఎదురు చూస్తున్నారు. ఆకాశంలోనిల్చి నిలింపులు ఈ సంగతులు మాట్లాడుకొంటున్నారు కూడాను.

ఇద్దరూ అతిరథులు, సమయస్ఫురణులు, విక్రాంతిపరులు. సూరులు. వీరు ఒకరితో ఒకరు పోరాడటంవల్ల ఈ జగత్తే పోతుందేమొ అసలె నశ్వరమైందిగదా ఈ జగత్తు అంటాడు బ్రహ్మ. యుద్ధం జరిగి తీరుతుందిగాక ఆగుతుందా అంటాడు రుద్రుడు. ఇంద్రుడు నరనారాయణులను శత్రువులు గెలువకూడదుగాక. అది ప్రపంచాలకు శ్రేయస్సు కాదు. అందుకని నారాయణులె గెలిచేటట్లుగా సంకల్పించాల్సిందని ప్రార్థి

స్తాడు. రుద్రుడూ బ్రహ్మకూడ అవును వారు గెలవడమే దేశ శ్రేయస్సుకు ఆధారం వాళ్ళేగెలవాలిగాక అంటారు. ఇంద్రుడు ఈ మాటలను బిగ్గరగా అందరకూ చెప్పి అందరు దేవతలనూ అలాగే తలచి సంకల్పింపవలసిందని అడుగుతాడు! దేవతలు పుష్పవర్షాన్ని కురిపిస్తారు.

కర్ణార్జునులు ఎదురుపడి ఒకరినొకరు తీవ్ర దృక్కులతో చూసుకొంటారు. శల్యుడూ కృష్ణుడూ చూచుకొంటారు. వాళ్ళ వాళ్ళ కేతనాలమీదనున్న ఏనుగూ కపీశ్వరులుకూడ చూచుకొంటారు. శల్యకర్ణులకు చిత్త దౌర్బల్యం కలిగిందట. ఆ సమయాన కర్ణుడు శల్యునితో, అర్జునుడు తనను చంపేస్తే ఏంచేస్తావని అడుగుతాడు. అందుకు శల్యుడు ఈ కృష్ణార్జునుల్ని కట్టి నిర్జిస్తానంటాడు. అర్జునుడుకూడ శ్రీకృష్ణుని అలాగే అడిగితే, శ్రీకృష్ణుడు, కర్ణుడు నిన్ను జయించడం అసంభవం. అయినా నేను చెప్తాను ఆ సమయమెవస్తే లోకాలే అంతం చేస్తాను. ముందు కౌరవుల్ని మట్టుబెట్టి ధర్మరాజుకు పట్టంగట్టి ఊరుకొంటాను అంటాడు.

వీరి యుద్ధం విలోకిస్తూ అంతా వేచి ఉంటారు. దుర్యోధనునివద్దకు అశ్వత్థామవచ్చి—

"భీష్ముడూ ద్రోణుడూ అంతటివాళ్ళె అర్జునునిచేత ఓడింపబడ్డారు. ఈ అంగరాజు అర్జునుడిని గెలుస్తాడా? యుద్ధం చేయడం నీకె నష్టంగా అవుపిస్తోంది. నీవు చెప్పినట్లయితె కర్ణుడు యుద్ధం ఆపుతాడు. నీవు అతడిచే ఆపని చేయించు. ధర్మరాజుతో తగినట్లు మాట్లాడితె వింటాడు. శ్రీకృష్ణుడు కూడ తెలివి తెచ్చుకొంటాడప్పుడు. ధర్మరాజు చెప్తే భీముడూ నకుల సహదేవులూకూడ వింటారుగాక.

ఒకవేళ నేనూ కృపుడు చావులేనివాళ్ళంగదా అనీ-అర్జునుని గెలుస్తామని నీవు ఉద్దేశపడుతున్నావేమొ-ఆమాటకొస్తే భీష్ముడూ ద్రోణుడూ అవధ్యులని మనమెరుగమా. శ్రీకృష్ణుడసేవాని కారణంగా అణగిపోయినారా? లేదా! ఈ కారణాలవల్ల నీవు ఇప్పటికయినా సంధి చేయటం అవసరమనిపిస్తున్నది. శ్రీకృష్ణుని రాయబార సమయంలో అవమానం చేశామనె శంక నీవు పెట్టుకొనకు. ధృతరాష్ట్రుడు రాజుగాయీ సంధి చేయవచ్చు. ధర్మరాజుకూడ దానికి సమ్మతిస్తాడు. అలాచేస్తే నీవు బ్రతికి ఉండడమనేది ఉంటుంది. ఈ సంధికి నీవు ఒప్పుకోవటం ఇెం్స." అంటాడు.

దుర్యోధనుడు ఒప్పుకోకుండా, ఇప్పుడేగా భీముడు, దుశ్శాసనుడిని చంపడము య్యింది! ఇక దుర్యోధనుడే మిగిలాడు, వాడ్ని చంపి తీరుతానని అంటున్నాడుగా-

ఎలా అవుతుందయ్యా సంధి పిచ్చి బ్రాహ్మడా అంటాడు. అదుగో చూడు ఇన్నాళ్ళ యుద్ధంలో శ్రమపడిపో ఉన్నవాడు అర్జునుడు. మంచి ఉత్సాహంగా ఉన్నవాడు కర్ణుడు. అర్జునుడు కర్ణునేం చంపగలడుగనుక?' అని వెళ్ళిపోతాడు దుర్యోధనుడు.

కర్ణార్జునులమధ్య యుద్ధం రెండు ఏనుగులమధ్య పోరాటంగా రెండు పర్వతాలమధ్య పోరాటంగా చెన్నొందింది. ఒకరిమీద ఒకరు దివ్యాస్త్రాలు వేసికొంటారు. ఇంద్రబాణంతోసహా అన్ని అస్త్రాలనూ అర్జునుడు ప్రయోగిస్తాడు. శ్రీకృష్ణుడు అర్జునునకు ఉత్సాహం ఎక్కిస్తునే ఉన్నాడు. ఖాండవదహనం ఎంత చాకచక్యంగా చేయించావో అలా ఈ కర్ణుని నరికివేయవయ్యా! తప్పుకుపోయినాడంటే ఇక మనకు దొరకడు. అతడ్ని వధించటం మనతరంకాదుగాక. చక్రం ఇస్తాను అదివేసి వాణ్ణి చంపుమంటాడు.

అప్పుడు అర్జునుడు నవ్వి, బ్రహ్మాస్త్ర ప్రయోగం చేస్తాడు. దానికి ప్రతిగా కర్ణుడుకూడ బ్రహ్మాస్త్రమే ప్రయోగిస్తాడు. అర్జునుడు వేసే బాణాలు అంతూ పొంతూ లేకుండా సూర్యరశ్మికి అడ్డుగావస్తూ చీకటినే కలిగిస్తున్నాయి. దుర్యోధనుడు తన వాళ్ళనందరనూ ఉరికి యుద్ధం చేయండంటాడు.

ఆ సమయంలో అశ్వసేనుడనే ఒకానొక నాగకుమారుడు అర్జునుని చంపడానికిగాను సర్పశిలీముఖమనే ఒక బాణంగా అయి కర్ణునాశ్రయించి ఉన్నాడు ఎప్పటి నుంచో. ఆ సర్పశిలీముఖ బాణాన్ని ఇన్నాళ్లూ కర్ణుడు గంధ పుష్పాలలో ప్రతిరోజూ పూజిస్తున్నాడు. దాని సంగతి ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది కర్ణునకు. అది అనుసంధానం చేస్తాడు. శల్యుడు ఆ బాణాను సంధానంచూసి, మెడకు సరిగా అమర్చి మరీ వదులు బాణం అంటాడు. కర్ణుడు, 'ఛీ' 'నాకంటే నీకు ఎక్కువ తెలుసా' అని బాణం వదలుతాడు. మంటలతో వచ్చే ఆ బాణాన్ని శ్రీకృష్ణుడుచూచి, అర్జునుని రథాన్ని ఐదంగుళాలు క్రిందికి వంగేటట్లు నొక్కుతాడు. ఆ బాణం సర్రున వెళ్ళి అర్జునుని కిరీటాన్ని పడగొట్టి దూరం వెళ్ళిపోతుంది. పరమేశ్వరుడు నరుడ్ని ఆ విధంగా రక్షించుకొన్నాడు. ఇంద్రదత్తమైన కిరీటం ఒక్కచే క్రింద పడిపోయింది. దేవతలు ఆశ్చర్యపోతారు. చప్పట్లుకొట్టుతారు.

కాని ఆ బాణం తిరిగి వెనక్కు వస్తోంది అర్జునుడ్ని చంపడానికి. అదిచూసి శ్రీకృష్ణుడు అపాము ఖాండవ దహన సమయంలో తప్పించుకొని పోయిన అశ్వసేనుడని చెప్తాడు. అర్జునుడు దానిని బాణాలతో చంపేస్తాడు. అర్జునుడు కర్ణుని పునః

ప్రకటితమయిన ఉత్సాహంతో కొట్టుతూ ఉంటాడు. కర్ణుని శరీరం మందార పువ్వులా అయిపోయింది.

కాలం సమీపించింది. కాలుడనేవాడు ఇక ఈ కర్ణుడు చనిపోతున్నాడ అని అంటున్నట్లైఉంది. కర్ణునకు భార్గవాస్త్రం జ్ఞాపకంలోకి రావటల్లేదు. పరశ రాముడి శాపఫలం ఆరంభించింది. బ్రాహ్మణ శాపంవల్ల రథం భూమిలోనికి క్రుంగి పోయింది.

కర్ణుడు అప్పుడు అనుకొంటాడు—"నేను అతులధర్మశీలుడిని. ధర్మతత్వ ప్రధానచిత్తులయిన వాళ్ళను ధర్మమే రక్షిస్తుందంటారు. నన్ను మాత్రం ఇలాంటి అన్యాయంలోకి ఎందుకు తోస్తోంది ధర్మువు." ఇలా ధర్మాన్నే తిట్టటం ఆరంభిస్తాడు. కష్టాల్లో ఉన్నవాళ్ళకు తాము ధర్మప్రకారమె నడుచుకొంటున్నట్లు అనిపించటంకద్దు. వారు ఒకానొక ధర్మాన్ని పట్టుకొని నడిపిస్తూ తాము చాల ధర్మపరులమనుకొంటారు. కర్ణుడు స్నేహధర్మాన్ని పవిత్రంగా పాటిస్తున్నవాడు. శ్రీకృష్ణుడూ కుంతీకూడ వచ్చి తనకు మహాసామ్రాజ్యాధికారమిస్తానన్నప్పటికీ, స్నేహధర్మాన్ని వదలక పట్టుకొని ఉన్నవాడు—అతడు అలా అనుకోవటంలో ఆశ్చర్యంలేదు.

రథం క్రుంగటంవల్ల రథచలనం తప్పిపోయింది. ఐనా కర్ణుడు మాత్రం అర్జునుని బాణాలకు ప్రతిబాణాలు వేస్తూనే ఉన్నాడు. వళ్ళు మాత్రం తూట్లుపడుత న్నది. ఇక తట్టుకోలేక కర్ణుడు బ్రాహ్మాస్త్రాన్ని వదలుతాడు. దానికి ఎదురుగా అర్జునుడు ఇంద్రాస్త్రాన్ని వదలుతాడు. కాని బ్రహ్మాస్త్రం వల్ల ఐంద్రాస్త్రం విధ్వంస మవుతుంది. అప్పుడు అర్జునుడు తిరిగి బ్రహ్మాస్త్రాన్నే ప్రయోగిస్తాడు దాన్నివారించ డానికి.

కర్ణుడు మరొక మహాస్త్రం వేయబోతుంటే తన రథచక్రం చాలభాగం భూమిలో కూరుకొనిపోవటంచేత అస్త్రవిన్యాసానికి అనుకూలంలేక క్రిందికిదిగి రథాన్ని ఉద్ధరించడానికి ఉపక్రమిస్తాడు. అప్పుడు అర్జునునితో "బాణాలు వేయటం ఆపాల్సింది. అది నీకు ధర్మం: ఉత్తమ కులజుడవునువ్వు. నేను రథాన్ని ఉద్ధరించి అప్పుడు నీతో యుద్ధం చేస్తాను. నిన్ను ప్రార్థిస్తున్నాననుకొనకు. ఓటమి అంగీకరి స్తున్నాననుకొనకు. నీవంటే నాకేమాత్రం భయంలేదు. నీధర్మం నీకు చెప్పానుగాక" అంటాడు.

ఎంత చిత్రమై వర్తిస్తుంది ప్రపంచ తత్త్వం. నేను రథం ఎత్తుకొనేవరకూ ఈ విల్లు అవతల పెట్టుతాను గనుక యుద్ధం మానుమనలేదు. అలా అన్నట్లయితె ఎలా ఉండేదో. నీవంటే నాకు భయంలేదుగాక నీ"ధర్మం" పాటించు అని ఏదో సూక్తి చెప్పటంతో శ్రీకృష్ణుడు కల్పించుకొని,—

"ధర్మం ఇప్పుడు జ్ఞాపకానికి వచ్చిందా? నీ దురభిమానం గర్వం ఎక్కడకు పోయినాయి. వాటివల్లకాదూ ఈ యుద్ధం సంక్రమించింది? లక్కయిల్లు కాల్పించినపుడు, కపటజూదం ఆడినపుడు, ద్రౌపదిని భంగపరచినపుడు, ఘోషయాత్ర రూపంతో వెళ్ళి పాండవులను చంపేయాలనుకొన్నప్పుడు ఈ "ధర్మం" అనే సంగతి ఒకటున్నదని గుర్తుకురాలేదా. అంటాడు. ఈ మాటలతో అర్జునుడి మనసు ఉడికిపోతున్నది. బాణాలు వేస్తూనే ఉన్నాడు. కర్ణుడు వాటిని వారించుకొంటూనే యుద్ధం చేస్తున్నాడు. రథాన్ని భుజంతో ఎత్తిపెట్టనే పెట్టాడు. భూమితోసహా రథం పైకి లేచిందప్పుడు. మళ్ళీ రథం ఎక్కి తాను సంధించాలనుకొనే విషభూయిష్టమయిన బాణాన్ని సంధించాడు కర్ణుడు, అర్జునుడు అప్పుడు ఒక మహాస్త్రాన్ని సంధించి,—

ఏను తపశ్చరణంబున, దానంబున, గురుజనాళితర్పణమున ని

త్యానూన వ్రతశీలుడ నేనియు గర్ణుతలద్రెంచు నీ శరమనియెన్

వదలివేశాడు బాణం. అదివెళ్ళి కర్ణుని శిరస్సును తరిగి రక్తం దోగుతుంటే శరీరం మహా పర్వతంలా ఆ రథంమ్మీదపడిపోయేట్లు చేస్తుంది. అప్పుడు అతని శరీరం నుంచీ ఒక మహాతేజస్సు సర్వులూ చూస్తుండగానే పైకివెళ్ళి సూర్యునిలో కలుస్తుంది.

ద్రోణుని తేజస్సు పరమపదాన్ని పొందటం సంజయుడు, కృష్ణార్జునులు మొదలయిన కొందరకే అవుపడినది. కాని కర్ణుని తేజస్సు సూర్యునిలో కలవటం సర్వులూ చూశారు.

కర్ణుడు చచ్చిపోయినాడని చెప్పుకొని పాంచాలురు మహా సంతోషంతో అరుస్తారు. శల్యుడు కర్ణుని కేతనం తీసేసి రథాన్ని వెనక్కు తోలుకొని వెళ్ళిపోతాడు. కౌరవసేన వెరగుపడి పారిపోతోంది. ఇలా ఉండటం ఎక్కణ్ణుంచో చూస్తాడు భీముడు. ఎంతో సంతోషంతో 'భో'మని అరుస్తాడు.

శల్యుడు దుర్యోధనుని వద్దకు వెళ్ళి అతడిని పరామర్శిస్తాడు. "మహాబలులైన మనవాళ్ళు పోట్లాడారు. యమవరుణ కుబేరులులా పోట్లాడారు. వాళ్ళు గెలువవలసినదె-కార్యకారణ సంబంధరీత్యా. మరి అది అలా జరగలేదు. పాండవులు గెల్చారు. ఇది విధికృతమనాలి. ఇంకో కారణంలేదు. ఇదుగో ఈ శరీరాలు ఎన్ని అలా యుద్ధానికి ఆహుతయిపోయినవో చూడాల్సింది." ఆ సమయంలోనే కృష్ణార్జునుల శంఖనాదాలు భయంకరంగా వినవస్తవి. దుర్యోధనుని వద్దనున్న సైన్యంకూడ ఆ శబ్దానికి హడలి పారిపోతారు.

అప్పటికి సూర్యుడు హస్తాద్రికి చేరుతాడు. దుఃఖశోకాలతో కౌరవులు తమ శిబిరాలకు వెళ్తుంటే, పూర్వం పాండవులు అరణ్యాలకు పోయే సమయంలోని దుఃఖశోకాలు ఇవేకదా అన్నట్లు ఉన్నది.

కృష్ణార్జునులూ తదితర పాండవులూ మహాసంతోషంతో శిబిరాలకు వెళ్ళి ధర్మరాజును అభినందిస్తారు. శ్రీకృష్ణుడు ధర్మరాజుతో "రాజా నీకు కర్ణునిపై క్రోధం జనించిన క్షణాన కర్ణుడు చనిపోయినాడనుకో? ఎలా బ్రతుకగలడు" అంటాడు. కాని సర్వధర్మపరుడైన ధర్మరాజు శ్రీకృష్ణునితో, అతడిని భగవంతునిగానే భావించి, "నీవు చక్కగ జూచిన సులభంబు, శోభనము, శ్రీధన-నీదగు కూర్మికేను భాజనమటె నాకు దుష్కరమె శత్రుజయంబు భవత్ప్రసాద జీవనులము" అంటాడు. ఈ 'ఎఱుక' ఎల్లప్పుడు కలిగినవాడౌటచేతనే ధర్మరాజు ధర్మపరుడవడానికి కారణమయింది. కృష్ణుడు మాత్రం యీ జయానికి తాను నిమిత్తమాత్రుడనీ పాండుపుత్రులు, సైన్యం, బావమఱుదులూ అందరూ అసలైన కారణమనీ అంటాడు.

ఎవరు నిమిత్త మాత్రులు ఎవరు అసలైన కారణులు అనేది ఎవరికివారు ఎప్పటికప్పుడు వితర్కించుకొని ఎఱుక చేయవలసిన అవసరం ప్రతివ్యక్తికీ ఉంది. నేను చేశానుగనుక ఈ ఫలితం ఇలా వస్తుందనీ, వచ్చిందనీ అనడానికిలేదు. ఇలా ఫలం వచ్చింది గనక అలా చేయడం కలిగిందనాలనిపిస్తుందిప్పుడు. కార్యం ముందూ కారణం వెనుకా అవుతుందా కారణం ముందూ కార్యం వెనుకా అవుతుందా? విద్వేషాలు కలిగి పాండవ కౌరవులు యుద్ధంచేసి చచ్చారా? లేదా ఇలా జనక్షయం కావడానికే యీ యుద్ధం వచ్చిందా అనే ప్రశ్నలకు భారత కథలు పూర్తయేంత వరకూ ఆలోచించి తెలుసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. మనం ఆఫీసుకు వెళ్ళి పనిచేస్తాము కనక ఆఫీసు నడుస్తోందా? ఆఫీసు నడుస్తుంటుంది గనక మనం

వెళ్ళి పనిచేయాలా? ఏది నిజం. ఇది తెమిలేదెప్పుడు? ప్రపంచాన్ని తెలియాలి. భారతకథ ప్రపంచపుకథె అని తెలుసుకొంటుంటే ఆ ప్రశ్నలకుకూడ సమాధానం దొరక్కపోదు. విత్తుముందా చెట్టుముందా అనేదానికి సరియైన సమాధానం మనసుకు నచ్చేటట్లు తెలియకపోదు.

## 3. అసమగ్రయోగ విలీనం

కర్ణుడు అసమగ్రమైన యోగానికి ప్రతీకగా వ్యాసుడు చెప్తూ వచ్చారు. యోగం అనేది సంపూర్ణమైన మోక్షాన్ని జ్ఞానం లేకుండా ఇవ్వగలిగిందికాదు. పైగా సాత్త్విక వృత్తులకెదురుగా కర్ణుడుండటంచేత అతడు అసమగ్రయోగానికె ప్రతీక. అసమగ్రయోగంవల్ల తత్కాలానికి కుంభకంలో శాంతి కలిగినా ఆ తరువాత భూసంబంధమైన వాసనలు వచ్చిపడుతవి. వాటిని జ్ఞానంతోనేగాని ఇతర విధంగా తొలగించటం అనేది కుదరదు. భూమి కృంగిపోయిందంటె అర్థం అసమగ్ర యోగంలో సాధకుడు భూసంబంధమైన వాసనలలో కూరుకుపోయి ఇక లేవజాల డని వ్యాసునిబోధ. అర్జునునితో శ్రీకృష్ణుడు "వెయ్యి బాణం వానిమీద" అని చెప్పి నాడంటె నిర్వృతి తత్త్వం ఋజు తత్త్వాన్ని జ్ఞానమనె బాణంతోకొట్టి సాధకునికి జ్ఞాన సంపర్కం కలిగింపుమని చెప్పటమె. అర్జునుడు అలాకొట్టి అసమగ్రయోగ తత్త్వాన్ని సమగ్ర జ్ఞానంలో విలీనం చేసికొన్నాడు. సాధకుడు ఈ యీ చిక్కు ల్లోంచి అలా సమగ్ర జ్ఞానంతోనే తన్ను తాను ఉద్ధరించుకోవాల్సి ఉన్నదని బోధ.

ఇది కర్ణపర్వం

# మహాభారత కథలు

(శల్య పర్వము – ప్రథమాశ్వాసం)

## 1. చివరి రోజు యుద్ధం - శల్యు వధ

పదిహేడో రోజు రాత్రి సంజయుడు వెళ్ళి ధృతరాష్ట్రునితో, కర్ణుడు చని పోయినకథా వియషం చెప్పి పద్దెనిమిదోనాడు తెల్లవారకముందె తిరిగి వెళ్ళి యుద్ధ రంగం ప్రవేశిస్తాడు. మళ్ళీ 18వ రోజు రాత్రి ధృతరాష్ట్రుని వద్దకువెళ్ళి, ఏడ్పు రవంతో–"శల్యుడూ, శకునీ, ఉలూకుడూ, సంశప్తకులందరూ, సైన్యమంతానూ చనిపోయినార"నీ దుర్యోధనుని తొడలు భీముడు విరగకొట్టాడనీ చెప్తాడు.

అంతఃపురములోని వారంతా అదివిని శోకసముద్రంలో మునిగిపోతారు. గాంధారి కోడండ్రను పట్టుకొని యేడుస్తుంది. ధృతరాష్ట్రుడు మూర్ఛపోయి శీతలోప చారాలు చేసినమీదటలేచి, దుఃఖించి, అందరనూ వారి ఇండ్లకు వెళ్ళవలసినిదం పంపి, సవిస్తరంగా జరిగిన సంగతి చెప్పవలసిందని సంజయుని అడుగుతాడు.

అప్పుడు సంజయు చెప్తాడు.

పదిహేడోరోజు రాత్రి బహిరంగ ప్రదేశంలో కౌరవులు సమావేశమై ఉండంగా కృపాచార్యుడు దుర్యోధనునికి కర్తవ్యాన్ని బోధిస్తాడు. "భీష్మ ద్రోణా శ్వత్థామాది మహామహుల సహాయంతో యుద్ధంచేసి భీష్మద్రోణుల్ని చంపుకొన్నాము. ఇప్పుడు కర్ణుడుకూడ చచ్చాడు. పాండవులు మహాబలులై ఉత్సాహంతో ఉన్నారు. రాజులకు సంగ్రామం సాధారణంగా కర్ణమె అయినా, ఇలాంటి పరిస్థితుల్లో సంధి మేలు. మహారాజయిన నీవు చావు తప్పించుకొనటం అవసరం. శ్రీకృష్ణుడు భగవా నుడె అయిన కారణాన పాండవుల్ని రక్షణ చేయకలుగుతున్నాడు. మనం సంధిచేసి కొని–ప్రాణ రక్షణచేసికోవటం ఉత్తమ"మని, కృపాచార్యుడు దుర్యోధనునకు చెప్తాడు.

అందుకు దుర్యోధనుడు "నీవిచ్చిన సందేశము యెంతో మేలుకలగడానికి చెప్పిందె–కాని, నాకు అదె రుచించటల్లేదు. పాండవులకు యెన్నో యెగ్గులు కలిగిం చానునేను. ఇప్పుడు పొందుకావాలంటె అది కలుగుతుందా? ఇప్పుడిక కేవలం యుద్ధంకాక మరొక సుఖం అనేది నాకులేదు!" అంటాడు.

కృపాచార్యుడు తప్పనిసరిగా యుద్ధానికై సమ్మతిస్తాడు. సైనికులతోసహా అందరు దొరలూ సరస్వతీ నదీతీరానికి వెళ్ళామని నిర్ణయించుకొంటారు. దానికి కారణం విజయ సుఖాన్ని అనుభవించుతున్న పాండవబలాలు అర్ధరాత్రి వేళవచ్చి తమ శిబిరాలమీదపడి తమను చంపుతారేమోననే భయమే. అలా సరస్వతీతీరానికి వెళ్ళిం తరువాత అశ్వత్థామను సంప్రదించినవాడై దుర్యోధనుడు అతడి సలహాపై మద్రేశ్వరుడైన శల్యుని సర్వసైన్యాధిపతిగా అతడికి అభిషేకం చేస్తాడు.

ఇలా కౌరవులు సరస్వతీ తీరానికి వెళ్ళారనీ అక్కడ శల్యుని సర్వసేనాధిపతిగా చేశారనీ పాండవులకు అప్పటి కప్పుడే చారులద్వారా తెలుస్తుంది. వాళ్ళు ఈ సంగతి వినడానికై రాత్రి చాలా సేపటిదాకా ఉన్నారు. అప్పుడు శ్రీకృష్ణుడు ధర్మరాజుతో చెప్తాడు –"ఈ శల్యుని నీవు తప్ప ఇంకెవరూ చంపలేరు. భీమార్జునులు కూడ చంపలేరు. ఈ నా మాటను గ్రహించు. నీవు అతడిని ఎదుర్కొని రేపు చంపవలసింది" అంటాడు. సందేహాస్పదమైన జ్ఞానం కలిగిన మద్రపతిని అష్టాంగ యోగి అయిన ధర్మరాజే నిగ్రహింపగలడని బోధ.

భీముడు అన్ని సమయాల్లోనూ, తన పురుషకారంమీదనే ఆధారపడ్డవాడు. ఎప్పుడూ భగవంతుని దయను ప్రకటంగా ఉచ్చాటనం చేయలేడు. అర్జునుడు తన చాకచక్యంతోపాటు శ్రీకృష్ణుని భగవంతునిగా నమ్మి ఆయన సలహాను క్షణక్షణానా ఉపయోగించుతూ పని గడుపుకొంటున్నాడు. ధర్మరాజా తన శరీర బలిమి ఎందుకూ పనికిరానిదని తెలిసి కేవలంగా పరమేశ్వరుని ధ్యానంచేసి దైవబలంతోనే కర్తవ్యం చేస్తాడు. శల్యుడు కేవలం దైవబలం కారణంగానే చావవలసినవాడని శ్రీకృష్ణుని ఊహ. దైవం రక్షించి ఈ రకంవారిని విలీనం చేసికోవలసిందే. అందుకే ధర్మరాజును భగవంతునిపై ఆధారపడి నీవే అతడిని చంపాలి అనే సలహా ఇచ్చింది. అర్జునుడు అందుకు ప్రయత్నించినట్లయితే చాలా కాలానికిగాని ఆ ఆశయం సిద్ధి పొందేది కాదని కూడ శ్రీకృష్ణుడు సూచించాడనేది గమనీయం. ఎందుకనంటె అర్జునుడికి కొంత స్వశక్తినుపయోగించే గుణముంది.

ఇంతకూ ఆ రాత్రి ఎవరి శిబిరాలకు వాళ్ళు వెళ్ళిపోయి మరునాడు ఉభయ సేనలూ చేరి పద్దెనిమిదవనాటి యుద్ధానికి తలపడుతారు.

శల్యుని ఆధ్వర్యంలో సంకుల సమరం జరుగుతుంది. నకులుడు కర్ణుని కుమారులైన చిత్రసేన సత్యసేన సుశర్మలను చంపేస్తాడు. ఇలకదోట్ల కూడా

ఎంతో ఘోరమైన యుద్ధాలు జరుగుతవి. అంతటా కౌరవ సేనకే దైన్యం కలుగుతూ వచ్చింది. శల్యుడయితె మహా రౌద్రంగా యుద్ధం చేస్తున్నాడు. భీముని గుర్రాలను చంపేశాడు. సహదేవుని నొవ్వజేశాడు. సహదేవుడు తిరిగి విజృంభించి శల్యుని కుమారుని చంపేస్తాడు. శల్యుడు మహా కోపంతో ధర్మరాజువైపుకు రథాన్ని తోలించుతుంటే భీముడు అడ్డుపడతాడు. ఇద్దరూ ఒకరొకరి రథాలను విరగ్గొట్టుతారు. గదాధరులై ద్వంద్వ యుద్ధానికి తలపడుతారు. శల్యుడు తప్ప భీమసేనుని ఎదుర్కొగలిగినవాడే లేడుగదా అనిపించేటట్లు చేస్తాడు శల్యుడా యుద్ధం. చివరకు ఇద్దరూ ఒకరినొకరు కొట్టుకొని మూర్ఛపోతారు. శల్యుణ్ణి కృపుడు తన రథంమీద పెట్టుకొని అవతలకు తీసికొనిపోతాడు.

మళ్ళీ కొంత సేపటికి శల్యుడూ ధర్మరాజూ యుద్ధం ఆరంభించుతారు. తీవ్రమైన విజయేచ్ఛతో శల్యునిరథం భగ్నమవుతుంది. వేరొక రథం అమర్చుకొనివచ్చి కలియబడతాడు. ధర్మరాజు ఎంత శక్తి తెచ్చుకొని యుద్ధంచేసినా శల్యుని జయించటం అందుబాటులో ఉన్నట్లు అవుపించలేదు. అప్పుడు శ్రీకృష్ణుని మాటలు జ్ఞాపకం చేసికొని ఆయన పరమాత్మ అని ఆ మాటలు తప్పిపోవటం అంటూ ఉండదనీ తెలిసి చివరకు సర్వాన్నీ పరిత్యజించిన మనసుతో కేవలం భక్తిని అనుసంధానం చేసి ఒకానొక శక్తిని శల్యునిపై వేస్తాడు. ఆ శక్తి శల్యుని గాయపరుస్తుంది. అతడు ముక్కునోట రక్తం కక్కుకొని చనిపోతాడు. శల్యుని తమ్ముడు అప్పుడు రోషంతో ముందుకు వచ్చాడని ధర్మరాజు అతడిని కూడ చంపేస్తాడు.

శల్యుని చుట్టాలు కోపించి ధర్మరాజును చుట్టుముట్టుతారు. దుర్యోధనుడు వీరి ఆవేశం చూసి అలా విచ్చలవిడిగా ముందుకు వెళ్ళవద్దనీ తన వెంట ఉండవలసిందనీ వారికి చెప్తాడు. అయినా వారు వినక ముందుకు వెళ్తారు. అప్పుడు భీముడు వచ్చి వారిని చెండాడుతాడు. కౌరవ పక్షంవారందరికీ ఎంతో విషాదం అవహిస్తుంది. భీష్మ ద్రోణ కర్ణులు క్రొత్తగా నశించినట్లు దుఃఖించారు. పారిపోయే సైన్యాన్ని దుర్యోధనుడు హెచ్చరించుతూ. "ఎక్కడికని పారిపోతారు? ఎక్కడికో పోయి అక్కడ చంపబడేకన్న యిక్కడ చస్తేనే వీరస్వర్గం కలుగుతుంది" అని హెచ్చరిస్తాడు. పాండవుల బలంకూడా ఎంతో క్షీణించింది. ఓటమి గెలుపుల ద్వంద్వం సర్వత్ర ప్రస్ఫుటమై రెంటికి తేడా అనేది అవుపడటం మానేసింది.

సాల్వుడు ఒక ఏనుగుతో వచ్చి పాండవులను ఎదుర్కొని ఢీకొనవస్తాడు. కాని ధృష్టద్యుమ్న సాత్యకులిద్దరూ ఆ ఏనుగునూ సాల్వుని కూడా చంపేస్తారు. ఇలాంటి స్థితిలో శకుని ఒక కుట్రచేసి పదివేల గుర్రాలతో ప్రక్క[illegible] పాండవ సేనల వెనకకు వచ్చి వారిపై ఉరుకుతాడు. అది చూసి ధర్మరాజు సహదేవుని అయిదువేల గుర్రాలతో వానిపైకి పంపుతాడు. సహదేవుడు శకునిని ఎదుర్కొంటాడు. ఎన్నో గుర్రాలు చనిపోయినవి. శకుని అలా అలా తిరిగితిరిగి [illegible] గుర్రాలతో తిరిగివచ్చి దుర్యోధనుని కలుస్తాడు. తాను ఎన్నో గుర్రాలను పాండవసైన్యంలో వాటిని చంపేశానంటాడు. అవి చస్తేనేగాని కాల్బలాలు పోట్లాడ్డానికి అవకాశం లేదంటాడు. దుర్యోధనుడు మళ్ళీ కొంతమందిని పంపుతాడు యుద్ధంలోకి.

కృష్ణార్జునులు దుర్యోధనుని మూర్ఖత విషయం చెప్పుకొని నవ్వుకొంటూ ఉంటారు. భీష్ముడు పోంగానే రాజీకి వస్తాడని అనుకున్నవాడు [illegible] తాను రాయబారానికి వెళ్ళినప్పుడే సంధికి వాళ్ళు [illegible] పాండవుల కివ్వరని తెలుసుట. విదురుడలా చెప్పాడని జ్ఞాపకం చేస్తున్నాడు. క్షత్రియులంతా చావడానికే ఈ దుర్యోధనుడు పుట్టాడన్నాడు. [illegible] ఇప్పుడున్నది దుర్యోధనుడూ శకునీ శకుని కుమారులూ.

ఇలా అనుకొంటూండగానే సహదేవుడు శకుని [illegible]. సంజయుడు సాత్యకి చేతిలో పట్టుబడ్డాడు. [illegible] క్రింద ఉండటం అర్జునుడు చూస్తాడు. ఈ [illegible] శ్రీకృష్ణునకు భక్తిపూర్వకంగా నమస్కరిస్తూ [illegible] వారందరూ తనచేత చావడానికి ఈ కృష్ణుడే కారణం [illegible] నుడు దుర్యోధనుని వైపు వెళ్దామనుకొనంగానే [illegible]

కృతవర్మ, అశ్వత్థామ, కృపుడు దుర్యోధనుని [illegible] తూంటారు. అందుకు "వాడు ఎక్కడో యుద్ధం చేస్తుంటాడు [illegible] చూడమా? ముందు పాండవుల [illegible] ఆడెనని వాళ్ళలా వెళ్ళిపోతారు.

ఇంతలో సహదేవుడు శకుని [illegible] వారు ఇక నెవరూ లేరు. అతడు [illegible]

ఇది విన్న ధృతరాష్ట్రుడు సంజయునితో "ఆ సమయంలో పాండవులకు ఏమాత్రం బలగం మిగిలింది?" అంటాడు. సంజయుడు సుమారు 18 వేలకు లెక్క చెప్తాడు. ఈ 18 చిత్రంగా మళ్ళీ మళ్ళీ వస్తుంటుంది. దశేంద్రియాలూ పంచ ప్రాణాలు బుద్ధి ప్రకృతి జీవుడులా? సంజయుని పాండవులు వదలివేశారుట.

## 2. ద్వైత విలీనం

శల్యుడు నిశ్చయ జ్ఞానం లేనివాడు. తామసవృత్తులకు మద్దతునిస్తున్నాడు. సాధకునికి ఉన్న ద్వైతజ్ఞానం మోక్షానికి యథాతథంగా పనికిరాదు. భగవంతుడె భక్తునికి జ్ఞానం కలిగించాలి. అతడ్ని రక్షించాలంటే అష్టాంగయోగ మార్గాన చిత్త శుద్ధి పొంది జ్ఞానం సంతరించి తరించాలి. ద్వైతం అంటే తాను ప్రతిష్ఠించిన విగ్రహమొక్కటే దైవం మిగిలినవి కావనే అజ్ఞాన పూర్వకమైన భక్తికలవారని అర్థం.

మహాభారత కథలో ఇంతవరకూ శారీరకంగా ప్రాపంచికంగా గల తామస వృత్తుల్ని నశింపు చేయడమెలాగో చెప్పారు. మిగిలింది తైజసికమైన అవస్థ. దానికి దుర్యోధనుడు ప్రతీక. ఊరుభంగం అనే సాధన ద్వారా ఆ అవస్థను జయించటం చెప్పబోతున్నారు. ఉ = (అంటే) మానసిక స్థితికి అర్థం। ఉరుభంగం (అంటె) గొప్ప భంగమని ఉ + ఉరుభంగం = ఊరుభంగం అవుతుంది. మానసిక ఆటంకాలుకూడా నశింపు కావటం సాధన. ఈ స్థితికిప్పటి లక్షణం అహంకార మమకారాలతో కూడిన తామస స్థితి, దీనిని భంగింపచేయటం సాధకునకు ఇంకా మిగిలియున్నట్టి పని. ఈ భంగం, అభయవృత్తి వల్లనూ, నిర్వృత్తి వల్లనూ మాత్రమె కలగాలి అదె తరువాతి కథ.



లోనున్న రాజును పేరుపెట్టి పిల్చి నానా దుర్భాషలూ ధర్మరాజు ముఖంగా అంటారు. "కౌరవ వంశ జాతుడవై ఇలాటి నికృష్టపు బ్రతుకు బ్రతకడానికి ఆరంభించ వ"ద్దంటాడు. "కొడుకులు, తమ్ములు ఘోరమైన చావులు చస్తుంటే చూసి చూసి ఇక్కడ ఈచోట నీ ఒక్క ప్రాణం కాపాడుకోవాలనుకొంటున్నావా! రాజులకు ప్రాణంకంటె మానం మాన్యమైందికదా? బయటకురా, మమ్ములను గెలుస్తావా రాజ్యం పొందవచ్చు చనిపోతావా స్వర్గం చేరవచ్చు, నీకు ఇలా రావడమెమేలుగాని అలా దాక్కోవడం మేలు కాదంటాడు ధర్మరాజు.

అందుకు దుర్యోధనుడు మడుగులోనుంచె సమాధాన మిస్తాడు "ఇంకా నేను రాజ్యం ఎవరికోసం చేస్తాను! భీష్మాదులు చనిపోయినారు! అంతా పోయిన ఆ స్మశాన రాజ్యాన్ని నీకే ఇస్తున్నాను నీవేలుకోవలసింది" అంటాడు ధర్మరాజుతో.

"నీవిచ్చే రాజ్యం మొదట ఇచ్చినట్లయితె ఇంతచిక్కు వచ్చేదేకాదు. ఇప్పుడు నీవిచ్చేదేమిటి! నీవు ఇచ్చినా నిన్ను చంపకుండా ఉండనుగాక" అని దుర్యోధనుడు తమకు చేసిన ఎగ్గులన్నీ జ్ఞాపకంచేసి తిట్టుతాడు ధర్మరాజు:

దుర్యోధనుడిక అంబోగర్భుడై ఉండలేక బయటకు గదతోనహా వచ్చే ప్రయత్నం చేస్తూ "మీకు రథ తురగ యుద్ధపరికరాలున్నాయి ఇంతమంది ఉన్నారు నాకు లేవు. ఒక్కడను మిమ్మలను చూచి భయపడి పోతున్నాననీ ఈ కృష్ణుణ్ణి చూసి భయపడుతున్నాననీ అనుకోవద్దు. యుద్ధ ధర్మం చెపుతున్నానంటాడు.

ధర్మం చెప్తున్నానన్న మాట దుర్యోధనుడినోట వినంగానే ధర్మరాజు నేను గదాయుద్ధం నీతో చేస్తాను ఒకణ్ణి బయటకు రావాల్సిందంటాడు. అప్పుడు కౌరవ రాజు బయటకువచ్చి -"రండి ఒకొక్కడే ఇక అందర్నీ మట్టుబెట్టేస్తా" నంటాడు. కాని అభిమన్యుని అందరు కౌరవులూ చంపినప్పుడీ ధర్మం లేకపోయిందా" అంటారు పాండవులు. దుర్యోధనునికి సమాధానం ఏదీ లేకపోయింది.

అప్పుడు ధర్మరాజే "మాలో ఒక్కనితో పోరి గెల్చి రాజ్యం తీసికొన్నానరె స్వర్గానికిపోయినా సరె. ఒప్పుకొంటున్నాను రావలసింది" అంటాడు. వెంటనే శ్రీకృష్ణుడు రహస్యంగా ధర్మరాజు అన్న మాటకు లబలబలాడుతాడు. శకునితో పందెం వేయటం ఎంత తెలివితక్కువయిందో ఇలా ఒప్పుకోవటంకూడ అంత తప్పేను. ఒకొక్కడే పోట్లాడి వీడిని గెలవడం సాధ్యమనుకోను. భీముడైనా గదా

యుద్ధంలో వీనికంటే ఎక్కువ చాకచక్యం కలిగిన వాడేననుకొంటున్నాను అంటాడు. ఇది విన్న భీముడికి రోషంవచ్చి "అలా ఎందుకంటావయ్యా నన్ను వంచు వానిమీదకు" అంటూ గొడవ చేస్తాడు. చివరకు భీమ దుర్యోధనుల యుద్ధమై స్థిరం చేస్తారు. వారి ఇద్దరూ మాటలు పెంచి రోషాలు తెప్పించుకొంటూ ఉండగా బలరాముడికి ఈ సంగతి నారదునిద్వారా తెలిసి వీరి యుద్ధం చూడాలని వస్తాడు రథం పరువెత్తించి. అంతా అయనకు నమస్కారాలు చేస్తారు.

యుద్ధం ఈ మడుగు దగ్గర చేయడంకంటె కురుక్షేత్రంలోనే వెళ్ళి చేయడం మేలనీ అక్కడనయినట్లయితె చనిపోయినవారికి స్వర్గం సునాయాసంగా వస్తుందనీ భావించి అక్కడికె ప్రయాణమై వెళతారు.

బలరాముడు భారత యుద్ధారంభ సమయంలో అన్నదమ్ములమధ్య పోరాటం చూడటం ఇష్టంలేదని చెప్పి మొదట్లోనే తీర్థయాత్రలకని వెళ్ళాడు. ఆ తీర్థాలు తిరిగి తిరిగి వచ్చాడు. మొదట చంద్రుడు సరస్వతీనదిలో ప్రతి అమావాస్యనాడు వెళ్ళి స్నానం చేసి తన యక్షవ్యాధిని పోగొట్టుకొని పదహారు కళలూ తిరిగి పొందుతుండేచోటు అయిన ప్రభాస తీర్థం ఆ తరువాత చమసోద్భేదనం అనే తీర్థం తరువాత ఇంద్రతీర్థం వెళ్ళి అనేక యజ్ఞాలుచేసి శాండిల్య ఆశ్రమానికి వెళ్ళి అక్కడకు నారదుడువచ్చి కురుక్షేత్రంలో కౌరవ పాండవులకు జరిగిన యుద్ధ విశేషాలు చెప్పి దుర్యోధన భీములు యుద్ధం చేయబోతున్నారిప్పుడన్నాడు. వెంటనే ఆ యుద్ధం నేను చూడాలి అనుకొంటూ బలరాముడు రథమెక్కి పరువెత్తించి వచ్చాడు [illegible] నికిక్కడికి.

## 2 గదాయుద్ధం

తీరా అంతా కలిసి యుద్ధ రంగానికి వెళ్తారు. భీమ దుర్యోధనులు [illegible] యుద్ధం ఘోరంగా చేస్తుంటారు. శ్రీకృష్ణుడు భీముడికి దుర్యోధనునికున్నంత [illegible] చక్యం నేర్పు గదాయుద్ధంలో లేవంటాడు. ఆ మాటలు [illegible] రెండు మూడు దెబ్బలు బాగా తగులుతాయి దుర్యోధనుని గదతో. [illegible] బెంబేలు పడిపోతుంటారు. కృష్ణుడప్పుడు అర్జునితో [illegible] ఓడిపోయేదాకా ఎదురుచూడటం కాదు కావలసింది తొడలు [illegible] మాట జ్ఞాపకం తెచ్చుకొని తొడలు విరగగొట్టితేనేకాని [illegible]

మంటాడు. అర్జునుడు భీముని చూస్తాడు. భీముడు ఒక క్షణాన అర్జునుని చూస్తాడు. అర్జునుడు తన తొడలను కొట్టి సైగచేస్తాడు. అంతె-భీముడు దుర్యోధనుని తొడలను విరగగొట్టేస్తాడు దెబ్బతో.

గదా యుద్ధంలో తొడలపై కొట్టరాదనే సాధారణ నిబంధన ఉంది. ఈ నిబంధనను దాటినందుకు బలరాముడు కోపగించి వస్తాడు. అది అధర్మమంటాడు. శ్రీకృష్ణుడు వచ్చి సర్ది చెప్పవలసి వస్తుంది. భీముడు కోపంకొద్దీ దుర్యోధనుని తలను రెండుసార్లు కాలితో తంతాడు. దానిని ధర్మరాజుకూడ గర్హించి అది సరి కాదంటాడు.

కాని, గదాయుద్ధం చేసేటప్పుడు తొడలు క్రిందిభాగం కొట్టరాదనటం బలాబలాలు చాకచక్యాలు తెలియడానికి చేయబడే పోటీ యుద్ధంలో. ఒకరినొకరు యెలాగయినాసరె చంపివేయాలనే యుద్ధంలోకూడ ఆ నిబంధనం పాటించటం నియమంగా ఉంటుందా? తొడలు విరగగొట్టటం వనికిరాదనటం ఉంటే ఒకరినొకరు చంపటం కూడదనేమాట మాత్రం ఉండదా? వాస్తవమయిన పరిస్థితిని యోచించి ఎఱిగిన వారికి ఈమాత్రం తెలియకపోదు. తెలియనివారికి చెప్పికూడ ప్రయోజనం ఉండదనిపిస్తుంది.

శ్రీకృష్ణుడు బలరామునికి సర్దిచెప్పేటప్పుడు, మైత్రేయ మహాముని శాపం ఒకటి దుర్యోధనునకు ఉన్నదనీ దాని ప్రకారం భీముని గదాప్రహారంవల్ల దుర్యోధనుని తొడలు విరిగి అతడు కూలటం తప్పనిసరి అనీ చెప్తాడు. బలరామునకు ఆ సమాధానం కచ్చితంగా అర్థమైంది. అతడి సంస్కారానికి తగినట్లుగా సమాధానాన్ని శ్రీకృష్ణుడు చెప్పాడుగనక అతడికి అర్థమైందిగాక.

ధర్మరాజుకూడ భీముడు దుర్యోధనుని తన్నటంవల్ల యెంతో అపచారమయిపోయిందని బాధపడుతాడు. అందుకు శ్రీకృష్ణుడు, దుర్యోధనుడు చేసిన దుష్టపువనులకు కడుపుమండి ఇతడు వానితలను తన్నాడు. దానివల్ల పుణ్యమా పాపమా అనే తర్కం ఇప్పుడు అనవసరం. నిజానికి భీముడుచేసిన ప్రతిజ్ఞ వాడి తొడలు విరగగొట్టి పడగొట్టి కాలితో నెత్తి తంతాననికదా? ప్రతిన నెరవేర్చుకొనటం తప్పా? అంటాడు. భీముడువచ్చి ధర్మరాజుకు నమస్కరిస్తాడు. ధర్మరాజు శ్రీకృష్ణునీ భీమునీ మెచ్చుకొంటాడు. అక్కడున్న రాజులందరకూ వినపడేటట్లుగా శ్రీకృష్ణుడు "దుర్యోధనుడు యెంత దుర్మార్గంగా ప్రవర్తించి వీరి సతిని అగచాట్లుపెట్టి పెద్దలను

తేలికచేసి అతిశయంతో ప్రవర్తించాడు. వీడికి తగినచావు వచ్చిందిప్పటికి. వీని కొరకు ఇంక మీరు సమయం వృధా చేయనక్కర్లేదు. వెళ్ళిపోండి" అన్నాడు.

దుర్యోధనుడు నేలమీదపడి సగంలేచి శ్రీకృష్ణుని తిట్టటం ఆరంభిస్తాడు. "అర్జునుడు చేసిన సంకేతాన్ని ఆధారంగా తీసుకొని ఈ పాపిఅయిన భీముడు నా తొడలు విరగగొట్టాడు. ఈ పాపానికి నీవే కారణం. అప్పుడు శిఖండి బాణాలు వేస్తున్నట్లుగా నాటకమాడి అర్జునునిచేత భీష్ముని చంపించావు. ధర్మరాజు చేత అబద్ధమాడించి ద్రోణాచార్యుని మట్టుపెట్టించావు. నేలక్రుంగిన సమయంలో కర్ణుని చంపించావు — భూరిశ్రవుణ్ణి యెక్కణ్ణుంచో బాణంతో కొట్టించి చంపించావు అంటాడు. శ్రీకృష్ణుడు దుర్యోధనునితో "నీలోభమే నీవే కారణమై ఈ యుద్ధం కలిగింది. దానివల్లనే భీష్మద్రోణాదులు చనిపోవట [illegible]. శిఖండి కొట్టుతున్న సమయంలో అర్జునుడు కొట్టకుంటా యుద్ధం మానేసి కూర్చోమంటావా? చంపుకొనటమె ప్రధానమైన ఈ యుద్ధంలో నీకూ [illegible]! కర్ణుడికీ మంచి పరిస్థితులను పాండవులే కల్పించి పెట్టి అప్పుడు [illegible] బాణాల్తో సరదాగా కొట్టుమనా నీవు చెప్పే ధర్మం? అభిమన్యుని [illegible] ఎలా చంపారో జ్ఞాపకం చేసికొను. సైంధవుణ్ణి [illegible] దాచిపెట్టి అర్జునుడు ప్రాయోపవేశం చేసేదాకా లేదా చచ్చేదాకా [illegible] ఈ యుద్ధం ధర్మయుద్ధం అనలేవా నీవు?

నా తెలివినే వీరికి సహాయమిస్తానని చెప్పేను నీకు [illegible]. నా తెలివినే ఉపయోగించానని తెలుసుకో. భీముణ్ణి చంపేస్తానని ఒక [illegible] చేస్తూ—మల్లయుద్ధ పోటీలలో చెప్పే షరతులు తెచ్చి ఈ యుద్ధంలో [illegible] మనటంలో నీకు వివేకమేమైనా ఉన్నదా? నిన్ను అర్జునుడు [illegible] ఒకప్పుడు రక్షించారు జ్ఞాపకముంచుకొను. ఉత్తర గోగ్రహణంలో [illegible] ఒక్క అర్జునునివల్ల ఓడిపోయారు. నీవు కేవలం [illegible] బడి ఓడిపోవటం—పాపాలన్నీ మూటకట్టుకొని [illegible]

దుర్యోధనుడు అంటాడు అప్పుడు. "[illegible] పశ్చాత్తాపంతో మీవాళ్ళంతాకూడ [illegible] పడిపోతాడు. పాండవులు అంతా తమ తమ [illegible]

ఆ తరువాత పాండవులూ కృష్ణుడూ సాత్యకి, కౌరవశిబిరాలకుపోయి అక్కడి నిశ్శబ్దాన్ని గమనిస్తారు! పాండవులంతా రథాలు దిగబోతుంటె శ్రీకృష్ణుడు ముందు తాను దిగక, అర్జునుని దిగి దూరంగా నిలువుమంటాడు. తాను ఆ తరువాత దిగి ప్రక్కకు తొలగంగానే అర్జునుని రథం-అప్పుడెప్పుడో అగ్ని దేవుడిచ్చిన నాటిది-ఆ గుఱ్ఱాలతోసహా భగ్గునమండిపోయింది. అంతా అవాక్కయిపోయి చూస్తారు. "ఇదే మిటి" అంటారు.

అప్పుడు కృష్ణుడు చెప్తాడు అర్జునునితో. నిన్ను రక్షించడానికి భీష్మద్రోణ కర్ణ శల్యులు వేసిన బాణాల ప్రభావాన్ని నేనుభరించి ఈ రథాశ్వాలతోసహా నిన్ను రక్షించాను. ఇప్పుడు పనైపోయిందిగదా. వాటి ప్రభావం ఇదుగో ఇదె నన్నాడు. ఈ అద్భుత రసావిష్టమయిన ఆ క్షణం పాండవులకు పూర్వంనుంచీ ఉన్న భక్తిని తెలియజేస్తుందా? లేక ఇక ఇప్పుడిలా తెలిసిందికనక వారికి ఇక ముందు ఉండ బోయేభక్తికి కారణాన్ని తెలియజేస్తుందా? ఏదైనాకావచ్చు.

భక్తుడికి ఎప్పుడూ ఇలాటి అద్భుత రసాత్మకమయిన అనుగ్రహం భగవంతుని నుంచి కలుగుతునే ఉంటుంది. కేవలం అద్భుత రసం అనుభవించి ఊరుకుంటాం మనమయితె. అది భగవంతునిపై భక్తిని ఇనుమడింపచేస్తుంది-పాండవులవంటి కొందరు భక్తులలో; ఇలా ఎందుకు ఈ అద్భుతాన్ని చూపించాడీ శ్రీకృష్ణుడు అని పిస్తుంది మనకు. దానికి కారణమున్నది. అర్జునుడు కౌరవ యుద్ధం పద్దెనిమిది రోజులూకూడ మనసార యుద్ధం చేయనేలేదు. శ్రీకృష్ణుడు అప్పుడే పాండవులతో చెప్తాడు ఆమాట. కేవలం కరుణ కారణంగా శత్రువుల్ని చంపనంటే, తాను ఒక్క పరాభవాన్ని నిరూఢిచేసి చెప్పి యుద్ధానికి ఒప్పించాడట. అలా యుద్ధం చేసినందుకె అర్జునుడు మహా చింతపడిపోతున్నాడు. అలా తగ్గి ఉండటంవల్ల ఇలా ఉన్నాడుగాని అర్జునుడు నాతో సముడేసుమా! అంటాడు.

ఇలా అద్భుతం చేసిన కారణం అర్జునుని మనసులో దుగ్ధపోగొట్టటానికి. ఈ చంపిందంతా ఆధ్యాత్మికంగా చూస్తే భగవంతుడే పట్టుబట్టి అలా జరగాలని చేసి నట్టిదేకాని అర్జునుడుగాని పాండవులుగాని కారణులు కారని చెప్పేందుకు ఆ అద్భు తాన్ని చూపించాడు. పాండవులు చేసినపనికి కర్తృత్వం వదలుకోమని చెప్పడమది! వేదాంతార్థ బృంహితంగా వ్యాసుడీకథను రచించి పంచమవేదంగా భారతాన్ని రూపొందించాడనేది ఇక్కడి మకుటం.

పాండవులు కేవలం ఆ యుద్ధాన్ని తమ కర్తవ్యంగా మాత్రమే చేశారు. అందుచేత వారికి పాపంగాని పుణ్యంగాని అంటదు. అది అకర్మ-ఇక కర్తృత్వ మొక్కటే ఆధ్యాత్మికరీత్యా వారు వదలుకొనవలసిన అవసరం ఉంది. దానికి ప్రాతిపదికగా ఇన్నాళ్ళు అస్త్ర శస్త్ర ఘాతాలు తిన్న రథాశ్వాలు ఇవాళ దగ్ధంకావ టం చూపి అది భగవదిచ్ఛ అనేది సూచించాడు భగవంతుడు. ఇకముందు జరుగ బోయే మారణకాండకుకూడ భగవంతుడే కారణమన్న భావం పాండవుల్లో కలగా లని శ్రీకృష్ణుని ఆశయం బహుశః

అప్పుడు అంతా కులానగ ఓఘవతీనది ఒడ్డుకు వెళ్తారు. అక్కడ ధర్మ రాజుకు గుర్తుకువస్తుంది. ఈ కౌరవులు చావడం వల్ల ఎక్కువ దుఃఖించేది గాంధారి! ఆమె పతివ్రత. ఆమె శపిస్తే తాము చిత్తయిపోతారు. ఆమెను అనున యించాలి. అందుకు శ్రీకృష్ణుని బ్రతిమాలి పంపుతాడు ధర్మరాజు. శ్రీకృష్ణుడు మళ్ళీ కరిపురం వెళ్తాడు.

ధృతరాష్ట్రుని కలిసి దుఃఖాన్ని ప్రకటిస్తారు శ్రీకృష్ణుడు. దుర్యోధనాదుల చేసిన పాపిష్ఠికర్మలే ఈదైన్యానికి కారణమని వాపోతాడు. అక్కడే [illegible] తెచ్చు కొన్నాడంటాడు. దుర్యోధనుడు తొడలువిరిగి పడ్డాడని చెప్తాడు. గాంధారిని మహాపతివ్రతవమ్మా అంటాడు. నీవు పాండవులను ఆశీర్వదించాల్సింది. వాళ్ళ మిమ్ములను తరింపజేస్తారంటాడు. ఆమె దుఃఖిస్తూనే తన [illegible] పాండవులకు అప్పగించి" అంటుంది. తిరిగి వచ్చేస్తారు శ్రీకృష్ణుడు.

నంజయుడు చివరకు తాను దాగికొన్న పొదనుండి వచ్చి దుర్యోధనుడ్ని పలుకరిస్తాడు. దుర్యోధనుడు తన హృదయంలో రోషం తీరేదాకా పాండవుల్ని సంజయుని యెదుట తిట్టుతాడు.

అప్పుడు కృపుడు, కృతవర్మ అశ్వత్థామలుకూడ వస్తారు. మళ్ళీ దుర్యోధనుడు తన స్థితిని చెప్పి గోలపెట్తాడు. అశ్వత్థామకు పాండవులమీద మహాకోపం [illegible] స్తుంది. దుర్యోధనునితో అంటాడు "నేను నా శక్తికొద్దీ పాండవులను [illegible] సర్వులనూ నాశనం చేస్తాను చూడు" మంటాడు. [illegible] దుర్యోధనుడు కలశముతో నీరు తెప్పించి అశ్వత్థామను సైన్యాధిపతిగా అభిషేకిస్తాడు.

## 3 విధాన క్రమణిక

మహాభారత కథలో వ్యాసమహర్షి మోక్షమార్గాన్ని—ఉపనిషత్తులలో చెప్పిన బోధకు సమంగా నర్మగర్భంగా—చెప్తూఉన్నాడనేది యెక్కడికక్కడ తెలుస్తూ ఉంటున్న విషయం।

ఆదిపర్వంలో పాండవులూ కౌరవులూ ఒకే సాధకునిలో ఉండే సాత్విక తామసికవృత్తులనీ ఒకళ్ళు ఇంకొకళ్ళతో పోటీపడటం మోక్షం సాధించడానికి సాత్త్వికవృత్తులు ప్రయత్నాలు చేస్తుండటమునూ స్థూలంగా కనుపించుతూ ఉంటుంది.

అరణ్యపర్వంలో సాత్త్విక వృత్తులు ముందుకుపోవడానికి పూర్వం ప్రశాంతతను పొందాల్సిన అవసరం ఉందని సూచించి సద్వృత్తులయిన పాండవులకు అరణ్యవాసం కలిగించాడు వ్యాసుడు. ఆ పర్యాంతాన భగవంతుడ్ని చేరాలని తెలిసి అహంకార మమకారాలను తగ్గించుకొని విరాటునివద్దకు వెళ్ళారు పాండవులు. విరాట్ అంటే నిర్వృతి అనె అర్థం. వానితోకలిసి తమ పేరులేకుండా ఉండటం సర్వం బ్రహ్మమనె తత్త్వమె సర్వం ఖల్విదం బ్రహ్మసాధనకు నాంది.

ఉద్యోగపర్వంలో పాండవులు తా మైదు సద్వృత్తులనేగాక పాంచాలురు మొదలైన సద్వృత్తులనుకూడ కూర్చుకొనాలి. అన్నిటికంటె ముఖ్యంగా నిర్వృతి తత్త్వమయిన శ్రీకృష్ణుని తమ పక్షంగా భావించి అలా చేసికొంటారు. పాంచాలురంటె పంచేంద్రియాలయందు అనసక్తిలేనివారని అర్థం. ఈ సద్వృత్తులన్నిటితో దుర్వృత్తుల్ని సమూలంగా నాశంచేయాలని. అంతేగాని రాజీవల్ల ప్రయోజనం లేదు. నిర్వృతితత్త్వమయిన శ్రీకృష్ణుని సలహాతో యుద్ధానికి ఉపక్రమించారు.

భీష్మపర్వంలో అసమగ్ర కర్మానుష్టానుడైన భీష్ముని చంపారు. అసమగ్రమవడమెందుకంటె దుర్వృత్తులకు తోడ్పడుతున్నాడుగనుక. ఆయనకు శిఖండి అనే పరమాత్మ (పుం.స్త్రీ కానివాడు)ను చూపి సమగ్ర జ్ఞానం పొదమజేసి అతడే అస్త్రసన్యాసంద్వారా తామసిక వృత్తిని మానేట్లుజేశాడు వ్యాసుడు. అసమగ్రమైన అష్టాంగయోగం ఋజు పూర్ణమైన నిర్వృతి జ్ఞానంతో లీనమైపోయిందని బోధ.

ద్రోణపర్వంలో అసమగ్ర జ్ఞానిఅయిన ద్రోణుడు జ్ఞానాన్నిపొంది ప్రాయోపవేశంచేసి యోగియై ప్రాణాలు వదలటం ద్వారా ద్రోణుడు జయింపబడినట్లు

చెప్పి, అసమగ్ర జ్ఞానం సమగ్ర జ్ఞానంతో లీనము చేసినట్లు బోధ చేశారు. కర్ణ పర్వంలో అసమగ్ర యోగియైన కర్ణుని ఋజుమార్గియైన అర్జునునిచేత కృష్ణుడు (నిర్వృతి తత్త్వం)చంపించటంతో యోగంకూడ జ్ఞానంతోనె లీనమయింది. ద్వైతాన్ని సూచించే శల్యుడు చనిపోవటంతో (ద్వైతం అష్టాంగయోగంవల్ల కలిగిన చిత్త శుద్ధితోనే జయింపబడాలి అనేది బోధ.–) శారీరిక సంబంధమైన అన్ని ప్రవృ త్తులూ నశించి సాత్త్విక వృత్తులతో లీనమయినవి.

ఇక మిగిలింది–అశ్వత్థామ, కృతవర్మ, కృపుడు, దుర్యోధనుడు, కౌరవుల ప్రక్కను పాండవులు, కృష్ణుడు, సాత్యకిలు పాండవప్రక్కనూ మిగిలారు. అశ్వత్థామ అంటే ప్రకృతి ప్రకాశమని, కృతవర్మ అంటె సంచితపూర్వకమైన వాసనలని కృపుడు అంటె ప్రారబ్ధంలో కలిగె వాసనలు అనే వాటికి ప్రతీకలని అర్థం. దుర్యోధనుడు అహంకార మమకారాలకు ప్రతీక. ఇంకా కౌరవ్యులు శరీరానికి సంబంధించిన తామసిక వృత్తులకు ప్రతీకలు.

దురోధనుడు తొడలు విరిగి పడిపోయినాడంటె అహంకార మమకారాలు విరిగి పడిపోయినవనిబోధ. ఇంకా మిగిలినవారు చిరంజీవులు అనగా ప్రకృతి, మాయ, జీవుడు. అవి నశించేవికావు. అవి సాత్త్వికవృత్తులతో లీనం కావాలి. సాత్త్వికవృత్తులలో వారు అందర్నీ చంపి చివరకు ఓడిపోవటంవల్ల ఇది సాధించబడినదని తెలియాలి.

ఇది శల్యపర్వం ద్వితీయాశ్వాసః



# మహాభారత కథలు

(సౌప్తికపర్వము - ప్రథమాశ్వాసము)

## 1. పైశాచికం

దుర్యోధనుడికి అవసాన దశ దగ్గరపడింది. తొడలు విరిగి ఒంటరిగా నేల పడివున్నాడు. కృపుడు కృతవర్మ అశ్వత్థామలు వెళ్ళి అప్పుడు కలుస్తారు. అశ్వత్థామ ఆవేశంతో "పాండవుల్ని నేను చంపేస్తాను" అని ప్రతిన చేస్తాడు. దుర్యోధనుడు అశ్వత్థామను సర్వసైన్యాధ్యక్షునిగా వెంటనే అభిషేకం చేశాడు. వాగ్దానం పురస్కరించుకొని అశ్వత్థామ, కృపుడు కృతవర్మలతో నందె చీకట్లో బయలుదేరి పాండవ శిబిరాల వైపుకు వెళ్తారు రథాలమీద। రాత్రులయినా యుద్ధం చేదామనే ! ! పధ్నాలుగో రోజున రాత్రంతా యుద్ధం చేశారుకదా.

అప్పటికి పాండవసైన్యం మహా సంతోషంలో మునిగి తమ తమ గొప్పలు, పాట్లు చెప్పుకొంటూ అరుపులు కేకలూ కేరింతాలూ నెరపుతున్నారు. ఆ సమయంలో ఈ రథికత్రయానికి పాండవ శిబిరంలో ప్రవేశించే ధైర్యం లేకపోయింది. నక్షత్రాలు వచ్చినయి.

వారు అక్కడి అడవిలో ఒక మర్రిచెట్టు క్రింద విశ్రమిస్తారు. అశ్వత్థామకు పగకారణంగా నిద్రరాలేదు. మిగతా ఇద్దరూ నిద్రపోయినారు. అశ్వత్థామ ఆ చెట్టుపైనున్న కాకులు నిద్రించటం చూస్తూ ఉంటున్నాడు. ఇంతలో ఒక గ్రుడ్లగూబ వచ్చి ఆ కాకుల మెడలు కొరికి చంపేస్తోంది. కొన్నిటిని రక్కిపీకి చంపుతోంది. అది చూచి అశ్వత్థామ ఆలోచిస్తున్నాడు.

మహా రథికులయిన పాండవుల్ని చంపుతానని ప్రతినపట్టి దుర్యోధనుని నమ్మించాను. వాళ్ళు మేలుకున్న సమయంలో ఎదిరించి చంపటం అసంభవం। ఈ ఉలూకం చేసినట్లు వాళ్ళు నిద్రపోతున్నప్పుడు చంపటంద్వారానేతప్ప మరొక విధంగా నా ప్రతిజ్ఞ నెరవేరదు. కనుక వాళ్ళంతా నిద్రపోంగానే శిబిరం ప్రవేశించి పడివున్న వాళ్ళను పీనుగులుగ చేసేస్తాను" అనుకొంటాడు.

తాను బ్రాహ్మణ జన్మమేగాని బ్రహ్మతత్త్వం తెలియకపోగా ఈ క్షత్ర ధర్మాన్ని అంగీకరించి ఉన్నవాడు. క్షత్రధర్మం చేయటమె ఇప్పుడు ఈ క్షణాన

కర్తవ్యం. యుద్ధంచేసి శత్రువుల్ని చంపడం ఒకఎత్తు. అలా చేయలేనప్పుడుకూడ క్షత్ర ధర్మం అయిన "శత్రువుల్ని చంపటమ"నే పనిని చేసితీరాలి అని నీతి.

ఆ నిర్ణయం కృప కృతవర్మలకు చెప్పడానికి వారిని నిద్రలేపి, తానే ముందుగా ఆ నిర్ణయం చెప్పక తనకు మతిపోయినంత పనవుతున్నదనీ కర్తవ్యం చెప్పాల్సిందనీ వారినడుగుతాడు. అప్పుడు కృపుడు, "మనం ధృతరాష్ట్రుని వద్దకు వెళ్ళి అక్కడ ఆయనా, విదురుడూ గాంధారీలతో కలిసి ఆలోచించి ఏదైనా చేయటం భావ్యమంటాడు. అశ్వత్థామ తన నిశ్చయాన్ని చెప్తున్నాడు.

"మానవుడికి తెలివి అనేది ఒకటుండటం చేత మానవ స్వభావం ఏమి తోస్తే అది పాటించడమె. అందుకె బాల్యంలో ఈ బాట బాగుందని అన్నవాడే యవ్వనుడైనాక దానిని మానేసి అదిగో ఈబాట సరియైందని మరొకటి చేపట్టుతాడు వృద్ధాప్యంలో ఇంకొకటి సరియైనదంటాడు. సర్వ్యాపారం ఇవాళ లేవాలని చేస్తున్న వాడు తనకు ధనం చేకూరిన తరువాత మరొక విధంగా మారిపోతాడు. నేను బ్రాహ్మణ జన్ముడినె కాని, నా మనసు శాంతి పొందటమనేది అవసరం: అందుకు ముందు నా తండ్రిని చంపినవాని మీద పగతీరాలి. నేను క్షత్ర ధర్మాన్ని దౌర్భాగ్య వశంచేత అనుసరించాను ఇంతవరకూ. దానిని ఇప్పుడయితే మార్చుకొనటం సులభం కాదు. బ్రాహ్మణునకు దమం, క్షత్రియునకు తేజస్సు, వైశ్యునకు దక్షత్వం శూద్రునకు అందరికీ అనుకూలంగా ఉండడం. ఇవి ఉంటేనే వారు సద్వృత్తి కలిగిన వారనే కీర్తి వస్తుంది. నేను క్షత్రియ తత్త్వంలో ఉన్నాను కనక నా తేజస్సు చూపడానికి నేను ఒకానొక పథకం అనుసరించబోతున్నాను అదేమిటంటే ఇప్పుడీరాత్రి పాండవ శిబిరంలో అంతా నిద్రపోతూ పడివున్న సమయంలో ప్రవేశించి, అక్కడి అందర్నీ, అన్ని రథ గజ తురగాలను చంపివేసి వస్తాను" అంటాడు.

కృప కృతవర్మలు ఆశ్చర్యపోతారు. అతన్ని నిద్రపోయి లేచిన తర్వాత ఆ పని చేద్దామని అనునయిస్తారు. ఐనా అశ్వత్థామ పెడచెవిని పెట్టి-

"అలుక ఎత్తిన వానికి అర్థచింతకునకు నాతురునకు
గామగోచరాత్మునికిని వచ్చునె విడి నిద్ర :"

అంటాడు. మా తండ్రిని తలచి ఆతురత పడుతున్నాను. శత్రువుల్ని తలచి కోపగించుకొంటున్నాను. యుద్ధం ఎలా చేయటమా అనే చింత కలుగుతున్నది, దుర్యోధనునికి ప్రియమైన పని చేసేదాకా అని తొందరపాటు చెందుతున్నాను.

అలాంటివానికి నాకు నిద్రేమిటి? అర్జునుడూ కృష్ణుడూ అడ్డుకుంటున్నప్పుడు పగ వారిని చంపటం కుదరనిమాట. ఇప్పుడే సమయం ! అంటాడు.

తిరిగి కృపాచార్యుడు మేనల్లునికి ధర్మంబోధ చేస్తాడు. నిద్రించేవాళ్ళని శరణన్న వాళ్ళనీ చంపటం దుష్పథ ప్రవర్తన క్రిందకు వస్తవి. దుష్పథ ప్రవర్తన కలవాడు ఇతర్లు చెప్పిన మాటవిన్నప్పుడే ఆ పథం నుంచి తొలగటమవుతుందిగాని, అభాగ్యవశంచేత ఎవడయితే సుభాషితాలను పాటించకపోతాడో అతడు భాగ్యాన్ని పోగొట్టుకుంటాడు. నీవు తరువాత పశ్చాత్తాప పడవలసి వస్తుంది సుమా!" అంటాడు.

అశ్వత్థామ తిరిగి తన నిశ్చయాన్ని శాసించి వారిద్దరనూ తనవెంట రావల సిందంటాడు. తాను సర్వసైన్యాధ్యక్షుడుగదా! అప్పుడు కృప కృతవర్మలు అతడి వెంట వెళ్ళడానికి అంగీకరిస్తారు.

## 2. ఐషీకం

వాళ్ళు వెళ్తూనే ఉన్నారు. అశ్వత్థామకు ఎదురుగా ఒక మహాభూతం అడ్డువస్తూ కనబడుతుంది. పెద్దనోరు కోరలు మింగేస్తానంటున్నట్లుంది. ఇది మిగతా ఇద్దరకూ కనపడలేదు. అశ్వత్థామ ఆ మహాభూతాన్ని ఎదుర్కోవాలనుకొన్నాడు మనసులోనే తాను బాణాలు వేస్తున్నాడు. బాణాలతో చక్రంతో అస్త్రాలతో గదతో కూడ మనసులో ప్రహరిస్తున్నాడు. వాటన్నింటినీ ఆ భూతం మింగివేస్తోంది. అశ్వత్థామకు దిక్కుతోచటల్లేదు. "నేను దుశ్చింతతో సుప్తులను చంపాలనుకున్నపాపం నన్నిలా భూతరూపంగా వచ్చి నాశనం చేస్తోందా" అనుకొన్నాడు. కృపుడు చెప్పిన మాటను వినకపోతినే అనుకొన్నాడు. మళ్ళీ తన పట్టుదల ఎందుకు వదలాలి "నన్ను ఈ భూతం మింగేస్తే మాత్రమేమిటి నాకు చింత" అనుకుంటాడు. కర్తవ్యం ఆభూతాన్ని జయించటమెననుకొంటాడు. దయ్యం పోవాలంటే దైవాన్ని తలవాలి గనక శివుణ్ణి తలచి ఆయనకు ఆత్మోపహారంగా తన శరీరాన్ని ఇచ్చేస్తాననుకొంటాడు, రథందిగి నేలమీద కూర్చొని శివుని ధ్యానిస్తాడు-ఇదంతా మానసికంగానే. ముగ్గురూ వెళ్ళే దోవలోనే!

అప్పుడు ఒక వేదిక తన ముందు అవుపడుతుంది, దాని చుట్టూ పైన క్రింద ప్రమథగణాలు పిశాచాల రూపాలతో తిరుగుతున్నట్లు కన్పడుతుంది. తాను చేయ బోయే ఘోరమైన హత్యలనుంచి సంతోషాన్ని పొంది రక్తాలను త్రాగుదామని ప్రమథ

చంపేస్తాడు. శిఖండి ఉన్నచోటికి వెళ్తాడు. అతడు నిద్రలేచి ఎదుర్కొన్న సమయాన అతడి శిరస్సును నరికేస్తాడు. అంతా నిశ్చేష్టులై ఇతడు అశ్వత్థామగదా అనుకొంటూ సింహంముందు భయపడిఉన్న జింకల్లా ఉన్నారు.

అక్కడి వాళ్ళందరకూ యుద్ధం ఆరంభమయిన రోజునుంచీకూడి అదపాదడపా కలలు వస్తున్నవిట. ఒక స్త్రీ పెద్ద భూతమై తల విరబోసికొని ఈఏనుగుల్ని గుఱ్ఱాల్ని రథాల్ని చేతిమూటగా కట్టితెచ్చి అశ్వత్థామ ముందు ఉంచుతుంటే అతడు వాటన్నిటినీ మట్టుబెట్టుతున్నట్లు కలలు వచ్చింది. ఇప్పుడిది జాగ్రతె. ఆ కలలోని అనుభవాన్నిబట్టి ఇతడు అశ్వత్థామేననే భావం వారికి కలిగింది.

తీరా పాండవులు లేరన్న సంగతి అశ్వత్థామకు తెలిసింది. ఇక తెల్లవారబోయే సమయానికి హత్యా కాండ పూర్తి అవటంచేత వెళ్ళి శిబిరానికవతలనున్న కృతవర్మతో ఈ సంగతంతా చెప్తాడు.

వెంటనే దుర్యోధనుడు చనిపోకముందె కలిసి వానికి చెప్పాలి ఈ శుభవార్తను-అతడు సంతోషించి శాంతితో చనిపోవాలి అనే ఆశయంతో అక్కడకు వెళ్తాడు. దుర్యోధనుడు అక్కడ నిశ్చేష్టుడై పడిఉంటాడు. పురపురవేడుస్తూ అశ్వత్థామ, కృతవర్మ కృపులు దగ్గరకు వెళ్తారు. అశ్వత్థామ మాటవిని మహాప్రయత్నంతో దుర్యోధనుడు కన్నుతెరచి వీరుచేసిన ఘోరకాండ విని ఎంతో సంతోషాన్ని పొందుతాడు. అశ్వత్థామను మెచ్చుకొంటాడు. నీవు నన్ను సంతోషపెట్టినట్లు ఇంకెవరూ-కర్ణుడు, భీష్ముడు శల్యుడూకూడ సంతోష పెట్టలేదంటాడు. "పాండవులు మాత్రం తనకు కన్పడలేదని శ్రీకృష్ణుడు వారిని తన బారినుంచీ తప్పించాలని ఎక్కడకో తీసికొనిపోయి ఉంటాడనీ" అశ్వత్థామ చెప్తాడు.

దుర్యోధనుడు నిర్మానుష్యమైన రాజ్యమె శత్రువులకు వదలినందుకు శాంతితో ప్రాణాలు వదలుతాడు. స్వర్గంలో మళ్ళీ కలుద్దామని చెప్పి మరీ చనిపోతాడు.

## 3 తామస నిరసనం

రాత్రివేళ సుషుప్తిలో అంతా మైమరచియున్న సమయంలో అశ్వత్థామ సర్వులనూ చంపేశాడనే మాటలతో వ్యాసుడు సుషుప్తి దశలోగల ప్రాజ్ఞుడనేవాని చుట్టూ అజ్ఞానం ఆవరించి ఉంటుందనీ, అశ్వత్థామ హత్యాకాండ నడిపినట్లు

గా దాన్ని తొలగించాడనీ తెల్పాడు. అశ్వత్థామ ప్రకృతి తత్త్వానికి ప్రతీక. అశ్వత్థం—ప్రకృతి అనే వృక్షము కదా! ప్రకృతి నశించేదికాదు. (indistructabilty of matter). అది బ్రహ్మముతో లీనం అయేది మాత్రమె. (atom రూపంగా) సాధకుడు హాయిగా నిద్రించి నేను ప్రశాంతిలో ఉన్నాను అనుకోరాదు. తానేఅయిన ప్రాజ్ఞదశ అంధకారంలో ఉంటడంచేత కలిగిన స్థితఅది. నిద్ర అలా ఎప్పుడూ ఉండదు. ప్రకృతివశాన మెలకువవచ్చి తీరుతుంది. ప్రకృతికి ప్రతీక అయిన అశ్వత్థామ నిద్రలేపాడు వారిననటంలో అర్థమదె. వారు తిరిగి మైకంలో పడకుండా ఈ శరీరం త్యజించి శాంతి నందటం తత్త్వం. అదె ఇక్కడి సూచన. అందుచేత 18వ రోజు రాత్రి యుద్ధంతో విశ్వతైజస ప్రాజ్ఞులకు కలిగే అన్ని అంతరాయాలూ తొలగించడమెలాగనే మోక్షమార్గం వ్యాసమహర్షి పూర్తి చేశారు. ఇది అర్థంకావట మెలాగో దానికి ఇంకా సాధన కావాలనిపిస్తుంది.

ఇక మిగిలిందెవరు యుద్ధానంతరం సాధనానంతరం [illegible] ఐదుగురు, (సాధకుడన్నమాట) (2) శ్రీకృష్ణుడు [illegible] (3) సాత్యకి—(సత్యాన్వేషి) సత్యాన్వేషణం సాధకునికెప్పుడూ [illegible] ఇక కౌరవుల ప్రక్క అనగా జయించబడినవారి ప్రక్క—(1) [illegible] చావులేదుగదా). శిరోరత్నం తీయబడటంలో జయించబడినాడు. (2) [illegible] అనగా చేసిన కర్మఫలమని అర్థం. అంటే సంచితకర్మ—కర్మ [illegible] వాసనలు లేవుకనక వేచిన విత్తులా అయిపోయింది. (3) [illegible] కర్మ—ఇది అకర్మగా మిగిలింది. వీటితో సాధకుడు [illegible]

ఈ బోధను తెలియడమె భారతాన్ని చదివిన ఫలాన్ని [illegible] ఎరుగాలి.

ఇది [illegible]



# మహాభారత కథలు

(సౌప్తిక పర్వము- ద్వితీయాశ్వాసం)

## అశ్వత్థామ పరాభవం

ధృష్టద్యుమ్ముని సారథి ఒక్కడే అశ్వత్థామ నుంచీ తప్పించుకొనివచ్చి ధర్మరాజాదుల ముందు కూలిపడి యేడుస్తాడు. అశ్వత్థామ రాక్షసుడై ఆరాత్రి చేసిన హత్యలన్నీ చెప్తాడు. ధృష్టద్యుమ్నుడు, శిఖండి, పాంచాలురు ఇతర్లు, ద్రౌపది కొడుకులయిదుగురు అంతా చంపబడ్డారు.

ధర్మరాజు ఈ దారుణకాండవిని, తమ కొమారులంతా చనిపోయి రనివిని దుఃఖపడుతాడు. ద్రౌపది తన తండ్రి చనిపోయినందుకే మహా దుఃఖంతో ఉంది. ఇప్పుడు సోదరులు కుమారులూకూడ పోయినమాట ఎలా వింటుంది. వెళ్ళి ఆమెనూ ఇతర్లనూ తీసికొని శిబిరానికి రావలసింది అని నకులుని పంపుతాడు. తాముకూడ అక్కడనుంచే శిబిరానికి చేరుతారు.

శిబిరంలోనున్న శవాలనుచూచి మూర్ఛపోతాడు. సాత్యకి కృష్ణార్జునుల ప్రయత్నంతో ధర్మరాజు సేదతేరి మళ్ళీ ఏడ్చి చివరకు ద్రౌపది వస్తుందనే సమయానికి ఒకచోట కూర్చొని ఈ చనిపోయిన వారందరకూ అగ్నికార్యం చేయాలనే విషయం ఆలోచిస్తు ఉంటాడు.

ద్రౌపది గోలపెట్టుతూ రథందిగివచ్చి కుమారులను తలచి నేలపడిపోతుంది. కొంతసేపటికిలేచి ధర్మరాజు జయాన్ని పొందినందుకు సంతోషమేనని చెప్తూనే, ఆయన రాజ్యమేలుతుంటే కొడుకుల్నికూడ చూసుకొనే భాగ్యం తనకు లేకపోయిందని దుఃఖిస్తుంది. అశ్వత్థామను ఈ భీమసేనుడు వెళ్ళి పట్టి చంపాలి. లేదా అతడి తలమీద మణి ఉంటుంది అది తెచ్చి తనకిస్తే అతడు సమసినట్లు నమ్ముతానంటుంది.

ధర్మరాజు అంగీకారంతో భీముడు నకులుని సహాయంగా తీసుకొని అశ్వత్థామను వెతుకుతూపోతాడు.

శ్రీకృష్ణుడు అప్పుడు ధర్మరాజుతో_"భీముడ్ని ఒక్కడినే పంపావు అశ్వ త్థామ పైకి_అది శ్రేయస్కరంకాదు. అతడిదగ్గర బ్రహ్మశిరోనామకమనే అస్త్ర మున్నది. అది మనుష్యులమీద వేయరానిదైనా ఆ అంశలను అశ్వత్థామ పాటించే వ్యక్తికాదు. ఎందుకంటే,"—

"అశ్వత్థామ ఒకసారి నావద్దకు ఒంటరిగావచ్చి తాను బ్రహ్మశిరోనామకాస్త్ర మిస్తాననీ దానికి బదులు నేను తనకు నా చక్రాన్ని ఇవ్వాలని అడిగాడు. నేను నా చక్ర, గదా, కార్ముక ఖడ్గాలు తెచ్చి ఒకచోట పెట్టి నీకు ఏదికావలెనంటే దానిని తీసికోవాల్సింది_అందుకు నాకేమీ ప్రతిఫలం అక్కరలేదు అని అన్నాను. అతడు చక్రం కోసం ప్రయత్నించి దానిని ఏ విధాన గాని ఎత్తలేకపోయినాడు". అప్పుడు నేను నీవు దీన్ని ఎందుకోర్కరుకొన్నావో చెప్పాల్సింది". అన్నాను. అతడు "నీతోనే ఇప్పటికిప్పుడు యుద్ధంచేసి గెల్చి కీర్తి పొందుదామని వచ్చాన"న్నాడు. అంటువల్ల అశ్వత్థామ చాల అహంకారి. దురభిమాని. భీముడు ఒక్కడే వెళ్ళటం సరికాదు. పదండి అంతా పోదాం" అని కృష్ణుడు బయలుదేరుతాడు.

రథం నిముషంలో భీముని కృష్ణద్వైపాయనాశ్రమంలో [illegible] చూచిన అశ్వత్థామ వెంటనె ఒక దర్భను మంత్రించి బ్రహ్మశిరోనామాస్త్రాన్ని [illegible] "అపాండవము చేస్తుందిగాక ధరిత్రిని" అని వదలుతాడు. శ్రీకృష్ణుడు [illegible] "అర్జునా! అర్జునా అదుగో బ్రహ్మశిరాస్త్రాన్ని వదలినాడు. [illegible] దాని పైబ్రహ్మ శిరాస్నే వదలితేతప్ప ఇంకే అస్త్రంకూడ దానిని [illegible] వెంటనె ప్రయోగించాల్సింది"_అంటాడు.

అర్జునుడు వెంటనే రథందిగి, నియతుడై, [illegible] తీసికొని మంత్రంతో బాణాన్ని కూర్చి, (1) ఆ [illegible] కలుగరాదని (2) తనకున్నూ తన సోదరులకూ [illegible] ప్రార్థించి వదలుతాడు. రెండు బ్రహ్మశిర అస్త్రాలు [illegible] విక్రమంతోఉంటవి. అప్పుడు నారదుడు [illegible] అశ్వత్థామకూ అర్జుననకూ మధ్యనిల్చి అంటారు—

"ఎంతోమంది యుద్ధాలు చేశాడు పూర్వం [illegible] మానవ మారణాలైన ఇలాంటి అస్త్రాలు ఏనాడైనా [illegible] వెంటనె వారికి నమస్కరించి అంటాడు. అంతటి అస్త్రాన్ని [illegible]

మాత్రమే నేను ఈ అస్త్రాన్ని వేశాను. మమ్ములను దృష్టిలోఉంచుకొని మాక్షేమం తలచి మీరేం చెప్పినా చేస్తాను. నా అస్త్రాన్ని ఉపసంహరిస్తాను" అంటాడు.

యుద్ధాలయితె చేయవచ్చుగాని ఇలా న్యూక్లియరు బాంబులాటి మారణాయుధాలు వేయటం తప్పనే సంగతి ఆ మునులకూ అర్జునునకూ నిశ్చయంగా తెలునుననిపిస్తుంది: హిరోషిమా ఉదాహరణలు వారి కక్కరలేదు కాబోలు. అర్జునుడు వెంటనె తన అస్త్రాన్ని ఉపశమింపజేస్తాడు. అశ్వత్థామ వేసిన అస్త్రం తమముందు దుఃఖాన్ని వర్షింపకుండా చేయవలసిందని ప్రార్థిస్తాడు. మహామునులు అర్జునుని చాల మెచ్చుకొంటారు. ఎందుకంటే వారికి తెలుసు—దాన్ని ఉపసంహారం చేయాలంటే "తపము బ్రహ్మచర్యమును దానము సత్యము" ఇవి ఉండాలి. ఇవన్నిటికోసమే మహామునులు నిరంతరం జపంలో ఉండేది. ఈ అర్జునుడు ఇంతవాడా? అనుకొన్నారు.

అశ్వత్థామను కూడ వారు వత్తిడి చేస్తారు. అతడు అస్త్రాన్ని ఉపసంహరించడానికి ప్రయత్నించి విఫలుడవుతాడు. అప్పుడంటాడు—"వీళ్ళు దుర్యోధనుని అధర్మంగా చంపారు. ఆ కోపంతోనూ నా ప్రాణ భయంవల్లనూ ప్రయోగించానీ అస్త్రం. వివేకం కోల్పోయి వదిలేశాను. అది ఈ పాండు భూపసుతవర్గము నంతనూ నాశనం చేస్తుంది. నాకు పాపం చుట్టుకొంటే చుట్టుకోనీయండిగాక" అంటాడు. అప్పుడు కృష్ణద్వైపాయనుడు, నీవు ఈ అస్త్ర ప్రయోగానికి గల ఆశయాన్ని మార్చుకొను. నీ తలమీది మణిని ఇచ్చివేయి అప్పుడు అందరకు శుభం అవుతుంది. నిన్ను ఈ అర్జునుడేకాదు పాండవులెవరూ చంపజూడరు అంటాడు. అశ్వత్థామ తన శిరోరత్నాన్ని తప్పనిసరిగా ఇస్తూ ఇది నాగభయం, తస్కరభయం దానవభయం, దేవభయం లేకుండా చేసేది. ఆకలి దప్పులు నిద్ర రోగం లేకుండా చేసేది. ఇట్టి రత్నాన్ని ఇవ్వటం నీ మీదగల గురుత్వభావం వల్లనేనని చెప్పిఇస్తాడు. నా అస్త్రం పాండవులను వదలి వారివల్ల గర్భంధరించిన వారి గర్భాలను విచ్ఛిన్నం చేస్తుందిగాక అంటాడు. వ్యాసుడు "అప్పైన ఆశపడకు" అంటాడు.

కృష్ణుడప్పుడు కల్పించుకొని మాట్లాడుతాడు— "అశ్వత్థామా! అన్ని పాండవ వంశగర్భాలూ పోవాలనకు—ఒక్క గర్భం వదలిపెట్టాల్సింది నేను ఆ గర్భాన్ని ఎలాగయినా కాపాడదలచుకొన్నాను" అంటాడు. అశ్వత్థామ తిరగబడి అంటాడు. అదేంవీల్లేదు. ఉత్తరాగర్భాన్ని మాత్రం తప్పింపజేసేందుకు అడుగుతున్నట్లున్నాడు. అది వీల్లేదు నేనొప్పుకోను అంటాడు. 'నా అస్త్రహతుడైనవాడికి నీవు

ప్రాణాలిస్తావా!' అసంభవం అంటాడు. పైగా మళ్ళీ నీళ్ళు తీసికొని ఆ అస్త్రాన్ని పాండవ సంతాన సకల గర్భ విషయంగా ప్రమోచనం చేస్తాడు.

కృష్ణుడు మాత్రం, ఉత్తరా గర్భం రక్షింపబడుతుంది బ్రాహ్మణ వచనం ఒక టుంది అది వృథాపోదు. బాలిశుడవైన నీవు తిండి దొరకక, దుర్గంధమైన రక్తంతో పళ్ళు స్రవిస్తూ ఉంటే ఎవరి సహాయమూ దొరకక మూడువేలేండ్లు బాధ పడతావుగాక. నీవు చూస్తుండగానే పరీక్షిత్తు జనమేజయుడనే కుమారుని కనటం అతడు ధర్మంగా పరిపాలించటం అవుతుందిగాక" అని శపిస్తాడు. వ్యాసుడు తథాస్తు అంటాడు.

పాండవులూ కృష్ణుడూ ఆ రత్నాన్ని తీసికొనివచ్చి ద్రౌపదికి మునిచేత ఇప్పిస్తారు. ఆమె దుఃఖం ఆపుకొని, దానినితెచ్చి ధర్మరాజుకు బహూకరించి ఆయన తలపై ఉంచుతుంది. పాండవ వంశంలోని కోడండ్ర కెవరకూ [illegible] నిలువలేదు ఒక్క ఉత్తరకు తప్ప.

అంతా అయినమీదట ధర్మరాజు శ్రీకృష్ణునడుగుతాడు. అశ్వత్థామ ఒక్కడు శిబిరంలోకి వచ్చి ఇంత దురాగతం చేయగలిగిన సామర్థ్యం [illegible] ఎలా పొందాడు చెప్పాల్సిందంటాడు.

అందుకు శ్రీకృష్ణుడు ఆ శక్తి పరమేశ్వరుడైన శివునిది. శివుని [illegible] చినవాడు అశ్వత్థామ. ఆ శివశక్తివల్లనే అశ్వత్థామ ఒక్కడై [illegible] మీద ప్రకటించి తీర్చుకోకలిగాడు.

బ్రహ్మ ఒకప్పుడు భూత నంచయాన్ని సృష్టించమని [illegible] శివుడు అలాగే చేద్దాం అనే అభిప్రాయం వెలిబుచ్చి, [illegible] తపో విభవం కావాలిగదా అని జలంలో మునిగి తపస్సు చేస్తూ [illegible] చాల సంవత్సరాలు ఉండి బ్రహ్మ దక్షునే వానిని సృష్టిస్తాడు. [illegible] యాన్ని సృష్టించుమంటాడు. అతడు సందేహించగా [illegible] కదా సృష్టి నీవు చేయాల్సింది అంటాడు. [illegible]

శివుడు తరువాత నీటినుండి వచ్చి ఈ భూత [illegible] కొంటాడు. నిజలింగాన్ని నేలపై పడవేస్తాడు.

దేవతలూ, బ్రహ్మ ఆ శివలింగ ప్రకాశమానానికి అచ్చెరువుపడి పూజలు చేస్తారు. తరువాత కొంత కాలానికి ఒక మహాధ్వరాన్ని తలపెట్టి చేస్తారు. కాని వారు రుద్రుని మహానుభావత్వం ఎరుగకపోవటం వల్ల ఆయనకు యజ్ఞంలో భాగం కల్పించలేదు. యజ్ఞం ఆరంభం అయి నడుస్తున్న సమయంలో శివుడు కోపగించు కొని అక్కడకు వచ్చి అందరనూ భయపెట్టి యజ్ఞాన్ని నాశనం చేస్తాడు. దేవతల నెవరినీ బయటకు పోనీయక పోయినాడు. చివరకు వారంతా శివునకు "శరణు శరణు " అనే మాటలు పలుకుతూ నిలుచొనిపోతారు.

శివుడు తన కోపాన్ని పుచ్చి నీళ్ళలో పారేస్తాడు. దేవతలను అప్పుడు ఆదరంతో చూస్తాడు. అతడె శృంగభంగమయిన దేవతలకు మళ్ళీ పరిపూర్ణత నిస్తాడు. అంతటి మహాదేవుడు శివుడు". అని శ్రీకృష్ణుడు ధర్మరాజుకు చెప్పి-ఆతడి కారణానె అశ్వత్థామ ఇంతపని చేయకలిగాడుగాని, వస్తుతః అతడికంత శక్తి" లేదని చెప్తాడు.

ఇంతకూ కోపాన్ని తీసి జలాశయంలో శివుడు పారేశాడనటం చిత్రమైన విషయంగా ఉంటుంది. ఎలా తీసి వుంటాడు? తాను వేరు క్రోధంవేరు అని తెలిసిన వాడు కావటంచేత, తాను సాక్షిమాత్రుడుగా ఉండి కోపాన్ని పరికించి చూచాడు. ఆ కోపం అలా మూర్తిమంతం అయేటట్లు చేశాడన్నమాట. ఆ మూర్తిమంతం చెయ్యటం ఎలాగో మనకు తెలీదు. మూర్తిమత్వం పొందిన ఆ క్రోధాన్ని తననుంచి విసరి వేశాడు నీటిలోనని అర్థం.

## 2. ప్రకృతిని జయించడం

అశ్వత్థామ తలపై రత్నం ఉన్నదంటె అర్థం అది ప్రకృతియొక్క తరళ తను ప్రకాశమును సూచిస్తుంది. దానిని ధర్మరాజుకు అంతరణ చేయంగానే ప్రకృతి సాధకునకు లొంగిపోయినదని అర్థం. కృతవర్మ కృపులు పిగిపోయినారు అనగా సంచిత ప్రారబ్ధ కర్మలకు సాధకునిపై ప్రభావము నశించిందని అర్థము. అనగా ఇక ఇతడు చేయునది అకర్మ అని బోధ.

సాధకుని స్థితి, నిర్వృతితత్త్వ మయిన కృష్ణుని ఆరాధిస్తూ అకర్మ చేస్తూ ఉండటమె ననేది జ్ఞాపకముంచుకొనాలి.

ఇది సౌప్తికపర్వం

# మహాభారత కథలు

## (స్త్రీపర్వము- ప్రథమాశ్వాసము)

## వైరాగ్య క్రమణిక

పదకొండు అక్షౌహిణుల బలం పుత్రపౌత్ర బంధువర్గమంతా యుద్ధంలో నశించిన తరువాత ప్రోడులా ధృతరాష్ట్రుడుండి దుఃఖిస్తుంటే సంజయుడంటాడు.

"రాజా! ఎవరిని గురించి దుఃఖించాలి? అంతమంది పోతే ప్రతి ఒక్కరిని గూర్చి దుఃఖించవద్దా? అది అవివేకం! ఎప్పుడూ చేయవలసింది కర్తవ్యం! ఆ పోయిన వారందరకూ తిలోదకాలు వదలడం అవసరం. ముందు ఆ యుద్ధ రంగంలో ఉన్న శవాలదగ్గరకు వెళ్దాంపద" అంటాడు.

ధృతరాష్ట్రునికి దుఃఖం ఆగటల్లేదు. దుఃఖం ఆగాలంటే ఆ దుఃఖం రావటానికి కారణము తనుకూడాను అనే భావం రావాలి. ఆ భావం వచ్చినప్పుడు ఓహో ఈ దుఃఖానికి నా కర్మే కారణము. కర్మఫలం అనుభవించాలిగాక అనే ఊహ వస్తుంది. వెంటనే అలాటి కర్మ ఇక చేయరాదు. సత్కర్మలే చేయాలి అనిపిస్తుంది. ఈ చర్చలో దుఃఖం తగ్గుతుంది. ఇది ఒక పంథా. (చిట్కా) ధృతరాష్ట్రుడు ఈ యుద్ధం తానే రాకుండా చేయకపోవడం తప్పైంది అనుకొంటున్నాడు. ఇక పుణ్యం ఏదీ తనకు మిగిలినట్లు లేదు గనక చచ్చిపోవటమె తనకు శాంతి అనుకొని దుఃఖిస్తున్నాడు.

సంజయుడు "యుద్ధం నీవు ఆపగలగటం మాత్రం జరిగేదా! నీవు చేయవలసిన పనిని చేయకపోయినావనే దొక్కటే గమనింప తగిందిగాని యుద్ధం ఆపటం నీ తరమా! చుట్టూవున్న అడవికి మంటపెట్టి మధ్యలోనున్న తనకు తాపం కలుగు తున్నదని ఏడ్చిన విధంగా నీ పుత్రులు ఈ యుద్ధం లేవగొట్టి నశించి పోయారు" అంటాడు.

విదురుడు కల్పించుకొని అనేక విషయాలు చెప్తాడు. ఈ విషయాలన్నీ మానవుడై నవానికి ఎంతో అవసరం. ఇది కథ. వింటున్నాం అంటే అర్థం కేవలం సాక్షిగా విషయగ్రహణం చేస్తున్నామన్న మాట. ఇవి మన మనసుకు ఎక్కితే

దుఃఖం వచ్చినప్పుడు ఉపయోగిస్తవి. దుఃఖ సమయంలో ఎవరైనా క్రొత్తగా ఈ మాటలు చెప్తే అవి ఎక్కనే ఎక్కవు మనసుకు. మనసులో అదివరకే ఎక్కి ఉన్నట్లయితే. ఎవరయినా జ్ఞాపకం చేస్తేచాలు ఉపయోగిస్తవి ఆ సమయాన. అందుకని విదురుని మాటలను సాక్షిగా అర్థం చేసికొనటం మనకు ఎంతో మేలు. విదురుడంటాడు.

"ప్రపంచంలోని శరీరాలు పదార్థాలు పెరగడం తగ్గటం వికసించటం నశించటం మామూలు. వద్దన్నా కద్దన్నా అది తప్పదు. మృత్యువు బలవంతులనైనా పిరికివాళ్ళనైనా ఒకవిధంగానే కబళిస్తుంది. వీళ్ళు చావడానికి యుద్ధమె రావాలని లేదు. నీ బిడ్డలు, యుద్ధంలో పోయినందుకు సంతోషించాలి. వాళ్ళు స్వర్గానికి చేరారుగాక!

దుఃఖ విషయాన్ని గూర్చి చింతిస్తుంటే దుంఖాక్రాంతత్వమె కలుగుతుంది. దానిని చింతింపకుండా ఉండటం ఆర్యుడైనవాడు చేస్తాడు. అతడు కర్తవ్యం ఆలోచించడమెతప్ప వచ్చిన దుఃఖ విషయాలు మనసులో చర్విత చర్వణం చేయడు. ధృతరాష్ట్రుడు అప్పుడు "పండితులెలా దుఃఖం కలిగినప్పుడు కూడ బాధపడకుండా ఉంటారు?" అని అడుగుతాడు.

"పండితునకూ, తానూ, తన శరీరం ఒక విధంగా మనసును ఆకర్షిస్తూనే ఉంటవిగాక. కాని ఇతర ప్రపంచాన్ని చూసి విస్తృతమైన మమకారం పెంచుకోరు. ''ఈ ప్రపంచమంతా అసారమైంది'' అనే ఊహను బలంగా అనుసంధానం చేస్తారు. తాము కట్టుకున్న గుడ్డలు తమకెంత కొద్దికాలంపాటు ప్రయోజనమొ ఆ మాత్రం లేదా కొంచెం ఎక్కువ కాలంపాటు మాత్రమె తమ శరీరాలు కూడ ప్రయోజనాన్ని ఇస్తవి అనివారికి తెలుసు. వారి మనసు చుట్టునున్న వస్తువులు తమవనీ లేదా ఇతర్లవనే సంగతిమీద కేంద్రీకృతమై ఉండదు. అందుకని వారి మనసు దుఃఖాన్ని కలిగించే సంఘటనల్లోగాని, దుఃఖంలోగాని తగుల్కోదు."

"సంసారం"– అంటే పుట్టుక చావులు. ఒక బ్రాహ్మణుడు అరణ్యంలో చిక్కుకొన్నాడు. ఘోరమైన క్రూరమృగాలు వెన్నంటుతుంటే మహాభయంతో తప్పుకొని తప్పుకొని పోతున్నాడు. దిక్కుతోచలేదు. ఆ అరణ్యమంతా ఉరులువన్ని ఉన్నాయి. అందులో చిక్కుకొంటానని భయపడుతున్నాడు. ఒక ఘోరమైన ఆకారంగల వనిత వచ్చి కౌగలించుకొంటుంది వదలదు తనను. ఐదుతలల ఏనుగులు

తిరుగుతుంటవక్కడ. ఒక చెట్టుదగ్గర లతా గుల్మాలతో కప్పిపెట్టబడ్డ పాడుబావి ఉంటే చూడక ఇతడు దాంట్లో పడతాడు. కాని ఆ చెట్టువేరు ఒకటి దొరికితె దానిని పట్టుకొని నిలుస్తాడు గాలిలో. కాని ఆ చెట్టును ఆరుతలల ఏనుగు ఛిన్నాభిన్నం చేస్తుంటుంది. ఒక ఎలుక ఆ వేరును కొరికేస్తుంటుంది. బావిలో ఒక గొప్ప సర్పము బుసకొట్టుతూ భయపెట్టుతోంది. ఏనుగు కదిలించటంవల్ల ఆ చెట్టు కొమ్మల్లో ఉన్న తేనె తుట్టె కదలిపోయి దానినుంచి తేనెబొట్లు బొట్లుగా పడుతున్నది బావిలో. ఈ బ్రాహ్మణుడు నాలుక చాచి ఆ తేనెబొట్లు గ్రహించి చప్పరించి సంతోషిస్తున్నాడు.

"మరి ఆ బ్రాహ్మణుడెలా బైటపడ్డాడు ఆ బాధల్లోనుంచి" అన్నాడు ధృతరాష్ట్రుడు.

అందుకు విదురుడు ఇదంతా ఒక కథగా చెప్తే సాక్షిగా ఉంది నీవు నీ మనసుతో గ్రహిస్తావని అలా చెప్పదమయింది. నిజానికి ఆ బ్రాహ్మణుడు ఈ ప్రపంచంలో జన్మమెత్తిన జీవుడు అని తెలిసికొను. ఆ మృగాలు రోగాలు. ఆ వనిత ముసలితనం. ఆ ఏనుగులు పంచభూతాలు. ఆరు తలల ఏనుగు ఆరు ఋతువుల సంవత్సరం. ఆ చెట్టు ఆయుష్షు. ఆ ఎలుక కాలుడు ఆ నాగేశ్వరుడు మృత్యువు. ఇన్నిటి మధ్య తియ్యగా ఉండే తేనె చుక్కను ఆస్వాదించి సంతోషించుతూ ఉండటం ఇది జీవుడు చేస్తున్నపని. మోక్షం అనే నిచ్చెన ఎక్కి పైకి వస్తేతప్ప అతడలా ఉండిపోవటం ఖాయమనే విషయం సాక్షి రూపంగా చూస్తేనే గ్రహింపు అయేది। ఇది సంసార గహనాన్ని తెలియజేసే కథ.

జీవునికిగల శరీరం అతడి రథం అనుకో. సారథి సత్త్వము. అశ్వాలు ఇంద్రియాలు. బుద్ధి చేసే పనులు పగ్గాలు. ఆ గుర్రాలను ఎలాపడితే అలా పోనిస్తే గోతిలోపడదం అవుతుంది. ఆ పగ్గాలను "శీలము" అనేవిగాచేసి ఆ రథవేగాన్ని అదుపులో పెట్టుకుంటే పరమసుఖాన్ని పొందే దోవ త్రొక్కవచ్చు అంటాడు విదురుడు. కనక పుత్రులకు పరలోక క్రియలు చేసి కర్తవ్యం నిర్వహించాల్సింది అంటాడు.

పరలోక క్రియలనేటప్పటికి మళ్ళీ ధృతరాష్ట్రిడికి దుఃఖం ముంచుకొని వస్తుంది. అప్పుడు కృష్ణ ద్వైపాయనుడు వస్తాడు. ఆయనకు మర్యాదలు చేసింతర్వాత ధృతరాష్ట్రునకు ఆయనకూడ ఎంతో చెప్తాడు,

"నీకు తెలీకుండా వచ్చిపడింది కాదు ఈ దుఃఖం. ఎప్పటినుంచో తెలిసిందే. నీ పుత్రుని మౌర్ఖ్యము వల్లనె ఇది వచ్చింది. పైగా ఇది దైవికం. అంటే దేవతలు తలపెట్టి తెచ్చిపెట్టిన యుద్ధం, దేవలోకంలో నేను ఒకప్పుడు స్వయంగా విన్నాను. భూదేవి తన భారాన్ని సమయింపజేయాల్సిందని అడగడం, నారాయణుడు నవ్వుతూ ధృతరాష్ట్రుడికి దుర్యోధనుడనే కుమారుడు కలిగి పాండవులతో యుద్ధం తెప్పించి భూపతుల్ని చంపి భూ భారాన్ని అణచివేస్తాడని చెప్పడమూను. దుర్యోధనాదులు వారి వారి తప్పులు కారణంగా సమసిపోయినారు. నీవు ఇదంతా తెలిసికొని నిలిచావు. ఇప్పుడు 'శాంతము' అనేదే నీకు కావలసింది అంటాడు. అప్పుడు ధృతరాష్ట్రునికి ధర్మరాజు తనతో ఎలా ప్రవర్తిస్తాడోననే శంక కలగటం వ్యాసుడు గ్రహిస్తాడు. అప్పుడు చెప్తాడు—

ధర్మరాజు ఎప్పుడూ సంధి కోసమే ప్రయత్నించాడు. అతడికి ఎప్పుడూ హింస ఇష్టములేదు. నిన్ను ఆదరంతో చూచుకొనేవాడేగాని బాధపెట్టేవాడు కాదు. నీవిలా బాధపడుతూనే ఉంటే ధర్మరాజు మనోవ్యథ పడిపోతాడు కూడాను. అతడికి నీయందు విముఖత్వం లేదు. కనక-

దైవకృతమిది అనేది చిత్తంలో ఉంచుకొను. పాండవులు నీ పుత్రులేను అనేది జ్ఞాపకం ఉంచుకొను. వనట అనేది అగ్ని. ఎఱుక అనేది నీరు. ఈ నీటితో ఆ అగ్నిని ఆర్పాలి అన్నాడు.

ధృతరాష్ట్రుడు ప్రాణాలు వదిలే ఊహను ఇక రానివ్వనన్నాడు అంతే. ఈ నిశ్చయంతో ధృతరాష్ట్రునికి కర్తవ్యం వచ్చి మనసులో నిలిచింది. ఇక దుఃఖం దాన్ని ఆక్రమింపకుండా ఎప్పుడూ ఏదో కర్తవ్యం చేస్తుండటమె పని శాంతి పొందాలంటే.

## 2 పౌలికల పరిశీలనం

అప్పుడు ఆడవాళ్ళందరికీ కబురువంపి ఆ పౌలికలవద్దకు అందరితోసహా పోవడానికి ఉద్యమిస్తాడు ధృతరాష్ట్రుడు. గాంధారి, కుంతి, అందరు కోడండ్రు చెలికత్తెలు, ఉళ్ళోవాళ్ళు ఏడ్పులతో అనలంకార శరీరాలతో వస్తారు. అందరనూ విదురుడు ఓదార్చుతాడు. అంతాకలిసి ఒక క్రోసు దూరం వెళ్తారు అక్కడకు. కృపా

చార్యుడూ కృతవర్మ ఇద్దరూ ఎదురు వస్తారు. దుర్యోధనుడు వీరయుద్ధంలో చని పోయి స్వర్గానికి వెళ్ళాడనీ, అశ్వత్థామ ఆ క్రిందటి రాత్రి పాండవ శిబిరం ప్రవేశించి ధృష్టద్యుమ్న శిఖండ్యాది పాంచాలురనూ ద్రౌపతి కొడుకులనూ మిగతా సైన్యాన్నీ కూడ సంహరించాడని చెప్తారు. అతడిని పట్టుకోడానికి పాండవులు వానిని వెంటనంటి వెళ్ళారనీ చెప్తారు. పాండవులు గెలిచామనే సంతోషం లేకుండా ఇలా వాళ్ళ కుమారులు చావడం జరిగింది కనక దుఃఖపడకండి అని గాంధారికి చెప్తాడు కృపుడు. కృపుడు కరిపురికి వెళ్తాడు. కృతవర్మ యాదవరాజ్యానికి వెళ్ళిపోతాడు.

ధృతరాష్ట్రుడు ఈ పొలికలకు వస్తున్నాడని తెలిసి ధర్మరాజు తమ్ములతో కలసి ధృతరాష్ట్రుడున్నచోటుకు వస్తాడు. అక్కడి కౌరవ కాంతలంతా ధర్మరాజును దుయ్యబట్టుతారు. నీవు ధర్మాత్ముడవా? కృప అనేది ఉందా నీకు. బంధువుల్ని అందర్నీ చంపించావు. వీళ్ళనేకాదు అభిమన్యుని చంపించావు. నీకు విభూతి అనేది ఎలా కలుగుతుంది? అంటారు. ధర్మరాజు వెళ్ళి ధృతరాష్ట్రుని కాళ్ళకు దణ్ణం పెట్టుతాడు.

ధృతరాష్ట్రుడు ప్రియమూ అప్రియమూ లేకుండానే ధర్మరాజును కౌగిలించు కొంటాడు. భీముడు వస్తాడు. ఆ పేరు వినేటప్పటికి ధృతరాష్ట్రుడికి మహా కోపం వస్తుంది. "రాదగ్గరకు" అని ఒక్కసారిగా కౌగిట్లో ఇరుకించుకొని నలిపి పిసికి వెన్నెక్కు విరిచి విసరివేస్తాడు భీముడేననుకొని. కాని శ్రీకృష్ణుడు భీముడ్ని దగ్గరకు వంపక ఒక ఇనప స్తంభాన్ని తోస్తాడు ధృతరాష్ట్రుని ముందుకు. ఆ స్తంభంకాస్తా విరిగిపోయింది. అప్పుడు ధృతరాష్ట్రుడు "అయ్యో! భీమా! కోపంకొద్దీ నిన్నువిరిచి పారేశా"నని గోలపెట్టుతాడు. అప్పుడు కృష్ణుడు చెప్తాడు. "నీవు అంత కోపంతో అలా చేస్తావనే భీముడికి బదులు ఒక ఇనపదుంగ తెచ్చిపెట్టాను. నీవనుకున్న శిక్ష దానికయింది. అప్పుడు ధృతరాష్ట్రుడి శరీరం ఆ ఇనపదుంగ కారణంగా నెత్తురు జిమ్మటంచేత పరిచారకులువచ్చి దానిని తుడుస్తారు.

కొడుకులు చచ్చారనేది మనసులో ఉంచుకొని భీముడ్ని చంపేయాలనుకున్నావు అధర్మంగా. కాని భగవంతుడు దానిని ఇచ్ఛగించండె అది ఎలా జరుగుతుంది? అంటాడు శ్రీకృష్ణుడు. ఇతడిని ఒక్కడ్నికాదు పాండవుల్ని అందర్నీచంపినా నీ కొడుకులు మళ్ళీ వస్తారా అంటాడు. అందుకు ధృతరాష్ట్రుడు చింతించి నాకు వచ్చిన కోపభారం భరించలేక అలా చేశాను. నా తమ్ముని పుత్రులు నా ముందు

ప్రేమలో ప్రవర్తించేటట్లు చేయాల్సింది. అని మళ్ళీ అందర్నీ కౌగలించుకొని ఆశీర్వ దిస్తాడు. చిరవకు తనూ గాంధారీ ఈ జీవితాన్ని ఈ పాండవులు ఆధారంగా వెళ్ళ బుచ్చు కోవాలన్న సంగతి అప్పటికి ఆతడికి దృఢమయింది.

పాండవులు గాంధారివద్దకు వెళ్లారు. గాంధారి వీరిని శపిస్తుందా అన్నంత ఉద్రేకంలో ఉంది. అప్పుడు కృష్ణద్వైపాయనుడు హఠాత్తుగావచ్చి "శపించకు. శపించకు. ఈ ధర్మరాజు చాల ధర్మపరుడు. నీ కొడుకు యుద్ధానికి పోయేముందు నీకు నమస్కరించడానికి వచ్చినప్పుడు నీవేమన్నావు? ధర్మం ఏవపక్షానఉందో ఆ పక్షం జయిస్తుందిగాక అనలేదా? ఇప్పుడు ఈ పాండవులు జయించటం వీరు ధర్మ పరులన్న సంగతిని ధ్రువపరచింది. వీరియందసూయ పడకమ్మా!" అంటాడు. అప్పుడు గాంధారి తగ్గిపోయి, "శపించనుగాక. వారు ధర్మపరులని తెలుసును. కాని భీముడు అధర్మంగా నా కొడుకు తొడలు విరగగొట్టి చంపడం సరికాదుగదా. సాధారణంగా పాటించే నియమం పాటించవద్దా" అంటుంది.

భీముడు వెంటనె "అమ్మా! అమ్మా! అప్పుడు నీ కొడుకు నన్ను చావగొట్టు తుంటే మరోదోవలేక నేను అలాకొట్టాను. లేకపోతేనేనేచచ్చేవాణ్ణి. ఆత్మరక్షణకోసం అది తప్పలేదు క్షమించమంటాడు. ద్రౌపదిని పరిభవించినప్పుడు నీకొడుకు తొడలు చూపి అవమానించిన క్షణాన వాటిని విరగగొట్టవలసినవాణ్ణి. అప్పుడు మా అన్న ఒప్పుకొనకపోవటంచేత ఆపని జరగక కేవలం ప్రతిజ్ఞగా చేశాను. దానిని పాటించ కుండా ఎలా ఉండేదమ్మా రాజునై పుట్టి" అంటాడు. అయినా ప్రతిజ్ఞనుకూడ తోసేసి సంధికోసం ప్రయత్నం చేశాము. నీ కొడుకు ఒప్పుకోలేదు ఏం చేయమమ్మా? అంటాడు.

అప్పుడు మళ్ళీ గాంధారి,-"పోనీ శత్రువు కనక చంపానంటేసరే. దుశ్శాస నుడి రక్తం త్రాగటం ఎంత దారుణం!" అంటుంది.

అందుకు భీముడు"అమ్మా! అమ్మా! నేను త్రాగలేదమ్మా అలానటించి, ముఖా నికి రక్తం పూసికొని చుట్టూ భయంకరంగా పోట్లాడుతున్న సైన్యాన్ని భయపెట్టా నమ్మా! నిజమిది నమ్ము" మంటాడు. "అంత పాపం చేసేటంతటి నికృష్టుడనా అమ్మా నేను" అంటాడు.

మళ్ళీ "గ్రుడ్డి వానికితోడుగా ఉండాలనయినా కేవలం ఒక్కణ్ణయినా మిగల్చక అందర్నీ చంపారే! ఒక్కడుంటే మాత్రం మీ అన్నను రాజ్యం చేయనీయడని భయమా వాడు!'' అన్నది "ధర్మరాజేది'' అన్నది.

వెంటనే ధర్మరాజు వచ్చి—
నీ పుత్రుల జంపించిన పాపాత్ముని గ్రూరచిత్తు బరివాదార్హున్
శాపంబున బొలియింపుము భూపాలక వల్లభాభి పూజిత శరణా

అంటాడు. ఇది పూర్తి సమర్పణం. ఈ సమర్పణంతో గాంధారి మారుమాట్లాడలేదు. కోపంతోకూడిన ముఖం త్రిప్పుకొన్నది. ఆమె కండ్లకు కట్టిన పట్టానందు నుంచి ఆమె దృష్టి ధర్మరాజు కాలివేళ్ళపైబడి గోళ్ళను, కాల్చింది. అదిచూచి అంతా తత్తరపడుతారు. చివరకు ఆమె శాంతి వహిస్తుంది.

"మీరంతావెళ్ళి ఆ కుంతిని చూడండి'' అని పంపిస్తుంది.

పాండవులు వెళ్ళి మహా శోకంతో తల్లికాళ్ళమీద పడతారు. ఆమె వాళ్ళపళ్ళు నిమురుతుంటుంది. ఒకరినిచూసి ఒకరు కేవలం దుఃఖపూరితులవుతారు. అప్పుడు ద్రౌపదివచ్చి "నీ మనుమలు వచ్చి నిన్ను చూడరేమమ్మా" అని వాపురుమంటుంది. కుంతి ఆమెను ఎత్తి కౌగలించి ఊరార్చి గాంధారి దగ్గరకు తీసికొనిపోతుంది. గాంధారి ద్రౌపదికి కోపోపశమనంచేసికోమని చెప్తూ కుంతి తట్టుకోలేదు నీ దుఃఖాన్ని, ఆమె కోసం నీవు శోకం మానుమంటుంది.

ఇదంతా ఇలా జరుగుతుందని తెలిసి చెప్పనే చెప్పారు విదురుడు. అప్పుడు దుర్యోధనుడు మాట వినకపోయినాడు అనుకొంటుంది.

❋❋❋

# మహాభారత కథలు

## స్త్రీ పర్వము- ద్వితీయాశ్వాసము

## శ్రాద్ధాదులు

గాంధారి కంటికి గుడ్డకట్టు ఉంటుంది ఎప్పుడూ. ఇప్పుడు పోలికలకువచ్చి ఈ చనిపోయినవారిని గమనించడానికి వచ్చినా ఆ కట్టు గుడ్డ విప్పలేదు. పైగా ఆమె ఒక చోటనె ఉండి పరికిస్తె ఎక్కడెక్కడ ఎలా పడివున్నవారైనా అవుపడుతున్నారు. ఎలాఅనేది తెలియకపోతే అది దివ్యదృష్టి అంటె ఒప్పుకోవటమె తప్పనిసరి. సూర్య చంద్రులూ కన్నూ లేనప్పుడు తెలివిఅనేది ఉన్నది. దానివల్లనె వ్యవహారం నడుపబడుతున్నదనీ తెలిసికొవాలి. గాంధారికి వివరాలన్నీ ఆలా అవగతం కావటం సంభవమే. ఆమె పేరు పేరునా అందరినీ చెప్పి దుఃఖిస్తుంది. ఆ చనిపోయినవారి భార్యలు ఎలా ఏడుస్తున్నారో చూడమంటుంది. ఈ మాటలన్నీ శ్రీకృష్ణునకు చెప్తోంది. దురోధనుని, దుశ్శాసనుడ్ని, దుర్ముఖుడ్ని అభిమన్యుణ్ణి, సైంధవుణ్ణి, భూరిశ్రవసుణ్ణి భీష్ముడ్ని శకునిని అందరనూ తెలిసి గోలపెట్టుంది. చివరకు శ్రీకృష్ణుని, "ఇదంతా నీవే చేశావుగాక. నీవు ఈ యుద్ధం మాన్పదల్చుకొంటే మాన్పకలిగేవాడివి కావా? నిన్ను శపిస్తానుగాక. నీ బంధువులంతా ఇలాగే వాళ్ళలోవాళ్ళు కొట్టుకు చస్తారు నీవుమాత్రం దిక్కులేనివాడిలా ఒంటరిగా చనిపోతావు'' అంటుంది. శ్రీకృష్ణుడు "ఈలాటి శాపం నాకు అదివరకె ఉన్నదమ్మా! నేను చింతపడనుగాక. నీవు లేచివెళ్ళి చనిపోయినవారికి అగ్ని కార్యాలు నడిపించు. నీ కుమారుడికి, నీవు ధృతరాష్ట్రుడు, భీష్ముడు, బాహ్లికుడు ఇంతమంది చెప్పారు. విన్నాడుకాదు. చివరకు నీవు నన్ను తప్పుపట్టుతున్నావు! శపించావా? అలాగెకానీ. చేటు, చావులకు బాధపడటం ఆరంభించేవారికి దుఃఖం పెరగడమెగాని తరగడముండదు. నీకొడుకు యుద్ధంలో వెనుదిరుగకుండా చచ్చేదాకా పోరేవాడై యుండాలని నీవనుకోలేదా!'' అంటాడు.

ఆమె మాట్లాడలేకపోయింది. ధర్మరాజును పిల్చి ధృతరాష్ట్రుడు చనిపోయినవారందరకూ అగ్ని సంస్కారం చేయిస్తాడు. తిలోదకాలు తనవారికి వదలుతాడు. దానివల్ల ప్రేతలకు దాహం తీరుతుందని శాస్త్రం. పైగా తనకున్న విధికృత కర్మ అది. చేయక తప్పనిది.అప్పుడు కుంతి ధర్మరాజు వద్దకు వచ్చి కర్ణుడు తనకు కుమారుడే గనుక ధర్మరాజే వానికి తిలోదకాలు వదలాల్సి ఉందంటుంది. కర్ణుని జన్మకథవిని పాండవులు నిర్ఘాంతబోతారు.

"ఓహూ! ఆ మహాపరాక్రముడు నా తల్లికి బిడ్డడా అని వాళ్ళు అచ్చెరువందుతారు. ధర్మరాజు దుఃఖాన్ని పొంది చివరకు కర్ణునకుకూడ తిల వదలుతాడు. ఇది స్త్రీ పర్వం.

## 2. కథాలోకనం

మహాభారతంలో దుఃఖభాగం అంతా దీంతో అయిపోయింది. ఇంక అంతా విచారణాభాగం. ధర్మ విచారణం. వేదాంతవిచారణం. ఇవి వస్తవి.

ప్రపంచంలో సుఖంగాని దుఃఖంగాని అనుభవించేటప్పుడు, ఎవరికీ, మతం, వేదాంతం మనసుకు పట్టవు. ఆ రెండూ లేనితటస్థ సమయాల్లోనే అవి మనసులో కదలగలిగేది. తిండిలేక మలమల మాడుతుంటే వేదాంతం చెప్పినా ఏమీ ప్రయోజనంలేదు. అంతకుముందె భక్తి అతడికి కలిగి, ప్రభావితుడై ఉంటేతప్ప దేవుడు దేవుడు అన్నా ప్రయోజనంలేదు. సుఖదుఃఖాలు రెండూ లేకుండాపోయే సమయాలే కొద్ది. సుఖాన్ని ఎవరూ వదలుకోవాలని చూడరు. దుఃఖాన్ని పోగొట్టుకోవాలనే ఆశిస్తారు. పాండవులకు వచ్చిన దుఃఖాల సంగతి చెప్పి వాటిని ఎలా దాటగలిగారో కథలుగా చెప్పిన కారణం అదె. దుఃఖాన్నిదాటి సుఖదుఃఖాలు సాధారణంగాఉండేవే నని తెలిసి, అవి సమానమని తెలియాలి. అలాటి క్షణాలు జీవితంలో ఎక్కువ చేసి కొని, ఆ క్షణాల్లో ధర్మం తెలియడానికి—అంటే—భగవంతుడ్ని తెలియడానికి ప్రయత్నించటానికె మహాభారతం వినడం—అదె ఒక చక్కనిదోవ అనేది తెలియాలి.

ఇది స్త్రీ పర్వం.

❋❋